శ్రీ

# భారతీయ మహాశిల్పము

1, 2, 3 ం

(శ్రీ ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వ సహాయముతో ముద్రితము)



గ్రంథకర్త, ప్రచురణకర్త:

స్వర సుబ్రహ్మణ్య కవి

మొదటి కూర్పు 1000 ప్రతులు

ప్రాప్తిస్థానములు:

1. స్వర్ణ కోటీశ్వరరావు
పెదపాలెం
వయా, అప్పికట్ల
బాపట్లతాలూకా,
గుంటూరు జిల్లా

2. కొండూరి వీరరాఘవాచార్యులు
కార్యదర్శి
ఆంధ్రశిల్ప కళాపరిషత్తు
తెనాలి
గుంటూరు జిల్లా







# పీఠిక

1951 సంవత్సర ప్రాంతమున వాస్తుమథనామృతము, శిల్పమథనామృతము, భారతీయ శిల్పము అను మూడు గ్రంథములను వేర్వేరుగా రచింప దలచి వాస్తుమథనామృతమును భారతీయ శిల్పమును వ్రాసితినిగాని యవి ముద్రింపబడలేదు. ఇంతలో మన్నేటికోట వాస్తవ్యులగు గోనుగుంట బ్రహ్మయాచార్యులుగారు నాయొద్దకువచ్చి వాస్తుమథనామృతమునందలి 400 లకు పైగానున్న యంశములనుజూచి యచ్చెరువంది యివి యన్నియు వ్రాసికొనిన బాగుండునుగాని సుమారు రు. 8000-00 లతోగాని యీగ్రంథము ముద్రించుటకు వీలుపడదనియెంచి గణితముల వరుసను మాత్రము కొంతవఱకు వ్రాసికొని ముద్రించిరి. ఆగ్రంథమే "గృహవాస్తు గణితరత్నావళి" గా ప్రచారములోనున్నది. శిల్పమథనామృతమును వ్రాయబూనగా ప్రయాగ విశ్వవిద్యాలయమున చరిత్రాచార్యులుగానున్న శ్రీప్రసన్న కుమారాచార్యులు, ఎం. ఏ. పి. హెచ్. డి., గారిచే సంస్కరింపబడి లండన్ ఆక్సఫర్డు యూనివర్సిటి ప్రెస్సువారిచే ముద్రితమై బొంబాయి కలకత్తా మద్రాసు చీనా జపాన్ న్యూయార్కు వఱకు వ్యాపించిన మానసారమను వాస్తుశాస్త్రము, బీహారు నలందా కాలేజి ప్రొఫెసర్ ఫణీంద్రనాథబోస్ యం. ఏ. గారిచే పరిష్కరింపబడి బెనారస్‌లో ముద్రింపబడిన ప్రతిమాలక్షణము, శిల్పశాస్త్రము, అను గ్రంథములు, ఇండియా, యూరోప్, అమెరికాలకు వ్యాపించినవి. నాసికక్షేత్రనివాసి శిల్పకళానిధి వఝే కృష్ణశర్మగారిచే సంశోధితమై పూనా ఆనందాశ్రమ ప్రెస్సులో ముద్రింపబడిన కాశ్యపశిల్పము. త్రివేంద్రము మహామహోపాధ్యాయ టి. గణపతిశాస్త్రి పరిశోధితమై అనంతశయన గ్రంథావళిగ ప్రకటింపబడిన మయమతము శిల్పరత్నము రెండు భాగములు, మహామహోపాధ్యాయ టి. గణపతిశాస్త్రి సంపాదితమై బరోడా గైక్వార్ మహారాజాగారి లైబ్రరీ కొసంగబడి బి. భట్టాచార్య యం. ఏ. పి. హెచ్. డి. పరిశోధితముగా ప్రకటింపబడిన సమరాంగణసూత్రధార నామవాస్తుశాస్త్రము అపరాజిత, వృ[illegible], తంజావూరు సరస్వతీ గ్రంథాలయమునుండి వ్రాయించి తెప్పించిన విశ్వకర్మీయ శిల్పము. మున్నగు గ్రంథములు మహాపండితులచే సంస్కరింపబడినప్పటికిని శిల్పవృత్తి నవలంబించి చేయువారలకు సరియైన యర్థము లందుగోచరింపక యొక్కొక్కచోట చిక్కుతీగెలతో బెనవేసికొన్న మహారణ్యమధ్యప్రదేశము వలె నభేద్యముగ నుండుటకు గారణము శిల్పపద నిఘంటువులు లేకపోవుటచేతను, సంస్కృత గ్రంథముల నాంధ్రీకరించక యొకవైపునకు త్రోసిపుచ్చుచు వచ్చుటచేతను, శిల్పులకు పారంపర్య క్రమశిక్ష లభించకుండుటచేతను, కలిగిన ట్లూహించవలసియున్నది. మహర్షులచే వ్రాయబడిన యీ

గ్రంథములయందు నాకుగల యభిరుచియే యేమాత్రము వెనుకంజ వేయనీయక స్థిరచిత్తముతో నుంచుటచే వరమేశ్వరానుగ్రహమువలన దీనిని వ్రాయజాలితిని. శిల్పశాస్త్రమనినను, వాస్తుశాస్త్రమని నను సమానమను భావముతోనే ప్రాచీనులు వ్రాసియుండిరి. ఇప్పుడు మాత్రము కొందఱు శిల్పము వేఱు వాస్తు వేఱు అని భావించుచుండిరి. ఆధునికులలోను శ్రీ ఫణీంద్రనాథబోసుగారు గృహవాస్తుశాస్త్రమును శిల్పశాస్త్రమనియే వ్యవహరించిరి. ఇట్టిస్థితిలో వాస్తు మథనామృతము, శిల్పమథనామృతము, భారతీయ శిల్పమను చరిత్రము, ఈ మూడును - భారతీయ మహాశిల్పమునందలి షోడశకళలుగా నిర్ణయింపబడి యందిమిడియున్నవి. ఇవి క్రమక్రమముగా నుత్తరోత్తరోత్కర్షములై వివిధాంశముల నిముడ్చుకొని యున్న శిల్పరూప చిత్రములతో నేత్రానందమును, హృదయానందమును గలిగించుచుండుటచేతనే వయోధికుడనగు నే నింతటి మహత్తరగ్రంథమును లిఖించగలిగితిని. ఇట్లు వ్రాయుచు 7వ భాగము పూర్తియగునప్పటికి ముద్రణ వ్యయమును భరింపలేని యస్మాదృశుల కిట్టి కార్య మెట్లు గట్టెక్కగలదను సంశయ మంకురించి తిరుపతి శ్రీ వేంకటేశ్వర యూనివర్సిటీవారి కీ విషయమును తెలియజేసికొనగా, అప్పటి ఆక్టింగు రిజిష్ట్రారువారు మిగిలిన 9 భాగము లెంతకాలములో పూర్తియగునని యడిగిరి. ఆంధ్రజ్యోతి ఎడిటర్ శ్రీ నార్ల వెంకటేశ్వరరావుగారికీ సచిత్ర భారతీయ మహాశిల్పభాగములు చూపగా వారు సంతోషించి "యేతన్ముద్రణమునకు దగిన యత్నము చేయుదము. తలపెట్టినపనిని ఆపవలదని యభయమొసంగుచు, శిల్పపదములకు తగిన నిఘంటువు లేనియెడల మీ శ్రమ కొంత వ్యర్థముగా గనుపించును. చదువువారలకు బోధపడునంతటి తాత్పర్యమున్నను నిఘంటువునుగూడ వ్రాయుట ముఖ్య"మనిరి. అటులే చేయుదునని నిర్ణయించితిని. నే నింతటిభారమును వహించుటచూచి యెడనెడ ఆంధ్రప్రభ, ఆంధ్రజ్యోతి మున్నగు పత్రికలలో దర్శనాచార్య శ్రీకొండూరి వీరరాఘవాచార్యులుగారు వ్యాసములు వ్రాయుచు భారతీయ మహాశిల్పమును గుఱించిన సమస్తవిషయములు లోకమునకును ప్రభుత్వమునకును దెలియజేయుచు వచ్చిరి. 1963 లో గ్రంథముద్రణకు సహాయార్థమై ఆంధ్రప్రదేశ ప్రభుత్వమువారి నర్థించితిమి. అప్పటికి రిజిష్టరుగాలేక నామమాత్రముగానున్న ఆంధ్రశిల్ప కళాపరిషత్తునుగూడ ప్రభుత్వదృష్టికి తెచ్చితిమి. వారు సంఘము రిజిష్టరయినదా? అని ప్రశ్నించినంతనే నేను బాధ్యతవహించి నా స్వంతధనముతో 1964 లో రిజిష్టరు చేయించి దరిమిలా లలితకళా ఎకాడమీ అనుబంధ సంస్థగానుండునట్లు కోరగా శ్రీవారు అనుమతించి ఆంధ్రశిల్ప కళాపరిషత్తును దయాదృష్టితో చూచుచునేయుండిరి. గ్రంథరచనా వివరములు: మొదటి భాగమున కాశ్యపశిల్పము 3-4-5-6 పటలములు. మానసారము 13-14 అధ్యాయములు. శిల్పరత్నము పూర్వభాగము 9-10-16-17-18-19 అధ్యాయములు. సమరాంగణ 1-61 అధ్యాయములు. అపరాజిత 173 సూత్రము గ్రహింపబడి వాస్తుమానము ఉపపీఠభేదములు, అధిష్ఠానభేదములు మున్నగు 104 విషయములు కూర్పబడినవి.

రెండవ భాగమున కాశ్యపశిల్పము 7-8-9-10-11-12-13-14-15-16-17-18-19-20-21 22-24-25 పటలములు. మానసారము 11-15-16-18 అధ్యాయములు. శిల్పరత్నము పూర్వభాగము 20-21-23-30-32-34-35-36 అధ్యాయములు. సమరాంగణ 55 అధ్యాయము. అపరాజిత 150 సూత్రము గ్రహింపబడి నాలప్రతిష్ఠ స్తంభ, వేదికా, జాలక, తోరణ, కుంభలతాది లక్షణభేదములు మున్నగు 41 విషయము లుగ్గడింపబడినవి.

మూడవ భాగమున-కాశ్యపశిల్పము 26-27-28-29-30-31-32, పటలములు, మానసారము 12-19-20-21-22-23 అధ్యాయములు - శిల్పరత్నము పూర్వభాగము - 24-25-26 అధ్యాయములు- సమరాంగణ 32 అధ్యాయము - అపరాజిత - 106 సూత్రము గ్రహింపబడి గర్భన్యాసము ఒక్క-అంతస్తు మొదలు అయిదంతస్తుల వఱకుగల దేవాలయభేదములు - మున్నగు 122 విషయములు చెప్పబడినవి.

నాల్గవ భాగమున - కాశ్యపశిల్పము-33-34-35-36-37-38-39-40-41 పటలములు - మానసారము 24-25-26-27-28-29-30 అధ్యాయములు - సమరాంగణ, 49-58-62 అధ్యాయములు - అపరాజిత - 81-104-106-154-155-157-158-159-163 సూత్రములు గ్రహింపబడి, ఆఱంతస్తులు మొదలు పదునాఱంతస్తులవఱకుగల దేవాలయభేదములు, వైరాజ్య ప్రాసాదభేదములు, అందుత్ర్యంగ, పంచాంగ, సప్తాంగ, నవాంగాదిభేదములు-రుచకము మొదలగు 64 భేదములు- మున్నగు 138, విషయములు కూర్పబడినవి

ఐదవ భాగమున విశ్వకర్మ ప్రకాశ 6 అధ్యాయము సమరాంగణ 55-56-57-63, అధ్యాయములు, అపరాజిత 106-155-159-106-116-162-163-167-168-170. సూత్రములు గ్రహింపబడి సాంధారభేదములు - నాగరోద్భవ విమానప్రాసాదభేదములు - కైలాసజాతిప్రాసాద భేదములు-విమాన నాగరచ్ఛందజ పుష్పకాది ప్రాసాదభేదములు, శ్రీధరాది శుద్ధఛందభేదములు- మేరుజాతిభేదములు మున్నగు - 160 విషయములు చెప్పబడినవి.

ఆఱవ భాగమున, విశ్వకర్మప్రకాశ 6 అధ్యాయముల, సమరాంగణ, 49-55-56-57-62-63-65 అధ్యాయములు, అపరాజిత 141-167-170-171-174-175-180-181-182 సూత్రములు గ్రహింపబడి మేరుభేదములు, కైలాసభేదములు, పుష్పకభేదములు, మణికభేదములు - త్రివిష్టప భేదములు - భూమిజప్రాసాదభేదములు, ఉదయకలాస్కంధి రేఖాభేదములు ద్రావిడప్రాసాద భేదములు - వరాటప్రాసాదభేదములు, మున్నగు, 184 విషయము లుగ్గడింపబడినవి.

ఏడవ భాగమున కాశ్యపశిల్పము 43 పటలము - శిల్పరత్నము పూర్వభాగము 40 అధ్యాయము, సమరాంగణ 59-60-61-64 అధ్యాయములు. అపరాజిత 133-134-164-165-166-169-172-176-177-178 సూత్రములు గ్రహింపబడి వరాటప్రాసాదభేదములు - విమాన ప్రాసాద భేదములు - నాగరసాంధార ప్రాసాద భేదములు, రుచకజాతి సాంధారప్రాసాదభేదములు - లతినజాతి ప్రాసాదభేదములు - మిశ్రజాతి ప్రాసాదభేదములు - శ్రీసంజ్ఞకవలభిప్రాసాదభేదములు - సింహావలోకన ప్రాసాదభేదములు - నాగరజాతి బ్రహ్మవిష్ణ్వాది ప్రాసాదములు - ద్వారదేవతలు - ప్రాకార విధానము మున్నగు - 178 విషయము లుక్తములైనవి.

ఎనిమిదవ భాగమున కాశ్యపశిల్పము 44-45-46 పటలములు - శిల్పరత్నము పూర్వభాగము 39-40-41-42 అధ్యాయములు, మానసారము 31-32-33-34 అధ్యాయములు - విశ్వకర్మ ప్రకాశ, 6 అధ్యాయము, సమరాంగణ 66-67 అధ్యాయములు, అపరాజిత - 186-187-188 సూత్రములు గ్రహింపబడి, ప్రాకారవిధానము - పరివారదేవతలు - గోపురభేదములు - మండప భేదములు, మున్నగు 84 విషయములు వాకొనబడినవి.

తొమ్మిదవ భాగమున. కాశ్యపశిల్పము 46_47_48_49_50_53_59_60_61_62_63_64_65_66_67_68_69_70_71_72_73_74_75_76_77_78 పటలములు, మానసారము 51-52-53_62 అధ్యాయములు, శిల్పరత్నము ఉత్తరభాగము 1-3-14-21-22 అధ్యాయములు, సమరాంగణ 76_77 అధ్యాయములు, అపరాజిత 198-199-200-202-204-205-206-208-212-213-21 సూత్రములు గ్రహింపబడి శిలాలక్షణములు రత్నలక్షణములు - స్వయంభులింగభేదములు - శివరూపభేదములు, గణపతి భేదములు, సూర్యలక్షణము, గ్రహలక్షణములుమున్నగు - 124 విషయములు వివరింపబడినవి

పదియవ భాగమున కాశ్యపశిల్పము 46_48 పటలములు, మానసారము 48_54_55_57_58_59_60_61_68 అధ్యాయములు. శిల్పరత్నము ఉత్తరభాగము 23_24_25 అధ్యాయములు - సమరాంగణ 77 అధ్యాయము. అపరాజిత_217_219_220_221_223_226 సూత్రములు, విశ్వకర్మీయ శిల్పము 8 అధ్యాయము, మయవాస్తు శిల్పసంగ్రహము, గ్రహింపబడి విష్ణురూప భేదములు. దేవీరూపభేదములు, దిక్పాలక లక్షణములు_నానావిధ దేవతల లక్షణములు_ఋషి లక్షణభేదములు యక్ష రాక్షస గంధర్వ అప్సర కిన్నరాది రూపభేదములు_జైనబౌద్ధాది లక్షణములు మున్నగు 144 విషయములు చెప్పబడినవి.

పదునొకండవ భాగమున కాశ్యపశిల్పము 50_51_52_53_54_55_56_57 పటలములు, మానసారము 49_64_65_66 అధ్యాయములు. శిల్పరత్నము ఉత్తరభాగము 5_6_67_8_9_10_11_12-13-14_15_16 అధ్యాయములు_ఆత్రేయ శిల్పము, మయవాస్తుశాస్త్రము 3 అధ్యాయము, సమరాంగణ. 76_78 అధ్యాయములు, వాస్తు శిరోమణి 3_4 అధ్యాయములు, అపరాజిత 210_225_234_236 సూత్రములు. మయమతము గణపతాచార్యుని టీక 4_5 అధ్యాయములు, గ్రహింపబడి ప్రతిమావిధానము, ఉత్తమమధ్యమ కనిష్ఠదశతాల భేదములు_నవతాల భేదములు_అష్టతాల భేదములు సప్తతాలభేదములు_షట్తాలభేదములు_పంచతాల భేదములు చతుస్తాలభేదములు_త్రితాల భేదములు ఏకతాల లక్షణము, మున్నగు. 33 విషయము లుక్తములు.

పది రెండవ భాగమున కాశ్యపశిల్పము 79_80_81_82_83_84_85_86 పటలములు. మానసారము 43-67 అధ్యాయములు, శిల్పరత్నము ఉత్తరభాగము 16_21 అధ్యాయములు, పూర్వభాగము 44_46 అధ్యాయములు, సమరాంగణ 71_72_73_74_75_79_80_81_82_83 అధ్యాయములు అపరాజిత 211_235_236 సూత్రములు, శిల్పసంహిత 11 అధ్యాయము, మయమతము తాళపత్రగ్రంథము66 అధ్యాయము గ్రహింపబడి దేవదానవాదిప్రతిమా మాన భేదములు ముఖభేదములు పంచపురుష భేదములు, ఋజ్వాగతాది స్థానక భేదములు పతాకాది చతుఃషష్టిహస్త భేదములు రస దృష్టి భేదములు. ఆయుధభేదములు చిత్రలేఖనాదికము_మున్నగు 167 విషయములు వివరింపబడినవి.

పదు మూడవ భాగమున విశ్వకర్మప్రకాశ. 1_2_5_7 అధ్యాయములు, శిల్పరత్నము పూర్వభాగము 3 అధ్యాయము - మానసారము 5_6_7_8_9 అధ్యాయములు, సమరాంగణ. 8_14_20_21_23_24 అధ్యాయములు, అపరాజిత 55_56_63_91_92_93_94_95_96_97_98_184 సూత్రములు కాశ్యపశిల్పము 2 పటలము గ్రహింపబడి భూమి లక్షణములు, గ్రామలక్షణములు,

ఏకశాలభేదములు, ద్విశాలభేదములు, త్రిశాలభేదములు, చతుశ్శాలభేదములు, మున్నగు 300 విషయములు వివరింపబడినవి.

పదునాల్గవభాగమున మానసారము, కాశ్యపశిల్పము, సమరాంగణసూత్రధార అపరాజిత పృచ్ఛ, శిల్పరత్నము, నారదీయశిల్పము, వాగ్నేయాగమము, పరశివవిశ్వకర్మాగమము లందలి ప్రతిష్ఠాభాగములను గ్రహింపబడి సుప్రయోగ సర్వదేవతాప్రతిష్ఠాగమము శైవవైష్ణవ శాక్తేయముల కుపయోగించు జీర్ణోద్ధారాదులు, మున్నగువిషయములు చెప్పబడినవి.

పదునైదవభాగమున సమరాంగణ సూత్రధార 31 అధ్యాయము వివిధయంత్రరహస్యములు. చిత్రశిల్పము. వేదకాలమునుండి నేటివఱకుగల శిల్పచరిత్రము. అందలి మహత్తర చమత్కారములు మున్నగు 200 విషయముల వ్రాయబడినవి.

పదునాఱవభాగము సమస్త శిల్పగ్రంథములనుండి గ్రహింపబడిన పదివేలశబ్దములుగల నిఘంటువు కూర్పబడినది. ఇట్లు దాదాపు రెండువేల ముఖ్యవిషయములతో గూడిన యిమ్మహా గ్రంథముద్రణమునకు శ్రీ ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వమువారు భాగమునకు వెయ్యిరూపాయలుగా అంచనా వేసి ప్రస్తుతము రు. 3000-00 లు 1966 మార్చి నెలలో దయచేయుచు ముద్రింపబడు గ్రంథములలో 5 వ వంతు ప్రభుత్వమున కిమ్మనిరి. కాని గ్రంథములు ప్రభుత్వమువారియొద్దనే యున్నందున మే నెల మొదటివారములో హైదరాబాదు వెళ్ళి జూన్ 10 వఱకు అచ్చటనేయుండి గ్రంథములను తీసికొనివచ్చి యే ప్రెస్సువారినడిగినను మాకు విశ్రాంతిలేదన మొదలిడిరి. తుదకు తెనాలిలో గుంటూరుజిల్లా కో-ఆపరేటివ్ ప్రింటింగ్ ప్రెస్ అధ్యక్షులగు శ్రీ వెలగా వీరయ్యగారితో సంప్రతించి అక్టోబరు నెలలో ముద్రణకార్యమున కుద్యమించితిమి. కాని బహుకార్య ధురంధరత్వము గల యాప్రెస్ వారు చాల మాంద్యముగ పనిచేయుట తటస్థించినది. నేను బాపట్లతాలూకా పెద పాలెమునుండి తెనాలివెళ్ళుట తిరిగివచ్చుట మొదలగు కష్టనష్టము లట్లుంచి యింకను రు. 2000-00 అయిననేకాని గ్రంథము సంపూర్ణరూపమును ధరింపజాలదని ప్రెస్‌వారి అంచనాద్వారా తెలిసికొని మరల ప్రభుత్వమునకే తెలియజేయుచు ప్రభుత్వముకోరిన 5 వ వంతు మాత్రమేకాదు, 4వ వంతు గ్రంథములైనను ప్రభుత్వమున కీయ సిద్ధముగానున్నానని ప్రార్థించితిని. శ్రీవారు తామిచ్చిన పైకమున కెంతపనిజరిగినదో తెలిసికొనుటకు ఆడిట్‌రిపోర్టు పంపవలసినదిగా ఏప్రిల్ నెలలో నోటీసు పంపిరి. ఆడిట్ యెట్లైట్లో యిన్నాళ్లు పట్టినది.

ఆంధ్రశిల్ప కళాపరిషత్తు నాకేమాత్రము సహాయపడజాలకుండినను అది యభివృద్ధిచెంది శాశ్వతముగా నుండుటకై యీ ముద్రింపబడు గ్రంథములలో పదవవంతు గ్రంథములను విక్రయించిన ధనమును మూలధనముగా నొసంగుటకును, ఆధనము శ్రీప్రభుత్వమువారి పరీక్షతో నిలిచియుండుటకును, నిర్ణయించితిని. అవసరమైనపుడాధనమును తక్కిన భాగముల ముద్రణకు వాడుకొనుచు మరల నిచ్చుచుండుటకును. ఈరీతిగానే తక్కిన భాగముల ప్రతులనుగూడ పదవవంతు పరిషత్తుకొసంగుచు దాని యభ్యుదయమునకు దోహదముచేయుట నాముఖ్య లక్ష్యము. గేయప్రబంధమగు పార్వతీపరిణయ రచనాకాలమునుండి నిరంకుశోపాఖ్యాన ముద్రణసమయమునను భారతీయ మహాశిల్ప ముద్రణ ప్రయత్నమునను. సమయానుకూలముగ తగు సహాయ మొనర్చుచున్న మత్సోదరతుల్యుడగు శ్రీదీవి లక్ష్మీకాంతరావుగారికిని, నా రచనలయందలి యభిరుచిని లోకమునకు ప్రకటించుచున్న దర్శనాచార్య శ్రీ కొండూరి వీరరాఘవాచార్యులుగారికిని, 1964 లో గుంటూరు విద్యాశాఖాధికారిగా

నుండి యీ భారతీయ మహాశిల్ప ముద్రణ మత్యవసరమని ప్రభుత్వమువారికి సూచించుటయేగాక, పలువిధముల ప్రోత్సాహ మొసగుచున్న త్రిభాషాకవులు శ్రీ పులివర్తి శరభాచార్యులు, B. A. B. Ed. గారికిని, ఏతద్రచనామధ్యకాలమున ధైర్యదాన మొసంగిన ఆంధ్రజ్యోతి ఎడిటర్ శ్రీ నార్ల వెంకటేశ్వరరావుగారికిని, 1965 లో గోవా దేశాంతవర్గత కాంసరపాలక్షేత్రస్థ కాళికాలయమున సహస్ర చండీమహాయజ్ఞమునకు సన్నాహ్వానించి అగ్రసన్మానమొసంగిన శ్రీదైవజ్ఞ బ్రాహ్మణ సంఘమువారికిని, శిల్పగ్రంథోపయోగాదుల నెల్ల గుర్తించిన సంస్కృత శాఖామాత్యులగు శ్రీ యం. ఆర్. అప్పారావుగారికిని, శ్రీ ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వము వారికిని, ప్రభుత్వాదేశప్రకారము గుంటూరు హిందూ కాలేజి హైస్కూలు భవనములో 17-12-1966 న సన్మానసభ జరిపించి రెండు దుశ్శాలువలు నూటపదా ఱురూపాయలు ఇచ్చి సన్మానించిన గుంటూరుడిస్ట్రిక్టు యెడ్యుకేషనల్ ఆఫీసరు శ్రీ డి. వెంకటస్వామి యం. బి. ఇ. డి. గారికిని, నా కృతజ్ఞతను ప్రకటించుచు ధన్యవాదము లర్పించుచున్నాను.

—గ్రంథకర్త.



ఇది రెండు వైపుల జూచినను తల కనుపడునట్టి చిత్రలేఖనము

# శిల్ప పరిభాష

వాజనము

ప్రతివాజనము

పద్మము.

కుముదము.

కపోతము.

రత్నపట్టము

పద్మము:

అంతరము

కుంభము.

నిమ్నము.

కర్ణము:

గోపానము

ధారాకుంభము.

వజ్రపట్టము.

ప్రతిముఖము.

త్రిపట్టము

పాలిక.

గలము

ఉపానము.

ఖురము

వేదిక.

కంపము.

వేదకంఠము.

చంద్రావలోకనము.

పంజరము.

కర్ణకూటము.

ఘంట.

శాల.

తోరణము.

కోష్ఠము.

తవంగము.

స్తోభణము.

శిఖరము.

శీర్షము.

కుంభము:

కర్ణము.

## సుప్రసిద్ధ ప్రాజ్ఞుల అభిప్రాయములు

# ఆసంశీలన

శ్రీ సూర్యదేవర సంజీవదేవ్‌గారు

రూపసాధన రూపాతీతానికి దారితీస్తుందని.
రూపాతీతానికి దారితీసినా తీయకపోయినా కూడ రూపసాధన మానవునికి రసానందాన్ని ప్రసాదిస్తూ వచ్చింది యుగయుగాలనుండి దిగ్దిగంతాల వ్యాప్తితో.

వాస్తవానికి, రూపానికీ రూపాతీతానికీ ప్రగాఢమైన ప్రభేదంలేదు. రూపాతీతంకూడ ఒక విధమైన రూపమే. రూపం అనబడుతూన్నది స్థూలరూపం; రూపాతీతం అనబడేది సూక్ష్మరూపం. రూపం అనబడే స్థూల రూపాన్ని చర్మచక్షువులు చూడగలవు. రూపాతీతం అనబడే సూక్ష్మరూపాన్ని చర్మచక్షువులు చూడజాలవు. అందుకు సూక్ష్మదర్శినికాని లేక మానవుని అతీంద్రియ చక్షువులుకానీ అవసరం.

దృశ్యజగత్తులో గోచరించే అసంఖ్యాక రూపాలలో ఒకదానితో మరొకదానికి పోలికవుండదు. దేని ఆకృతి దానిదే. ఈ అసంఖ్యాక రూపాలన్నీ శిల్పాలుకావు. మానవుడు నిర్మించిన రూపాలు మాత్రమే శిల్పాలు. శిల్పాన్ని నిర్మించిన మానవుడు తన శిల్పం నశించకముందే నశిస్తాడు (మానవదేహం మాత్రమే). శిల్పి నశించిన తరువాత కూడ శిల్పం ఎంతోకాలం వరకూ నశించక నిలిచి వుంటుంది. మానవ రూపాలకంటే శిల్పరూపాలు ఎక్కువ చిరంతనాలు.

నిర్జీవంగా కనుపించే శిలకు ప్రాణప్రతిష్ఠ చేస్తాడు శిల్పి తన కళాకౌశలంద్వారా, తన రసదృష్టిద్వారా, తన రూపసృష్టిద్వారా, అదివరలోని అమూర్తశిల ఆకృతితో మూర్తివంతమవుతుంది. మనచేత చూడబడుతూ మాత్రమేవుండి మనను చూడలేని శిల శిల్పి పోసిన ప్రాణంతో స్పందిస్తూ, శిల్పి ప్రసాదించిన నేత్రాలతో మనను చూస్తుంది.

ప్లిస్టసీన్ మహాయుగం అంతిమభాగంలో, అంటే ఒక లక్ష సంవత్సరాలక్రిందట, ఆధునిక మానవుని ఆవిర్భావం. అప్పటినుండీకూడ శిలలను మలిచి ఏదో రూపంలో ఒక వస్తువుగా నిర్మించుకోవాలని ఆదిమ మానవుని ఆరాటం. ఆ ఆరాటం రూపకల్పన తాల్చేవరకు వేల సంవత్సరాలు పట్టింది. ప్రాచీన శిలాయుగాన్ని దాటి, నవ్యశిలాయుగాన్ని దాటి, తామ్ర, కాంస్య, లోహయుగాలను దాటి మానవుడు నేడు పరమాణుయుగంలో ప్రవేశించాడు.

ఈ అతీతకాలం అంతటిలోనూ, ఏదో ఒక రూపంతో, అపరిపక్వ స్థితిలోనో, అర్ధపక్వ స్థితిలోనో పూర్ణపక్వ స్థితిలోనో, శిల్పకల్పనా స్రవంతి అజస్రంగా ప్రవహిస్తూనే వస్తూంది విశ్వమంతటా కూడ.

భారతదేశంకూడ విశ్వంలోని ఒక దేశమే కనుక భారతదేశంలోకూడ అంతే. ఏడెనిమిది వేల సంవత్సరాల క్రిందటి వరకూ ఇతర దేశాలలో వలెనే భారతదేశంలో కూడ శిల్పం అనేది పనిముట్లరూపంలో మాత్రమే వుంటూ వచ్చింది కాని మూర్తికల్పన చెందలేదు. తరువాత మొహెంజదరో కాలంనాటి శిల్పం మూర్తికల్పనలో కొంత కౌశలాన్ని సంపాదించుకొన్నది. ఆటు తరువాత భారతీయశిల్పం క్రమవికాసాన్ని పొందుతూ నవ్యరీతులను, నవ్యతర రూపకల్పనలను రూపొందించసాగింది.

క్రీ. పూ. నాలుగవ సహస్రాబ్దంలో మూర్తికల్పనతో ప్రారంభమైన భారతీయశిల్పం మౌర్యకాలంలో (క్రీ. పూ. 325_326) బహుముఖంగా వికసించింది. ఉత్తర భారతదేశంలోనూ, దక్షిణ భారతదేశంలోనూ కూడ భారతీయశిల్పం తన ప్రాభవాన్ని రూపొందించుకోసాగింది. ఆంధ్రదేశంలో అమరావతిలోని శాతవాహన శిల్పమూ, నాగార్జున కొండలోని ఇక్ష్వాకుశిల్పమూ నిజంగా శిలలలోని కవితలనిపించుకొన్నాయి. ఇంకా దక్షిణాన క్రీ. శ.

పదకొండు పన్నెండు శతాబ్దాలలో వికసించిన చోళశిల్పం తన ప్రత్యేకతలను చూపసాగింది. ఈచోళశిల్పం ప్రసాదించిన ప్రత్యేకమూర్తి కంచుతో నిర్మితమైన నటరాజ విగ్రహం.

భారతీయశిల్పానికి ఉత్తరహిందుస్థానం బుద్ధమూర్తిని ప్రసాదిస్తే దక్షిణ హిందుస్థానం నటరాజ విగ్రహాన్ని ప్రసాదించింది. మొదటిది శాంతికీ, స్థిరత్వానికీ, గంభీరతకూ ప్రతీక అయితే రెండవది గతిశీలతకూ, భావశబలతకూ, రసావేశానికీ ప్రతీక. ఇక గాంధారశిల్పం గ్రీకో భారతీయ సమ్మిశ్రణను ప్రదర్శిస్తుంది. భారతీయ శిల్పం వివిధ ప్రాంతాలలో, వివిధ కాలాలలో వివిధ రూపాలుగా రూపొందింది.

భారతీయశిల్పం వాస్తవ వాదానికి చెందిందా లేక కల్పనా వాదానికి చెందిందా అనే వాద వివాదం కళా సమీక్షకులలో రేగుతూ వచ్చింది. కొందరు అది అనీ, మరికొందరు ఇది అనీ వాదిస్తూ వచ్చారు. భారతీయశిల్పం ఏ ఒక్కదానికి చెందుతుందన్నా కూడ అది మిధ్యావాక్కు మాత్రమే అవుతుంది. భారతీయ శిల్పంలో వాస్తవ వాదమూ కల్పనా వాదమూ రెండూకూడ వున్నాయి అనటం మాత్రమే యథార్థమవుతుంది. భారతీయ శిల్పధారలో లౌకికత ఎంతగా వున్నదో పారలౌకికతకూడ అంతగా వున్నది. శృంగార రసం ఎంతగా వున్నదో, ఆధ్యాత్మికానుభూతి అంతవున్నది,

ఆదిమ శిల్పులు స్వేచ్ఛగా, ఏ సూత్రాలకూ, రీతిరివాజులకూ, నియమబద్ధతకూ సంబంధం లేకుండా తమ శిల్ప సృష్టిని చేసినప్పటికీ ఆటు తరువాత వచ్చిన శిల్పులు శిల్పశాస్త్రాలనబడే వాటిని పాటిస్తూ, నియమాలకు లొంగి తమ కళాకృతులను కల్పించ సాగేరు. అందువల్ల భారతీయ శిల్పాకృతులకు ఇచ్చిన విలువయే ఈ భారతీయ శిల్పశాస్త్రాలకుకూడ అబ్బింది,

శ్రీ స్వర్ణ సుబ్రహ్మణ్య కవిగారు రచించిన ఈ "భారతీయ మహాశిల్పము" అనే బృహత్తర గ్రంథం చాలా అద్భుతమైంది. దీన్ని రచించటంలో వీరు చూపిన శ్రమా, శక్తిసామర్థ్యాలుకూడ ప్రశంసనీయం. "భారతీయ మహాశిల్పము" అనే బృహత్తర గ్రంథాన్ని గ్రంథకర్త పదహారు భాగాలక్రింద విభజించారు. ఇందులో చాలాభాగం వాస్తుశిల్పానికి చెందివుంది.

భారతీయశిల్పం అనగానే మూర్తిశిల్పంతోపాటు వాస్తుశిల్పంకూడ ప్రత్యక్షమవుతుంది. వాస్తుశిల్పాన్ని శిల్పశాస్త్రాలలో స్థాపత్యం అంటారు. వాస్తుశిల్పిని స్థపతి అంటారు. అసలు రూపకళలన్నిటికీ వాస్తుశిల్పం మూలం. ఈ సత్యానికి ప్రాచ్యదేశాలలో ఎంత విలువ ఇచ్చారో పాశ్చాత్యదేశాలలో కూడ అంత విలువ ఇచ్చారు. అందుకే "Architecture is the mother of all arts" అన్ని కళలకూ కూడ వాస్తుశిల్పం తల్లిఅట. ఇది ముమ్మాటికీ నిజం గృహం అనే దానిలో వుంచటానికే శిల్పకళలూ చిత్రకళలూ అన్నీకూడ ఉత్పన్నమయాయి. గృహమనేదే లేనిచో శిల్పాలు అవసరం వుండేవికావు. చిత్రాలు అవసరం వుండేవికావు. అందుకే వాస్తుశిల్పానికంత విలువ.

ఆత్మశరీరంలో నివసిస్తే శరీరం నివసిస్తుంది గృహంలో. కనుక గృహం అనేది గొప్ప తేజోమందిరం. ఇటువంటి తేజోమందిరాన్ని నిర్మించే వాస్తుశాస్త్రం కళలన్నిటికీ తల్లివంటిది అనటంలో ఆశ్చర్యంలేదు. ఆదిమ మానవునికి గృహంయే గృహంకాని మానవుని నిర్మాణశక్తి విజృంభించినకొద్దీ స్వతంత్ర గృహనిర్మాణాన్ని ఏర్పరచుకో ప్రారంభించాడు. వాతావరణ ప్రభావంనుండి రక్షించుకోటానికి ఏర్పడిన గృహనిర్మాణం క్రమేణ ఒక గొప్ప లలితకళగా రూపొంది దానికి గొప్ప శాస్త్రాలు తయారైనాయి. క్రమేణ ఇందులో దేవాలయ స్థాపత్యం ప్రత్యేకతను పొందింది.

వాస్తునిర్మాణం అనేది గంధప్రధానమైన భూమినీ శబ్దప్రధానమైన ఆకాశాన్నీ కలిపే కళ; నిలువురేఖలకూ అడ్డరేఖలకూ సమన్వయాన్ని చేకూర్చేలయ; ఉపయోగానికీ సౌందర్యానికీ మైత్రిని సృష్టించే కౌశలం వాస్తుశిల్పం, భూమికి ఆకాశం గొడుగైతే భూమిమీది మనుష్యులకు గృహమే గొడుగు.

మానవసేవయే మాధవసేవ అయినపుడు మాధవసేవకూడ మానవసేవయే అనే దృఢవిశ్వాసం మానవాళి ప్రబలినకాలంలో గృహనిర్మాణానికి తోడు దేవాలయ నిర్మాణంకూడ వర్ధిల్లసాగింది. అనాటి దేవాలయాలు

దేవుళ్ళకు మాత్రమే ఆలయాలు కాక మానవ సంస్కృతికి కూడ ఆలయాలుగా వుండేవి. గ్రామంలో కానీ, నగరంలో కాని అనేక గృహాలు వున్నాయి. కాని ప్రతి గృహమూ ఒక్కొక్కరి స్వంతమే. ఎవరి గృహం వారిదే. కాని దేవాలయం మాత్రం ఎవరికీ స్వంత గృహం కాదు. అందరికీ స్వంత గృహమే. అది పౌరుల సమష్టిగృహం, సాముదాయిక కార్యకలాపాలకు అది నివాసం, శిల్పాలకూ చిత్రాలకూ అది కళానికేతనం. రూపం ద్వారా రూపాతీతాన్ని అందుకోవాలనికొంటే, ఇంద్రియానుభూతి ద్వారా అతీంద్రియ సత్తాను అనుభవించటానికి అనాడు ఈ దేవాలయ నిర్మాణాలు ఆవశ్యక మయాయి.

శ్రీ స్వర్ణ సుబ్రహ్మణ్యకవిగారి "భారతీయ మహాశిల్పము" ప్రాచీన శిల్పశాస్త్రాలయిన "కాశ్యప శిల్పము", "మానసారము", "శిల్పరత్నము", "సమరాంగణ", "అపరాజిత" మొదలైన వాటిని ఉపయోగించి రచించబడినది. ఈ శాస్త్ర గ్రంథాలలోని శ్లోకాలు, వాటికి తెలుగు తాత్పర్యాలు చేర్చబడినవి. ఎనిమిది భాగాలు వాస్తుశిల్ప విషయాలతోనూ, ఏడు భాగాలు మూర్తి శిల్పవిషయాలతోనూ, 16వ భాగం శిల్పపదాలకు సంబంధించిన నిఘంటువుగానూ కూర్పించబడినాయి.

ఇటువంటి గ్రంథం ప్రజల కెంతవరకు ఉపయోగపడుతుందనవచ్చు. న్యాయానికి ఏ గ్రంథమూ కూడ ప్రజలందరికీ ఉపయోగపడదు. కొన్ని గ్రంథాలు ఎక్కువమందికి ఉపయోగపడితే మరికొన్ని గ్రంథాలు తక్కువ మందికి ఉపయోగపడతాయి. తక్కువ మందికి ఉపయోగపడే గ్రంథాలెప్పుడూ కూడ ఎక్కువ మందికి ఉపయోగపడే గ్రంథాలకంటే గంభీరతరమై వుంటాయి. గ్రంథాల ఉపయోగంకూడ స్థూలంగా కొంతా, సూక్ష్మంగా కొంతా వుంటుంది. "భారతీయ మహాశిల్పం" లాంటి గ్రంథం చాలా తక్కువ మందికి ఉపయోగ పడుతుంది. అందుకే ఈ గ్రంథపు విలువ ఎక్కువ. దీని ఉపయోగం స్థూలం కాక సూక్ష్మం, పాఠకుల సంఖ్యమీద ఆధారపడి వుండదు గ్రంథపు గొప్పదనం.

నివాస గృహాల నిర్మాణానికి మంచి ప్రదేశం ఎంతవసరమో దేవాలయనిర్మాణానికి కూడ అంతమంచి ప్రదేశ మవసరం. "శిల్పరత్నం" 9 వ అధ్యాయం నుంచి ఒక శ్లోకాన్ని తీసి సుబ్రహ్మణ్యకవిగారు ఈ ప్రదేశ నిర్ణయ విషయమై చెపుతారు తాత్పర్యంతో.

తీర్థాంతే తటినీతటే జలనిధే స్తీరే సరిత్సంగమే।
శైలాగ్రేఽద్రి తటే వనోపవనయో రుద్యానదేశే తథా।
సిద్ధాధ్యాయతనేషు వా గురుసదో గ్రామే పురే పత్తనే।
వాన్యత్రాపి మనోరమే సురసమిజ్యాయై క్షితిం కల్పయేత్॥

తా॥ పుణ్యక్షేత్రమునందూ, నదియొడ్డునను, సముద్రపుటొడ్డునను, రెండునదు లేకమైనచోటను, కొండ శిఖరమునను, కొండదిగువ ప్రదేశమునను, మహారణ్యమునను, తోటలోను, రాజవిహారవనమునను, మహర్షులు నివసించినచోటను, గ్రామమునను, పట్టణమునను, వాణిజ్యస్థానమునను, ఇంక నెచ్చట యింపయిన ప్రదేశములందో అచ్చటనెల్ల దేవాలయమును నిర్మించవచ్చును

ఇందులో సూచించిన చోటులు చాలా కమనీయమైనవి. కొండచివరను, కొండక్రిందను, నదీసంగమాలలో, సాగరతీరాలలో, ఉద్యానాలలో ఆలయనిర్మాణాలు ఎంతో ప్రకృతిరామణీయకతను ప్రసాదిస్తాయి. ఆత్మ సాధనకు సుదృశ్యం ఎంతో మేలు చేకూరుస్తుంది. సౌందర్యసాధనకు అందుకే అంత విలువ.

భారతీయ వాస్తుశాస్త్ర గ్రంథాలలో "మానసార" మనేది విశిష్టమైన గ్రంథం. మానసారమంటే అర్థం కొలతయొక్క సారం అని. భారతీయ వాస్తుశిల్పాన్ని గురించి ఈ గ్రంథం సమగ్రంగా వివరిస్తుంది. వాస్తు శిల్పానికీ విశాలత్వాన్నిచ్చి మూర్తి శిల్పాన్నికూడ ఇందులో ఇముడుస్తుంది ఈ "మానసారం". కేవలం గృహ నిర్మాణాన్ని మాత్రమేకాక గ్రామనిర్మాణం, నగరనిర్మాణం, ఉద్యానవన నిర్మాణం, విపణివీధి నిర్మాణం ఓడ రేవుల నిర్మాణం, వంతెనలు కట్టుట, బావులూ, సరోవరాలూ, మెట్లుకట్టు మొదలైనవెన్నో విషయాలు ఇందులో

వివరించబడివున్నాయి. ఇంతేకాక గృహంలో ఉపయోగించే కుర్చీలు, బల్లలు, కట్టెలు, బుట్టలు, పంజరాలు, దీపాలు, దీపస్తంభాలు, ఆభరణాలు తలపాగలు మొదలైనవెన్నో "మానసారం"లో చెప్పబడివున్నాయి. గృహనిర్మాణానికి సంబంధించిన ప్రదేశం, భూమిలోని భూగర్భ పరిస్థితి, వాతావరణ విషయాలు, శీతోష్ణత, సూర్యరశ్మి, గాలిలోతేమ మొదలైన ప్రాథమికవాస్తువిషయాలన్నీకూడ "మానసారం"లో విశదీకరించబడివున్నాయి. ఈ బృహద్గ్రంథాన్ని ఇదివరలో అలహాబాద్ విశ్వవిద్యాలయంలో ప్రాచ్యశాఖాధిపతియైన డాక్టర్ ప్రసన్నకుమార ఆచార్య ఆంగ్లంలోకి అనువదించి వున్నారు. ఇదికాక "సమరాంగణ" అనేదికూడ చాలా విలువైన గ్రంథమే. ప్రథమంలో నిర్మాణమే ప్రాధాన్యం, సూత్రాలు తరువాయివి. సూత్రాలను నిర్ణయించకముందు నిర్మించిన శిల్పులు మౌలికులైన సృజనశీలురు. సూత్రాలు ఏర్పరచబడిన తరువాత నిర్మించే శిల్పులు తమ మౌలిక సృజనమీదకంటే శాస్త్రగ్రంథాల్లోని సూత్రాలమీద ఎక్కువ ఆధారపడి నిర్మిస్తారు. ఈ రెండవ దానిలో మొదటిదానిలోవున్న ప్రాణస్పందన మందగిస్తుంది.

అయితే ప్రతివారూ, ఏ ఆధారం లేకుండా, ప్రమాణ గ్రంథాలతో పని లేకుండా, సూత్రాల సహాయం తీసుకోకుండా శిల్పనిర్మాణం చెయ్యజాలరు. అందువల్ల శిల్పసామాన్య గ్రంథాలుకూడ ఎంతో అవసరం. ఉన్నవన్నీ సంస్కృతంలోనే వుండిపోవటంలో అవి పండితులకు పనికొచ్చేవిగా మాత్రమే వుండిపోయినాయి. శ్రీ స్వర్ణ సుబ్రహ్మణ్యకవిగారు అవసరమైన వాటన్నిటికీ తెలుగుటీకలు వ్రాసి తెలుగు శిల్పుల కుపయోగపడునట్లు ఈ గొప్ప గ్రంథాన్ని తయారు చేయటం అసమాన సేవ చేయటమే.

వాస్తుశిల్పంతో ప్రారంభించి మూర్తిశిల్పం మీదుగా శిల్పపద నిఘంటువుతో పూర్తిచేసిన ఈ పదహారు భాగాలలో సుబ్రహ్మణ్యశర్మగారు తమ జీవితాన్ని అంకితం చేశారు. సృజనాత్మక శిల్పులకే కాక శిల్పసంబంధమైన విషయాలు తెలుసుకొని ఆనందించాలనే శిల్పజిజ్ఞాసువులకు కూడ ఈ గ్రంథం ఎంతగానో తోడ్పడుతుంది.

భారతీయ వాస్తుశిల్పానికి బౌద్ధనిర్మాణాలు ఎంతగానో వికాసాన్ని ప్రసాదించాయి. విహారం, చైత్యం, స్తూపం అని బౌద్ధవాస్తుశిల్పాన్ని మూడు విభాగాలు చేయవచ్చు. విహారం అనేది బౌద్ధభిక్షువులు నివసించటానికి నిర్మించబడిన ఆవాసం. చైత్యం అనేది వారు ఆరాధనచేసుకొనే ఆరాధనామందిరం. ఇక స్తూపం అనేది మరణించినవారిని పూడ్చికట్టిన సమాధులు, ఈమూడింటి వాస్తువిధానంకూడ వేర్వేరుగా వుంటుంది.

భారతీయ దేవాలయ వాస్తులో గోపురం వున్నట్లే పాశ్చాత్యమైన గోథిక్ వాస్తులోకూడ ఆర్చీలతోనిండిన శిఖరనిర్మాణం వున్నది, చర్చీలకు. పాశ్చాత్య వాస్తుశిల్పంలో మనకు రెండు విధాలైన ప్రధానశైలులు గోచరిస్తాయి. ఒకదాన్ని ట్రబేటెడ్ (Trabeated) శైలి అనీ, రెండవదాన్ని ఆర్క్యుయేటెడ్ (Arcuated) శైలి అనీ అంటారు. మొదటి శైలికి స్తంభమూ, దూలమూ ప్రధానాలు. ఈ శైలి అధికంగా ప్రాచీన ఈజిప్టులోనూ, మినోవాన్ పర్షియా, గ్రీసు మొదలైన దేశాలలోనూ గోచరిస్తుంది. రెండవ శైలిలోని ప్రధాన లక్షణాలు ఆర్చీ, గుంబజాలూ మొదలైనవి. ఇది ప్రధానంగా రోమన్, బైజాంటైన్, గోథిక్ సంప్రదాయాలకు చెందివుంది. ఈ రెండు విధానాల నిర్మాణంకూడ రాయి దొరికే దేశాలమీదా, రాయి దొరకని దేశాలమీదా ఆధారపడివుంటుంది. రాయిదొరికే చోట మొదటిశైలి వ్యాపకంలో వుంటే రాయి దొరకక ఇటుకలతో మాత్రమే నిర్మాణం సాగేచోట రెండవ శైలి వ్యాపకంలో వున్నది. అప్పుడు ఎండకు ఎండిన ఇటుకను మాత్రమే వాడేవాళ్ళు ఆదేశాలలో. భారత దేశంలో ఆర్యులు ప్రవేశించినప్పుడు ఆర్యులుకూడ కాల్చని ఇటుకనే కట్టడాలకు వాడేవాళ్ళు. కాని భారత దేశంలోని అప్పుడువున్న అనార్యులు మాత్రం కాల్చిన ఇటుకనే వాడేవాళ్ళు.

భారతీయ వాస్తులో పైచెప్పిన రెండు పాశ్చాత్య శైలుల మిశ్రమ విధానం గోచరిస్తుంది. గోపుర నిర్మాణంలో రెండవశైలి, మిగతా నిర్మాణాలలో మొదటి శైలీ గోచరిస్తాయి. మొదటి శైలిలో స్తంభాల నిర్మాణం చాలా ప్రధానమైనది. ఈ స్తంభాల వివరాలను "మానసారం"లో విపులంగా ఇచ్చివున్నారు. దీనినే సుబ్రహ్మణ్యకవి గారు తమ "భారతీయ మహాశిల్పము"లో విశదీకరించినారు. అసలు స్తంభం అనే పేరుకే పర్యాయనామములు 12 వున్నాయి. జంఘ. చరణము, స్తలి, స్తంభము, అంఘ్రి, స్థాణు, స్థూణము, పాదము, స్కంభము, అరణి, భారము, ధారణము,

"4 కోణములు గలది బ్రహ్మకాంతము, 8 పలకలు కలది విష్ణుకాంతము, 16 పలకలుగాని గుండ్రము గాని కలది రుద్రకాంతము, 6 పలకలు గలది స్కంద కాంతము, మొదలునుండి చివర వరకు ఇట్లు ఆకారము చెప్పబడినది, మరియు మొదలు నడుము చివర నాలుగు పలకలును చివర తారముతో సమానముగా చివర కంఠమును, మధ్య తారముతో సమానముగా మధ్య కంఠమును, అటులే మొదటి భాగమునను దాని తారముతో సమానముగా కంఠమును చేసి మొదలు నాలుగు పలకలు యెప్పటివలెనే యుంచినట్లయిన చిత్రకంఠమను పేరు గలదియగును. ఇది అన్ని దేవాలయములకును పనికివచ్చును".

ఇక "కాశ్యపశిల్పము"లో కిటికీలను (జాలకములు) గురించి ఎన్నో వివరాలు చెప్పబడివున్నాయి. కిటికీలపేర్లు, లక్షణాలు ఈ విధంగా వున్నాయి.

"గోనేత్రము, గజనేత్రము, నంద్యావర్తము, ఋజుక్రియము, పుష్పకర్ణము, సకర్ణము, అని జాలకములు 6 విధములు. దీర్ఘచతురస్రముగను, కంఠమునందు ఛిద్రములు లేకుండునది గోనేత్రము, పలుచదరముగను కర్ణమున ఛిద్రములును గలది గజనేత్రము. 5 పుష్పములుగా ఛిద్రములు గలది నంద్యావర్తము. మధ్య కమ్మి యుండి రెండు కిటికీలుగా చేసిరేని ఒక్కటియే రెండుగా కనుపడునది ఋజుక్రియము. నంద్యావర్తమువలె రంధ్రములు గలది పుష్పకర్ణము. ఆయత వృత్తము కలది సకర్ణము స్తంభముతో కలసియున్న కిటికీగాని గోడయందున్న కిటికీగాని తలుపులు యిష్టానుసారముగా చేయవచ్చును. సభ మొదలైనవానికి కిటికీలు అర్ధపదముగ చేయవలెను, ఇనుముతోను, దారువుతోను, రాతితోను, ఇటుకలతోను కిటికీని చేయవచ్చును. ఎక్కడ అవసరమనితోచిన అక్కడ కిటికీని పెట్టవలెను. శిల్పరత్నము 4 అధ్యాయము దీని ననుసరించియే యున్నది".

ఈ విధంగా ఒక్కొక్క విషయాన్ని గురించి ఇన్నిన్ని వివరాలతోకూడిన భేదాలున్న శిల్పశాస్త్రాలు అరుదుగా వుంటాయి. అటువంటి అరుదైన గ్రంథాలను ఎన్నుకొని, ఆగ్రంథాలలోని అవసరమైన అధ్యాయాలనూ, ఆ అధ్యాయాలలోని అవసరమైన శ్లోకాలనూ తీసుకొని ఇటువంటి ఉద్గ్రంథ నిర్మాణం గ్రంథకర్త చేయటం ఎంతో ప్రశంసనీయమైనపని. ఈ గ్రంథంలో సాహిత్య రచన మాత్రమేకాక గ్రంథకర్త స్వయంగా కొంత రేఖాచిత్ర రచనకూడ చేశారు. శిల్పమంతా దృశ్యకళ, దృశ్యకళను గురించి శ్రవ్య ప్రధానమైన మాటలలో నూరువాక్యాలు చెప్పేబదులు మూడు చిత్రాలను చూపితే ఇతరులకు సులభతరంగా తెలిసిపోతుంది. గ్రంథకర్త చిత్రకారుడుకూడా కావటంవల్ల ఈపని చక్కగా నెరవేరింది.

పైన స్తంభాల భేదాలు వివరించబడి వున్నాయి. వాటిని చదివినంతమాత్రాన వాటి తారతమ్యాలను చక్కగా కళ్లకు కట్టినట్లుగా తెలుసుకోటానికి వీలుండదు. స్కందకాంత స్తంభముగా 6 పలకలు గలిగివుంటుంది అని పదిసార్లు చదివిన దానికంటే ఒక్కసారి ఆ స్తంభాన్నికాని, ఆ స్తంభపు చిత్రాన్నికాని చూస్తే వెంటనే బోధపడుతుంది. ఇటువంటి వాటన్నిటికీ సుబ్రహ్మణ్యకవిగారు రేఖాచిత్రాలను రచించటంతో చదువరుల పని చాలా సులభమైంది. ఒకే వస్తువును ఒక శిల్పశాస్త్రంలో ఒక విధంగా వివరించివుంటే మరో శిల్పశాస్త్రంలో మరో విధంగా వివరించి వుంటుంది. అంతమాత్రాన ఆ రెంటికీ కలయిక వుండదనుకోరాదు. ఈ లక్షణ భేదాలకు కారణం ఈ శిల్పశాస్త్రాలన్నీ ఒకే కాలంలో, ఒకే ప్రాంతంలో ఒకే లాక్షణికునిచేత రచించబడినవికావు. వేరువేరుకాలాల్లో, వేరువేరు ప్రాంతాల్లో వేరువేరు వ్యక్తులచేత రచించబడినాయి. అందువల్ల ఒకే వస్తువును గురించివ్రాస్తే కూడ వాటిలో భేదాలు తప్పవు. ఈసత్యం సాహిత్య రచనల్లో, నాట్యశాస్త్రాల్లో, సంగీత శాస్త్రాల్లోకూడ విదితమవుతుంది. ప్రాంతేతర పాఠ్యభేదాలు అన్నిటిలోనూ గోచరిస్తూనే వుంటాయి కాలభేదాలనుకూడ కలుపుకొని.

ఈ విభేదాలు అంతగా ప్రధానమైనవికావు. దేన్ని అనుసరించి పంచరించినా ప్రమాదంలేదు. వాస్తు శిల్పంలోని ఉపపీఠాన్ని వివరించటంలో "శిల్పరత్నము"అనే గ్రంథం ఒక విధంగానూ, "మానసారం" అనే గ్రంథం మరోవిధంగానూ చెప్పటం జరిగింది. వీటి వివరణల్లో కొలతలకుకూడ భేదాలున్నాయి. ఉదాహరణకు, ఉపపీఠంయొక్క ఎత్తును 12 భాగాలుచేసి అందులో పాదుక 2 భాగాలు, పద్మం 1 భాగం, క్షేపణం ½ భాగం మొదలైనవి "శిల్పరత్నము"లో చెప్పివుంటే "మానసారం" లో ఉపపీఠంయొక్క ఎత్తును 24 భాగాలుచేసి,

వాటిలో పాదుక 5 భాగాలనీ, కంపము 1 భాగమనీ, కంఠం 12 భాగాలనీ, మొదలైన విధంగా చెప్పబడివున్నది. ఇందుకు సుబ్రహ్మణ్య కవిగారు తమ వ్యతిరేకతను తెలుపుతూ ఇది నిజంగా 12 భాగాలేకాని 24 భాగాలు కాదని "మయమతము" నుండి ఈ శ్లోకాన్ని ఎత్తిచూపుతున్నారు. "ఉత్సేధం ద్వాదశాంశేతు, పాదంద్వ్యంశము పానకః అర్ధేన కంప మిత్యుక్తం గ్రీవోచ్ఛ్రంతు షడంశకం." ఇదే విషయాన్ని "మానసారం" లోనే మరికొన్ని విధాలుగా కూడా చెప్పబడి వున్నది.

కొందరు శిల్పులు తమ అభిమానాలను అనుసరించి తమకు నచ్చిన వాటిని ఎన్నుకొని వాటికి అను గుణంగా సంచరిస్తారు, ఒకరు అనుసరించిన పంథాను మరొకరు నిందించటం కూడా శిల్పుల్లో వ్యాప్తమై వున్నది. ఇటువంటి వివాదాలు వాంఛనీయాలు కావు. నిరపేక్షిక దృష్టిలో దోషం అనేదే లేదు ఎందులోనూ కూడ. కాని సాపేక్షిక దృష్టిలో దోషం లేనిది లేదు. శాస్త్రం అనేది నిర్దోషమైనది అని నమ్మటమే ఒక మహాదోషం. ఒక నాటి గుణం రెండవ నాటికి దోషం కావచ్చు. శిల్పవిషయాలనే తీసుకొందాం. పీఠం ఎత్తు నాలుగు అంగుళాలుండాలని వుంటే అప్పటికది సమంజసంగానే వుండవచ్చు. అప్పటి అవసరాలనుబట్టి, దాన్ని అప్పుడు గుణమే అంటాం కాని దోషం అనం. కాని అదే పీఠం మరొక కాలంలోనో, మరొక దేశంలోనో నాలుగు అంగుళాల ఎత్తువుంటే చాలక పోవచ్చు. ఆరు అంగుళాలుంటేకాని సరిపోదు. అప్పుడు పీఠం ఎత్తు ఆరు అంగుళాలుండాలని శాస్త్రం వాసిస్తుంది. అంతటితో నాలుగు అంగుళాల కొలత దోషంగా భావించబడుతుంది. కనుక శాస్త్రాలు కూడ అంతిమ ప్రామాణ్యాలు కావు, అవి నిరపేక్షికాలు కావు కనుక.

ఎనిమిదవ భాగంతో వాస్తుశిల్పం వెనక్కు తగ్గి తొమ్మిదవ భాగంతో మూర్తిశిల్పం ముందుకు వస్తుంది. ఏయే ప్రతిమకు ఎంతెంత కొలతలుండాలి, ఏయే లక్షణాలుండాలి మూర్తి నిర్మాణానికి పనికివచ్చే శిలలు ఎన్ని విధాలు, వాటి ధర్మాలేమిటి మొదలైన విషయాలతో నిండివుంటాయి ఈ భాగాలు.

మొదటనే మనం అనుకొన్నట్లు భారతీయమూర్తిశిల్పం అటు వాస్తవవాదాన్నీ కలిగున్నది, ఇటు కల్పనా వాదాన్నీ కలిగున్నది. సహజరూపాలను ఎంతగా కల్పించారో భారతీయ శిల్పులు అసహజరూపాలనుకూడ అంతగా నిర్మించారు. సృష్టిలో సహజత్వమే ప్రధానంకాదు, అసహజత్వంకూడ ప్రధానమైనదే. సహజత్వమనేది తయారు కాని ముడిపదార్థం, దాన్ని సుందరరూపంలోకి కాని అసుందరరూపంలోకి కాని మలచటం అసహజమే అవుతుంది. ప్రపంచంలోని సంస్కృతి, సభ్యత అంతాకూడ అసహజమైనదే, అందుకే అవి గొప్పవి. మానవుడు జన్మించే టప్పుడు సహజస్థితిలో వుంటాడు. కాని క్రమేణ వస్త్రాలు ధరించటం, మాటాడటం, వండిన పదార్థాలనుతినటం, కళాసృష్టిచేయటం మొదలైన పనులద్వారా అసహజంగానే అవుతాడు. ఈ అసహజత్వమే మానవుని విశిష్టత, జంతువులు సహజంగా జీవిస్తాయి కాని మానవుడు అసహజంగా జీవిస్తాడు. అందుకే మానవుడు గొప్పవాడు, గేతే మహాకవి ఈ విషయాన్నే సుందరంగా అన్నాడు, "Those organs which guide an animal are under man's guidance and control." ఏ అవయవాలు జంతువును నడుపుతాయో ఆ అవయవాలను మనిషి నడుపుతాడు, తన వశంలో వుంచుతాడు.

భారతీయ మూర్తి శిల్పానికి దేహమానం (Anatomy) లేదనే విమర్శవున్నది. ఇది నిజమే, అయితే దానికి వాస్తవ దేహమానం లేదుకాని కళాత్మక దేహమానం వున్నది. భారతీయ శిల్పశాస్త్రాలన్నీకూడ రూపకళాత్మక దేహమానపు కొలతలతో నిండివున్నాయి, వాస్తవదేహమానాన్ని అనుసరించి కల్పిస్తే అది అనుకరణ అవుతుంది కాని సృజనకాదు. గ్రీకుశిల్పం నాస్తవవాదానికి చెందిందీ అని అంటే దానిలో కూడ దేహమానం వున్నదని కాదు. శుద్ధభారతీయశిల్పం అనబడే దానిలోకంటే ఎక్కువ వాస్తవికత ఉన్నదని మాత్రమే, ఒక భారతీయ శిల్పంలోనేకాదు దేహమానంలేనిది, నేడు ప్రపంచమంతటా వ్యాపించివున్న ఆధునిక శిల్పంలోకూడ దేహమానం లేదు. దేహమానాన్ని అనుసరించి నిర్మించినట్లయితే విశ్వవిఖ్యాత మహాశిల్పి హెన్రీమూర్ నేడెవరికీ తెలిసివుండే వాడే కాదు.

భారతీయ శిల్పంలో వాస్తవవాదంకూడ వున్నదీ అంటే అందులో ఫోటోగ్రాఫిక్ వాస్తవిక వున్నదని అర్థంకాదు. ఒక విధమైన ఆదర్శవాదపు వాస్తవికత అని అర్థం.

ఇక సుబ్రహ్మణ్యకవిగారి "భారతీయ మహాశిల్పము" లౌకిక శిల్పవిషయం కాక అధిలౌకిక శిల్పవిషయం కావటంతో ఇందులోని కొలతలు, లక్షణాలు మొదలైనవన్నీ విలక్షణంగా వుండి మన మామూలు వాస్తవంకంటే భిన్నంగా వుంటాయి. ఇందులోని లక్షణాల ననుసరించి నిర్మించిన శిల్పాలలో రూపలావణ్యం సన్నగిల భావసౌందర్యం ఎక్కువవుతుంది. మానవశిల్పసత్తా మానవులను నిర్మించటంతో మాత్రమే ఆగక కాల్పనిక జీవులైన యక్ష, గంధర్వ కిన్నర, కింపురుష రాక్షస, దేవ మొదలైన వారిని కూడ సృష్టించింది. ఆ కల్పనారూపాలకు సాహిత్యంలో ప్రాణం పోసినట్లే శిల్పంలోకూడ ప్రాణం పోశారు. ఒకో జీవికి ఒకో విశిష్టరూపం కల్పించారు. రాక్షసుల రూపాలను ఏ విధంగా కల్పించాలి, దేవతా రూపాలను ఏ విధంగా ఇంకా ఇతర రూపాలను ఏ విధంగా కల్పించాలి మొదలైన సర్వవిషయాలూ ఈ గ్రంథంలో వివరంగా, విపులంగా కనపిస్తాయి. కొన్ని విషయాలను చూస్తే ఆ కాలంలో కూడ ఇంత విలక్షణత వుందేనా అనిపిస్తుంది!

శ్రీ స్వర్ణ సుబ్రహ్మణ్య కవిగారు "భారతీయ మహాశిల్పము"ను బహుశ్రమపడి మాగించారు. కొన్ని రచనలను రచయితలు తమ నిమిత్తమే రచించుకోవచ్చు. కాని ఈ గ్రంథంలాంటి రచనలను మాత్రం ఇతర్ల నిమిత్తమే రచిస్తారు. అందువల్ల ఇటువంటి గ్రంథాల సఫలత గ్రంథకర్తమీద మాత్రమే సమగ్రంగా ఆధారపడక పాఠకులమీదకూడ కొంత ఆధారపడి వుంటుంది. ఇందులోని విషయం శాస్త్రీయమైనదైనప్పటికీ గ్రంథకర్త ఉపయోగించిన సరళశైలిద్వారా అతి సుబోధకంగా వున్నది.

దృశ్యమయమైన రూపకళలను శ్రవ్యమైన-శబ్దాల్లో ఇమిడ్చి వినిపించటం అంత సులభం కాదు. ఈ సులభం కాని పనిని నెరవేర్చారు ప్రాచీన శిల్పశాస్త్రజ్ఞులు తమ శిల్పశాస్త్రాలలో. ఆ శిల్ప శాస్త్రాలను సుబ్రహ్మణ్యకవి గారు మన మాటల్లో మన కందించారు తమ "భారతీయ మహాశిల్పం"లో.

శిల్పాన్ని సృజించటం ఆనందం; సృజించిన శిల్పాన్ని దర్శించటం ఆనందం, శిల్ప గ్రంథాన్ని రచించటం ఆనందం; రచించిన శిల్పగ్రంథాన్ని పఠించటం ఆనందం, ఇటువంటి ఆనందాలమధ్య జీవించటం ఒక మహదానందం!

తుమ్మపూడి<br>1968 } — సంజీవదేవ్

## శ్రీ నార్ల వెంకటేశ్వరరావుగారు (ఆంధ్రజ్యోతి ఎడిటర్.)

అలంకారశాస్త్రాన్ని కొన్నేళ్లక్రితం ఒక మహాపండితుడు తెనిగించాడు, దాన్ని చూడగా "సంస్కృతం వచ్చినవారికి ఇది అనవసరం, రానివారికి ఇది అర్థంకాదు" అని తీర్మానించుకోవలసి వచ్చింది.

స్వర్ణ సుబ్రహ్మణ్యకవిగారు భేషజాలకుపోరుగాని శిల్పశాస్త్రంలో వారు మహాపండితులే, "సమరాంగణ" "కాశ్యపశిల్పం" "మానసారం" "శిల్పరత్నం" మొదలైన ప్రాచీన శిల్పశాస్త్రాలలోని ముఖ్యభాగాలకు ఆయన చేసిన ఈ తెనిగింపు సంస్కృతంరాని నాబోటివారికి చక్కగా అర్థమౌతున్నది. నాదృష్టిలో ఇది సామాన్య విజయంకాదు,

అనువాదాలు సుబోధకంగా జరగాలంటే. అనువాదకునికి రెండు భాషలపై (మూలం భాషపై మాతృ భాషపై) సమానంగా అధికారం వుండాలి. ఇంతేకాదు, మూలగ్రంథాంశంపై కూడా అధికారం వుండాలి. ఈ అర్హతలు తమకు పుష్కలంగా వున్నందువే సుబ్రహ్మణ్యకవిగారు తమ ఈ అనువాదంలో ఘనవిజయాన్ని సాధించారు.

ద్రవ్యాభావంవల్ల ఈ గ్రంథ ప్రచురణ మధ్యలో నిలిచిపోతే అప్పుడు మనప్రభుత్వం విజ్ఞత, మన పరిషత్తుల విజ్ఞత, మన సాహిత్యపోషణల విజ్ఞతను, శంకించవలసి వస్తుంది. నిర్విఘ్నంగా దీని ప్రచురణ పూర్తికావాలని మనసారా కోరుతున్నాము. కాగలదని విశ్వసిస్తున్నాము.

ఆంధ్రజ్యోతి<br>విజయవాడ } — నార్ల వెంకటేశ్వరరావు

## శ్రీ వావిలాల గోపాలకృష్ణయ్యగారు, యం. యల్. ఎ.

శ్రీ స్వర్ణ సుబ్రహ్మణ్యకవి
స్వర్ణ కోటేశ్వరరావుగారికి,

హైదరాబాదు
21-2-68

నమస్తే, మీరు అత్యంత ఆదరణతో పంపిన భారతీయ మహాశిల్పము బృహద్గ్రంథము 1, 2, 3 భాగాలు అందినవి. అత్యంత కృతజ్ఞుడను. ఇది ఒక మహాగ్రంథముగా అనుపమముగా ఉన్నది. సంస్కృత శ్లోకాలకు ఆంధ్రానువాదం చాలా శ్రద్ధతో చేసినారు. నా అభినందనలు. ఈ గ్రంథమును గూర్చి అభిప్రాయం యివ్వడం నా అర్హతకు మించినపని అనిపిస్తున్నది, నమస్తే

భవదీయుడు,

వావిలాల గోపాలకృష్ణయ్య
21-2-68

---

# నివేదిక

'భారతీయ మహాశిల్పము' అనే ఈ బృహద్గ్రంథాన్ని ఆంధ్రులకు అందించ గలుగుతున్నందుకు ఆంధ్ర శిల్పకళాపరిషత్తు ఎంతగానో ఆనందిస్తున్నది. ఈ పరిషత్తుకు ఈనాటి చైతన్యం కలిగించినవారు శ్రీ స్వర్ణ సుబ్రహ్మణ్యకవిగారనే చెప్పవలె. పరిషత్తును తన సొంతడబ్బు వెచ్చించి రిజిష్టరు చేయించి తద్వారా ప్రభుత్వము నుండి గ్రంథముద్రణకు మూడువేల రూపాయల విరాళం సంపాదించడానికి కారకులు శ్రీ కవిగారే. ఆ మేరకు పరిషత్తు శ్రీవారికి సర్వదా కృతజ్ఞత చూపుతున్నది. ఈ మహోత్కృష్ట గ్రంథం వెలువడడానికి ధనసహాయం చేసిన ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వ విద్యాశాఖవారికి మా కృతజ్ఞతలు.

భారతీయ మహాశిల్పం — అనేక విషయాలను క్రోడీకరించిన బృహద్గ్రంథం. సామాన్య శిల్పులకు గ్రామనగరాదులు, ఆలయ మండపాదులు దేవతాప్రతిమాదులు నిర్మించడానికి కావలసిన లక్షణాలను సులభంగా అందించడానికి ఇంకొక చిన్న లక్షణగ్రంథం ప్రకటించాలని వున్నది. దానితోపాటు ప్రతిష్ఠాతంత్రం నడపడానికి గూడ ఒక సులభ సూక్ష్మ ప్రతిష్ఠా కలాపం అవసరంగా వున్నది. ఈ రెండు గ్రంథాలు అచిరకాలంలోనే వెలువడ బోతున్నవి. ఈ పనులన్నింటికీ మాకు కళాప్రియుల దోహదం కావలసివున్నది. ఈ భారతీయ మహాశిల్ప గ్రంథాలు కొద్దికాలంలోనే చెల్లినట్లయితే ఇంకా ఎన్నోపనులు చేయగలుగుతామని ఆశిస్తున్నాము. అందుకు మీ సహకారం అవసరం.

ఇట్లు
కొండూరు వీరరాఘవాచార్యులు
కార్యదర్శి
ఆంధ్ర శిల్పకళాపరిషత్తు

తెనాలి
12-6-68

# విషయసూచిక

ప్రథమకళ

ద్వితీయభాగము

## తృతీయకళ

| | కాశ్యప | మాన | శిల్పర | సమరాం | అపరా |
|---|---|---|---|---|---|
| ప్ర | 3-4-5-6 | 13-14- | 9-10-16-17-18-19 | 1-61- | 173 |
| ద్వి | 7-8-9-10-11-12-13-14-15-16-17-18-19-20-21-22 24-25- | 15-16-18-11 | 1-20-21-23-30-32-34-35-36- | 55 | 150 |
| తృ | 26-27-28-29-30-31-32- | 12-19-20-21 22-23. | 1-25-26- | 62 | 106- |



277 వ పుటలో ఈ దేవాలయము కొలతలు చదివి తెలిసికొనవచ్చును.



శ్రీ విశ్వకర్మ పరమేశ్వరునకు

భక్తిపూర్వకముగా

అంకితమీయబడినది.

శ్రీ ర స్తు

# భారతీయ మహాశిల్పము.

ప్రథమ కళ

---

## 1. ఇష్టదేవతాస్తుతి.

శ్రీవాణ్యాశ్రిత పాదపద్మయుగళం, విద్యుత్ప్రభాభాసురం
గాయత్రీయుత మవ్యయం దశభుజం మేర్వగ్ర పీఠోజ్జ్వలం
దేవర్షిస్తుత పంచవక్త్రమభవం మందస్మితాస్యం శివం
వందే శిల్పసహస్ర మూలపురుషం శ్రీవిశ్వకర్మ ప్రభుమ్॥ 1

కేయూరైః కటకై ర్విభూషితకరం హారావళీ సంయుతం
దివ్యద్రత్నకిరీటకుండలధరం పీతాంబ రాలంకృతం
సృష్ట్యాదిత్రయ హేతుమూలవపుషం మేఘాధిరూఢోజ్జ్వలం
సర్వాభీష్ట వరప్రదాయక మహం వందే తమీశం సదా॥ 2

పంచాస్యాం నవయౌవనాం దశభుజాం విద్యున్నిభాం సుందరీం
నానాశక్తి సముద్భవాత్మకతనుం వేదస్తుతాం చిన్మయీం
గాయత్రీం కనకాంబరాం త్రినయనాం హంసాధిరూఢాం పరాం
సాష్టాంగైః ప్రణమామ్యహం నిఖిలదాం దేవీం జగన్మాతరమ్॥ 3

సద్యోజాత ముఖాజ్జాతం శుద్ధస్ఫటిక సన్నిభం
ఆదిశక్తియుతం శాంతం ఋగ్వేదస్యాధి నాయకమ్॥
త్రికోణకుండహోతారం కాలమేఘోపరి స్థితం
లోహకృన్మూలపురుషం మనుంధ్యాత్వాఽర్చయామ్యహమ్॥ 4

వామదేవ ముఖోద్భూతః మేఘవర్ణో మహాద్యుతిః
పరాశక్తియుతోదేవో యజుర్వేదాధినాయకః
ధీమాంశ్చతుష్కోణకుండ హోతానీలాభ్రవాహనః
దారుకృన్మూలపురుషః పాతుమాం సర్వదా మయః॥ 5

అఘోరముఖ సంజాతం మహామాణిక్య సన్నిభం
ఇచ్ఛాశక్తియుతం వృత్త కుండహోతార మవ్యయం
సామవేదాధిపం భక్త మేఘవాహన సంస్థితం
తామ్రకృన్మాలపురుషం త్వష్టారం పూజయా మ్యహమ్॥ 6

తత్పురుష ముఖాజ్జాతం శ్యామవర్ణం మహౌజసం
షట్కోణకుండ హోతారం క్రియాశక్తియుత ప్రభుం
అధర్వామ్నాయనేతారం శ్వేతమేఘోపరిస్థితం
శిలాకృన్మాలపురుషం శిల్పినం ప్రణమా మ్యహమ్॥ 7

ఈశాన ముఖసంజాతః తప్తకాంచన సన్నిభః
జ్ఞానశక్తియుతః పీత మేఘస్సంస్థో పరిస్థితః
ప్రణవశ్రుతీశాష్టాస్ర కుండహోతా మహామతిః
స్వర్ణకృన్మాలపురుషో విశ్వజ్ఞః పాతు మాం సదా॥ 8

బ్రహ్మేశానాచ్యుత గుణగణైః సంభవోయః పరాత్మా
కాలజ్ఞాన ప్రథితవచనై ర్లోకచక్షుష్ ప్రదాతా
మాయాతీతః కులమతహరో ధర్మసంరక్షకస్తం
వీరబ్రహ్మేంద్ర గురుచరణం నౌమిభక్త్యా సదాఽహమ్॥ 9

శ్రీ పాలకొండ పురభాసిత భానుబింబం
సింహాద్రి వంశ భవ మాది విరాట్ స్వరూపం
సద్విశ్వనాథ మవధూత మతీంద్రియం తం
సర్వార్థదాయక మహం ప్రణమామి భక్త్యా॥ 10

శ్రీ స్వర్ణవంశ కలశోదధి పూర్ణచంద్రః
అష్టాంగ యోగ మహిమాతిశ యాభిరామః
సాక్షాన్మహేశ్వరభవోఽ మరలింగనామ
మాంమత్పితా మహసమః కృపయా స పాయాత్॥ 11

సమరాంగణ ?వ అధ్యాయము.

శ్లో॥ సుఖం ధనావిబుద్ధిశ్చ సంతతిః సన్నదాస్పృణాం
ప్రియాణ్యేషాంతు సంసిద్ధ్యై సర్వంస్యా చ్ఛుభలక్షణమ్॥

(2) యచ్చనిందితి లక్ష్మాత్ర తదేతేషాం విఘాతకృత్।
అతః సర్వ ముపాదేయం, యద్భవే చ్ఛుభలక్షణమ్॥ 8

తా॥ శుభలక్షణములతో గూడినవన్ని యును మానవులకు సుఖమును ధనమును ఐశ్వర్యమును సంతానమును కలిగించును. అవలక్షణములు కలవి యన్నియును సర్వమును నశింపజేయును. కనుక సమస్తమును శాస్త్రోక్తమైన శుభలక్షణములతో నున్నదానినే స్వీకరింపవలయును. అట్టి శాస్త్రమునే శిల్పశాస్త్రమనియు, వాస్తుశాస్త్రమనియు చెప్పచుందురు.

2. గ్రామాదులయందు దేవాలయ నియమము.

శిల్పరత్నము 9వ అధ్యాయము

శ్లో॥ తీర్థాంతే తటినీతటే జలనిధేస్తీరే సరిత్సంగమే।
శైలాగ్రేఽద్రి తటేవనోపవనయో రుద్యానదేశే తథా।
సిద్ధాద్యాయతనే షువా గుహవరో గ్రామే పురేపత్తనే।
వాన్యత్రాపి మనోరమే సురసమిజ్యాయై క్షితిం కల్పయేత్॥

తా॥ పుణ్యక్షేత్రమునను నదియొడ్డునను, సముద్రపు టొడ్డునను, రెండు నదులేకమైన చోటను, కొండ శిఖరమునను, కొండకు దిగువ ప్రదేశమునను, మహారణ్యమునను, తోటలోను, రాజవిహార వనమునను, మహర్షులు నివసించినచోటను, గ్రామమునను, పట్టణమునను, వాణిజ్యస్థానమునను, ఇంక నెచ్చట యింపయిన ప్రదేశము కలదో అచ్చటనెల్ల దేవాలయమును నిర్మించవచ్చును.

శిల్పరత్నము 9వ అధ్యాయము

శ్లో॥ ప్రాచీ ప్రతీచి చహరో నిజదిశ్యమేశే
వాయౌ నిశుంభజితి తారక జిత్యుదీచ్యాం
గ్రామాదికేషు నిరృతౌగణ పార్యయోశ్చ
గృహ్ణాతు భూమిమఖిలేష్వపి మధ్యతో వా॥ 2

తా॥ తూర్పునను పడమరను విష్ణ్వాలయమును. ఈశాన్యమున శివాలయమును, వాయవ్యమున దేవియాలయమును, ఉత్తరమున షణ్ముఖాలయమును, నైరృతిన వినాయకాలయమును, సమస్త దేవతలకు గ్రామ మధ్యమునను దేవాలయములను నిర్మించవచ్చును.

శ్లో॥ తద్గ్రామ పురరాష్ట్రాణాం స్యాన్మధ్యే బ్రహ్మణోగృహం।
ప్రాచ్యాం వా పశ్చిమే విష్ణోర్గ్రామాదీనాంచ సమ్ముఖమ్॥ 10

తా॥ పట్టణమునందైనను, గ్రామమునందైనను, బ్రహ్మయొక్క ఆలయము గ్రామ మధ్యమమునందే యుండవలెను. విష్ణు దేవాలయము గ్రామమునకు తూర్పునగాని, పడమరగాని, గ్రామమును చూచుచునుండవలెను.

శ్లో॥ ఉగ్రాః పరాఙ్ముఖాః శస్తా। నృణాం సౌమ్యాస్తు సమ్ముఖాః॥ 15

తా॥ ఉగ్ర దేవతలయిన నృసింహ, వీరభద్ర, వీరాంజనేయ, ఆలయములు గ్రామమున కెదురుగా నుండకూడదు. సౌమ్య దేవతలయిన లక్ష్మి, సరస్వతి, వినాయకుడు, విష్ణువు, శివుడు, మొదలగు దేవతల ఆలయములు గ్రామమును చూచుచుండుట శ్రేష్ఠము

### 3. విమాన నిర్మాణమునకు ఖాతవిధి.

శిల్పరత్నము 10వ అధ్యాయము

శ్లో॥ స్నిగ్ధం చైవతథా స్నిగ్ధం ద్వివిధం భూమిలక్షణం
చిక్కణాశర్కరా ఢ్యావా వ్యశక్యఖనన క్రియా॥ 1
యాసాస్నిగ్ధా మహీఖ్యాతా తనువాలుక సంయుతా
పురుషాంజలి మాత్రేషు దృష్టా తోయసమన్వితా॥ 2

అక్లేశాత్ఖననం యత్ర సాస్నిగ్ధాఖ్యా మహీస్మృతా।
హస్తమాత్రం ఖనేత్ స్నిగ్ధ భువమన్యత్ తథాజలమ్॥ 3

తా॥ భూమి స్నిగ్ధమనియును, అస్నిగ్ధమనియును, రెండు విధములు కలదు. అందు నునుపు గలిగి మొరముతో దట్టమైయుండి త్రవ్వుటకు సాధ్యముకానిది అస్నిగ్ధమనియు, సన్నటి యిసుకతోగూడి నడుములోతు త్రవ్వినప్పటికి జలము కనపడునట్టిదియును, సులభముగా త్రవ్వదగినదియు, నగు భూమి స్నిగ్ధమనియు జెప్పుదురు. దేవాలయమునకు పై రెండు విధముల భూమి పనికివచ్చును.

శ్లో॥ యుగాగ్రే తూక్తమానేతు మానసూత్రం విధాయతు।
తదన్యాకృతి గేహానాం తత స్తత్సంభవ క్షమాం॥ 5

మత్వావిధాయ సూత్రాణి వేదాశ్రం ఖాతమాచరేత్।
ఆధార శిలాంన్యస్య గర్తేఽస్మిన్ కలశంన్యసేత్॥ 6

తా॥ దేవాలయమునకు కావలసిన కొలత ప్రకారము సూత్రమును పట్టి నలుచదరము చేసి ఖాతమును త్రవ్వవలయును తరువాత ఆధార శిలనుంచి యందు కలశమునుంచవలెను.

శ్లో॥ ఖాత్వాక్షితిం తాం పురుషప్రమాణం జలాంత మశ్మావధి వా సులగ్నే।
పాదోనమా పూర్వ నిరుద్ధవేద్యాం రాత్రౌయజేత్ దిశ్యథ వాస్తుమైశ్యాం॥4

తా॥ భూమిని పురుష ప్రమాణముగాని, నీళ్లు పడునంతవరకుగాని, రాయి పడునంతవఱకు గాని, త్రవ్వి మంచి ముహూర్తమున మరల నా గుంటను మూడుపాళ్లు జలముతో నిండించి దాని మధ్యను ఆధార శిలనుంచి యందు శుద్ధోదకమును నవరత్నములు సువర్ణము మొదలగునవియును నానా ఓషధులును ఫలములు పుష్పములు మొదలగు వానితో గూడిన కలశమునుంచి యారాత్రి యందు వాస్తు పురుషుని శాస్త్రోక్త ప్రకారముగ పూజించి హోమ సహస్రమును జేసి పూర్ణాహుతి చేయవలెను. కశ్యప శిల్పము 3వ పటమున జెప్పబడిన రీతిగా ప్రథమేష్టకా కాలమున జేయదగు రీతిని దెలిసికొని 4వ పటలమున జెప్పబడినట్లు వేద మంత్రయుతముగ వాస్తు పూజాదికమును జేయవలెను.

## 4 ప్రాసాద విమాన శబ్దార్థములు.

### శిల్పరత్నము 16వ ఆధ్యాయము

శ్లో॥ దేవాదీనాం నరాణాంచ యేషురమ్యతయా చిరం।
మనాంసిచ ప్రసీదంతి ప్రాసాదాస్తేన కీర్తితాః॥ 1

నానామాన విధానత్వాత్ విమానం శాస్త్రతః కృతమ్॥ 1½

తా॥ దేవాలయములలోను మానవ గృహములలోను యేవి రమ్యముగా గన్పట్టు చున్నవో వానిని ప్రాసాదములని చెప్పబడెను. అనేక విధములయిన కొలతలతో నిర్మింపబడుట చేత వానిని విమానములని చెప్పుదురు. ప్రాసాద భేదములన్నియు ముందు చెప్పబోవుచున్నాము

## ౫. ప్రాసాద నియమము.

### శిల్పరత్నము 16వ అధ్యాయము

శ్లో॥ బ్రహ్మవిష్ణు శివానాంచా ప్యుత్తమం చక్రవర్తినాం।
శస్తం ద్వాదశ భౌమం స్యా న్నాన్యేషాం తద్వితీయతే॥ ౬౹

ద్వితలం చైక భౌమంచ సర్వదేవ నరోచితం।
హీనానాం నాధికోచ్ఛ్రంస్యా దితిప్రాహ పరాశరః॥ ౬౬

తా॥ బ్రహ్మ విష్ణు, శివ ఆలయములు చక్రవర్తి గృహము 12 అంతస్తులవరకు ఉండ వచ్చును. ఇతర దేవతలకును సామాన్య ప్రజలకును అవి కూడవు. 1 అంతస్తు 2. అంతస్తులు. సమస్త దేవతలకును సమస్త ప్రజలకును పనికివచ్చును. తక్కువ దేవతలకును, సామాన్యులకును, ఇవి పనికిరావని పరాశరుడు చెప్పెను

## 6. వాస్తు హోమము.

### కాశ్యప శిల్పము 6వ పటలము

శ్లో॥ హర్మ్యేవాఽ ద్యేష్టకేకాలే లింగం సంస్థాపయేత్తథా।
సకలం స్థాపనేచైవ సంప్రోక్షంతు తథైవచ॥ 1

బాణలింగ ప్రతిష్ఠాయాం మండపే నృత్తరంగకే।
సభాయాం యాగశాలాయాం వాస్తుహోమం సమాచరేత్॥ 2

ఆచార్యో లక్షణోపేతం స్వాచార్యో హోమ మాచరేత్।
సమయా ప్రాక్ప్రదేశేవా సౌమ్యేవా బ్రహ్మకేపదే॥ 3

స్థండిలం సికతైః కుర్యా ద్ధస్తమాత్రం ప్రవిస్తరం।
ఉత్సేధం ద్వ్యంగులం జ్ఞేయం చతురశ్రం సమంకురు॥ 4

జల కుంభం న్యసేదైంద్రే శాలిమధ్యే ద్విజోత్తమాః।
గంధతోయేన సంపూజ్య హోమతంత్రే చనిక్షిపేత్॥ 5

పాలాశ పత్ర పర్వాచ తజ్జలేషు నిధాపయేత్।
గంధ పుష్పాదినా పూజ్యా తజ్జలేద్వార దేవతా॥ 6

అగ్న్యాధా నాదికం సర్వ మగ్నికార్యోక్త మాచరేత్।
బ్రహ్మాది వాస్తుదేవాంశ్చ అగ్నిమధ్యేతు ఆవహేత్॥ 7

గంధైః పుష్పైశ్చ ధూపైశ్చ పూజయేత్ స్వస్వనామతః।
ప్రణవాది స్వనామ్నాంతు స్వాహాంతం హోమమాచరేత్॥ 8

స్యాద్రుద్భహ్మా ప్రసమిహోతః ప్రత్యేకం హోమమాచరేత్।
శతమర్ధంత దర్ధంవా హోమయేత్ గోఘృతేన తు॥ 9

పాయసే నైవ చరుణా ప్రత్యేకంతు శతాహుతీః।
జయాది రభ్యాదానంచ రాష్ట్రభృత్యశ్చ క్రమాద్ధృతే॥ 10

పిండాహుతించ కూశ్మాండం ప్రాయశ్చిత్తాహుతించరేత్।
హవ్యవాహేతి మంత్రేణ స్విష్ట మగ్నేతి హోమయేత్॥ 11

యదస్యేతి చ మంత్రేణ హోమయేత్తు ఘృతేన తు।
పరిషేచనం తతః కృత్వా ప్రాసాదే తనుమంత్రతః॥ 12

పరిస్తరణం విధాయ ఆజ్యస్యో త్పవనేక్రమాత్।
బ్రాహ్మణం తు పరే దద్యా ద్దర్శనా సూర్యమండలే॥ 13

ప్రణీతాద్భిశ్చ సంప్రోక్ష్య ఆత్మార్థం పావమానకైః।
ఏవం సమాప్య హోమంతు ప్రణిపత్య క్షమాపయేత్॥ 14

దర్భైః పాలాశపత్రైశ్చ శోషితే విన్యసేత్ క్రమాత్।
తదగ్రౌ దీపయిత్వాతు తథా ప్రాసాదమండపే॥ 15

ప్రాకారే గోపురస్థానే పర్యగ్ని కరణం కురు।
బ్రాహ్మ్యే తదగ్నిముద్వాస్య స్థాపితేతు జలేబుధః॥ 16

సర్వత్ర ప్రోక్షయే ద్విద్వాన్ శుచీవో హవ్యమంత్రతః।
వాస్తుదేవోద్గతార్థంతు పర్యగ్ని కరణంకరు॥ 17

వాస్తు హోమః సమాఖ్యాత శ్చాద్యేష్టకా విధిం బ్రువే। 18
ఇతి కాశ్యపశిల్పే వాస్తు హోమ ప్రతిపాదన పటలః॥

తా॥ దేవాలయమునందు ప్రథమేష్టకా న్యాసమునకు ముందు లింగమును స్థాపించవలయును. ఆ స్థాపనమునందు సంప్రోక్షణమును కూడ చేయవలయును, బాలలింగ ప్రతిష్ఠయందును, మండప ప్రారంభమునను, సభామండప ప్రారంభమందును, నృత్యమండప ప్రారంభమునందును యజ్ఞశాలలో వాస్తుహోమమును చేయవలయును. ఆచార్యుడు లక్షణయుక్తముగ హోమమును చేయవలయును. దేవాలయ మధ్య ప్రదేశమునగాని, అందు తూర్పునగాని, ఉత్తరమునగాని, లేక కొలత ప్రకారము నిర్ణయింపబడిన బ్రహ్మస్థానమునందు గాని యిసుకతో స్థండిలమును ఒక హస్తము విస్తారముగను, అంతే పొడవుగను, రెండంగుళముల యెత్తుగను, సమ చదరముగ కల్పించవలెను. అందు తూర్పున జలకుంభమును, ధాన్యరాశి యందుంచవలయును. గంధముతో పూజించి హోమతంత్రమును మోదుగ ఆకులయొక్క యీనెలు ఆ జలమునందుంచవలెను గంధపుష్పాదులతో పూజించి ద్వారదేవతలను ఆవాహనము చేయవలయును అగ్ని కార్యమంతయును యథావిధిగా చేసి వాస్తుపురుషాంగ దేవతలగు బ్రహ్మాది పంచచత్వారింశద్దేవతలను అగ్నియందావాహనముచేసి గంధపుష్ప ధూపాదులతో పూజించి ఒక్కొక్క నామమునకు ముందు ఓంకారమును, చివర స్వాహా అను పదమును, చేర్చి హోమమును చేయవలయును అందు బ్రహ్మకు ప్రత్యేకముగా 108 లేక 54 లేక 27 పర్యాయములుచేసి ఆపునెయ్యి, పాలు, అన్నము వీనితో నూఱుహోమములు చేయవలయును. తరువాత జయాదిహోమములు చేయవలయును. పిండాహుతి, కూశ్మాండప్రాయశ్చిత్తాహుతులు చేయవలెను. “హవ్యవాహా” అను మంత్రముతో స్విష్టమగ్నేతి హోమములు “యదస్య” అను మంత్రముచేత ఘృతహోమము. తరువాత పరిషేచనము ప్రాసాదమంతటను చేయవలయును. పరిస్తరణముచేసి ఆజ్యోత్ప్లవనముచేసి బ్రాహ్మణులను, సూర్యమండలమును, చూచి ప్రణీతాగ్నిని పవమానసూక్తముతో శుద్ధోదకముచే సంప్రోక్షించి హోమమును సమాప్తిచేసి సాష్టాంగ నమస్కారములతో గోత్ర సూత్ర నామములుచెప్పి కొని త్రిమార్జనమును వేశికొనవలయును. దర్భలు, మోదుగఆకులు ఎండించియుంచవలెను. వాని చివరలకు అగ్నిని ముట్టించి ప్రాసాదము, మండపము, ప్రాకారము, గోపురము, మొదలగు ప్రదేశములయందంతటను పర్యగ్నికరణము చేయవలయును. మరునాడు సూర్యోదయ కాలమునకుముందు బ్రాహ్మ్యకాలమున అగ్నిహోత్రమున కుద్వాసముచెప్పి జలమున స్థాపించవలయును. తరువాత “శుచీవోహవ్యా” అను మంత్రముతో అంతటను జలమును ప్రోక్షించవలయును. వాస్తుపురుషుడను దేవుడు పైకివచ్చుటకు గాను పర్యగ్నికరణమును చేయవలయును. ఇది వాస్తు హోమపద్ధతి. ఇక ప్రథమేష్టకాన్యాస విధిని చెప్పబోవుచున్నాను. వినుము.

## 7. ప్రథమేష్టకాన్యాస విధానము

### కాశ్యపశిల్పం 4వ పటలము

శ్లో॥ అథమక్ష్యే విశేషేణ శ్రుణుధ్వం ప్రథమేష్టకాం।
ప్రాసాదే మండపే సాలే గోపురేవ తథైవచ॥ 1

సదనే పరివారాణాం విన్యసేత్ ప్రథమేష్టకాం।
స్నిగ్ధం చైవ తథాఽ స్నిగ్ధం ద్వివిధం భూమిలక్షణమ్॥ 2

చిక్కణం శర్కరాఢ్యంచ అశక్య ఖనన క్రియం।
సుస్నిగ్ధమితి విఖ్యాతం కుసువాలుక సంయుతమ్॥ 3

పురుషాంజలి మాత్రంతు దృష్ట్వాతోయ సమన్వితం।
అశక్యకరణం యత్త దస్నిగ్ధాఖ్యం మహీతలమ్॥ 4

ప్రాసాదస్యతు విస్తారో ద్విద్విహస్తో థవిస్తృతః।
హస్తమాత్రం ఖనే ద్వాప్ర సుస్నిగ్ధంతు మహీతలమ్॥ 5

యావత్త త్ర జలందృష్టం ఖనేత్తావత్తు భూతలే।
అవటం వాలుకైః స్థూలైః పూరయిత్వా జలాన్వితమ్॥ 6

పూరయిత్వాజలం పశ్చా జ్జలేన సమతాం కురు।
ముసలైర్హాస్తి పాదైశ్చ స్నిగ్ధం కృత్వా బృహచ్ఛిరైః॥ 7

ఏవమాధార మానంతు అధికం త్వవటం కురు।
మాన సూత్రాది సూత్రాంతు పాతయేత్తత్ర దేశికః॥ 8

ప్రథమం మానసూత్రంతు విన్యసేత్తు ద్వితీయకం।
తృతీయ ముపపీఠం స్యా దధిష్ఠానం తథోపరి॥ 9

పంచమం హోమసూత్రంతు షష్ఠంతు ప్రతిసూత్రకం।
ఏవం క్రమేణ కర్తవ్యం సూత్రషట్కం ద్విజోత్తమా॥ 10

తా॥ ప్రథమేష్టకాన్యాసమును గూర్చి చెప్పుచున్నాను వినుడు. ప్రాసాదము, మండపము, ప్రాకారము, గోపురము, పరివారాలయము, వీనియందు ప్రథమేష్టకాన్యాసమును చేయవలయును. అందు స్నిగ్ధము, అస్నిగ్ధము అను రెండు విధములగు భూములు కలవు. నునుపైమొలుపు మాత్రితోను సన్నయిసుకతోను, గూడి త్రవ్వుటకు సాధ్యము కానిది సుస్నిగ్ధభూమి. ఇట్టి భూమిని నాభిలోతున త్రవ్వి దానినిండ జలమునుంచగా త్రవ్వుటకు వీలు కానిభూమి సుస్నిగ్ధము. ప్రాసాదము యొక్క విస్తారమునకు రెండు రెండు హస్తములు పెంపుచేసి ఒక హస్తము లోతున త్రవ్వవలయును. సుస్నిగ్ధమైన భూమినే త్రవ్వవలయునుగాని అసిగ్ధభూమిని త్రవ్వరాదు. నీళ్ళు యెంతలోతున నున్నవో అంతలోతు త్రవ్వవలయును. దానినిండ లావుగల యిసుకను పోయవలయును. అంతట జలముచే నింపి తలవెడల్పుగల రోకళ్ళతోను, దిమ్మెసలతోను, చదరము చేయవలయును. ఇట్లు ఆధారమానమును చేయవలయును. అందుపల్లముగాచేసి మానసూత్రము మొదలయిన సూత్రములు వేయవలయును. మొదట మానసూత్రము, రెండవది విన్యాసము, మూడవది ఉపపీఠము. నాలుగవది అధిష్ఠానము ఆయిదవది పాదానుసూత్రము, ఆఱవది ప్రతిసూత్రము ఇట్లు వరుసగా చేయవలయును.

శ్లో॥ తస్యోపరి ప్రపాంకృత్వా నవహస్త ప్రమాణతః।
షోడశ స్తంభ సంయుక్తం విధాయ ధ్వజభూషితమ్॥ 11

తోరణై ర్దర్భమాలైశ్చ ముక్తాదామై రలంకృతః।
మండపస్య త్రిభాగైకం వేదికాయాస్తు విస్తరమ్॥ 12

హస్తమాత్రం సముత్సేధం దర్పణోదరసన్నిభః।
పరితస్త్వగ్నికుండాని మహాశాలం ప్రకల్పయేత్॥ 13

వేదాశ్రం చాపసువృత్తం చాబ్జమింద్రాదితః క్రమాత్।
హస్తమాత్రం చవిస్తారం ఖాతం చైవ త్రిమేఖలమ్॥ 14

గోమయాలేపనం కృత్వా ప్రోక్షయేత్పంచ గవ్యకైః।
పిష్టచూర్ణై రలంకృత్య తతోవై విప్రభోజనమ్॥ 15

కృతోచ్ఛిష్టం సముద్వాస్య వాస్తుహోమం తతఃకురు।
పర్యగ్నికరణం కృత్వా ప్రోక్షయేద్వా కుశాన్ న్యసేత్॥ 16

స్థండిలం వేదికాయాంతు అష్టద్రోణైశ్చ శాలిభిః।
తదర్ధైస్తండులైశ్చైవ తదర్ధైశ్చ తిలోపరి॥ 17

స్థండిలం కల్పయేద్ధీమాన్ దర్భైః పుష్పైః పరిస్తరైః
శిలాభిత్తౌ శిలాభిస్తు దళభిస్తథ హర్మ్యకే॥ 18

ఆద్యేష్టకాం తం కర్తవ్యం విపరీతం వినాఽఽచరేత్।
పుంలింగాభిః శిలాభిస్తు కారయే త్ప్రథమేష్టకాః 19

ద్వారబంధస్తు కర్తవ్యః స్త్రీ శిలాభి ర్విశేషతః।
నపుంసకోపలైర్వైవ మూర్ధ్నేష్టకాద్విజోత్తమ॥ 20

యథాలాభ శిలాభిర్వా భిత్తి స్తంభోదయో భవేత్।
నవాంగులం సమారభ్య ద్విద్వ్యంగుల వివర్ధనాత్॥ 21

ఏకోన చత్వారింశాంతం వేదమే వాంగులేనతు।
విస్తారం చ ఘనం ప్రాగ్వ త్తత్సం ఖ్యాహ్యేవ షోడశ॥ 22

ఏకాది షోదశాంతం భూమి నామక్రమ ఉచ్యతే।
మృదిష్టకాది పుంసాపి రేఖాభిస్తు పరీక్షయేత్॥ 23

అయుగ్మ ఋజురేఖాచ పుంలింగా సంప్రకీర్తితా।
యుగ్మరేఖాచ యుగ్మత్వా త్కంఠాభాసా నపుంసకా॥ 24

భిన్నబిందు కలాదీని లోకపాల సమన్వితం।
వర్జితాని ప్రయత్నేన దోషహీనాంస్తు సంగ్రహయేత్॥ 25

ఈషదున్నత మగ్రంస్యా న్నత మూల ముదాహృతం।
ఊర్ధ్వభాగం ముఖంఖ్యాత మపరం పృష్ఠకాంశకమ్॥ 26

అగ్రేనా మగ్రితాం చాగ్రే ఊర్ధ్వం హ్యపర ముచ్యతే।
ప్రాగుదగ్రంతు సర్వాసాం శీర్షాణాం పరికీర్తితమ్॥ 27

మూలాంతా దితరత్ఖ్యాతం ప్రమాణ మిష్టయాపరం।
గవ్యైర్గంధోదకైః స్నాప్య పూర్వరాత్రేఽధివాసయేత్॥ 28

తా॥ పూర్వము చెప్పబడిన ఆధారముపై తొమ్మిది హస్తముల పొడవున్న పొడవునుచేసి నలుచదరముగ పదునారు స్తంభములతో పందిరి వేయవలెను. ధ్వజములు, తోరణములు, దర్భ మాలలు, ముత్యముల హారములు, మొదలగు వానితో అలంకరించి ఆ మంటపములో మూడవ వంతు నలుచదరముగ అరుగును వేయవలయును. ఒక హస్తము యెత్తును అద్దమువలె మెరక పల్లములు లేకుండను రచించి దానిచుట్టును అగ్నికుండములు, పెద్ద పందిరి కల్పించవలెను. పూర్వ నలుచదరముగను, దక్షిణము అర్ధ చంద్రాకారముగను, పడమర గుండ్రముగను, ఉత్తరము అష్ట దళ పద్మమువలెను, కుండములకు, మూడేసి మేఖలములను, ఒక్కొక్క కుండము విస్తారము ఒక హస్తమును లోతు ఒక హస్తమును చేసి ఆవుపేడతో అలికించి ఆపైన పంచగవ్యములను ప్రోక్షించవలెను పరిపిండి మొదలగు వానితో ముగ్గులు పెట్టి అచట బ్రాహ్మణులకు భోజన ముపెట్టి తరువాత మరల గోమయముతో అలికి ముగ్గులుపెట్టి వాస్తు హోమమును, పర్యగ్ని కరణమును, చేసి శుద్ధోదకమును ప్రోక్షించి దర్భల నుంచవలయును. అంతట సంస్కరింపబడినభూమి యందలి వేదికయందు ఎనిమిది తూముల శాలిధాన్యమును ఆపైన అందులో సగము బియ్యమును, ఆ బియ్యముపైన అందులో సగము నువ్వులును, ఉంచి దర్భలును, పుష్పములను, చుట్టునుంచి రాతి గోడలయందు రాలను, దారుభిత్తియందు దారువులను, ఇష్టకలుగా రచించవలయును. ప్రథమేష్టకా న్యాసమువరకు చేయవలయును, ఇందుకు వ్యతిరేకము చేయరాదు. పురుషశిలతో ప్రథమేష్టకను రచించ వలయును. ద్వారబంధమునకు స్త్రీ శిలలనుపయోగించవలయును. మూర్ధ్నేష్టకకు నపుంసక శిలను ఎన్నడు నుపయోగించదగదు గోడకును, స్తంభములకును, స్త్రీపున్నపుంసక భేదములతో పని లేదు. తొమ్మిది అంగుళములు మొదలుకొని రెండు అంగుళముల చొప్పున పెంచుచు, ముప్పది తొమ్మిది అంగుళములవరకు పొడవు పదునారు విధములుగా ఇష్టకలను కల్పించవచ్చును. విస్తా రము నాలుగంగుళములును, అంతే మందమును చేయుచు ఒక్కొక్క అంగుళమును పై విధము గానే పెంచుచు పదునారు భేదములుగ రచించవచ్చును. అంతస్తులుకూడ ఒకటినుండి పదునారు వరకు చేయవచ్చును. మట్టితో ఇటికలను చేసినయెడల స్త్రీ పురుష నపుంసక భేదము లెట్లనిన, చేసి సంఖ్యగల రేఖలు నిలువుగా వంకరలు లేకుండనుండెనేని పురుషేష్టక, జంటరేఖలు, వంకరలు కలిగినయెడల స్త్రీ జాతి అడ్డరేఖలు, చుక్కలు, కలది నపుంసక జాతి. కనుక చక్కగా పరిశీలించి దోషములేని పురుషజాతిని గ్రహించి తల కొంచెము యెత్తుగను, పాదము కొంచెము పల్లముగను నిలుపవలెను. పైభాగము ముఖము. అడుగుభాగము వీపు అని తెలియవలయును. అన్ని యిటు కలను తూర్పుగాని, ఉత్తరముగాని, తలలుండునట్లుంచవలయును. పంచగవ్యములతోను, సుగంధ ద్రవ్యములతోను, ఇష్టకలను పూజించి యారాత్రి అధివాసము చేయించవలయును.

శ్లో॥ శివద్విజ కులోద్భూతం శివదీక్షా సమన్వితం।
సర్వలక్షణ సంపన్నో వేదాధ్యాయరతశ్శుచిః॥ 29

ఆపోవగాహనం స్నానం భస్మస్నానం సమాచరేత్।
నవాంబరధరోష్ణీషం సతీర్యగనులేపనమ్॥ 30

గంధమాల్యై రలంకృత్య సకలీకృత విగ్రహం।
పంచాంగ భూషణైర్భూష్య శాలయేద్వర్ష్మనేష్టకాః 31

హేమైః కార్పాస సూత్రైర్వా ప్రతిసంబంధయేత్సదా।
స్థండిలేకర్ణికా బాహ్యే మహాపద్మం నిధాపయేత్॥ 32

లకారం పూర్వభాగేతు వకారం యామ్యగోచరేత్।
రకారం వారుణశ్చేతు యకారం సౌమ్యగోచరేత్॥ 33

శాలిపిష్టేన సంలిఖ్య ప్రత్యేకం వస్త్రవేష్టితం।
పూర్వాగ్రం సౌమ్యయామ్యేతు శేషాద్వాచోత్తరాగ్రకా॥ 34

స్థాపయేత్సమయాభ్యర్చ్య పృథివ్యాద్యా నవక్రమాత్।
నవసంఖ్యాన్ నవాన్ కుంభాన్ సూత్రవస్త్ర విభూషితాన్॥ 35

సకూర్చాన్ సవితానాంశ్చ స్నానగంధ సుపూజితాన్।
హేమపంకజ సంయుక్తాన్ మధ్యమాన్ క్రమశోన్యసేత్॥ 36

మధ్యకుంభేతు సాదాఖ్యం పరితో లోకపాలకాన్।
తత్తన్మంత్రైర్ న్యసేత్కుంభం ధ్యాత్వాగంధాది పూజయేత్॥ 37

నైవేద్యం నమయేద్ధీమాంస్తతో హోమం సమాచరేత్।
అగ్నిధ్యానాదికం సర్వ మగ్నికార్యోక్తమాచరేత్॥ 38

పాలాశోదుం బరైశ్చైవ అశ్వత్థవట చందనం।
సమిధః సమ్యక్ మంత్రేణ మూలేనాన్యత్తు హోమయేత్॥ 39

చరు హోమ మఘోరేణ నేత్రేణైవ తిలాంస్తథా।
సర్షపం కవచేనైవ ప్రత్యేకాష్ట శతాహుతీః॥ 40

ద్రవ్యం ప్రతివిశేషేణ వ్యాహృత్యాऽऽహుతి మాచరేత్.
ఏవం జాగరణం రాత్రౌ ప్రభాతే దేశికోత్తమః॥ 41

ఆపోవగాహనాదీని ప్రాణాయామం సమాచరేత్।
ఇష్టకా కలశాగ్నించ పూజయేత్తు విశేషతః॥ 42

జలాది రభ్యాణానైశ్చ రాష్ట్రిం చైషపు హోమయేత్।
శిష్టమగ్నేతి మంత్రేణ పూర్ణాహుతిం సమాచరేత్॥ 43

స్థాపకః స్థపతిః పూజ్యో వస్త్రహేమాంగులీయకైః।
ముహూర్తే సమనుప్రాప్తే ద్వారం నిశ్చిత్య పూజయేత్॥ 44

ద్వారస్య దక్షిణేవాంఘ్రి మూలేభిత్త్యంత ధాంఘ్రికే।
ఇష్టకాం వా శిలాయాం తు స్థాపయేత్ స్థపతిః క్రమాత్॥ 45

ప్రాసాద మండపానాంచ నిర్గమస్య ప్రదక్షిణం।
సాలానాం గోపురాణాంచ ప్రవేశ స్యాత్ప్రదక్షిణే॥ 46

అభ్యంతరేతు భిత్తేస్తు గోపురాణాం నిధాపయేత్।
అగ్రమ గ్రం తథైశాన్యం మూలం మూలంతథాఽసురే॥ 47

అగ్రం మూలం సమం యుక్త్వా అగ్నౌచ వాయుగోచరే।
పంచబ్రహ్మాణ ఉచ్చార్య పూర్వాది క్రమశో న్యసేత్॥ 48

తన్మధ్యే విన్యసేత్ ప్రీతాం హేమపంకజ సంయుతా।
పంచమృద్భిః సమాలిఖ్య కుంభస్యాద్భిస్తు పూరయేత్॥ 49

శోభనం దక్షిణావర్తం వామావర్త మశోభనం।
వామావర్తం భవేత్ సమ్యక్ శాంతి హోమంతు కారయేత్॥ 50

యా గోపకరణం సర్వం దద్యాచ్ఛిల్పి ప్రకారయేత్।
ఇతి కాశ్యప శిల్పే ప్రథమేష్టకా విధిశ్చతుర్థః పటలః॥ 51

తా॥ శైవద్విజవంశ సంభవుండును, శివదీక్షా పరుఁడును, సమస్త శుభలక్షణములు కల వాఁడును, వేదాధ్యయ నాసక్తుఁడును, పవిత్రుఁడును, నదీస్నానము భస్మస్నానము చేసి నూతన వస్త్రములు శిరోలంకారము చందనాది లేపనము పుష్పమాలాద్యలంకారములు గల శరీరముతోను, శిరోభూషణము, కంఠమాల, కర్ణభూషణము, హస్తాభరణము, అంగుళ్యాభరణము, మున్నగునవి కల వాఁడై చక్కని యిటికలుగాని కడుగవలెను బంగారు తీగెతోగాని, నూలుదారముతోగాని, వేట వాలుగా చుట్టి మరల సవేవిధముగా యెదురు చుట్టి సంస్కరింపబడిన భూమియందు కర్ణికాకారము గల ముగ్గులో మహాపద్మము నుంచవలయును, దానికి తూర్పున లకారము, దక్షిణమున వకారము పడమర రకారము ఉత్తరము యకారము నుంచి వరిపిండితో ముగ్గువేసి ఒక్కొక్క దానికి ప్రత్యేకముగా వస్త్రములనుచుట్టి ఉత్తరము దక్షిణమున నుండు యిటికలు తూర్పుచివరలుగాను, తూర్పు పడమర నుండు యిటికలు ఉత్తరముచివరలుగాను. ఉండునట్లు సట్టనడుమ స్థాపించవలెను, పృథివి, జలము, తేజస్సు, వాయువు, ఇట్లు ఒకల క్రమముగా తొమ్మిది యిటికలను, తొమ్మిది కుంభములును, దారములు చుట్టి వస్త్రములు చుట్టి కూర్చలు పైన వితానములు నుంచి స్నానము గంధము పూజ సువర్ణపద్మములు మధ్యనుంచి వరుసగా నుంచవలెను. నైవేద్యమును సమర్పించి నమస్కారముచేసి తరువాత హోమములను చేయవలయును. అగ్నికార్యమంతయును శాస్త్రోక్తముగా చేయవలయును మోదుగ, మేడి, రావి, మఱ్ఱి, చందనము మొదలగు సమిధలను వేద మంత్రములతో ఓం మొదలుగాను, స్వాహా అను పదము చివరగాను, వచ్చునట్లు ఆయా దేవతల నామములతో హోమములను చేయవలయును, అఘోర మంత్రముతో చరుహోమమును, నేత్రమంత్రముతో తిలలను, కవచముతో ఆవాలను, వేయివేయిగా నూట యెనిమిది మారులు చేయవలయును. ద్రవ్యమునకు సమానముగా విశేషముగా ఆహుతులను చేయవలయును. ఇట్లు రాత్రియంతయు జాగరణముచేసి ఆచార్యుడు వేకువజామున నదీస్నానముచేసి సంధ్యావందన ప్రాణాయామాదులను ముగించి యిష్టకలను, కలశములను, అగ్నిని, విశేషముగా పూజించవయును. షోడశోపచార పూజలుచేసి హోమములను చేయవలయును ప్రజలందఱిచేతను హోమములు చేయించి పూర్ణాహుతి శిష్టమగ్నేతి మంత్రముతో చేయవలయును. శిల్పియును ఆగమాచార్యుడును వస్త్రములు సువర్ణాంగుళ్యాభరణములతో పూజింపబడవలయును. సుముహూర్త సమయమున ద్వారస్థానమున గుర్తుపెట్టి ద్వారమును పూజించవలయును. ద్వారముయొక్క కుడిప్రక్కను, గోడయందును నిలుపబడు శాఖలక్రిందను గూడ యిటికలనుగాని, శిలలనుగాని స్థాపించవలయును. ప్రాసాదముయొక్కయు, మండపముయొక్కయు, నిర్గమములకు చుట్టును ప్రాకారము గోపురము వీనికి వెలుపలి హద్దునను, గోడయొక్క లోపలిహద్దునను శిలల నుంచవలెను. ఈశాన్యమున రెండు చివర లుండునట్లును, నైరృతిని రెండు మొదళ్లుండునట్లును ఆగ్నేయము వాయవ్యము ఒక్క మొదలు ఒక్క చివర యుండునట్లును శిలలను స్థాపించవలయును. పంచబ్రహ్మలను స్మరించి తూర్పునుండి వరుసగా నలుదిశలయందు శిలలనుంచవలయును. మధ్యప్రదేశమున కలశమును సువర్ణపద్మయుతముగను, పంచమృత్తికలతో సహితముగను, శుద్ధోదక పూర్ణముగను జేసి పూజించవలయును. కలశమున జలము నింపునపుడు దక్షిణావర్తము శుభము. వామావర్తము అశుభము. అని తెలయవలెను. వామావర్తమైనయెడల శాంతి హోమములు చేసి యజ్ఞసామగ్రిని శిల్పాచార్యునకు దానము చేయవలయును.

## 8. పాదాధిష్ఠాన విభాగములు.

శిల్పరత్నము 17వ అధ్యాయము.

శ్లో॥ అధిష్ఠానోచ్ఛ్రయంపూర్వం హస్తమానేనవక్ష్యతే।
ప్రాసాదస్తు నిజైరంగై రధితిష్ఠతి యం సదా॥ 1

శ్లో॥ దృఢం శిలాదిఘటితం, తదధిష్ఠాన సంజ్ఞికం।
త్రైతిలానాం చతుర్హస్తం త్రిహస్తార్ధం ద్విజన్మనామ్॥ 2

తా॥ అధిష్ఠానముయొక్క యెత్తును హస్తమానముతో చెప్పుచున్నాడు ప్రాసాదము యొక్క అంగములన్నిటితో దీని యందుండును కనుక దీనికి అధిష్ఠానమను పేరు కలిగినది. దేవతాలయములకు 4 హస్తములుండవలెను.

శ్లో॥ మసూరకోన్నతం పంచహస్తే ద్వాత్రింశదంగులం।
త్రింశదంగుల ముచ్చంవా తస్యైవ చ పున స్తథా॥ 6

శ్లో॥ షడాదీనాంతు పంచానా మేకత్రింశతి మాత్రకం।
ఏకాదశోఽథద్వాత్రింశత్ ద్విద్వ్యంగుల వివర్ధనాత్॥ 7

శ్లో॥ అష్టత్రింశతి మాత్రోచ్చం శతుర్దశవిశాలినః।
నవత్రింశతి మాత్రోచ్చం చతుర్దశ పరస్యచ॥ 8

తా॥ మసూరోన్నతము 5 హస్తములయ్యేనేని పాదాధిష్ఠానము 1¼ హస్తముండవలెను లేదా అంతకు 2 అంగుళములు అధికముగాను ఉండవచ్చును. 6 హస్తములు మొదలు అనగా 7-8-9-10 వరకు అయిదు విధములు వీనికి 31 అం. అనగా గజమునకు 24 అంగుళముల కొలతతో చెప్పబడినది. అక్కడినుండి 11 హస్తములవరకు 32 అంగుళములు 12 హస్తములకు 34 అంగుళములు 13 హస్తములకు 36 అంగుళములు 14 హస్తములకు పైన విశాలమయ్యేనేని 39 అంగుళము లున్నతముండవలెను.

శ్లో॥ త్రిచతుర్హస్తయోర్ధామ్నో ర్హస్తమేవేతినిశ్చితం।
ఇత్యేవం క్షుద్ర హర్మ్యాణా మధిష్ఠానోచ్ఛ్రియక్రమః॥ 9

తా. మూడు నాలుగు హస్తములుగల దేవాలయమునకు 1 హస్తము అనగా 24 అం. ఎత్తు చెప్పబడినది.

శ్లో॥ అత్రోత్సేధాంశమానేనా ప్యధిష్ఠానో ప్యుచ్ఛ్రియం విదుః।
కైశ్చిత్తేన ప్రకారేణ విధాతవ్యం విచక్షణైః॥ 13

తా॥ పై జెప్పినరీతిగా భాగ నిర్ణయములతో చేయుచుందురు. కొందఱు సామాన్యముగా ఇదేప్రకారముగా చేయుచుందురు.

శ్లో॥ అత్రాధిష్ఠాన తుంగస్య ద్విగుణం పాదతుంగకం।
ద్విగుణాన్నాధికోత్సేధః స్తంభః ప్రోక్తః స్వయంభువా॥ 14

తా॥ అధిష్ఠానముయొక్క యెత్తునకు రెట్టింపుగా పాదాధిష్ఠానము యెత్తుండవలెను. అంతకంటె మిగులుండగూడదు. స్తంభములైనను ద్వి గుణముకంటె అధికముగా నుండరాదు.

## ౪. సామాన్య విధి.

శ్లో॥ ఉత్తరోపానయోర్మధ్యం పాదమానమితిస్మృతం!
త్రికరాద్యంగులీ షట్కం వర్ధమానం తతస్తతః॥ 15

శ్లో॥ యథాశోభం యథాయోగ్యం పాదమానం కరోతువా।
విస్తారేణ సమం పాద మాన మిత్యుచ్యతే బుధైః॥ 16

తా॥ ఉత్తరము ఉపానము వీనిమధ్య పాదమానము అని చెప్పదురు. 3 హస్తములు మొదలు 6 అంగుళములు చొప్పున వృద్ధిచేయుచు అలంకారమునకు సరిపడునట్లును శాస్త్రమునకు సరిపడునట్లును చేయవలెను. విస్తారముతో సమానముగా పాదముయొక్క యెత్తును చేయవలెనని తెలిసినవారు చెప్పుదురు.

శ్లో॥ విస్తారస్యచతుర్థాంశ యుతం వా వియుతం తు వా।
స్యాత్షట్సప్తాష్టభాగేన యుతం వా హీనమేవవా॥ 17

తా॥ విస్తారములో నాల్గవభాగము కలిపిగాని కలుపకుండాగాని 6వ భాగము 7వ భాగము 8వ భాగము కలిపిగాని లేక తగ్గించిగాని చేయవచ్చును.

## 10. ఉపపీఠ ప్రమాణము.

శిల్పరత్నము 17వ అధ్యాయము.

శ్లో॥ అధిష్ఠానస్య చాధస్తాదుపపీఠ ప్రయోజితం।
రక్షార్థ మున్నతార్థం వా శోభార్థం చ ప్రకల్పయేత్॥ 25

అద్యంగ తుంగ పంచాంశ త్రిగుణం వోప పీఠకం।
అధిష్ఠాన ద్విగుణం స్యా దుపపీఠ సముచ్ఛ్రియః॥ 26

తా॥ అధిష్ఠానమునకు దిగువ భాగమున ఉపపీఠమును కల్పించవలెను. గట్టితనమునకును ఎత్తుకొఱకును, సౌందర్యముకొఱకును, ఉపపీఠము నిర్ణయింపబడినది. అధిష్ఠానముయొక్క పొడవును 5 భాగములుచేసి అందు 3 భాగములు ఉపపీఠము యెత్తు చేయవలెను. అధిష్ఠానము యొక్క యెత్తునుబట్టి రెట్టింపుకూడ చేయవచ్చును.

కాశ్యపశిల్పము 5వ పటలము.

శ్లో॥ అథవక్ష్యే విశేషేణ ఉపపీఠ విధింపరం।
అధిష్ఠాన సమోచ్ఛం వా త్రిపాదం చార్ధమేవ వా॥ 1

పంచభాగేఽగ్ని భాగం వా సపాదం సార్ధమేవ వా।
పాదోన ద్విగుణం వాఽథ ద్విగుణం వా విశేషతః॥ 2

ఏవ మష్టవిధః ఖ్యాత ఉపపీఠోదయో ద్విజ.॥ 2½

తా॥ ఉపపీఠముయొక్క యెత్తును చెప్పుచున్నాడు. 1 అధిష్ఠానముతో సమానము. 2 అధిష్ఠానము యెత్తును నాల్గుభాగములుచేసి అందు మూడు పాదములయెత్తును, 3 అధిష్ఠానము యెత్తులో సగము, 4 అధిష్ఠానము యెత్తును ఐదుభాగములుచేసి అందు మూడుభాగములు, 5 అధిష్ఠానమును నాల్గు భాగమునుచేసి అందు ఒక భాగము కలిపి మొత్తము 5 భాగములు, 6 అధిష్ఠానము యెత్తులో సగము కలిపి మొత్తము ఒకటిన్నరభాగము, 7 అధిష్ఠానమును నాల్గుభాగములుచేసి పైన 3 భాగములు కలిపి ఒకటిమ్ముప్పాతిక, 8 అధిష్ఠానమునకు రెట్టింపు. ఇట్లు యెనిమిది విధములుకలవు. మఱియు.

మానసారము 13వ అధ్యాయము.

శ్లో॥ ఉపపీఠ విధింవక్ష్యే శాస్త్రే సంక్షిప్యతేఽధునా।
అధిష్ఠానోన్నతేదేశే చోపపీఠం హి సంశ్రితం॥ 1

ఏతంతత్త్వమధిష్ఠానం తుంగం తచ్చతురంశకం।
విభజేత్వాదిమాంశేన చైకైకాంశ వివర్ధనాత్॥ 2

తదష్టాంశావసానం స్యా జ్జన్మాదిపట్టి కాంతకం।
ఏవం హి చోప పీఠోచ్చం నవభి ర్భేద మీరితం॥ 3

అథవా ద్వాదశాంశంవా మధ్యభూమ్యాదికం క్రమాత్।
అథవా క్షుద్రహర్మ్యేతు చతుర్భాగ సమోన్నతమ్॥ 4

తా॥ అధిష్ఠానముయొక్క యెత్తులోనే ఉపపీఠముండును. అధిష్ఠానము యెత్తును నాల్గు భాగములుచేసి అందలి మొదటి భాగమునందు ఒక్కొక్క పాతికను పెంచుచు ఇట్లు 8 పాతికల వరకు పెంచి 9 భేదములుగా చేయవచ్చును. 1¼.1½.1¾.2.2¼.2½.2¾.3 అనగా అధిష్ఠానము యెత్తులో నాల్గవ భాగముతోకూడ చేయవచ్చును, కనుక 9 అయినవి. లేక ఎత్తును 16 భాగములుగా చేసి అందు 12 భాగములుగాని మధ్య భూమ్యాదులకు చేయవచ్చును. లేక క్షుద్రహర్మ్యములకు అధిష్ఠానము యెంతో అంతయెత్తున చేయవచ్చును.

శ్లో॥ ద్విభాగం వా త్రిభాగం వా చతుర్భాగ మథాపి వా।
పంచదశోదయం వా పి శాంతికాది శిరోన్నతం॥ 5

అథవామధ్యహర్మ్యేతు ద్విభాగం వా త్రిభాగికం।
చతుర్భాగం పంచభాగం స్యాత్షడ్భాగావసానకం॥ 6

శాంతి కాత్ సర్వ కామ్యాతం పంచధోత్తుంగ మీరితమ్॥ 6½

తా॥ ఎత్తును నాల్గుభాగములుచేసి అందు 2 భాగములుగాని, లేక 3 భాగములుగాని, లేక సమానముగాని, 16 భాగములుచేసి అందు 15 భాగములుగాని శాంతికాది శిరోన్నతము చెప్పబడియున్నది. లేక మధ్యహర్మ్యములకు 2 భాగములుగాని, 3 భాగములుగాని, 4 భాగములు గాని, 5 భాగములుగాని, 6 భాగములుగాని, ఇట్లు ఐదువిధములుగా చెప్పబడియున్నది.

శ్లో॥ అథవా ముఖ్యహర్మ్యేషు త్రయాం వా చతురంశకం॥ 7

పంచాంశం వా షడంశం వా సప్తాంశం వాఽవసానకం।
ఏవం పంచవిధం ప్రోక్తం శాంతికాది శిరోన్నతమ్॥ 8

తా॥ ముఖ్యహర్మ్యములకు 3 భాగములు, లేక 4 భాగములు, లేక 5 భాగములు, లేక 6 భాగములు, లేక 7 భాగములు ఇట్లు ఐదువిధములుగా శాంతికాది గృహములకు చెప్పబడియున్నది.

శ్లో॥ క్షుద్రోత్సేధం వా పి పాదా ధికం చార్ధాధికంతు వా।
పాదోనద్విగుణం వాఽపి ద్విగుణం చ విశేషతః॥ 9

తా॥ క్షుద్రోత్సేధమునకైనను ఎత్తును నాల్గు భాగములుచేసి దానికి ఒక పాతిక యెక్కువగాని, అర యెక్కువగాని, ముప్పాతిక యెక్కువగాని, రెట్టింపుగాగాని చేయవచ్చును.

## 11. ఉపపీఠ నిర్గమము.

కాశ్యపశిల్పము 5వ పటలము

శ్లో॥ పీఠంవిభజ్యదశధా ఏకద్విత్రి చతుష్టయం॥ 3
పంచాంశం వాఽథ నిష్క్రాంత మధిష్ఠానస్య పాదుకం।

ఉపపీఠస్య నీవ్రంతు పంచాంశం పరికీర్తితమ్॥ 4

తా॥ ఉపపీఠముయొక్క నిర్గమమును చెప్పుచున్నాడు. అధిష్ఠానమును 10 భాగములుచేసి అందు 1 భాగముగాని, 2 భాగములుగాని, 3 భాగములుగాని, 4 భాగములుగాని, 5 భాగములుగాని ఇట్లు అధిష్ఠానముయొక్క నిర్గమము చేయవచ్చును. ఉపపీఠముయొక్క నిర్గమము 5 భాగము లుండవలెను.

శిల్పరత్నము 17వ అధ్యాయము.

శ్లో॥ అష్టభాగైక భాగం వా సప్తభా గైక భాగికం।
షడ్భాగైకాంశకం వా థ నిర్గతిః పూర్వముక్తవత్॥ 31

తా॥ ఉపపీఠమును 8 భాగములుచేసి అందు 1 భాగము, లేక 7 భాగములుచేసి అందు 1 భాగము, లేక 6 భాగములుచేసి అందు 1 భాగము, ఇట్లు నిర్గమమును చేయవచ్చును.

శ్లో॥ మూలహర్మ్యస్యపాదేషు బాహ్యతో వప్రజన్మనః।
ఉపపీఠ నిర్గమంస్యాద్భాగేనైవ సత్కృతే॥ 10

సప్తాష్ట నవ భాగంవా దశమేకాదశం తథా।
ద్వాదశైకాంశ భాగం వా చతుర్దశాంశ మేవ వా॥ 11

పంచదశాంశకం వాపి విభజేత్తు విశేషతః।
తత్తద్భాగైక భాగం వా ద్విభాగం వా త్రిభాగికం॥ 12

చతుర్భాగం పంచభాగం షట్సప్తాష్టక మేవచ।
పూర్వవన్నిర్గమం ప్రోక్తం యన్మానోత్తమ్యముత్సృజేత్॥ 13

తా॥ మూలహర్మ్యము (అనగా అధిష్ఠానము) యొక్క పాదమున వప్రముయొక్క మొదలు వెలుపలకు ఉపపీఠముయొక్క నిర్గమము భాగములచేత చెప్పబడుచున్నది. 7 8. 9 10. 11. 12 13. 14. 15. ఇట్లు తొమ్మిది విధములుగా భాగములు చేయవచ్చును. ఆయా భాగములలో 1 భాగముగాని, 2 భాగములుగాని, 3 భాగములుగాని, 4 భాగములుగాని, 5 భాగములుగాని, 6 భాగములుగాని, 7 భాగములుగాని, 8 భాగములుగాని మునుపటివలెనే నిర్గమమును విడువవచ్చును.

శ్లో॥ అథవా హస్తమానేన నిర్గమం తత్ప్రవక్ష్యతే।
ఏకహస్తం సమారభ్య చతుర్థాంశేన వర్ధనాత్॥ 14

తత్త్రిహస్తావసానం స్యాన్నిర్గమం నవధా భవేత్॥ 14½

తా॥ లేక హస్తముల కొలతచేత నిర్గమము చేయవచ్చును. 1 హస్తము మొదలు నాల్గవ భాగము వృద్ధిచేయుచు అట్లు 3 హస్తములవఱకు 9 విధములుగా నిర్గమము విడువవచ్చును.

శ్లో॥ అథవా దండమానేన చోపపీఠస్య నిర్గమం। 15
దండం సార్ధం ద్విదండం వా సార్ధద్విదండ మేవచ॥

త్రిదండం చార్ధమాధిక్యం చతుర్దండ మథాపివా।
పంచషట్ సప్తదండంవా దండాష్ట నవ దండకం॥ 16

నిర్గమం చోపపీఠ స్య పాదబాహ్యావసానకమ్। 17

ఏతత్తు నిర్గమం ప్రోక్తమ్॥ 17½

తా॥ మరియు దండమానముచేత ఉపపీఠముయొక్క నిర్గమము చెప్పుచున్నాడు. 1 దండము 1½ దండము 2, దండములు, 2½ దండములు, 3 దండములు, 3½ దండములు, 4 దండములు, 5 దండములు, 6 దండములు, 7 దండములు, 8 దండములు, 9 దండములు, ఇట్లు పదిరెండు విధములుగా, మానసారమున జెప్పబడినది.

## కాశ్యప శిల్పము 5వ పటలము

శ్లో॥ తన్నీవ్ర ముపపీఠంతు పాదబాహ్యే ప్రకల్పయేత్।
అథాగ్నిపాద సదృశం ద్విగుణం త్రిగుణం తు వా॥ 5

జగతీనీవ్రతుల్యం వా ఉపాన సదృశంతు వా।
ఏవం హి పంచభేదం స్యా దుపపీఠస్య నిర్గమః॥ 6

ఉపపీఠస్య నిష్క్రాంతం సభాదీనా మథోచ్యతే।
సభాదీనాంతు పాద్బాహ్యం నిష్క్రాంతం దండముచ్యతే॥ 7

సమంతు దండ మారభ్య నవదం డావసానకం।
ఉపానంచ తథానీవ్రం ప్రథమాది త్రయ త్రయమ్॥ 8

తా॥ ఉపపీఠముయొక్క నిర్గమము గోడకు వెలుపల చేయవలెను. ముప్పాతిక భాగము దానికి రెట్టింపు లేక 3 భాగములు చేయవచ్చును. జగతి నిర్గమముతో సమానముగాని, ఉపానముతో సమానముగాని, చేయవచ్చును ఇట్లు 5 భేదములు సభ మొదలైన వానికి ఉపపీఠముయొక్క నిర్గమము గోడకు వెలుపల సమముగాని, ఒక దండము మొదలు 9 దండములవరకు చెప్పబడుచున్నది. ఉపానము నిర్గమము 1 మొదలు 9 వరకు కలదు.

## మానసారము 13వ అధ్యాయము

శ్లో॥ ఉమేశవిష్ణు హర్మ్యాణాం చక్రవర్త్యాలయస్య తు
యత్తదేవ సముక్తం హి తంత్రవిద్భిః పురాతనైః॥ 63

తత్తద్దేవాది సర్వేషాం నిర్గమాని యథోచ్యతే।
తత్తదంగాని సర్వేషా ముపానాది యథాక్రమమ్॥ 64

తత్సమం నిర్గమంవాపి తత్పాదాధికమేవచ।
తదర్ధాధిక భాగంవా తత్త్రిపాదాధికం తతః॥ 65

తత్సమాధిక మేవం వా పాదాదుపాన నిర్గమః।
అథ వా పాద విష్కంభా ద్దండమానేన మానయేత్। 66

తా॥ శివ విష్ణుమందిరములకు ఏవి చెప్పబడినవో అవియే చక్రవర్తి మందిరమునకు రచించవలయును. సమస్త దేవతలకును ఆయా నిర్గమములు ఉపానములు క్రమముగా రచించ దగును. నిర్గమము సమానముగాని, పాతిక అర, ముప్పాతిక, రెట్టింపు ఇట్లు చేయవచ్చును.

శ్లో॥ ఏకదండ సమంవాపి తదర్ధాధిక మేవచ।
తదర్ధాధికమేవం వా తత్త్రిపాదాధికం తు వా॥ 67

ద్విదండం వా త్రిదండం వా జన్మనిర్గమ మీరితం।
అథ వా హస్తమానేన పాదహస్తం సమారభేత్॥ 68

తత్సమం వర్ధయే త్తస్మాత్ సార్ధహస్తావసానకః।
జన్మనిర్గమ మేవోక్తం పద్మనిర్గమ మిష్యతే॥ 69

తుంగం తత్సమమేవం వా పాదార్ధాధిక మేవ వా
పాదోన ద్విగుణం వాఽపి పద్మ మేవం తు నిర్గమం॥ 70

అథ వా హస్తమానేన పూర్వవద్ వక్ష్యతే విధిః।
ఉపాన పీఠమానేన యుక్త్యా పద్మస్య నిర్గమమ్॥ 71

తా॥ ఉపానముయొక్క నిర్గమము ఒక్క దండము సమానముగాని, దానికంటె పాతిక అధికముగాని, అర్ధభాగము అధికముగాని ముప్పాతిక అధికముగాని, రెండు దండములుగాని, మూడు దండములుగాని, చేయవచ్చును. లేక హస్తమానముచేత ఒక్క పాతిక మొదలుకొని దానితో సమానముగాని, ఇట్లు క్రమముగా పెంచుచు ఒకటిన్నర హస్తమువరకు ఉపానముయొక్క నిర్గమము చెప్పబడినది. పద్మముయొక్క నిర్గమము ఎత్తుతో సమానముగాని, ఒక పాతిక అధికము గాని, అర్ధభాగ మధికముగాని, ముప్పాతిక అధికముగాని రెట్టింపుగాని చేయవచ్చును. లేక హస్తమానముచేత మునుపటివలెనే భాగములతో చేయవచ్చును. లేక ఉపపీఠముతో సమానముగా నిర్గమము చేయవచ్చును.

శ్లో॥ కల్పానాం క్షుద్రపద్మానాం తత్సమం వాఽథ నిర్గమం।
పట్టికానాం తు సర్వాసాం తత్సమం నిర్గమం భవేత్॥ 72

భాగ పాదాది సర్వేషా మూర్ధ్వం వాస్తువశా న్న్యసేత్।
పాదానామపి సర్వేషాం భూషణం పత్రజాతిభిః 73

అంతరే పట్టికైర్వ్యక్తం పద్మానాంతు పత్రైర్యుతం।
చతురశ్రాకృతించైవ ప్రభ ఆదీని కంపవాజనైః॥ 74

అథవారత్న పుష్పైశ్చ పత్రాద్యైరలంకృతం (స్యాత్)।
అన్యైర్యుక్తం స్వలంకృత్య ప్రతివాజన దేశకే॥ 75

ప్రతివాజనంతు తేషాం కుర్యాత్తత్ దృఢీకృతం॥ 75½

తా॥ క్షుద్రపద్మములకు నిర్గమము ఎత్తుతో సమానముగా నుండవలెను. పట్టికలన్నిటికిని యెత్తుతో సమానముగానే నిర్గమముండవలెను. భాగము అందులో పాదికవంతు మొదలైనవి అన్నియు పైన వాస్తుశాస్త్ర ప్రకారము చేయవలెను స్తంభములన్నిటికిని పత్రజాతులతో నలంకారము చేయవలెను. లోపల నాట్యములతోను, పద్మదళములతోను, నలుచదరముగాను. ప్రథమమునుండి కంపము వాజనము మొదలగు వానితోను లేక ప్రతివాజన ప్రదేశమున రత్నముల చేతను పుష్పములచేతను పత్రములచేతను అలంకారము చేయవలెను. ఇతరములగు అలంకారముల చేతను చేయవలెను. ప్రతివాజనము దృఢముగా చేయవలెను.

శ్లో॥ అన్యేన వాంతరం చైవ వ్యాలసింహాదిరూపకైః
ఖండేవా శ్రేణి సంయుక్తం వృత్తాశ్రం పుష్పకైర్యుతం॥ 76

అనుక్త మన్యం సర్వేషాం యుక్త్యా తత్రైవ యోజయేత్॥ 77

ఇతిమానసారే వాస్తుశాస్త్రే ఉపపీఠ విధానం నామత్రయోదశోఽధ్యాయః

తా॥ అంతరితము మొదలగువానియందును వ్యాలములు సింహములు మొదలగు రూపములతోను ఖండములయందు వరుసలతోను గుండ్రముగానుండెడి ప్రదేశములందు పుష్పములతోను ఇట్లు ఆలోచించి యిందు చెప్పబడకున్నను సమస్తమైన అలంకారములు చేయవచ్చును.

ఇట్లు మానసార వాస్తుశాస్త్రమున ఉపపీఠముయొక్క విధానము అను 13వ అధ్యాయము.

## 12. అభ్యంతర పాదము. (పద్మము)

### శిల్పరత్నము 17వ అధ్యాయము

శ్లో॥ ఇష్టాధిష్ఠానోచ్ఛ్రియంశం విభజ్య సంఖ్యాభిశ్శత్యాదినందాంతిమాభిః
కుర్యాదేకాంశేన తూపానకం తే పద్మం ధామోత్సేధతోఽఒఽదౌఽధికంస్యాత్॥ 32

పద్మస్య తుంగే షడ్భక్తే భాగం మూలేఽస్యపీఠికా
అధశ్ఛదం త్రిభాగేన ద్విభాగే నోర్ధ్వగచ్ఛదం॥

అథసప్తాంశితే తస్మిన్ పీఠమంశేన పంకజం
త్రిభిర్భాగేన తత్కర్ణం ద్వాభ్యామూర్ధ్వచ్ఛదం విదుః॥ 34

పద్మోత్తుంగేఽష్టాభిరంశైర్విభక్తే భాగేన స్యాత్ పీఠికా లోకభాగైః
పద్మోత్సేధోద్వ్యంశతః కర్ణికోచ్చం యుగ్మైర్వాజై ర్వా భద్రైర్భూషితం హి॥35

తా॥ అధిష్ఠానముయొక్క యెత్తును 4 మొదలు 9 వరకు భాగములు చేసికొనవచ్చును, అందు పాదము 1 భాగమును వదలి దానిపైన పద్మమును చేయునప్పుడు ఆ పద్మము అధోభాగమున యెక్కువగను ఊర్ధ్వభాగమున తక్కువగను ఉండవలెను ఎట్లనగా పద్మముయొక్క యెత్తును 6 భాగములు చేసితిమేని అందు పాదము 1 భాగమును పద్మముయొక్క దిగువ ప్రదేశము 3 భాగములును, పైప్రదేశము 2 భాగములును, ఇట్లు చేయవలెను. 7 భాగములు చేసినప్పుడు అందు 1 భాగము పాదమును పద్మము క్రిందిప్రదేశము 3 భాగములును, పైప్రదేశము ˊ భాగములను ఆ పైన మట్టము 1 భాగమును చేయవలెను. 8 భాగములు చేసినప్పుడు అందు 1 భాగము పీఠమును, 3 భాగములు పద్మముయొక్క దిగువ ప్రదేశమును 2 భాగములు పద్మముయొక్క పైవంపును, (యీ పైవంపును కర్ణమని చెప్పవచ్చును) దానిపైన 2 భాగములు వాజనముగాని మట్టముగాని చేయవచ్చును.

## 13. ఉపపీఠము యొక్క అవయములు భద్రపీఠము.

శిల్పరత్నము 18వ అధ్యాయము.

శ్లో॥ అర్కాంశే తూపపీఠోచ్చే తూపానద్ ద్వ్యంశ మంశతః
పద్మం క్షేపణ మర్ధాంశం గ్రీవా పంచాంశతో భవేత్॥ 1

అర్ధేన కంపం తస్యోర్ధ్వ గాబ్జ మంశేన వాజనం
కంప మూర్ధ్వపదం చైత దష్టాంగ ముపపీఠకం॥ 2

షడంగం వా విధాతవ్య మూర్ధ్వాధః పద్మకౌ వినా
వేది భద్ర మిదం ప్రోక్తం సర్వ హర్మ్యోచితం ద్విధా॥ 3

ఆచ్ఛిద్య శివభాగైశ్చ భానుభాగాంశకాంశకైః।
రామాంశాంశక భాగైస్తు ద్వాభ్యా మంశేన యోజయేత్॥ 4

తా॥ ఉపపీఠముయొక్క యెత్తును 12 భాగములుచేసి అందు పాదుక 2 భాగములు పద్మము 1 భాగము, క్షేపణము ½ భాగము, కంఠము 5 భాగములు, కంపము ½ భాగము, పద్మము 1 భాగము, వాజనము 1 భాగము, కంపము 1 భాగము, ఇట్లు చేసిరేని అష్టాంగయుతమైన భద్రపీఠ

మసబడును. అందు ఊర్ధ్వపద్మమును, అధఃపద్మమును వదలినట్లయిన షడంగయుతమైన వేదిభద్ర మగును. మరియు పై 1½ భాగములను ఒక్కొక్క భాగముచేత 2 నిమ్నములుగా ఏర్పాటుచేయ వచ్చును. లేదా ½ భాగముల చొప్పున విభజించియైన చేయవచ్చును. మరియు ½ భాగముల చొప్పున 4 ఖండములుచేసియైన చేయవచ్చును. ఇది అధమము.

కాశ్యపశిల్పము 5వ పటలము.

శ్లో॥ తదుచ్చైర్ద్వాదశాంశే తు ఉపానోచ్చం ద్విభాగయా
పద్మ మంశేన కర్తవ్య మర్ధాంశం కంప ముచ్యతే॥ 9

భూతాంశం కంఠతుంగం తు కంపమర్ధంతు పూర్వవత్
ఏకేన వాజనం కుర్యా త్కంపమేకేన కారయేత్॥ 10

అష్టాంగ మేవ మాఖ్యాతం షడంగం త ద్వినాంబుజం
కంపేనాంబుజ మానంతు యోగ్యం భద్రోపపీఠకం॥ 11

ఊర్ధ్వేకంపం వినా వాఽపి పంచాంగ ముపపీఠకమ్॥ 11½

తా॥ ఉపపీఠముయొక్క యెత్తును 12 భాగములుచేసి అందు పాదుక 2 భా. పద్మము 1 భా. కంపము ½ భా. కంఠము 5 భా. కంపము ½ భా. పద్మము 1 భా. వాజనము 1 భా. కంపము 1 భా. ఇట్లు చేసిన అష్టాంగయుత మగు భద్రపీఠ మనబడును. ఇది ఉత్తమము. ఈ 12 భాగములతోనే చేసి అందు పైనను క్రిందను పద్మములు లేకుండ చేసినచో షడంగములు గలిగిన వేదిభద్ర మగును. ఇది మధ్యమము పై 12 భాగములతోనే చేయుచు పైభాగమున కంపము లేకుండ వాజనముతోనే సరిపుచ్చినట్లయిన పంచాంగయుత భద్రపీఠమగును. ఇది అధమము.



1 భద్రపీఠము



2 వేదిభద్రము.

కాశ్యపశిల్పము మయమతము మొదలగువానియందు చెప్పిన భాగములను పెంచి మానసారమున కొంచెము వ్యత్యాసముగా చెప్పబడియున్నది.

## 14. వేదిభద్రము తద్భేదములు:

మానసారము 13వ అధ్యాయము

శ్లో॥ ఉత్సేధంతు చతుర్వింశ దుపానం పంచభాగికం
ఏకే నకంపమిత్యుక్తం గ్రీవోచ్చం ద్వాదశాంశకం॥ 18

కంపమేకంతు వేదాంశం వాజనం కంప మంశకం॥ 19

వేదిభద్ర మితి ప్రోక్తస్॥ 19½

తా॥ ఉపపీఠోన్నతమును 24 భాగములుచేసి అందు పాదుక 5 భా. కంపము ½ భా. కంఠము 12 భా. కంపము ½ భా. వాజనము 4 భా. కంపము 1 భా. ఇట్లు చెప్పబడియున్నది. ఇది నిజముగ 12 భాగములే దీనిని 24 భాగములని చెప్పుట వింత. "ఉత్సేధం ద్వాదశాంశం తు. సార్ధద్వ్యంశ ముపానకం అర్ధేనకంప మిత్యుక్తం గ్రీవోచ్చం తు షడంశకం॥ కంప మర్ధేన యుగ్మాంశం వాజనం కంపమర్ధకం॥ అని మయునుతమునందున్నట్లు చెప్పుచున్నారు మరియు మానసారముప దీనినే నాలుగు విధములుగ జేసినాడు


మానసార వేదిభద్రము 1.

శ్లో॥ ......................అథవా ద్వాదశాంశకం
జన్మ ద్వయాంశకం పద్మం కంపమర్ధేన కారయేత్॥ 20

పంచాంశం కంఠ మర్ధేన క్షేపణం పద్మ మంశకం
అధ్యర్థం పట్టికోత్సేధం కంపమర్ధేన కారయేత్॥ 21


మానసార వేదిభద్రము 2.

తా॥ ఉపపీఠోన్నతమును 12 భాగములుచేసి అందు ఉపానము 2 భా. పద్మము 1 భా. కంపము ½ భా. కంఠము 5 భా. కంపము ½ భా. పద్మము 1 భా. వాజనము 1½ భా. కంఠము ½ భా. ఇది రెండవ పద్ధతి. మానసారమునందలి 2- పద్ధతులు చూపుచున్నాము.

శ్లో॥ అథవా భాగమానేన సార్ధాంశం పాదుకోదయం
తదూర్ధ్వే తత్సమే నాబ్జం కంప మర్ధేన కారయేత్॥ 22

సార్ధ పంచాంశకం గ్రీవం క్షేపణం చార్ధభాగికం।
తదూర్ధ్వేపద్మ మంశేన వాజనం చైకభాగికం॥ 23

తదూర్ధ్వే కంపమర్ధంస్యా ద్యోజయేత్తు విచక్షణః॥ 23½



మానసారచిత్రము 3.

తా॥ పూర్వము చెప్పిన 12 భాగములనే పాదుక 1½ భా. పద్మము 1½ భా. కంపము ½ భా. కంఠము 5½ భా. క్షేపణము ½ భా. పద్మము 1 భా. వాజనము 1 భా. కంపము ½ భా. చేయవచ్చును. ఇదిమూడవపద్ధతి.

శ్లో॥ తదే వాంశేన యుగ్మేన సోపానాంబుజ మేవ వా 24
కంపమర్ధం తథా కర్ణం తదూర్ధ్వేఽంశేన పట్టికా।
పంచాంశం కంధరం ప్రోక్తం కంపమర్ధేన కారయేత్॥ 25

ద్వ్యంశం త ద్వాజనోత్తుంగం కంపమర్ధేన కార యేత్।
సర్వహర్మ్యేషు యోగ్యంస్యాద్ వేదిభద్రం చతుర్విధమ్॥ 26

తా॥ మునుపు చెప్పినదానినే ఉపానము 1 భా. పద్మము 1 భా. కంపము ½ భా. కర్ణము ½ భా. పట్టిక 1 భా. కంఠము 5 భా. కంపము ½ భా. వాజనము 2 భా. కంపము ½ భా. చేయవలెను. ఇది నాల్గవపద్ధతి.



మానసారచిత్రము 4.

## 15. ప్రతిభద్రము తద్భేదములు

### శిల్పరత్నము 18 వ అధ్యాయము

శ్లో॥ జన్మతో వాజనాంతం యత్ తుంగే త్రినవ భాజితే
పాదుకం పంకజం కంపం కంఠ ముత్తర మంబుజం॥ 5
కపో తాలింగ కర్ణాం శ్చ ప్రతిం వాజన మిత్యపి
ప్రతిభద్రాహ్వయం హ్యేతత్ సర్వాలంకార సంయుతమ్॥ 6

తా॥ ఉపానమునుండి వాజనముయొక్క చివరకు ఎత్తును 27 భాగములుచేసి అందు పాదుక, పద్మము, కంపము, కంఠము, ఉత్తరము, ఆలింగము, కర్ణము, ప్రతి, వాజనము, ఇవియన్నియు భాగముల ప్రకారము 27 అగునట్లు చేసిరేని ప్రతిభద్ర మగును. ఇందు భాగనిర్ణయములేదు.

కాశ్యపశిల్పము 5వ పటలము.

శ్లో॥ ఉపపీఠస్య భోత్సేధం స_ప్తవింశతి భాజితే॥ 12
ద్విభాగం పాదుకోత్సేధం పంకజం తత్సమం భవేత్
కంప మేకాంశ మిత్యుక్తం ద్వాదశాంశం గలోదయం॥ 13
ఉ_త్తరం చైకభాగం స్యా త్తత్సమం చోర్ధ్వ మంబుజం
అగ్నిభాగం కపోతోచ్ఛ మంశ మాలింగ ముచ్యతే॥ 14
త్రైయశ్ర మేకభాగేన ప్రతిమానం ద్విభాగయా
కంపం చైకవిభాగేన మానం త త్ప్రతి భద్రకమ్॥ 15

తా॥ ఉపపీఠముయొక్క యెత్తును 27 భాగములుచేసి అందు పాదుక 2 భా. పద్మము 2 భా. కంపము . భా గలము 12 భా. ఉ_త్తరము 1 భా. పద్మము 1 భా. కపోతము 3 భా. ఆలింగము 1 భా. మూడుపలకలు 1 భా. ప్రతి 2 భా. కంపము 1 భా. ఇట్లు చేసినచో ప్రతిభద్రమగును.



కాశ్యప శిల్పమందలి ప్రతిభద్రము.

మానసార 13వ అధ్యాయము.

శ్లో॥ స_ప్తవింశంతికం భాగం, చోపపీఠోదయం భవేత్
తదంశేన త్ర్యంశకం చ జన్మకంపం శివాంశకం॥ 27
తదూర్ధ్వే చాక్ష మబ్జం స్యాత్ కంప మేకేన కారయేత్
గ్రీవ మేకాదశాంశం స్యాత్ తదూర్ధ్వే కంప మంశకం॥ 28
తద్ద్వయం చాంబుజం చోర్ధ్వే కపోతోచ్ఛం గుణాంశకం।
తదూర్ధ్వేఽంతరితం చాంశం యుగ్మాంశం ప్రతివాజనమ్॥ 29



మానసార ప్రతిభద్రము।

తా॥ ఉపపీఠముయొక్క యెత్తును 27 భాగములుచేసి అందు ఉపానము 3 భా. కంపము 1 భా. పద్మము 2 భా. కంపము 1 భా. గ్రీవము 11 భా. కంపము 1 భా. పద్మము 2 భా. కపోతము 3 భా. అంతరితము 1 భా. ప్రతివాజనము 2 భా. ఇట్లు చేయుట మొదటి పద్ధతి.

శ్లో॥ కేచి చ్చోపపీఠోచ్చం స్యాత్ ద్వాత్రింశతికం భవేత్।
జన్మోచ్చం ద్వ్యంశకం చైవ క్షేపణం చార్ధభాగికం॥ 30

సార్ధ ద్వ్యంశేన పద్మంస్యాత్ క్షుద్రాబ్జం చార్ధకం భవేత్।
తత్సమం చోర్ధ్వకంపం స్యాత్ ద్వ్యంశం చోపరి కంధరమ్॥ 31

కంప మర్ధం తధాబ్జం స్యాత్ ద్వ్యంశం చోపరి పట్టికా।
పద్మమర్ధం తథా కంపం కంధరం తు దశాంశకం॥ 32

అర్ధాంశం కంపమర్ధేన చాధోపద్మం చ కారయేత్।
తదూర్ధ్వే కంప మర్ధాంశ మంశం చోపరి కంధరః॥ 33

ఉత్తరం చాంశకం చోర్ధ్వే కంప మర్ధం తథాంబుజం।
కపోతోచ్చం త్రయాంశం స్యా దాలింగం చార్ధభాగికం॥ 34

ఏకం చాంతరితం చోర్ధ్వే శివాంశం ప్రతివాజనమ్॥ 34½

తా॥ ప్రతిభద్రముయొక్క రెండవ పద్ధతి చెప్పుచున్నాడు. ఉపపీఠముయొక్క యెత్తును 32 భాగములు చేసి అందు పాదుక 2 భా. క్షేపణము ½ భా. పద్మము 2½ భా. క్షుద్రపద్మము ½ భా. కంపము ½ భా కంఠము 2 భా. కంపము ½ భా. క్షుద్రపద్మము ½ భా. పట్టిక 2 భా. క్షుద్రపద్మము ½ భా. కంపము ½ భా. కంఠము 10 భా. కంపము ½ భా. అధోపద్మము ½ భా. కంపము 1 భా. కంఠము 1 భా. ఉత్తరము 1 భా. క్షేపణము ½ భా. క్షుద్రపద్మము ½ భా. కపోతము 3 భా. ఆలింగము ½ భా. అంతరితము 1 భా. ప్రతివాజనము 1 భా. ఈ ప్రకారముగా చేయవలయును.




శ్లో॥ అథ వా చోపపీఠోచ్చం త దేకాంశాధికం తథా॥ 35

సార్ధదృ గ్జన్మనోత్సేధం కంప మర్ధం తదూర్ధ్వకే।
పద్మతుంగం తు షడ్వ్యంశం కంప మర్ధేన కారయేత్॥ 36

తత్సమం కంధరం ప్రోక్తం కంప మర్ధం తథాఽంబుజం
తదూర్ధ్వే చ ద్విభాగేన వజ్రకుంభం ప్రకారయేత్॥ 37

దళ మధ్యర్ధ కంపం చ ద్విసప్తాంశం గలోదయం।
ఉత్తరం చాంశకంపం స్యాత్తదూర్ధ్వే చ సరోరుహమ్॥ 38

కపోతోచ్చం త్రయాంశం స్యా దాలింగం చార్ధకం భవేత్।
అంశే సాంతరితం చోర్ధ్వే శివాంశం ప్రతివాజనమ్॥ 39

తా॥ ఉపపీఠోన్నతమును 33 భాగములుచేసి అందు ఉపానము 2½ భా. కంపము ½ భా. పద్మము ½ భా. కంపము ½ భా. కంఠము ½ భా. కంపము ½ భా. క్షుద్రపద్మము ½ భా. వప్రకుంభము 2 భా. దళము 1½ భా. గళము 5.2.7 ఇట్లు మూడు భిన్నములుగా చేయవలెను. దీనిని పట్టగళ[33] మని చెప్పవచ్చును. ఈ గళమును మధ్య రత్నముగా జేయగూడదు. ఉత్తరము కంపము క్షుద్రపద్మము ఈ మూడును కలిపి రెండు భాగములు చేయవలెను. కపోతము 3 భా. ఆలింగము ½ భా. అంతరితము 1 భా. ప్రతివాజనము 1 భా. ఇది మూడవపద్ధతి.



మసూరక ప్రతిభద్రము - 3

శ్లో॥ తదేవ త్ర్యంశ మాధిక్యం జన్మ సార్ధద్వయాంశకం।
తదూర్ధ్వే కంప మర్ధేన పద్మోత్సేధం గుణాంశకం॥ 40

కంప మర్ధం తథా కర్ణం కంపమర్ధం తథాంబుజం।
ద్విభాగం రత్నపట్టం స్యాత్ దల మర్ధంతు క్షేపణం॥ 41

కర్ణ మంశం తదూర్ధ్వేఽర్ధం క్షేపణం చైక మంబుజం।
తదూర్ధ్వే క్షేపణం సార్ధం కంఠ మేకాదశాంశకం॥ 42

ఉత్తరం కంప మప్యర్ధం చాంబుజం ద్వ్యంశ మూర్ధ్వకే।
కపోతం సార్ధ మాలింగం సార్ధ మంతరితం తథా॥ 43

ఏకభాగం ప్రతిం చైవ సార్ధాంశం చోర్ధ్వవాజనం।
ప్రతిభద్ర మితిప్రోక్తం పాదబ స్తు చతుర్విధం॥ 44

దేవ భూసుర భూపానాం హర్మ్యాణా మాసనాన్వితమ్॥ 44½



మసూరక ప్రతిభద్రము 4.

తా॥ ఉపపీఠమును 36 భాగములుచేసి అందు ఉపానము 2½ భా. కంపము ½ భా. పద్మము 3 భా. కంపము ½ భా. కర్ణము 1 భా. కంపము ½ భా. క్షుద్రపద్మము ½ భా. రత్నపట్టము 2 భా. దళము ½ భా. క్షేపణము ½ భా. కర్ణము ½ భా. క్షేపణము ½ భా. పద్మము 1 భా. క్షేపణము 1½ భా. కంఠము 11 భా. ఉత్తరము 1 భా. కంపము ½ భా. పద్మము 2 భా. కపోతము 1½ భా. ఆలింగము 1½ భా. అంతరితము 1 భా. ప్రతివాజనము 1 భా. వాజనము 1½ భా. ఇది నాల్గవ పద్ధతి.

## 8వ ప్రతిసుందరము

### కాశ్యపశిల్పము 5వ పటలము

శ్లో॥ ద్విభాగం పాదుకోత్సేధం ద్విభాగం పంకజోదయం।
కంపమేకేన కర్తవ్య మేకే నాంతరితం భవేత్॥ 16

ద్విభాగం ప్రతితుంగం తు ఏకేనైవతు వాజనం।
అష్టాంశం గల మానంతు కంప మేకేన కారయేత్॥ 17

అబ్జ మేకేన కర్తవ్యం కపోతోచ్ఛ్రం గుణాంశకం।
ఏకే నాలింగమేకే నాం తరితం తు ప్రకల్పయేత్॥ 18

ప్రతితుంగం ద్విభాగేన వాజనం చైకభాగయా।
సప్తవిశంతి భాగేతు మానం తత్ప్రతి సుందరమ్॥ 19


కాశ్యపశిల్పము ప్రతిసుందరము.

తా॥ ఉపపీఠోన్నతమును 27 భాగములుచేసి అందు పాదుక 2 భా. పద్మము 2 భా. కంపము 1 భా. అంతరితము 1 భా. ప్రతిముఖము 2 భా. వాజనము 1 భా. గళము 8 భా. కంపము 1 భా. పద్మము 1 భా. కపోతము 3 భా. ఆలింగము 1 భా. అంతరితము 1 భా. ప్రతి 2 భా. వాజనము 1 భా. ఇట్లు చేసినచో దీనిని ప్రతిసుందరమందురు.

### శిల్పరత్నము 18వ అధ్యాయము.

శ్లో॥ ద్విభాగం పాదుకోత్సేధాత్ ద్విభాగం పంకజోదయం॥ 11
కంపమేకేన కర్తవ్య మేకేనాంతరితం భవేత్।
ద్విభాగం ప్రతి తుంగం తు తథైవేకేన వాజనం॥ 12
అష్టాంశం గల తుంగం తు కంప మేకేన కారయేత్।
అబ్జమేకేన కర్తవ్యం కపోతోచ్ఛ్రం గుణాంశకం॥ 13
ఏకేనా లింగపట్టం స్యా దంతరం చైక భాగికం।
ప్రతి తుంగం ద్విభాగంతు వాజనం చైక భాగికం॥ 14
సప్తవింశతి భక్తేతు నామ్నా తత్ప్రతి సుందరమ్॥ 14½

తా॥ ఉపపీఠోన్నతమును 21 భాగములుచేసి అందు పాదుక 2 భా. పద్మము 2 భా. కంపము 1 భా. అంతరితము 1 భా. ప్రతి 3 భా. వాజనము 1 భా. గలము 8 భా. కంపము 1 భా. పద్మము 1 భా. కపోతము 3 భా. ఆలింగము 1 భా. పట్టము ½ భా. అంతరితము 1 భా. ప్రతి 2 భా. వాజనము 1 భా. ఇట్లు చేసినేని ప్రతిసుందరమగును. ఇది కాశ్యపశిల్ప పద్ధతిలోనే యున్నది కనుక ఆకారము చూపవలసినదిలేదు. ఆలింగము కొలతలోనే పట్టమును ఆలింగమును రెంటిని చేసినాడు. మానసారమును చూసిన తెలియును.

## 17. సుభద్రపీఠములు.

కాశ్యపశిల్పము 5వ పటలము.

శ్లో॥ ఉపపీఠస్య చోత్సేధ మేకవింశతి భాజితే।
ఉపానం చ ద్విభాగేన పద్మమంశద్వయం బుజోదయం॥ 20

కంఠ మంశేన కర్తవ్యం పద్మమంశేన కారయేత్।
మహా పద్మం ద్విభాగేన పద్మమంశేన కార యేత్॥ 21

కంప మంశేన కర్తవ్యం కంఠోచ్చం వసుభాగయా।
భాగేన కంప మన్యేన పద్మకం పీఠకర్తృభిః॥ 22

కంపమంశేన కర్తవ్య మేతత్ సౌభద్ర ముచ్యతే॥ 22½

తా॥ ఉపపీఠమునొక్క యెత్తును 21 భాగములుచేసి అందు పాదుక 2 భా. పద్మము 2 భా. కంఠము 1 భా. క్షుద్రపద్మము 1 భా. మహాపద్మము 2 భా. క్షుద్రపద్మము 1 భా. కంపము 1 భా. కంఠము 8 భా. కంపము 1 భా. పద్మము 1 భా. కంపము 1 భా. ఇట్లు చేసినేని సౌభద్ర మగును.

శిల్పరత్నము 18వ అధ్యాయము.

శ్లో॥ ప్రకృత్యంశే సముత్సేధే భాగాభ్యాం జన్మ చాంబుజం
గల మర్ధేన భాగేన పద్మం ద్వ్యంశం తు వాజనం॥ 7

అర్ధే నాబ్జం తథా కంప ముష్టం కంఠాంశ ముత్తరం।
అర్ధేనాబ్జంతు గోపానం త్రిభిః స్యా త్కంప మంశతః॥ 8

సుభద్రకమిదం నామ్నా కథితం హ్యుప పీఠకం।
సింహేభ మకర వ్యాల భూత భద్రా ద్యలంకృతం॥ 9

ప్రతి వక్త్రం ఋషాస్యం స్యాత్ వ్యాలే నారూఢ మస్తకం।
దేవ ద్విజ నరేంద్రాణాం మకరాస్యం ప్రతేర్ముఖం॥ 10

స్వస్తికం వాఽథ దేవానా మ్యందు వైశ్య శూద్రయోః॥ 10½

తా॥ ప్రకృతిని రెండుభాగములుచేసి అందు మొదటిభాగమును పదలి పైభాగమును అనగా ఉపపీఠోన్నతమును 21 భాగములుచేసి అందు ఉపానము 1 భా. పద్మము 1 భా. కంపము ½ భా. మహాపద్మము 2 భా. వాజనము 2 భా. క్షుద్రపద్మము ½ భా. కంపము ½ భా. కంఠము 8 భా. వాజనము 1 భా. పద్మము ½ భా. గోపానము 3 భా. కంపము 1 భా. చేసి చేసి ఇది సుభద్రకమను. ఉపపీఠము. ఇట్లుచేసి సింహములు, ఏనుగులు, వ్యాలములు, భూతములు, భద్రము మొదలగువానితో నలంకారముగ చేయవలెను. ప్రతిముఖమున మత్స్యాకారములను చేయవలెను. మస్తకమున వ్యాలములను చేయవలెను. దేవతలకును, ద్విజులకును, రాజులకును, మకరముఖములతో ప్రతిని చేయవలెను. లేక స్వస్తికమునైన చేయవలెను. వైశ్యులకును శూద్రులకును అర్ధచంద్రాకారములను చేయవలెను.





కాశ్యపశిల్పము 6వ పటలము

శ్లో॥ ఉపానద్వికమగ్న్యంశ మబ్జం చాంశేన కంధరం॥ 23

ద్విభాగే నాబ్జం కర్తవ్యం పట్టికా తత్సమాభవేత్।
వర్తులం సార్ధభాగేన కంప మంశేన కారయేత్॥ 24

సప్తభాగం గలోత్సేధం కంప మంశేన కారయేత్।
అంబుజం శివ భాగేన మహాపట్టీ ద్విభాగయా॥ 25

అబ్జమర్ధాంశ మానేన, కంపమంశేన కారయేత్।
పంచపంచేన పీఠేచ సమ్యగ్భాగ విభాజితే॥ 26

కల్యాణ కారణం నామ్నా సర్వధామసు పూజ్యతే।
ఏవం విధిః సమాఖ్యాత ఉపపీఠే ద్విజోత్తమ॥ 27

అంగ నిష్క్రాంత వేశంచ అధిష్ఠాన విధానవత్।
భూతైశ్చవ్యాల సింహైశ్చ మకరైః పత్రజాతిభిః॥ 28

ఉపపీఠం గలోన్మిశ్రం భూషయంతు సలక్షణం।
ప్రత్యంగం మకరస్థాన మబ్జాద్యం రుద్దమస్తకం॥ 29

అంబుజేనైవ కర్తవ్య మధిష్ఠానోక్త మాచరేత్।
ఉపపీఠం సమాఖ్యాత మధిష్ఠాన విధిం శృణు॥ 30

తా॥ ఉపపీఠముయొక్క యెత్తును 25 భాగములుచేసి అందు పాదుక 2 భా. పద్మము 3 భా. కంఠము 1 భా. పద్మము 2 భా. పట్టిక 2 భా. వర్తులము 1½ భా. కంపము 1 భా. కంఠము 7 భా. కంపము 1 భా. పద్మము 1 భా. పట్టిక 2 భా. పద్మము ½ భా. కంపము 1 భా. ఇట్లు చేసినచో కల్యాణకారణమను పేరుగలది యగును. ఉపపీఠములయందిది శ్రేష్ఠమైనది. మునుపుచెప్పిన అష్టాంగములు అధిష్ఠానమునకువలె దీనియందును చేయవలెను. భూతములు, వ్యాలములు, సింహములు, మకరములు, పత్రజాతులు, మొదలగు వానితో నలంకారముగ చేయవలెను. ప్రతి స్థలము అలంకారముగా నుండవలెను. మస్తకమున పద్మములు మొదలగు వానితో నలంకారము చేయవలెను.

## 18 కళ్యాణకారణ భేదములు

### శిల్పరత్నము 18వ అధ్యాయము.

శ్లో॥ ఉపానంతు ద్విభాగం స్యాద్ రామాంశం పద్మ ముచ్యతే॥ 15

ఏకాంశం కంధరం విద్యా దంశాభ్యాం పద్మముచ్యతే।
ద్విభాగం పట్టిమానం స్యా దధ్యర్ధం పద్మమానకం॥ 6

కంపమర్ధేన కర్తవ్యం సప్తభాగం గలం తథా।
కంపమర్ధేన కర్తవ్య మంబుజం సార్ధభాగికం॥ 17

మహాపట్టి ద్విభాగేన పద్మమధ్యర్ధ భాగతః।
కంపమర్ధేన కర్తవ్యం పంచవింశతి భాజితే॥ 18

కలాణ్యకారణం నామ్నా సర్వధామసు పూజితం।
అథవా మంచకాద్యంగై ర్భూషయే ద్వోప పీఠకం॥ 19

అంగనిష్క్రాంత వేశాన్య స్యధిష్ఠానక వ ద్భవేత్।
అధిష్ఠానం చోప పీఠం మృణాచేష్టకయాఽపి వా॥ 20

శిలాభి ర్వా విధాతవ్యం దారుణా వా యథాబలమ్॥ 20½

తా॥ ఉపపీఠోన్నతమును 25 భాగములుచేసి అందు పాదుక 2 భా. పద్మము 3 భా. కంఠము 1 భా. పద్మము 2 భా. పట్టము ½ భా. పద్మము 1½ భా. కంపము ½ భా. గళము 7 భా. కంపము ½ భా. పద్మము 1½ భా. పట్టిక 2 భా. పద్మము 1½ భా. కంపము ½ భా. ఇట్లు చేసినచో కల్యాణకారణ మను పేరుగలది యగును. ఇది శ్రేష్ఠము. మంచకాది అంగములచేతకూడ ఉపపీఠమును చక్కగా చేయవచ్చును. అంగవిన్యాసాంత భేదములు (అనగా పద్మము కంఠము మొదలైనవి. వెలుపలికి వచ్చుట లోపలికి తగ్గుట మొదలయినవి.) అధిష్ఠానమునకు యెట్లో ఉపపీఠమునకుగూడ అట్లే అని తెలియవలెను. అధిష్ఠానము ఉపపీఠము ఇవి మన్నుతోగాని, ఇటుకలతోగాని, దారువుతోగాని, శిలలతోగాని చేయవచ్చును. అనగా చేయబోవు పనిననుసరించి బలమును తెలిసికొని చేయవలెను-మానసారమున ఇది చెప్పబడలేదు.



కాశ్యపశిల్పము కల్యాణకారణము



[illegible]

మంచభద్రమనునది యొక పీఠమున్నట్లు శ్రీకుమారుడు వచించియున్నాడు కాని దాని కొలతలు చెప్పలేదు. మానసారమున నాలుగు విధములుగా జెప్పబడియున్నది.

## 16 మంచభద్రభేదములు

### మానసారము 13వ అధ్యాయము

శ్లో॥ తుంగే త్రింశతి భాగేన జన్మతుంగం గుణాంశకం॥ 45

అర్ధేన కంప మూర్ధ్వేతు గుణాంశేన మహాంబుజం।
అర్ధేన కంపం కంఠం దృక్ చార్ధం కంపం తథాఽంబుజం॥ 46

కపోతం సార్ధ మూర్ధ్వేతు యుగ్మాంశం ప్రతివాజనం।
తదూర్ధ్వే కంఠ మష్టాంశ ముత్తరం చైక భాగికం॥ 47

తదూర్ధ్వం క్షేపణం సార్ధం పద్మం గోపానకం త్రిభిః।
శేషమాలింగాంతరితం ప్రతివాజన సంయుతమ్॥ 48

తా॥ ఉపపీఠముయొక్క యెత్తును 30 భాగములుచేసి అందు పాదుక 3 భా. కంపము ½ భా. పద్మము 3 భా. కంపము ½ కంఠము 2 భా. కంపము ½ భా. పద్మము ½ భా. కపోతము 1½ భా. ప్రతివాజనము 2 భా. కంఠము 8 భా ఉత్తరము 1 భా. క్షేపణము 1 భా. పద్మము 1½ భా. గోపానము 3 భా. మిగిలినది ఆలింగము ½ భా. అంతరితము 1 భా. ప్రతివాజనము ½ భా. ఇట్లు చేయుట మొదటిపద్ధతి.

శ్లో॥ తదేవ భాగభేదేన త్రయం చోపాన మీరితం।
అర్ధేనోపరి కంపం స్యాత్ సార్ధత్ర్యంశం సరోరుహం॥ 49

క్షేపణం చార్ధ మర్ధాంశం కంపం కర్ణం తథాంబుజం।
సార్ధద్వయం తు గోపానం త్ర్యంశం తత్ప్రతివాజనం॥ 50

తదూర్ధ్వేగల మష్టాంశ ముత్తరం చైకభాగికం।
కంప మర్ధం తథాబ్జం స్యాత్ కపోతోచ్చం త్రయాంశకం॥ 51

అబ్జమర్ధాంశకం చైవ మష్యర్ధం తు యథాక్రమం।
ఆలింగ మంతరం చైవ ప్రతివాజన మంతిమమ్॥ 52

తా॥ పైజెప్పిన దానినే భాగభేదములచేత చెప్పుచున్నాడు. పాదుక 3 భా. కంపము ½ భా. పద్మము 3½ భా. క్షేపణము ½ భా. కంపము ½ భా. కర్ణము ½ భా. పద్మము ½ భా. గోపానము 2½ భా. ప్రతివాజనము 3 భా. గలము 8 భా. ఉత్తరము 1 భా. కంపము ½ భా. పద్మము ½ భా. కపోతము 3 భా. ఆలింగము ½ భా. అంతరితము ½ భా. ప్రతివాజనము 1½ భా. ఇది రెండవ ప్రకారము.


మానసార మంచపత్రము.1.


మానసార మంచపత్రము.2.

త్రయస్త్రింశతి కంతుంగం ద్వ్యంశేనోపాన మీరితం।
కంపమర్ధేన తస్యోర్ధ్వే సార్ధద్వ్యంశం మహాంబుజం॥ 53

అబ్జం సార్ధం కంపమర్ధం ద్వ్యంశే నాంతరితం తతః।
కంపమర్ధం తథా పద్మం పట్టికోచ్చం తథాఽంశకం॥ 54

పద్మమర్ధం తథాకంపం పంచ భాగేన తద్గలం।
ఏకాంశం చోత్తరం చోర్ధ్వే కంపమర్ధం తథాఽంబుజం॥ 55

కపోత మరభాగం స్యాత్ తత్సమం ప్రతి వాజనం।
తదూర్ధ్వేఽంతరితం కర్ణం త్రయాంశం చోత్త రాంశకం॥ 56

కంప మర్ధం తథా పద్మం కపోతోచ్చం గుణాంశకం।
శేష మాలింగాంతరితం గల ముత్తర మంశకమ్॥ 57

తా॥ ఉపపీఠముయొక్క యెత్తును 33 భాగములుచేసి అందు పాదుక 2 భా. కంపము ½ భా. పద్మము 2½ భా. క్షుద్రపద్మము 1½ భా. కంపము ½ భా. అంతరితము 2 భా. కంపము ½ భా. పద్మము ½ భా. పట్టిక 1 భా. పద్మము ½ భా. కంపము ½ భా. గలము 5 భా. ఉత్తరము 1 భా.

కంపము ½ భా. పద్మము ½ భా. కపోతము 1½ భా. ప్రతివాజనము 1½ భా. అంతరితము 1½ భా. కర్ణము 1½ భా. ఉత్తరము 1 భా. కంపము ½ భా. పద్మము ½ భా. కపోతము 3 భా. ఆలింగము 1 భా. అంతరితము ½ భా. గలము ½ భా. ఉత్తరము 1 భా. ఇది మూడవ ప్రకారము.

శ్లో॥ చతుస్త్రింశతికం భాగం కృత్వా తత్తుంగ మానతః।
జన్మతుంగం గుణాంశం స్యాత్ కంప మర్థేన కారయేత్॥ 58

ఊర్ధ్వవప్ర్యాంశ మబ్జం చ క్షుద్రపద్మం తదూర్ధ్వకే।
కంప మర్ధంతు సప్తాంశం గల మాలింగ మంశకం॥ 59

అర్ధేన కంపమర్ధేన పద్మం సార్ధద్వయాంశకం।
కపోతం సార్ధ మాలింగ మేకం కంఠం ద్వికర్ణకం॥ 60

ఏకంపట్టం ద్వయంకర్ణం చైకం చోత్తర మంశకం।
అర్ధమర్ధం కంపమబ్జం చోపానోచ్చం గుణాం శకం॥ 61

ఆలింగ మర్ధభాగేన శివాంశం వాజనం భవేత్।
మంచభద్ర మిదంనామ్నా చతుర్భేద మితీరితమ్॥ 62

తా॥ ఉపపీఠముయొక్క యెత్తును 34 భాగములుచేసి అందు పాదుక 3 భా. కంపము ½ భా. పద్మము 3 భా. పద్మము ½ భా. కంపము ½ భా. గలము 7 భా. ఆలింగము 1 భా. కంపము ½ భా. పద్మము ½ భా. మహాపద్మము 2½ భా. కపోతము 1½ భా. ఆలింగము 1 భా. కంఠము 2 భా. కర్ణము 1 భా. పట్టము 2 భా. కర్ణము 1 భా. ఉత్తరము 1 భా. కంపము ½ భా. పద్మము ½ భా. గోపానము 3 భా. ఆలింగము ½ భా. వాజనము 1 భా. ఇది నాల్గవ ప్రకారము.



మానసార మంచభద్రము 3



మానసార మంచభద్రము 4.

## 20. అధిష్ఠానవిధి

కాశ్యపశిల్పము 6వ పటలము

శ్లో॥ అథ వక్ష్యే విశేషేణ అధిష్ఠానవిధిం శృణు।
ధరాతల మధిష్ఠాన మాధారం ధరణీ తథా॥ 1

భువనం పృథివీ భూమిః పర్యాయ వచనాదిభిః।
హర్మ్యరారం చ కూటాది నీవ్రాధిష్ఠాన నీవ్రకం॥ 2

తస్మా దుపరి పీఠస్థ నీవ్రం హోమాగ్నినిర్గమం।
తస్మాత్ ప్రకృతినీవ్రం చ సూత్రపాతం తు కారయేత్॥ 3

యత్రైవాధ్యేష్టకానాం స మానం తత్రైవ లక్షయేత్।
తస్మా త్తు ఘనభిత్త్యైవ ప్రకృత్యంతం ప్రకల్పయేత్॥ 4

తా॥ ధరాతలము, అధిష్ఠానము, ఆధారము, ధరణి, భువనము, పృథివి, భూమి, ఇవి యన్నియు అధిష్ఠానమునకు పేర్లు. ప్రథమేష్టకలను ఏచట నుంచితిమో అక్కడనే పరిమాణమును నిర్ణయించవలెను. దానినుండి ఘనభిత్తిని ప్రకృతి అంతమువరకు కల్పించవలెను. ప్రకృతి యనగా అధిష్ఠానమునకు మూలమైన ప్రదేశము. అప్పటినుండి పైన ఉపపీఠముయొక్క నిర్గమమును హోమాగ్ని నిర్గమమును ప్రకృతి నిర్గమమును సమానముగా నుండునట్లు సూత్రమును పట్టవలెను. కనుక కొలతలను చక్కగా చూడవలెను

## 21. ప్రకృతి లక్షణము.

కాశ్యపశిల్పము 6వ పటలము.

శ్లో॥ సుధావం ప్రకృతే ర్మధ్యే ప్రకృతా పేకహస్తకం।
ద్విహస్తం వా ప్రకృత్యుచ్ఛ్రం త్రిహస్తం వా వినాకృతిం॥ 5

షడంగుల సముత్సేధం షట్ షడంగుల వర్ధనాత్।
ఉత్తమం మధ్యమం చైవ అధమం తత్ త్రిధా అపి॥ 6

ప్రకృత్యం చ స్థలం ఖ్యాత మంతమండలకస్య తు।
ఏవం కృత్వా ప్రకృత్యూర్ధ్వం హోమవాక్పలదేశికా॥ 7

భిత్తిపాదస్య విష్కంభం ద్విగుణం త్రిగుణం తు వా।
హోమనీవ్ర మితి ఖ్యాతం తదర్ధం వా బలాంచితం॥ 8

తా॥ ప్రకృతియొక్క కొలత 1 హస్తమునకు 6 అంగుళములు. అనగా ¼ హస్తము. ప్రకృతి 2 హస్తములుగాని 3 హస్తములుగాని అయినప్పుడు 18 అంగుళముల యెత్తు ఉత్తమము. 12 అంగుళములు మధ్యమము 6 అంగుళములు అధమము అని తెలియవలెను. మరియు స్తంభము యొక్క విష్కంభమునకు 2 భాగములు గాని, 3 భాగములు గాని, గోడ యుండవలెను. హోమ నీవ్రము పాతికభాగము గాని, అర్ధభాగము గాని, యుండవలెను. హోమాసము అనగా ప్రకృతి యని చెప్పబడు దిమ్మ.

## 22. హోమనిర్గమము.

కాశ్యప శిల్పము 6వ పటలము

శ్లో॥ తద్ధోమ ప్రకృతీ నీవ్రైర్ద్వి త్రి దండై ర్వాపి వా।
ఆయాని ప్రత్యాహాంతి ప్రోదుహా పింగళం తు వా॥ 9

హోమనీవ్రం సమం ప్రోక్తం ద్విపట్టం త్రిపట్టకం।
హోమ తుంగ సమానేన హోమోర్ధ్వే పట్టం ప్రకల్పయేత్॥ 10

అబ్జస్యోచ్చసమం వేశ మష్టార్ధం తు ఉపానకం।
తస్యోపరి అధిష్ఠానం సోపపీఠాన్వితం తు వా॥ 11

అన్య ద్ధోమం ప్రకృత్యూర్ధ్వే సోపానానాం ప్రకల్పయేత్।
తదూర్ధ్వే తరతలం వా సోపపీఠ మథాపి వా॥ 12

తా॥ ఆహోమ ప్రకృతి నీవ్రములు 2 దండములు గాని, లేక 3 దండములు గాని, చేయవచ్చును. హోమనీవ్రముతో సమానముగా అనగా అధిష్ఠానమునకు దిగువనుండెడి ప్రకృతి యనుదిమ్మ హోమతుంగ సమానముగా హోమముపైన పట్టమును కల్పించవలెను. స్తంభము యెత్తుతో సమానముగా ఉపానమును, దానిపైన అధిష్ఠానము ఉపపీఠముతో గాని, లేక ఒకటిగా కాని కల్పించవలెను.

శ్లో॥ తలోపానం వినాఽఽధారం హోమోర్ధ్వే వా ప్రకల్పయేత్।
ప్రకృతిం సమమాత్రంతు కల్పయే ద్దేశికోత్తమః॥ 13

హోమమాప్నే ఉపానాది హార్మ్యనిష్క్రాంత వేశనం।
అర్ధోత్సేధాంశ మానేనా ధిష్ఠాన స్యోచ్ఛ్రియం విదుః॥ 14

పాదోదయోర్ధ్వ మానం వా ష డష్టాంశేన ఏవవా।
అగ్రపాద విశాలంతు దండ మి త్యభిధీయతే॥ 15

తా॥ తలము, ఉపానము ఆధారము ఈమూడును కాకుండా హోమముపైన ప్రకృతి యను దానిని చేయవలెను. ఆ ప్రకృతి సమసూత్రముతో వరుసగా ఉపానమును అధిష్ఠానమును తలమును చేయవలెను. ఆ హోమముయొక్క కొలతతోనే ఉపానము మొదలయి హార్మ్యనిర్గమములు వేశనములు చేయవలెను. ఎత్తులో సగముతో అధిష్ఠానము యెత్తును చేయవలెను స్తంభము యొక్క చివరతో సమానముగాని, లేక 6 వ భాగముగాని, 8 వ భాగముగాని చేయువచ్చును.

## 23. అధిష్ఠానాంగ నిర్గమము

శ్లో॥ ఏకదండ సమారభ్య అర్ధదండ వివర్ధనాత్।
సపాదావంచ సంఖ్యాతు అగ్నిదం డావసానకా॥ 16

పద్మాహ్యే పాదనిష్క్రాంతం తత్ త్రిభాగ విభాజితే।
ఉపానం వ్యాస మేకాంశం శేషం జగతి విస్తరం॥ 17

కుముదేత్వంశమే కాంశం తన్నీవ్రం జగతీ సమం।
కుముదే పట్ట మంశేన తత్సమం కర్ణ వేశనం॥ 18

సర్వేషా మంబుజానాం తు నీవ్రం తుంగసమం భవేత్।
కంపానా మపి వా శేషం చతుర్భాగైక నిర్గమమ్॥ 19

తా॥ దండముతో కొలత యయ్యేనేని 1 దండము మొదలుకొని ½ దండము వృద్ధి చేయుచు అటుల 3 దండముల వఱకు 5 విధములుగా నిర్గమమును చేయవచ్చును. స్తంభము వెలుపలి నిర్గమము ఎట్లున్న దానిని మూఁడుభాగములు చేసి అందు ఉపానము 1 భాగము వ్యాసము మిగిలిన 2 భాగములు జగతి విస్తారమును చేయవలెను. కుముదమునకును 1 భాగము నీవ్రమును ఆనీవ్రము జగతితో సమానముగను ఉండవలెను. కుముదమున పట్టము 1 భాగమును దానితో సమముగ కర్ణము లోపలికి త్రిప్పవలయును చేయవలెను. సమస్తమైన పద్మములకు నిర్గమము యెత్తుతో సమానముగా నుంచవలెను. మిగిలిన కంపము మొదలయినవి అన్నియును యెత్తులో నాల్గవ భాగమే నిర్గమము చేయవలెను.

శ్లో॥ మహావాజన నిష్క్రాంతం తుంగం తుల్యార్థ ఏవవా।
త్రిపాదం వాఽథ నిష్క్రాంతం యథా బలవశా న్న్యసేత్॥ 20

జన్మాది పంచవర్గేషు తత్త దంగావసానకే।
ద్వారార్థం వా స్థలార్థం వా చోదయేత్త ద్ధరాతలే॥ 21

ఉపానం జగతీ కంపం ఖండంచ పట్టికా తథా।
పంచవర్గ మితి ఖ్యాతం జ్ఞేయ మర్థం తథా బుధః॥ 22

ద్వారం చ జలధారంచ స్థలం చ ప్రతిబంధకైః।
ప్రతే దూర్ధ్వే తు కర్తవ్య షంగం చైత న్నకారయేత్॥ 23

తా॥ మహావాజనముయొక్క నిర్గమము ఎత్తుతో సమానము గాని అందులో సగముగాని ముప్పాతిక భాగముగాని బలము ననుసరించి చేయవచ్చును. ఉపానము, జగతి, కంపము, ఖండము, పట్టిక, అనునవి యైదును పంచవర్గ మనబడును. ద్వారము, జలధారము, స్థలము, ప్రతిబంధము ఇవి ప్రతియొక్క ఊర్ధ్వమున చేయవలెను గాని, ఈ అయిదు అంగములయందు మాత్రము చేయరాదు.

## 24. ప్రతిబంధ పాదబంధ భేదములు

శ్లో॥ ప్రత్యంగ చ్ఛేదనం చేత్తు విపదా మాస్పదం సదా।
తస్మాత్సర్వ ప్రయత్నేన ప్రత్యంగచ్ఛేదనం వినా॥ 24

అధిష్ఠానం ద్విధా జ్ఞేయం ప్రతిబంధాంఘ్రి బంధనం।
ప్రత్యేకానాంతు భేదేన ప్రోచ్యతే ద్విజసత్తమాః॥ 25

సర్వేషాం ప్రతిబంధానాం కుముదం వృత్త ముచ్యతే।
పాదబంధ తలానాం తు వస్వశ్రం కుముదం భవేత్॥ 26

తయోః సంకర మేతస్మిన్ భవే త్తత్కర్తృ నాశనం।
ప్రాసాదం ప్రతిబద్ధంచే త్తద్భేదానేక సంకరః॥ 27

తా॥ ప్రత్యంగచ్ఛేదనమును చేసినట్లయిన హానికలుగును. కనుక ఎప్పుడును ప్రత్యంగచ్ఛేదనమును చేయరాదు. అధిష్ఠానము రెండు విధములు అని తెలియవలెను. 1 ప్రతిబంధము 2 పాదబంధము అని వేఱువేఱుగా వాని లక్షణములు చెప్పఁబడినవి. ప్రతిబంధము లన్నిటికిని కుముదము గుండ్రముగా చేయవలెను. పాదబంధ ప్రదేశమున కుముదమును 8 పలకలుగా చేయవలెను. ప్రాసాదములకు ఈ రెంటిని కలిపిగాని యింకా కొన్నిటిని కలిపిగాని సంకరముగా చేసిన యెడల యజమానుని చంపును కనుక జాతిచెడకుండ చేయవలెను.

## 25. జాతిసంకరదోషనిర్ణయము

శ్లో॥ కూటకోష్ఠాదికానాం తు కర్తవ్యం త చ్ఛుభావహం।
తదే వాంఘ్రి ప్రబంధేన తస్మిన్ సంకర ముత్తమం॥ 28

అశుభం విపరీతం చ వాస్తు రాష్ట్రనృపస్యచ।
తస్మా త్సర్వప్రయత్నేన వర్గం వర్గేణ సంకరమ్॥ 29

తా॥ కూటకోష్ఠములు చేయుటయందు సంకరము చేయవచ్చును. స్తంభములు చేయుటయందును సంకరము పనికివచ్చును. ఆలయమునకు మాత్రము విరుద్ధముగా చేసినట్లయిన రాజునకును రాష్ట్రమునకును కీడు కలిగించును. కనుక యేవర్గమునకు ఆ వర్గమునే కలిపి చేయవలెను.

మానసారము 14వ అధ్యాయమున చెప్పబడిన అధిష్ఠాన విధానము

శ్లో॥ అధిష్ఠానవిధిం వక్ష్యే శాస్త్రే సంక్షిప్యతేఽధునా
త్రింశ దంగుల మారభ్య షట్ షడంగుల వర్ధనాత్॥ 1

చతు ర్హస్తావసానం స్యా త్కుట్టిమం ద్వాదశోన్నతం।
ఏకాద్ ద్వాదశ భూమ్యంతం హర్మ్యాణాం తు క్రమా న్న్యసేత్॥ 2

విప్రాణాం తు చతుర్హస్తం భూపతీనాం త్రిహస్తకం।
సార్ధ ద్విహస్త ముత్సేధం యువరాజస్య హర్మ్యకే॥ 3

ద్విహస్తం తు విశాం ప్రోక్త మేకహస్తం తు శూద్రకే।
హర్మ్యతుంగ వశాత్ప్రోక్తం తస్య మాసుర కోన్నతమ్॥ 4

తా॥ అధిష్ఠానముయొక్క విధానమును చెప్పుచున్నాడు. 30 అంగుళములు మొదలు అనగా $1\frac{1}{4}$ హస్తము. 6. 6 అంగుళములు వృద్ధిచేయుము అనగా $1\frac{1}{4}$, $1\frac{1}{2}$, $1\frac{3}{4}$, 2, $2\frac{1}{4}$, $2\frac{1}{2}$, $2\frac{3}{4}$, 3, $3\frac{1}{4}$, $3\frac{1}{2}$, $3\frac{3}{4}$, 4. ఇట్లు పదిరెండువిధములుగా ఎత్తు చెప్పబడినది. ఎందుకనగా ఏకతలము ద్వితలము ఇట్లు పదిరెండు అంతస్తులవరకు శాస్త్రము చెప్పబడియున్నది. కనుక ఆయాహార్మ్యముల ననుసరించి చేయవలెను. విప్రులకు 4 రాజులకు 3 యువరాజునకు $2\frac{1}{2}$ వైశ్యులకు 2 శూద్రులకు 1 ఇట్లు జాతి నిర్ణయముతోను హర్మ్యములయొక్క ఉన్నతము ననుసరించియు చెప్పబడియుండెను.

## 26. అధిష్ఠానభేదములు

శిల్పరత్నము 19వ అధ్యాయము

శ్లో॥ అధిష్ఠానం మయః ప్రాహ చతుర్దశ విధం పృథక్।
పరాశరోఽపి ద్వివిధం త్రివిధం చ పరే జగుః॥ 1

మంచకా స్త్వధమా న్యాహుః పాదబంధాభిధాని వై।
మధ్యమా న్యుత్తమాని స్యుః ప్రతిబంధా న్యసంశయః॥ 2

ఉపానం జగతీ కుంభం కంధరం ప్రస్తరం తథా।
పంచవర్గ మితి ఖ్యాత మాద్యంగానాం విశేషతః॥ 3

కుముదేన వినా కార్యం యత్ త న్మంచక ముచ్యతే।
పాదబంధ తలానాం తు వస్వాశ్రం కుముదం భవేత్॥ 4

సర్వేషాం ప్రతిబంధానాం కుముదం వృత్త ముచ్యతే॥

తా॥ మయబ్రహ్మ తనశిల్పశాస్త్రమున అధిష్ఠానమును 14 విధములుగా జెప్పియున్నాడు. పరాశరుడు రెండు విధములుగా మాత్రము చెప్పినాడు. మరికొందరు మూడువిధములుగా చెప్పిరి. అందు మంచకములు అధమములనియు, పాదబంధములు మధ్యమములనియు, ప్రతిబంధము లుత్తమములనియు, నిర్ణయింపబడి యుండెను. ఉపానము, జగతి, కుంభము, కంఠము, ప్రస్తరము ఈ యైదును పంచవర్గ మనుపేరు పొందినవి. ఈ 5 కలపి ఉత్తమములు. కుముదము లేనిది మంచక మనబడును పాదబంధ ప్రదేశములందు కుముదము 8, పలకలు గలిగియుండును. అటులగాక అన్ని ప్రతిబంధముల యందును కుముదము గుండ్రముగానే యుండును.

## 27. ప్రతిబంధము

కాశ్యపశిల్పము 6వ పటలము.

శ్లో॥ అధిష్ఠానస్య చోత్సేధ మేకోనవింశ దంశితే।
ఉపానం చైకభాగేన సప్తాంశే జగతీ భవేత్॥ 30

షడంశం కుముదోత్సేధ మాలింగం త్వేకభాగయా।
త్రిపట్టం త్వేకభాగేన ప్రత్యుత్సేధం ద్విభాగతః॥ 31

వాజనం చైకభాగేన ప్రతిబంధ మిదం జగత్।
ఉపానరహితం శేషం పూర్వవ న్నైకభాగతః॥ 32

తా॥ అధిష్ఠానముయొక్క యెత్తును 19 భాగములుచేసి అందు ఉపానము 1 భా. జగతి 7 భా. కుముదము 6 భా. ఆలింగము 1 భా. త్రిపట్టము 1 భా. ప్రతి 2 భా. వాజనము 1 భా. ఇట్లు చేసిరని అది ప్రతిబంధ మనిపించుకొనును. ఉపానము లేకుండ అనేక విధములుగా చేయుదురు. ఇదే కొలతలో పుష్పపుష్కలమును చెప్పినాడు.

## 28. పుష్పపుష్కలము

కాశ్యపశిల్పము 6 వ పటలము

శ్లో॥ ఏకోనవింశ దంశంతు తలోత్సేధం విభాజితే॥ 46

ఉపాన మేకభాగేన అబ్జోచ్ఛ్ర మనలాంశకం।
కంపోచ్ఛ మర్ధభాగేన జగత్యుచ్ఛ్రం యుగాంశకం॥ 47

అంబుజం త్వర్ధభాగేన దల మర్ధాంశ మానతః।
అర్ధాంశం పద్మతుంగం తు గుణాంశం పట్టమానతః॥ 48

పద్మ మర్ధాంశ మానేన తత్సమం కంప ముచ్యతే।
అధ్యర్ధాంశం తు ఖండోచ్ఛ్రం కంప మర్ధేన కారయేత్॥ 49

పద్మ మర్ధేన కర్తవ్యం పట్టికా సార్ధభాగతః।
అంబుజం చార్ధభాగేన కంప మర్ధేనకారయేత్॥ 50

పుష్పపుష్కల మాఖ్యాతం పాదబంధే తు భేదితమ్॥ 50½

తా॥ అధిష్ఠానముయొక్క యెత్తును 19 భాగములుచేసి అందు పాదుక 1 భా. పద్మము 3 భా. కంపము ½ భా. జగతి 4 భా. పద్మము ½ భా. దళము ½ భా. పద్మము ½ భా. పట్టము 3 భా. పద్మము ½ భా. కంపము ½ భా. ఖండము 1½ భా. కంపము ½ భా. పద్మము ½ భా. పట్టిక 1½ భా. పద్మము ½ భా. కంపము ½ భా. కలది పుష్పపుష్కలము. (పాదబంధము లోనిది).



కాశ్యపశిల్పము ప్రతిబంధము



కాశ్యపశిల్పము పుష్పపుష్కలము

ద్రావిడప్రాసాద పంచపీఠములలో పైకొలతలుగల పీఠమొకటి యున్నది.

## 23. ప్రతిక్రమము

అపరాజితపృచ్ఛ 115వ సూత్రము విశ్వకర్మోవాచ

శ్లో॥ ద్రావిడాంశ్చ ప్రవక్ష్యామి ప్రాసాదాన్ శుభలక్షణాన్।
పీఠాన్ పంచైవ సంప్రోక్తాన్ కథయిష్యామ్యనుక్రమాత్॥ 1

పాదబంధన ఆద్యం స్యాత్ శ్రీబంధాఖ్యో ద్వితీయకః।
తృతీయో వేదిబంధాఖ్యశ్చతుర్థశ్చ ప్రతిక్రమః॥ 2

పంచమః పీఠ ఆఖ్యాతో నామ్నా ఖురకబంధనః।
ఏతైకానుక్రమం వక్ష్యే శృణు చైకాగ్రమానసః॥ 3

ఉత్సేధం భాగవింశత్యా విభజేత్పాదబంధనే।
శ్రీబంధే సప్తవింశత్యా వింశత్యా వేదిబంధనే॥ 4

ప్రతిక్రమే నవదశ వింశత్యా ఖురకే తథా।
తదనుక్రమతః ప్రోక్తం ప్రవక్ష్యే పాదబంధనే॥ 5

తా॥ ద్రావిడ ప్రాసాదములకు పీఠములు 5. అందు పాదబంధము, శ్రీబంధము, వేదిబంధము, ప్రతిక్రమము, ఖురకబంధము, అనుపేర్లు గలిగియున్నవి వానికి వరుసగా 20, 27, 20, 19, 20 భాగములు చేయవలెను.

శ్లో॥ నీడపత్తి పంచభాగా ద్విభాగా పద్మపత్రికా।
ఏకభాగా కర్ణికా చ కుముదం త్రిపదోన్నతం॥ 15

ఛేదోభాగం ద్వయం కంఠః పట్టికా భాగమేవచ।
పద్మపత్రీ భవేద్భాగం రసనా చ ద్విభాగికా॥ 16

ఛేదోభాగః ప్రకర్తవ్యో నామ్నా స స్యాత్ ప్రతిక్రమః।
ఊనవింశతి భాగైశ్చ కర్తవ్యా తు సముచ్ఛ్రితిః॥ 17

తా॥ నీడపత్తి 5 భా. పద్మపత్రము 2 భా. కర్ణిక 1 భా. కుముదము 3 భా. ఛేదము 1 భా. కంఠము 2 భా. పట్టిక 1 భా. పద్మపత్రము 1 భా. రసన 2 భా. ఛేదము 1 భా. ఇట్లు చేసినచో ప్రతిక్రమమగును.

సమరాంగణ సూత్రధార 61వ అధ్యాయము

శ్లో॥ ఇదానీం ద్రావిడాన్ బ్రూమః ప్రాసాదాన్ శుభలక్షణాన్।
ఏకభూమ్యాదయస్తే స్యుర్యావద్ద్వాదశభూమికాః॥ 1

పీఠా న్యపి చ కథ్యంతే తేషాం పంచైవ లక్షణైః।
తలచ్ఛంద శ్చ పంచైవ తేషాం యే శుభలక్షణాః॥ 2

పీఠమాద్యం భవే త్తేషు పాదబంధన ముత్తమం।
శ్రీబంధాఖ్యం ద్వితీయంచ తృతీయం వేదిబంధనం॥ 3

ప్రతిక్రమ మితి ప్రోక్తం చతుర్థం పీఠ ముత్తమం।
పంచమం పీఠ ముద్దిష్టం నామ్నా ఖురకబంధనం॥ 4

ఏతాని పంచపీఠాని ప్రోక్తా నీహ సమాసతః। 4½

తా॥ ద్రావిడప్రాసాదములలో శ్రేష్ఠమైనవి 5 అవి గోపురముల మొదలు ద్వారశిలలవరకు నిర్మాణభేదము లున్నను పీఠము లవియే. 1 పాదబంధము 2 శ్రీబంధము 3 వేదిబంధము 4 ప్రతిక్రమము 5 ఖురకము వీనిని పంచపీఠము లందురు.

## 30. ప్రకారాంతరము

శ్లో॥ భాగే నైకోనవింశత్యా పీఠక స్యోచ్ఛ్రితం భవేత్।
నీడవర్తి శ్చతుర్భాగా ద్విభాగా పద్మపత్రికా॥ 22

కర్ణికాం భాగికీం కుర్యాత్ కుముదం చ త్రిభాగికం।
ఛేద మేకపదం విద్యాత్ తతః కంఠం ద్విభాగికం॥ 23

పట్టికాం భాగికీం కుర్యాత్ భాగికీం వక్రపట్టికాం।
తథా మకరపట్టం తు భాగే నైకేన కల్పయేత్॥ 24

ద్విభాగో రసనాపట్ట శ్ఛేద స్తు భాగికో భవేత్।
ఇతి ప్రతిక్రమం పీఠం ఖురబంధో౽ధునోచ్యతే॥ 25

తా॥ ఎత్తును 19 భాగములుచేసి అందు నీడవర్తి 4 భా. పద్మపత్రిక 2 భా. కర్ణిక 1 భా. కుముదము 3 భా. ఛేదము 1 భా. కంఠము 2 భా. పట్టిక 1 భా. వక్రపట్టిక 1 భా. మకరపట్టము 1 భా. రసనాపట్టము 2 భా. ఛేదము 1 భా. ఇది ప్రతిక్రమము. కాశ్యపశిల్పమున మాత్రము ప్రతిక్రమమునకు 21 భాగములు చెప్పియున్నాడు.



అపరాజిత ప్రతిక్రమము



కాశ్యప ప్రతిక్రమము

## 31. కలశబంధము

### శిల్పరత్నము 19వ అధ్యాయము.

శ్లో॥ తుంగే ప్యేకోనవింశాంశే ద్వాభ్యాం పాదుకమాతుగైః।
జగతేం చ చతుర్భాగైః కుముదం పట్ట మంశతః॥ 90
అంశాభ్యాం కర్ణ మర్ధాంశే నోత్తరం వలభిం భువా।
సార్ధాగ్నిభిః కపోతోచ్చం కుర్యా త్కలశబంధకే॥ 91



శిల్పరత్నము కలశ బంధము.

తా॥ ఎత్తును 19 భాగములుచేసి అందు 2 భా. పాదుక, జగతి 5 భా కుముదము 4 భా. పట్టము 1 భా, కర్ణము 2 ఉత్తరము ½ భా. వాజనము 1 భా. కపోతము 3½ భా. ఇది కలశబంధము. ఇది ప్రతిబంధ జాతి లోనిది.

## 32. పుష్పపుష్కలము తద్భేదములు

### మానసారము 14వ అధ్యాయము

శ్లో॥ నవాధిక దశాంశం తత్ స్యాత్ తథాధికతుంగకే॥ 40
జన్మతుంగం ద్విభాగం తు వేదాంశః ప్రతుంగకం।
అర్ధాంశం పద్మతుంగం తు కంధరం తత్సమం భవేత్॥ 41
తత్సమం చోర్ధ్వపద్మం స్యా దేకాంశం కుముదోదయం।
సార్ధం పద్మం తథా కంపం కర్ణతుంగం ద్వయాంశకం॥ 42
కంప మర్ధం తథా పద్మం పట్టికోచ్చం ద్వయాంశకం।
తదూర్ధ్వే పద్మ మేకాంశం చోర్ధ్వే కంపం తదర్ధకం॥ 43
ఊర్ధ్వే చార్ధం వాజనోచ్చం కంప మూర్ధ్వేఽర్ధమేవ వా।
శేషం ప్రాగుక్తవ త్కుర్యాత్ తత్ర దేత ద్విశేషతః॥ 44

తా॥ ఎత్తును 19 భాగములుచేసి అందు పాదుక 2 భా. వప్రము 4 భా. పద్మము ½ భా. కంఠము ½ భా. ఊర్ధ్వపద్మము ½ భా. కుముదము 1 భా. పద్మము 1½ భా. కంపము 1½ భా, కర్ణము 2 భా. కంపము ½ భా. పద్మము ½ భా. పట్టిక 2 భా. పద్మము 1 భా. కంపము ½ భా. వాజనము ½ భా. కంపము ½ ఇది కుముదజాతిలోని మూడవపద్ధతి దీనిని పుష్పపుష్కల మందురు.

శ్లో॥ ఏకాంశం జన్మతుంగం స్యా దర్ధాంశం పద్మమేవచ।
శేషం తు పూర్వవ త్కుర్యాత్ కించి దేవం విశేషతః॥ 45

పట్టికే తత్కపోతం వా శేషం యుక్త్వా ప్రయోజయేత్।
ఏత చ్చతుర్విధం ప్రోక్తం పుష్పపుష్కల నామకం॥ 46

క్షుద్రేమధ్యేతు ముఖ్యేతు ప్రథమాద్యం ప్రభూషితం।
తేషు హర్మ్యేషు యోగ్యం స్యాత్ కల్పయే చ్ఛిల్పవిత్తమః॥ 47

తా॥ పైజెప్పినదానినే పాదుక ½ భా. పద్మము ½ భా. చేసి మిగిలినవన్నియు మునుపటి వలెనే కొంచెము భేదముతో చేయవచ్చును. పట్టికను కపోతముగా జేసి దానికి దగినరీతిగా మిగిలిన



మానసార పుష్పపుష్కలము. 3



మానసార పుష్పపుష్కలము. 4

పనులన్నియును చేయవలెను. ఇది కుముదజాతిలోని నాల్గవ పద్ధతి. క్షుద్రహర్మ్యములు మధ్య హర్మ్యములు ఉత్తమహర్మ్యములు అను మూడు విధములలో క్షుద్రహర్మ్యములు మొదలగువానికి జాతి పనికివచ్చును కాన శిల్పాచార్యుడు తెలిసికొని చేయవలెను.

## 33. కుక్షిబంధము

మానసారము 14వ అధ్యాయము.

శ్లో॥ తదే వాంశాధికోచ్చం స్యా జ్జన్మతుంగం కలాంశకం॥ 157
తతూర్ధ్వేఽర్ధేన పద్మం స్యా త్కంప మర్ధేన కారయేత్।

ద్వ్యంశం మహాంబుజం చోర్ధ్వే పద్మనిమ్నం శివాంశకం॥ 158
అర్ధేనాబ్జం తదూర్ధ్వే తు సార్ధాంశం కుముదోదయం।

అర్ధేనాబ్జం తథాకర్ణం చార్ధేనాబ్జం తదూర్ధ్వకే॥ 159
సార్ధాంశం పట్టికోత్తుంగం పద్మకం పం శివాంశకం।

అర్ధేన నిమ్నకం చోర్ధ్వేఽంతరితం తత్సమం తథా॥ 160
ఏకాంశేన ప్రతిం చోర్ధ్వే వాజనం చార్ధభాగికం।

ఏకాంశం కంధరం ప్రోక్తం కంప మర్ధేన యోజయేత్॥ 161
పద్మమర్ధేన సార్ధాంశం కపోతం విధువాజనం।

ఏకం తత్ప్రతి కంపం స్యాత్ ద్వివిధం త త్ప్రకీర్తితం॥ 162
శేషంతు పూర్వవ త్కుర్యాత్ సర్వాలంకార సంయుతమ్॥ 162½

తా॥ ఎత్తును 19 భాగములుచేసి పాదుక 2 భా. పద్మము ½ భా. కంపము ½ భా. పద్మము 2 భా. పద్మము ½ భా. నిమ్నము ½ భా. పద్మము ½ భా. కుముదము 1½ భా. పద్మము ½ భా. కర్ణము ½ భా. పద్మము ½ భా. పట్టిక 1½ భా. పద్మము ½ భా. కంపము ½ భా. నిమ్నము ½ భా. అంతరితము ½ భా. [illegible] ½ భా. వాజనము ½ భా. కంఠము 1 భా. కంపము ½ భా. పద్మము ½ భా. కపోతము 1½ భా. ప్రతివాజనము 1 భా. చేయవలెను. ఇది కుక్షిబంధము మానసారోక్తము.


మానసార కుక్షిబంధము.

## 24. పాదబంధము తద్భేదములు

అపరాజితపృచ్ఛ 123వ సూత్రము

శ్లో॥ ఖురకః పంచభాగ స్తు ద్విభాగా పద్మపత్రికా।
త్రిభాగ శ్చ కపోతః స్యా చ్ఛేదో భాగః ప్రకీర్తితః॥ 6

కంఠో ద్విభాగః కర్ణస్య త్రిభాగా పద్మపత్రికా।
త్ర్యంశః కపోతః పట్టిస్తు భాగా స్యా త్పాదబంధనే॥ 7

తా॥ పాదబంధమునకు ఖురము 5 భా. పద్మపత్రిక 2 భా. కపోతము 3 భా. ఛేదము 1 భా. కంఠము 2 భా. పద్మపత్రము 3 భా. కపోతము 3 భా. పట్టిక 1 భా. ఇట్లు 20 భాగములు చేయవలెను.

సమరాంగణ సూత్రధార 61వ అధ్యాయము

శ్లో॥ ఉత్సేధం భాగవింశత్యా విభజేత్ పాదబంధనే॥ 5

ఖురకః పంచభాగం స్యాత్ ద్విభాగా పద్మపత్రికా।
భాగికీ కర్ణికా కార్యా త్రిభాగం కుముదం భవేత్॥ 6

కంఠస్తు భాగేనైకేన కర్ణశ్చ తత్ ద్విభాగికః।
పట్టికా భాగమేకం స్యాత్ భాగికీ పద్మపత్రికా॥ 7

త్రిభాగికం కపోతం చ కుర్యా న్నాసికయా సహ।
భాగమేకం భవే చ్ఛేదః పాదబంధాఖ్య పీఠకే॥ 8

తా॥ ఖురము 5 భా. పద్మపత్రిక 2 భా. కర్ణిక 1 భా. కుముదము 3 భా. కంఠము 1 భా. కర్ణము 2 భా. పట్టిక 1 భా. పద్మపత్రిక 1 భా. కపోతము 3 భా. నాసికతోసహా చేయవలెను. ఛేదము 1 భా. ఇది పాదబంధము.

శ్లో॥ పద్మపత్ర్యాః ప్రవేశః స్యాత్ ఖురకా దంగులద్వయం।
గ్రాసః షడంగుల స్తస్యాః కుముదం సప్తనిర్గమం॥ 9

ప్రవేశమానం తావత్ స్యాత్ యావ ద్ది చ్ఛేదపట్టికా।
షడంగులం ప్రవేశం చ ఛేదపట్టస్య కారయేత్॥ 10

సమ స్తత్ర విధాతవ్యం ఛేదస్య కర్ణికస్య చ।
నిర్గమేణ పున స్తస్మాత్ ద్వ్యంగులా కంఠపట్టికా॥ 11

అంగులత్రితయం తస్యాః పద్మపత్రే వినిర్గమః।
నిర్గమశ్చ కపోతస్య కారయే దంగులత్రయం॥ 12

పట్టికానాం సమసూత్రంస్యా చ్ఛేదానాం చ సంస్థితిః।
పాదబంధోఽయ మాఖ్యాత శ్రీబంధః కథ్యతేఽ ధునా॥ 13

తా॥ పద్మపత్రముయొక్క ప్రవేశము ఖురమునుండి లోపలికి 2 అంగుళములు, మొత్తము దానియొక్క కొలతపైన 6 అంగుళములు, కుముదముయొక్క నిర్గమము 7 అంగుళములు, దానియొక్క ప్రవేశమును అంతే చేయవలెను. ఛేద పట్టిక 6 అంగుళములు ప్రవేశమును చేయవలెను. అది సమముగా నుండ వలెనుగాని యెటువాలుగా నుండ గూడదు. ఛేదమునకును కర్ణికకును దాని ఉన్నతము యెంతో అంతచేయవలెను. కంఠపట్టిక నిర్గమము 2 అంగుళము లుండ వలెను పద్మపత్ర నిర్గమము 3 అంగుళము లుండవలెను. కపోతమునకును 3 అంగుళముల నిర్గమము చేయవలెను. పట్టికలన్నియును సమసూత్రముతో నుండవలెను. ఛేదమునకును సమసూత్రము తోనే యుండవలెను.


అపరాజిత పాదబంధము.


సమరాంగణ పాదబంధము.

## 35. వెదీబంధము - తద్భేదములు

కాశ్యపశిల్పము 6వ పటలము

శ్లో॥ తదే వాలింగకాదూర్ధ్వం విభజ్యం వింశ దంశకై॥ 60
కల్ప్యం శ్రీకాంతబంధం తు పాదబంధే విభేదితమ్॥ 60½

తా॥ ఎత్తును 20 భాగములుచేసి భాగభేదములతో జేసినట్లయిన శ్రీకాంతబంధ మగును. ఇది పాదబంధజాతిలోనిదని చెప్పియున్నాడు. ఇందు వివరము కనుపడనందున ఆకారము వ్రాయలేదు.

అపరాజిత పృచ్ఛ 173వ సూత్రము విశ్వకర్మోవాచ

శ్లో॥ పీడవర్తీ చతుర్భాగా ద్విభాగా పద్మపత్రికా।
కర్ణికా భాగ మేకంతు త్రిభాగా కుముదోన్నతిః॥ 12

ఛేదో మేషశ్చ మకరో నక్రవట్టీ చ ఛేదకః।
కంఠశ్చ పద్మపత్రేచ భాగి భాగః సమున్నతః॥ 13

వేదీ ద్విభాగా కర్తవ్యా భాగస్స్యా చ్ఛేదకోన్నతిః।
వేదీబంధన ఉక్తశ్చ పంచత్రింశత్కైః సముచ్ఛ్రితః॥ 14

తా॥ నీడవర్తి 4 భా. పద్మపత్రిక . భా. కర్ణిక 1 భా. కుముదము 3 భా. ఛేదము, మేషము, మకరము, నక్రపట్టిక, ఛేదము, కంఠము, పద్మపత్రము ఇవి 7 ను ఒక్కొక్క భాగము, వేది 2 భా. ఛేదము 1 భా. చేయవలెను. ఇది వేదీబంధము.

సమరాంగణ సూత్రదార 61వ అధ్యాయము

శ్లో॥ విభజే ద్భాగపంచాశ్యా పీఠోచ్ఛ్రాయం విచక్షణః।
నీడవర్తి శ్చతుర్భాగ ద్విభాగా పద్మపత్రికా॥ 20

కర్ణికాం పదికాం విద్యాత్ కుముదం త్రిపదం తథా।
కుర్వీత పదికం ఛేదం తద్మ న్మేషం పదం బుధః॥ 21

భాగే నైకేన మకరం తథా మకరపట్టికాం।
ఛేదం పదం తథాకంఠం భాగికా పద్మపత్రికా॥ 22

భాగద్వయేన వేదిస్స్యాత్ ఛేదం భాగేన కల్పయేత్॥ 22½



అపరాజిత వేదీబంధము.



సమరాంగణ వేదీబంధము

తా॥ ఉన్నతమును 20 భాగములు చేసి నీడవర్తి 4 భా. పద్మపత్రిక 2 భా. కర్ణిక 1 భా. కుముదము 3 భా. ఛేదము 1 భా. మేషము 1 భా. మకరము 1 భా. మకరపట్టిక 1 భా. ఛేదము 1 భా. కంఠము 1 భా. పద్మపత్రిక 1 భా. వేది 2 భా. ఛేదము ! భాగము. చేయవలెను. ఇది వేదీబంధము.

## 36. ఖురబంధము

అపరాజితపృచ్ఛ 173వ సూత్రము

శ్లో॥ నీడవర్తీ చతుర్భాగా ద్విభాగా పద్మపత్రికా।
కర్ణికా చైకభాగేన ద్విభాగా కుముదోన్నతిః॥ 18

మేషో నక్రశ్చ మకరీ పట్టీ ఛేదశ్చ భాగతః।
కంఠం పట్టీ భాగభాగం భాగా స్స్యా త్పద్మపత్రికా॥ 19

కపోత స్తు త్రిభాగైః స్యాచ్ఛేదో వై భాగ ఏవచ।
అవృతః పంచమః పీఠో నామ్నా ఖురకబంధనమ్॥ 20

ఇతి సూత్రసంతాన గుణకీర్తి ప్రోక్త శ్రీభువనదేవాచార్యోక్త అపరాజిత పృచ్ఛాయాం ద్రావిడప్రాసాద పంచపీఠ లక్షణాధికారో నామ త్రిసప్తత్యుత్తర శతతమం సూత్రమ్.

తా॥ నీడవర్తి 4 భా. పద్మపత్రిక 2 భా. కర్ణిక 1 భా. కుముదము 2 భా. మేషము, నక్రము, మకరపట్టి, ఛేదము, కంఠము, పట్టి, పద్మపత్రిక. ఇవి ఒక్కొక్క భాగమును కపోతము 3 భా. ఛేదము 1 భా. మొత్తము 20 భాగములు. చేసినచో ఖురబంధనాగును.

సమరాంగణ సూత్రధార 61వ అధ్యాయము

శ్లో॥ విభజే ద్భాగవింశత్యా పీఠోచ్ఛ్రాయం విచక్షణః॥ 25

నీడవర్తి శ్చతుర్భాగా ద్విభాగా పద్మపత్రికా।
కర్ణికా భాగమేకం స్యాత్ ద్విభాగం కుముదం పదః॥ 26

భాగం మేషం తథా క్షేపో మకరో భాగిక స్తథా।
భాగమేకం విధాతవ్యా తతో మకరపట్టికా॥ 27

ఛేదో నక్రసమం కుర్యాత్ కంఠ మేకం పదం తతః।
పట్టికాం భాగికీం విద్యాత్ భాగికీ పద్మపత్రికా॥ 28

కపోతం త్రిపదం కుర్యాత్ తతో నాసికయా సహ।
ఛేద శ్చ భాగికః కార్యః ఖురబంధోఽయ మీరితః॥ 29

పీఠపంచక మి త్యుక్తం సూత్రితం పూర్వమేవ యత్।
పీఠా దూర్ధ్వంతు విజ్ఞేయా ప్రాజ్ఞైః ఖురవరండికా॥ 30

సంతి చాన్యాని పీఠాని లక్ష్మభేదా న్యనేకధా।
తేషాం మధ్యే ప్రకృష్టత్వా దేత త్పంచక మీరితమ్॥ 31



తా॥ ఎత్తును 20 భాగములుచేసి నీడవర్తి 4 భా. పద్మపత్రిక 2 భా. కర్ణిక 1 భా. కుముదము 2 భా. మేషము 1 భా. మకరము 1 భా. మకరపట్టము 1 భా. ఛేదము 1 భా. కంఠము 1 భా. పట్టిక 1 భా. పద్మపత్రిక 1 భా కపోతము 3 భా. ఛేదము 1 భా. చేయవలెను, ఇది ఖురబంధము. ద్రావిడపీఠములలో నీవైదు ముఖ్యమైనవి. కనుక పంచపీఠములను పేరు పొందినవి.

## 37. ఉరగబంధము

### మానసారము 14వ అధ్యాయము

శ్లో॥ అథ వా వస్వంశ మాధిక్యం తుంగం కృత్వా విశేషతః।
వాజనం చైకభాగం స్యాత్ తస్యోర్ధ్వం కంధరం ద్వయం॥ 14

తస్యోర్ధ్వే వాజనం చాంశం శేషం ప్రాగుక్తవ న్నయేత్॥ 14½

తా॥ అధిష్ఠానము యెత్తును 20 భాగములుచేసి వప్రము 7 భా. కుముదము 6 భా. వాజనము 1 భా. కంఠము 2 భా. వాజనము 1 భా. పట్టము 1½ భా. పట్టిక ½ భా. కంపము 1 భా. చేయవలెను, ఇది ఉరగబంధమున రెండవపద్ధతి.

## 38. కుంభబంధము

శ్లో॥ జన్మోచ్చం స్యాత్ త్రిభాగం చ స్వపద్మ మేకేన కారయేత్।
కంధరం చైకభాగం స్యా దూర్ధ్వే పద్మం శివాంశకం॥ 94

కుంభతుంగం శరాంశం స్యా త్పద్మ మేకేన కారయేత్।
తదూర్ధ్వే కంప మేకేన కర్ణ మంశం తదూర్ధ్వకే॥ 95

పద్మ మేకం తదూర్ధ్వే తు కపోతోచ్చం కలాంశకం।
ఆలింగ మంశకం చైవ మేకం చాంతరితం తథా॥ 96

ప్రతివాజన మేకేన కుంభబంధం చతుర్విధం।
గ్రాహసింహాదిపత్రైర్వా స్తు యుక్త్యా దేశ మలంకృతమ్॥ 97

తా॥ అధిష్ఠానోన్నతమును 20 భాగములుచేసి అందు పాదుక 3 భా. పద్మము 1 భా. కంఠము 1 భా. పద్మము 1 భా. కుంభము 5 భా. పద్మము 1 భా. కంపము 1 భా. కర్ణము 1 భా. పద్మము 1 భా. కపోతము 2 భా. ఆలింగము 1 భా. అంతరితము 1 భా. ప్రతివాజనము 1 భా. చేయవలెను. ఇది కుంభబంధమున నాల్గవపద్ధతి.

## 39. పట్టబంధము

శ్లో॥ జన్మాది వాజనాంతస్య తుంగే వింశాంశకం భవేత్।
జన్మతుంగం ద్విభాగం స్యా త్తదూర్ధ్వేఽర్ధేన వాజనం॥ 149

మహాబ్జం సార్ధయుగ్మం స్యా త్పద్మ కంపం శివాంశకం।
నిమ్నకంపం త థైకాంశం తదూర్ధ్వైకేన పద్మకం॥ 150

మహాపట్టం ద్విభాగం స్యాత్ పద్మకంపం శివాంశకం।
కంధరం చైకభాగం స్యాత్ క్షేపణాబ్జం శరాంశకం॥ 151

కపోతోచ్చం ద్విభాగం స్యా చ్ఛేషం త త్ప్రతివాజనం।
ఏతత్తు పట్టబంధం స్యా త్సర్వాలంకార సంయుతమ్॥ 152

తా॥ అధిష్ఠానము యెత్తును 20 భాగములుచేసి పాదుక 2 భా. వాజనము ¾ భా. మహాపద్మము ¼ భా. పద్మము ¼ భా. కంపము ¾ భా. నిమ్నము ½ భా. కంపము ½ భా. పద్మము 1 భా. మహాపట్టము 2 భా. పద్మము ½ భా. కంపము ½ భా. గలము 1 భా. క్షేపణము 1 భా. పద్మము 4 భా. కపోతము 2 భా. ప్రతివాజనము 2 భా. ఇట్లు చేసినేని పట్టబంధమగును.


మానసార ఉరగబంధము


మానసార కుంభబంధము


మానసార పట్టబంధము

## 40. వప్రబంధము

శిల్పరత్నము 19వ అధ్యాయము.

శ్లో॥ ద్వ్యైకైకాంశైః శరాంశై ర్యుగ శశధర దృక్ చంద్ర భూమ్యాశ్వినీభి।
ర్భాగే నోపాన కాబ్జం తదుపరి చ తథా కంప వప్రే చ కుంభే॥

పద్మం పట్టం చ కర్ణం తదుపరి చ గతం కంప మబ్జం చ పట్టి।
పట్టం త ద్వప్రబంధం త్వివసహితకృతినా భాజితే పాదబంధే॥ 48

తా॥ ఎత్తును 20 భాగములుచేసి అందు పాదుక 2 భా. పద్మము 1 భా. కంపము 1 భా. వప్రము [illegible] భా. కుంభము [illegible] భా. పద్మము 1 భా. పట్టము 2 భా, కర్ణము 1 భా. కంపము ½ భా. పద్మము ½ భా. పట్టి 1 భా. పట్టము 1 భా. ఇట్లు చేసినేని వప్రబంధమగును.


శిల్పరత్న వప్రబంధము.

## 41. ప్రతిముఖము

కాశ్యపశిల్పము 6వ పటలము.

శ్లో॥ త్రిసప్తాంశే తలోత్సేధే కృతాంశే నైకపాదుకా॥ 36

అంబుజం సార్ధభాగేన కంప మర్ధాంశ ముచ్యతే।
సప్తాంశంజగతీతుంగం రసాంశం కుముదోదయం॥ 37

ఆలింగ మేకభాగేన త్రిపట్టం త్వేకభాగయా।
ద్విభాగం ప్రతితుంగం స్యాత్ భాగ మేకేన వాజనం॥ 38
ప్రతివక్త్రి మిదం నామ ప్రతిబంధే తు భేదితమ్॥ 38½

తా॥ అధిష్ఠానముయొక్క యెత్తును 21 భాగముచేసి పాదుక 1 భా. పద్మము 1½ భా. కంపము ½ భా. జగ 7 భా. కుముదము 6 భా. ఆలింగము 1 భా. త్రిపట్టము 1 భా. ప్రతి 2 భా. వాజనము 1 భా. చేయవలెను. ఇది ప్రతిముఖము

## 42. ప్రతిక్రమము తద్భేదములు

శ్లో॥ తదేవ పక్షభాగేన ఉపానం పరికీర్తితం॥ 39
ఆలింగం చ ద్విభాగేన శేషం పూర్వవ దేవ హి।
ఉపానోపరి పద్మంచ కంపం చైకం పరిత్యజేత్॥ 40
తచ్చ ప్రతిక్రమం ఖ్యాతం సర్వదేవాలయే హితమ్॥ 40½

తా॥ పైదానినే ఉపానము 2 భా. ఆలింగము 2 భా. జగతి 7 భా. కుముదము 6 భా. ఆలింగము 1 భా. పట్టము ½ భా. ప్రతి 2 భా. వాజనము ½ భా. ఇట్లు చేసినేని ప్రతిక్రమమగును. ఉపానము పైన పద్మము కంపము చేయుగూడదు.

మానసారము 14వ అధ్యాయము.

శ్లో॥ ఏకవింశాంశకం తుంగే క్షుద్రోపానం శివాంశకం॥ 22
సార్ధ ద్వ్యంశం తు పద్మం స్యాదూర్ధ్వే సార్ధంతు కంపకం।
తదూర్ధ్వే వప్రంతు సప్తాంశం ధారాకుంభం రసాంశకం॥ 23
ఆలింగ మంశకం చైవాం తరితం తత్సమం తథా।
ఏకేన పద్మకంపం వా పట్టం వాఽథ ద్వయాంశకం॥ 24
గజై రశ్వైశ్చ సింహైశ్చ భూషితం మకరాదిభిః॥ 24½

తా॥ ఎత్తును 21 భాగముచేసి క్షుద్రోపానము 1 భా. పద్మము 2½ భా. కంపము 1½ భా. వప్రము 7 భా. ధారాకుంభము 6 భా. ఆలింగము 1 భా. అంతరితము 1 భా. పద్మము ½ భా. కంపము ½ భా. చేసిగాని లేక అంతరితమును పద్మమును కంపమును తీసివేసి 2 భాగములు పట్టమును చేసి యేనుగులు గుఱ్ఱములు సింహములు మకర వక్త్రములు మొదలగువానిచేత నలంకరింపవలెను. ఇది ప్రతిక్రమమున మొదటి పద్ధతి.



కాశ్యప ప్రతిముఖము



కాశ్యప ప్రతిక్రమము



మానసార ప్రతిక్రమము.

## 43. శ్రీకాంతము

### శిల్పరత్నము 15వ అధ్యాయము

శ్లో॥ త్రిసప్తాంశే తలోత్సేధే పాదుకం భూతభాగతః।
షట్పంచాంశౌ క్రమాత్కార్యౌ వప్రకుంభౌ తథాంశతః॥ 33

కంపం గుణాంశకం కర్ణ మూర్ధ్వకంపం తథాంశకం।
పద్మ మంశే నాగ్నిభాగైః కపోతం పాదబంధకం॥ 34

శ్రీకాంత మితి విఖ్యాతం సర్వజాత్యర్హకం భవేత్॥ 34½

తా॥ ఎత్తును 21 భాగములుచేసి పాదుక 1 భా. వప్రము 6 భా. కుంభము 5 భా. కంపము 1 భా. కర్ణము 3 భా. కంపము 1 భా. పద్మము 1 భా. కపోతము 3 భా. చేయవలెను. ఇది శ్రీకాంతమను పేరుగల పాదబంధ జాతి సమస్తమైనవారికిని పనికివచ్చును.

## 44. కుంభబంధము తద్భేదములు

### మానసారము 14 వ అధ్యాయము

శ్లో॥ ఏకవింశాంశ కోత్సేధం జన్మతుంగం కలాంశకం॥ 85

ఏకాంశం పద్మతుంగంతు కంప మేకేన కారయేత్।
భూతాంశం కుంభతుంగం స్యా దేకాంశం క్షేపణం భవేత్॥ 86

త్రయాంశం స్యా దధోపద్మ మూర్ధ్వే కర్ణం తథాంశకం।
తత్సమం కంప మూర్ధ్వేతు ద్విభాగం పట్టికోదయం॥ 87

తదూర్ధ్వే కంప మేకాంశం కంధరం చైకభాగికం।
తదూర్ధ్వే ద్వ్యంశకం పట్టం యుక్త్యా తత్రైవ యోజయేత్॥ 88



శిల్పరత్నము శ్రీకాంతము



మానసార కుంభ బంధము

తా॥ ఎత్తును 21 భాగములు చేసి పాదుక 2 భా. పద్మము 1 భా. కంపము 1 భా. కుంభము 5 భా. కంపము 1 భా. అధో పద్మము 3 భా. కర్ణము 1 భా. కంపము 1 భా. పట్టిక 2 భా. కంపము 1 భా. కంఠము 1 భా. పట్టము 2 భా. చేయవలెను. ఇది కుంభబంధములలో మొదటిది.

మానసారము 14వ అధ్యాయము

శ్లో॥ తదేవ తుంగభాగేన వహ్నిం సోపాన మీరితం।
ఏకాంశం పద్మతుంగం స్యాత్ పంచాంశం కుముదోదయం॥ 89

కంప మేకం తదూర్ధ్వే స్యా ద్ఫంధ్వంశం పద్మతుంగకం।
తదూర్ధ్వే కంప మేకేన తదూర్ధ్వే ద్వ్యంశకం గలం॥ 90

క్షేపణం చైకభాగం స్యా త్పద్మ మేకేన కారయేత్।
కపోతోచ్చం ద్విభాగం స్యా త్కంప మేకం తదూర్ధ్వకే॥ 91

తా॥ ఎత్తును 22 భాగములుచేసి సోపానము 3 భా. పద్మము 1 భా. కుముదము 5 భా. కంపము 1 భా. పద్మము 1 భా. కంపము 1 భా. గలము 2 భా. కంపము 1 భా. పద్మము 1 భా. కపోతము 2 భా. కంపము 1 భా. చేయవలెను. ఇది కుంభబంధమున రెండవ పద్ధతి.

శ్లో॥ తదే వాబ్జప్రదేశే తు కంప మేకేన పూర్వవత్।
తదూర్ధ్వే ద్వ్యంశం కర్ణం స్యా త్కంప మేకం తదూర్ధ్వకే॥ 92

ద్వ్యంశం చాంతరితం చోర్ధ్వే ప్రతిం చైకాంశ మేవచ।
తదూర్ధ్వే వాజనం చాంశం శేషం ప్రాగుక్తవ న్నయేత్॥ 93

తా॥ పైజెప్పిన దానినే మహాపద్మమునకు పైన కంపము 1 భా. కర్ణము 2 భా. కంపము 1 భా. అంతరితము 2 భా. ప్రతి 1 భా. వాజనము 1 భా. ఇట్లు చేయుట మూడవ పద్ధతి.

## 45. ఉరగబంధము

మానసారము 14వ అధ్యాయము

శ్లో॥ తదేవ ద్వ్యంశ మాధిక్యం కుంభస్యోర్ధ్వే విశేషతః॥ 15

కంప మేకం తథా కర్ణం కంపం తస్యోర్ధ్వ మంశకం।
ద్వ్యంశం గోపానకం చోర్ధ్వే శేషం తత్ప్రతివాజనమ్॥ 16

తా॥ ఎత్తును 22 భాగములు చేసి కుంభముపైన కంపము 1 భా. కర్ణము 1 భా. కంపము 1 భా. గోపానము 2 భా. ప్రతివాజనము 4 భా. చేయవలెను. లేదా గోపానముపైన 4 భాగములు మునుపటివలెనే చేయవచ్చును. ఇది ఉరగబంధమున మూడవపద్ధతి.


మానసార కుంభబంధము 2


మానసార కుంభబంధము 3


మానసార ఉరగబంధము 3

## 46. పాదబంధము

శిల్పరత్నము 18వ అధ్యాయము.

శ్లో॥ అష్ట సప్త శశి యుగ్మ భాగకైః చంద్ర యుగ్మ శశి భాగకైః క్రమాత్।
వప్రకం కుముద కంప కంధరాః కంప వాజన మథోర్ధ్వకంపకం॥ 46

పాదబంధ ముదితం తదుచ్ఛ్రయే ఉద్రయుగ్మక విభాజితే తలే॥ 46½

తా॥ ఎత్తును 22 భాగములుచేసి వప్రము 8 భా. కుముదము 7 భా. కంపము 1భా. కంఠము 2 భా. కంపము 1 భా. వాజనము 2 భా. ఊర్ధ్వకంపము 1 భా. చేసిన పాదబంధమగును

## 47. శ్రీబంధము

శ్లో॥ ద్వావింశ ద్భాజి తోత్సేధే పాదభ్యాం పాదుకం శరైః।
జగతీ కుముదం వేదైః పట్ట మంశేన కారయేత్॥ 87

ఏకేన కర్ణ మంశాభ్యాం సవల భ్యుత్తరం త్రిభిః।
కపోతం చతు రంశేన శ్రీబంధే ప్రస్తరోచ్ఛ్రయమ్॥ 88

తా॥ ఎత్తును 22 భాగములుచేసి పాదుక 2 భా. జగతి 5 భా. కుముదము 4 భా. పట్టము 1 భా. కర్ణము 1 భా. వలభి 2 భా. ఉత్తరము 3 భా. కపోతము 4 భా. చేయనలయును. ఇది శ్రీబంధప్రస్తరము ప్రతిబంధజాతిలోనిది.

## 48. పద్మబంధము

మానసారము 14 వ అధ్యాయము

శ్లో॥ ద్వావింశ దంశకం కృత్వా షడంశం జన్మతుంగకం।
క్షుద్రక్షేపణ మర్ధాంశం సార్ధవేదాంశ మంబుజం॥ 75

ఏకాంశం కంధరం చోర్ధ్వే తత్సమం చాబ్జకం భవేత్।
కుంభతుంగం గుణాంశం చ పద్మతుంగం శివాంశకం॥ 76

కంప మేకం తదూర్ధ్వే తు కంధరం చాక్షభాగికం।
క్షేపణం చైకభాగం తు పద్మం చైకేన కారయేత్॥ 77

ద్విభాగం పట్టికం పద్మ మంశమంశం తు వాజనమ్॥ 77

తా॥ అధిష్ఠానోన్నతమును 22 భాగములుచేసి, పాదుక 2 భా. కంపము ½ భా.
పద్మము 4½ భా. కంఠము ½ భా.
పద్మము 1 భా. కుంభము 3 భా.
పద్మము 1 భా. కంపము ½ భా.
కంఠము 2 భా. కంపము 1 భా.
పద్మము 1 భా. పట్టిక 2 భా.
పద్మము 1 భా. వాజనము 1 భా.
ఇది పద్మబంధము రెండవ పద్ధతి.







## 49. ప్రతిక్రమము

మానసారము 14వ అధ్యాయము

శ్లో॥ ద్వావింశ దంశకే కుంభం కుముదం చ విశేషతః॥ 25
ఆలింగ మంశకం చోర్ధ్వే చైకాంశం వాజనం భవేత్।
ద్విభాగం కంధరం పట్టం చైకం వాజన మంశకం॥ 26
తద్దేశే పూర్వవ ద్రూపైః సర్వాలంకార సంయుతం।
శేషం తు పూర్వవ త్కుర్యాత్॥ 23¾

తా॥ ఎత్తును 22 భాగములుచేసి క్షుద్రపాదుక ½ భా. పద్మము 2½ భా. కంపము 1½ భా జగతి 6 భా. కుంభము 6 భా. లేక కుముదముగాని చేసి, ఆపైన ఆలింగము 1 భా. వాజనము 1 భా. కంఠము 2 భా. పట్టిక 1 భా. వాజనము 1 భా. ఇది ప్రతిక్రమములోని రెండవ పద్ధతి.

## 50. కలశబంధము

కాశ్యపశిల్పము 6వ పటలము.

శ్లో॥ అధిష్ఠానస్య చోత్సేధం ద్వావింశతి విభాజితే॥ 82
పాదుకం చైకభాగేన భాగే నాబ్జంతు కంపకం।
కంప మేకేన కర్తవ్యం కంఠమానం ద్విభాగయా॥ 83
కంప మేకేన భాగేన పట్టి కాంశేన కల్పకం।
ద్విభాగం దలమానంతు గల మేకాంశ మానతః॥ 84
అంబుజం త్వేకభాగేన కుంభమానం శరాంశకం।
ఏకాంశం దలమానం స్యా దంశే నాలింగ ముచ్యతే॥ 85

త్రిపట్టం త్వేకభాగేన ప్రతిమానం ద్విభాగయా।
వాజనం త్వేకభాగేన కుర్యా త్సర్వ మలంకృతం॥ 86

ఏత చ్ఛ ప్రతిబంధం స్యాత్ భేదం కలశబంధనమ్॥ 88½

తా॥ అధిష్ఠానము యెత్తును 21 భాగములుచేసి, పాదుక 1 భా. పద్మము 1 భా. కంపము 1 భా. కంఠము 2 భా. కంపము 1 భా. పట్టిక 1 భా. పద్మము 2 భా. గలము 1 భా. పద్మము 1 భా. కుంభము 5 భా. పద్మము 1 భా. ఆలింగము 1 భా. త్రిపట్టము 1 భా. ప్రతిముఖము 2 భా. వాజనము 1 భా. చేయవలెను. ఇది ప్రతిబంధజాతిలోని కలశబంధము.



మానసార ప్రతిక్రమము.



కాశ్యప శిల్ప కలశబంధము

## 51. వప్రబంధము - తద్భేదములు

కాశ్యపశిల్పము 6వ పటలము

శ్లో॥ తలం ద్వావింశ దంశే తు ద్విభాగం పాదుకోన్నతం।
అబ్జ మేకేన కంపం తు ఏకాంశేన ప్రకల్పయేత్॥ 69

జగతీ పంచభాగేతు కుముదం చతురంశకం।
పద్మ మేకేన కర్తవ్యం కంప మేకేన కారయేత్॥ 70

కంఠతుంగం ద్విభాగేన కంప మేకేన కారయేత్।
శివాంశం దలతుంగం తు మహాపట్టీ ద్విభాగతః॥ 71

కంప మేకేన కర్తవ్యం వప్రబంధ మితిస్మృతం।
పాదబంధస్య వర్గం స్యాత్ సర్వధామసు పూజయేత్॥ 72

తా॥ ఎత్తును 22 భాగములుచేసి పాదుక 2 భా. పద్మము 1 భా. కంపము 1 భా. జగతి 5 భా. కుముదము 4 భా. పద్మము 1 భా. కంపము 1 భా. కంఠము 2 భా. కంపము 1 భా. దలము 1 భా. మహాపట్టి 2 భా. కంపము 1 భా. చేసినేని వప్రబంధమగును. ఇది పాదబంధ జాతిలోనిది.

మానసారము 14వ అధ్యాయము

శ్లో॥ వప్రబంధ మధిష్ఠానం ద్వాత్రింశ ద్భాగ తుంగకే॥ 120

జన్మ తు ద్వ్యంశకం తుంగే కంప మర్ధేన కారయేత్।
పద్మం సార్ధం శివాంశం స్యాత్తదూర్ధ్వేఽర్ధేన వాజనం॥ 121

వప్రోచ్చం సార్ధవహ్న్యంశం పద్మ మర్ధం చ కంపకం।
కంధరోచ్చం ద్విభాగం స్యా త్కంప మర్ధం తథాఽబ్జకం॥ 122

పట్టికోచ్చం కలాంశం స్యా త్పద్మమర్ధం తు వాజనం।
యుగాంశం కర్ణతుంగం స్యా త్కంప మంశం తథాఽంబుజం॥ 123

కపోతోచ్చం ద్విభాగం స్యా దేకాంశం ప్రతివాజనం।
వప్రబంధ మితి ప్రోక్తమ్॥ 123

తా॥ ఎత్తును 22 భాగములుచేసి పాదుక 2 భా. కంపము ½ భా. పద్మము 1½భా. వాజనము ½ భా. వప్రము 3½ భా. పద్మము ½ భా. కంపము ½ భా. కంఠము 2 భా. కంపము ½ భా. పద్మము ½ భా. పట్టిక 2 భా. పద్మము ½ భా. వాజనము ½ భా. కర్ణము 2భా. కంపము భా. పద్మము 1 భా. కపోతము 2 భా. ప్రతివాజనము 1 భా. చేసిన వప్రబంధ మగును.





మానసార వప్రబంధము.

## 12. వజ్రబంధము

మానసారము 14వ అధ్యాయము

శ్లో॥ వప్రబంధ మితిప్రోక్తం వజ్రబంధ మిహోచ్యతే॥ 124

తదేవ తుంగభాగేన జన్మతుంగం కలాంశకం।
తదూర్ధ్వేఽర్ధేన కంపం స్యాత్ సార్ధాంశం పద్మతుంగకం॥ 125

అర్ధేన కంపకం చోర్ధ్వే కంధరం తత్సమం భవేత్।
కంప మర్ధేన తస్యోర్ధ్వే పద్మ మరేన కారయేత్॥ 123

వజ్రకుంభం ద్వయాంశం స్యా త్తదూర్ధ్వేఽర్ధం సరోరుహం।
కంప మరేన తస్యోర్ధ్వే కర్ణతుంగం కలాంశకం॥ 127

తదూర్ధ్వం కంప మర్ధేన తత్సమం చాంబుజం భవేత్।
కపోతం తద్ ద్విభాగం స్యా దేకాంశం ప్రతివాజనం॥ 128

కంధరం చాశ్వినీ భాగం కంప మేకం తథాఽంబుజం।
వజ్రపట్టం ద్విభాగం స్యా త్పద్మం కంపం శివాంశకం॥ 129

వజ్రబంధ మితిప్రోక్తమ్॥ 129½



మానసార వజ్రబంధము

తా॥ పైన చెప్పినదానినే మార్పుచేసి చెప్పుచున్నాడు. పాదుక 2 భా. కంపము ½ భా. పద్మము 1½ భా. కంపము ½ భా. కంఠము ½ భా. కంపము ½ భా. పద్మము ½ భా. వజ్రకుంభము 1 భా. పద్మము ½ భా. కంపము ½ భా. కర్ణము 2 భా. కంపము ½ భా. పద్మము ½ భా. కపోతము 2 భా. ప్రతి వాజనము 1 భా. కంఠము ½ భా. కంపము 1 భా. పద్మము 1 భా. వజ్రపట్టము 3 భా. పద్మము ½ భా. కంపము ½ భా. ఈ ప్రకారముగా చేసిన చో వజ్రబంధ మగును.

## 53. ప్రతిక్రమము

### మానసారము 14వ అధ్యాయము

శ్లో॥ త దేకాంశాధికం తథా॥ 27

కుంభాంతం పూర్వవ చ్చోర్ధ్వే కంప మేకేన కారయేత్।
కంధరం చైకభాగం స్యాత్ తదూర్ధ్వే కంప మంశకం॥ 28

అంశేన కర్ణ మూర్ధ్వంతు వాజనం చైకభాగికం।
పూర్వవత్ సమలంకృత్య॥ 28½

తా॥ పైన జెప్పినదానినే ఒక భాగముకలిపి మొత్తము 23 భాగములుచేసి క్షుద్రపాదుక 1 భా. పద్మము 2½ భా. కంపము 1½ భా, జగతి 7 భా. కుంభము 6 భా. కంపము 1 భా. కంఠము 1 భా. కంపము 1 భా. కర్ణము 1 భా. వాజనము 1 భా. ఇట్లుచేసి మునుపటి వలెనే అన్ని అలంకారములు చేయవలెను. ఇది మూడవ పద్ధతి ప్రతిక్రమము.

## 54. శ్రీకాంతము

### కాశ్యపశిల్పము 6వ పటలము

శ్లో॥ అధిష్ఠానస్య చోత్సేధం త్రయోవింశతి భాజితే।
ఉపాన మేకభాగేన పద్మ మేకేన కంపకం॥ 75

జగతిం షష్ఠేన కుర్యాత్ కంప మేకేన కల్పయేత్।
పద్మ మేకేన కంఠాంత మేకాంశేనైవ కల్పయేత్॥ 76

ఏకాంశే నాంబుజం కుర్యాత్ గుణాంశం కుముదోదయం,
పద్మ మేకేన కర్తవ్య మాలింగం త్వేకభాగతః॥ 77

త్రిపట్టం శివభాగం తు ద్విభాగం ప్రతిమానకం।
వాజనం తు ద్విభాగేన కల్పయే త్తు యథాక్రమం॥ 78

ప్రతిబంధే తు భేదం స్యాత్ శ్రీకాంతం త ముదాహృతమ్॥ 78½

తా॥ అధిష్ఠానము యెత్తు 23 భాగములుచేసి పాదుక [illegible] భా. పద్మము 1 భా. కంపము 1 భా. జగతి 6 భా. కంపము 1 భా. పద్మము [illegible] భా కంఠము [illegible] భా. పద్మము [illegible] భా కుముదము 3 భా. పద్మము 1 భా. ఆలింగము 1 భా. త్రిపట్టము [illegible] భా. ప్రతి [illegible] భా. వాజనము 2 భా. ఇట్లు చేసినచో శ్రీ కాంతమగును. ఇది ప్రతిబంధ జాతిలోనిది.

## 55. నాగబంధము

### శిల్పరత్నము 19వ అధ్యాయము

శ్లో॥ త్రయోవింశ త్కృతోత్సేధే సార్ధ ద్వ్యంశేన పాదుకం।
వేదై ర్వప్రం క్త్రైరవంతు త్రిభి రేకేన తద్గలం॥ 92

భూమ్యంశే నోత్తరం సార్ధ భాగేన వలభిం తథా।
కపోతం గుణభాగేన ప్రతించ చతురంశకైః॥ 93

దలమేకేన కర్తవ్యం వాజనం ద్వ్యంశకం భవేత్।
నాగబంధ మిదం నామ్నా కారయే త్సర్వధామసు।
పాదబంధేఽపి దృశ్యంతే శ్రీబంధాది చతుష్టయమ్॥ 94

తా॥ అధిష్ఠానము యెత్తును 23 భాగములు చేసి పాదుక 2½ భా. వప్రము 4 భా. కుముదము 3 భా. గలము 1 భా. ఉత్తరము 1 భా. వలభి 1½ భా. కపోతము 3 భా ప్రతిముఖము 4 భా. దలము 1 భా. వాజనము 2 భా. ఇట్లు చేసినచో నాగబంధమగును. ఇది ప్రతిబంధ జాతిలోనిది. మరియు శ్రీ బంధము, కపోత బంధము, కలశబంధము, నాగ బంధము ఈ నాల్గువిధములును పాదబంధమునందును గాన్పించు చున్నవి.



మానసార ప్రపత్రము 3



కాశ్యపశిల్పము శ్రీకాంతము.



శిల్పరత్నం నాగబంధము

## 56. పద్మబంధము

### మానసారము 14వ అధ్యాయము.

శ్లో॥ తస్మా దేకాంశ మాధిక్యం సార్ధయుగ్మం తు పాదుకం॥ 78

తదూర్ధ్వే కంప మర్ధేన పంచాంశేన మహాంబుజం।
కంధరం చైకభాగేన పద్మ మంశేన యోజయేత్॥ 79

కుముదోచ్ఛ్రం గుణాంశం స్యాత్ పద్మ మంశం తదూర్ధ్వకే।
కంప మంశేన సంయుక్తం కంధరం తత్సమం భవేత్॥ 80

తత్సమం వాజనం చోర్ధ్వే వహ్న్యంశ మంతరం ప్రభా।
ద్వ్యంశం ప్రతి ముఖం కుర్యాద్ వాజనం త్వేకభాగికమ్॥ 8'

తా॥ ఎత్తును 23 భాగములు చేసి అందు పాదుక 2½ భా. కంపము ½ భా. పద్మము 5 భా. కంఠము 1 భా. పద్మము 1 భా. కుముదము 3 భా. పద్మము 1 భా. కంపము 1 భా. కంఠము 1 భా. వాజనము 1 భా. అంతరితము 3 భా. ప్రతి 2 భా. వాజనము 1 భా చేయవలెను. ఇది పద్మబంధము మూడవ పద్ధతి.

## 57. పద్మకాంతము

కాశ్యపశిల్పము 6వ పటలము.

శ్లో॥ ధరాతలోచ్చం విభజేత్ త్రయోవింశతి భాగయా।
ఉపానోదయ మేకాంశం షడంశం త్వంబుజోదయం॥ 109

ఏకాంశం కఠమానం తు ఊర్ధ్వే పద్మం నవాంశకం।
యుగాంశం తు ఘటోత్సేధ మేకాంశం పద్మకంపకం॥ 110

కంప మేకేన కర్తవ్యం ద్విభాగం కంధరోదయం।
ఏకాంశం కంపమానం తు ఊర్ధ్వే పద్మం తు తత్సమం॥ 111

కపోతోచ్చం గుణాంశం తు ఆలింగం త్వేకభాగయా।
ఏత చ్చాంబుజకాంతం స్యాత్ పాదబంధే తు భేదితమ్॥ 1'2



మూడవ పద్మబంధము 3



కాశ్యప శిల్పము. పద్మకాంతము.

తా॥ ఎత్తును 23 భాగములు చేసి పాదుక 1 భా. పద్మము 6 భా. కంపము 1 భా. పద్మము 1 భా. కుంభము 4 భా. పద్మము 1 భా. కంపము 1 భా. కంఠము 2 భా. కంపము 1 భా పద్మము 1 భా. కపోతము 3 భా. ఆలింగము 1 భా. ఇట్లు చేసినచో పద్మకాంతమగును. ఇది పాదబంధజాతి.

## 58. శ్రీ సౌందర్యము

శ్లో॥ త్రయోవింశతి భాగేతు తలోచ్చం తు విభాజతే॥ 99

ఏకాంశం పాదుకోత్సేధ ముపోపానం శరాంశకం।
అధఃపద్మం శివాంశం స్యా దేకాంశం కంఠ ముచ్యతే॥ 100

తద్వ ద్వేపన మేకాంశం కుముదోచ్చం గుణాంశకం।
తదూర్ధ్వం పద్మ మేకాంశ మేకాంశ ముపమానకమ్॥ 101

కంఠం ద్వ్యంశేన కర్తవ్య మేకాంశం చ పట్టికా।
ఏకాంశం పద్మ తుంగం తు ఆలింగం త్వేకభాగయా॥ 102

త్రిపట్టం తు తథాంశం తు ప్రతిమానం ద్విభాగయా:
ఏకేన వాజనం కుర్యాత్ శ్రీసౌందర్య మిహోచ్యతే॥ 103

ప్రతిబంధస్య భేదం స్యా దంతం చ పూర్వక్రమా॥ 103½

తా॥ ఎత్తును 23 భాగములుచేసి పాదుక 1 భా. ఉపపాదుక 5 భా. అధఃపద్మము 1 భా. కంఠము 1 భా. కంపము 1 భా. కుముదము 3 భా. పద్మము 1 భా. కంపము 1 భా. కంఠము 2 భా. పట్టిక 1 భా. పద్మము 1 భా. ఆలింగము 1 భా. త్రిపట్టము 1 భా. ప్రతిముఖము 2 భా వాజనము 1 భా. ఇట్లుచేసినేని శ్రీసౌందర్య మగును. ఇది ప్రతిబంధ జాతిలోనిది.

## 59. త్రికర్ణము

శిల్పరత్నము 1౯వ అధ్యాయము

శ్లో॥ అధిష్ఠానస్య చోత్సేధే త్రయోవింశతి భాజితే
ఉపాన మేకం ద్వాభ్యాం తు పద్మ మేకేన కల్పయేత్॥ 82

కర్ణం త్రిభాగ మంశేన కంప మేకేన కల్పనం।
ద్వ్యంశేన పట్టికాం విద్యాత్ కంప మేకేన కల్పయేత్॥ 83

పద్మ మేకేన కర్ణం తు ఏకాంశే నైప కల్పయేత్।
ఏకాంశే నాంబుజం కుర్యాత్ గుణాంశం కుముదోదయమ్॥ 84

పద్మ మేకేన కర్తవ్య మాలింగం త్వేకభాగయా।
త్రిపట్ట మిందుభాగేన ద్విభాగం ప్రతివాజనం॥ 85

వాజనం త్వేకభాగేన కల్పయేత్తు యథాక్రమం।
ప్రతిబంధ విశేషః స్యాత్ త్రికర్ణం త త్ప్రకీర్తయేత్॥ 86

తా॥ ఎత్తును 23 భాగములుచేసి పాదుక 1 భా. ఉపపాదుక 2 భా. పద్మము 1 భా. కర్ణము 3 భా. కంపము 1 భా. పట్టిక 2 భాగములు. కంపము 1 భా. పద్మము 1 భా. కర్ణము 1 భా. పద్మము 1 భా. కుముదము 3 భా. పద్మము 1 భా. ఆలింగము 1 భా. త్రిపట్టిక 1 భా. ప్రతివాజనము 2 భా. వాజనము 1 భా. ఇట్లు చేసినేని త్రికర్ణమను పేరుగలది యగును. ఇది ప్రతిబంధ జాతిలోనిది.



తార్క్ష్యప శిల్ప శ్రీసౌందర్యము



శిల్పరత్న త్రికర్ణము

## 60. పాదబంధము

### మానసార 14వ అధ్యాయము

శ్లో॥ జన్మాది వాజనాంతం స్యాత్సృష్టమోదయ పూరితం।
తదుత్సేధం చతుర్వింశ త్కృత్వాష్టాంశం తు వప్రకం॥ 5
కుముదోచ్ఛ్రం తు సప్తాంశం కంప మేకేన కారయేత్।
కర్ణతుంగం త్రయాంశం స్యాదూర్ధ్వే కంపం త్వేకాంశకం॥ 6
పట్టికోచ్ఛ్రం గుణాంశం స్యాత్కంప మంశేన యోజయేత్॥ 6½

తా॥ అధిష్ఠానోన్నతమును 24 భాగములుచేసి వప్రము 8 భా. కుముదము 7 భా. కంపము 1 భా. కర్ణము 3 భా. కంపము 1 భా. పట్టిక 3 భా. కంపము 1 భా. ఇది పాదబంధము మొదటిపద్ధతి.

### శిల్పరత్నము 16వ అధ్యాయము

శ్లో॥ అష్ట సప్త శశి రామ భాగికైః । శ్చంద్ర లోక శశి భాగికైః క్రమాత్॥
వప్రకం కుముద కంప కంధరాః । కంప పట్ట మథ వాజనం క్రమాత్॥ 23
పాదబంధ ముదితం త దుచ్ఛ్రయే । భాస్కర ద్విగుణితాంశతే ఫలే।
దేవ విప్ర నృప వైశ్య శూద్రకే । ష్వేష ముక్త మృషిభిః పురాతనైః॥ 24



శిల్పరత్నం మానసారం పాదబంధం

తా॥ ఎత్తును 24 భాగములుచేసి. వప్రము 8 భా. కుముదము 7 భా. కంపము 1 భా. కంఠము 3 భా. కంపము 1 భా. పట్టిక 3 భా. వాజనము 1 భా. ఇది పాదబంధము సమస్త వర్ణములవారికిని. దేవతలకును శ్రేష్ఠము. మానసారమునకును శిల్పరత్నమునకు భేద మేమి లేనందున ఒక్కటే యాకారము సరిపోవును.

## 61. ఉరగబంధము

### మానసార 14వ అధ్యాయము

శ్లో॥ అథ వా తచ్చతుర్వింశ ద్భాగం కృత్వా యథోచ్ఛ్రయం।
సప్తాంశం వప్రతుంగం స్యాత్ కుముదోచ్చం షడంశకమ్॥ 17
తదూర్ధ్వే కంప మేకాంశం కంధరం తత్సమం భవేత్।
తదూర్ధ్వే వాజనం చాంశం కంధరోచ్చం గుణాంశకమ్॥ 18
తత్ప్రదేశే విశేషోఽస్తి మకరాది విభూషితం।
తదూర్ధ్వే వాజనం చాంశం కంపనం చైక భాగికం॥ 19

తదూర్ధ్వే కంప మేకాంశం శేషం త త్ప్రతివాజనం
ఏత చ్చతుర్విధం జ్ఞాత్వో రగబంధ మితిస్మృతం॥ 20

సర్పవక్త్రాకృతిం కుర్యాత్ తదూర్ధ్వే త త్ప్రతిద్వయం।
ఏత చతుర్విధాకారం వృత్తం కుంభం ప్రకారయేత్॥ 21

దేవభూసుర భూపానాం హర్మ్యాణాం త త్ప్రకల్పయేత్॥ 21½



మానసార ఉరగబంధం

తా॥ పైజెప్పిన విధముగా గాళ ఎత్తును 21 భాగములుచేసి వప్రము 7 భా. కుముదము 6 భా. కంపము 1 భా. కంఠము 1 భా. వాజనము 1 భా. కంఠము 3 భా. మకరాద్యలంకారములతో చేయవలెను. వాజనము 1 భా. కంపము 1 భా. కంపము 1 భా. మిగిలిన 2 భాగములు ప్రతివాజనము చేయవలెను. ఈ ఉరగబంధము 1-2 పద్ధతులు ఒకవిధమైన సర్పముఖమువలె నుండును. 3-4 పద్ధతులుగూడ సర్పముఖమువలెనే మరియొక విధముగా నుండును. ఈ నాలుగు పద్ధతుల యందును, కుంభము గుండ్రముగా నుండవలెనే కాని కోణములుగా చేయుగూడదు.

## 62. ప్రతిక్రమము

మానసార 14వ అధ్యాయము

శ్లో॥ త త్తుంగై కాంశ మాధిక్యమ్॥ 29

పూర్వోత్తర ప్రదేశేతు కంపం చాంతర మంశకం।
ద్వ్యంశకం చ త్రిపట్టం స్యా త్తదూర్ధ్వే చాంశకం భవేత్॥ 30

ప్రతిం చైవాంశ మంశంచ వాజనం చైవ కారయేత్।
పూర్వవ త్సమలంకృత్య శేషం ప్రాగుక్తవ న్నయేత్॥ 31

తైతిలానాం ద్విజాతీనా మాలయేషు న్యసే త్క్రమాత్।
ఏతత్ ప్రతిక్రమం నామ్నా తం చతుర్విధ మీరితమ్॥ 32



మానసారప్రతిక్రమము 4.

తా॥ ఎత్తును 24 భాగములుచేసి పాదుక 1 భా. పద్మము 2½ భా. కంపము 1½ భా. జగతి 7 భా. కుంభము 6 భా. కంపము ½ భా. అంతరము ½ భా. త్రిపట్టము 2 భా. అంతరితము 1 భా. ప్రతి 1 భా. వాజనము 1 భా. ఇట్లు చేసి శేషించినది మునుపటివలెనే సర్వాలంకారములు చేయవలెను. ఇది ప్రతిక్రమము నాల్గవ పద్ధతి.

## 63 వప్రబంధము

శిల్పరత్నము 19వ అధ్యాయము

శ్లో॥ అత్రాధిష్ఠానతుంగే తు చతుర్వింశతి భాజితే
స్యా దష్టభాగై ర్జగతీ సప్తాంశైః కుముదం భవేత్॥ 60

పద్మం చ పట్టికా కంప స్త్వేకైకాంశై ర్గలః కరైః।
భాగే నైవోర్ధ్వకంపః స్యాత్ త్రిభి ర్భాగై శ్చ వాజనం॥ 61

వప్రబంధ మిదం ప్రోక్తం విప్రజా త్యర్హకం భవేత్॥ 61½

తా॥ ఎత్తును 24 భాగములుచేసి జగతి 8 భా. కుముదము 7 భా. పద్మము 1 భా. పట్టిక 1 భా. కంపము 1 భా. గలము 2 భా. కంపము 1 భా. వాజనము 3 భాగములు, ఇది వప్రబంధము. ప్రతిబంధజాతిలోనిది.

## 64. శ్రీకరము

కాశ్యపశిల్పము 6 వ పటలము

శ్లో॥ అధిష్ఠానస్య చోత్సేధం చతుర్వింశతి భాజితే॥ 87

పాదుకం తు ద్విభాగేన తత్సమం పంకజోదయం।
కంప మేకేన కర్తవ్యం జగత్యుచ్ఛం రసాంశకం॥ 88

పద్మ మేకేన భాగేన కంఠం పద్మం తు భాగయా।
వేదాంశం కలశోత్సేధం కమలం త్వేకభాగయా॥ 89

కంప మేకం ద్విభాగేన పట్టం ద్వ్యంశం తు వాజనం।
ప్రతిబంధే తు భేదం స్యాత్ శ్రీకరం నామ తూచ్యతే॥ 90

తా॥ అధిష్ఠానము యెత్తును 24 భాగములుచేసి పాదుక 2 భా. పద్మము 2 భా. కంపము 1 భా. జగతి 6 భా. పద్మము 1భా. కంఠము 1 భా. పద్మము 1 భా. కలశము 4 భా. పద్మము 1 భా. కంపము 1 భా. పట్టము 2 భా. వాజనము 2 భా. ఇట్లు చేసినచో శ్రీకర మనిపించుకొనును. ఇది ప్రతిబంధ జాతిలోనిది.

## 65. సుందరాంబుజము

కాశ్యప శిల్పము 6 వ పటలము

శ్లో॥ భానుద్వ్యంశే తలోత్సేధం ద్విభాగం పాదుకోదయం॥ 90

ఉపోపానం శివాంశం స్యాత్ షడంశం దలమానకం।
కంఠ మేకేన కర్తవ్య మంశే నాబ్జం ప్రకల్పయేత్॥ 91

గుణాంశం ఖండమానం తు దల మేకేన వృత్తకం।
కంప మేకేన కంఠం తు గుణాంశం గళమానకం॥ 9

వ్యోమాంశం దలమానం తు ద్విభాగం పట్టికా భవేత్।
ఏకాంశం దలమానం తు కంప మేకేన కారయేత్॥ 93

సుందరాబ్జా ద్యంబుజానాం పాదబంధే తు భేదితం॥ 93½

తా॥ ఎత్తును 24 భాగములుచేసి అందు పాదుక 8 భా. ఉపపాదుక 1 భా. జగతి 6 భా. కంఠము 1 భా. పద్మము 1 భా. ఖండము 3 భా. దలము 1 భా. గుండ్రముగా నుండవలెను. కంపము 1 భా. కంఠము 3 భా. దలము భా. పట్టిక 2 భా. దలము 1 భా. కంపము 1 భా. ఇట్లు చేసిరేని సుందరాంబుజ మగును. ఇది పాదబంధ జాతిలోనిది.



శిల్పరత్న పాదబంధము



కాశ్యప శ్రీకరము



కాశ్యప సుందరాంబుజము

## 63. స్కందకాంతము

### కాశ్యప శిల్పము 6 వ పటలము

శ్లో॥ చతుర్వింశతి భాగం తు తలోచ్చం తు విభాజితే॥ 104

ఉపానం త్వేకభాగేన ద్విభాగం తు దలోదయం।
తదూర్ధ్వే కంప మేకాంశం జగత్యుచ్చం శరాంశకం॥ 105

వేదాంశం కుముదోత్సేధం పద్మ మంశేన కల్పయేత్।
కంఠ మేకాంశ మిత్యుక్త మూర్ధ్వపద్మం శివాంశకం॥ 106

వాజనోచ్చం ద్విభాగేన ఏకాంశం పద్మతుంగకం।
ఆలింగం త్వేకభాగేన త్రిపట్టం తత్సమం భవేత్॥ 107

ప్రతిమానం ద్విభాగం స్యా ద్వాజనం త్వేకభాగయా।
స్కందకాంత మిదంనామ్నా ప్రతిబంధస్య భేదకమ్॥ 108

తా॥ ఎత్తును 24 భాగములుచేసి ఉపానము 1 భా. దళము 2 భా. కంపము 1 భా. జగతి 5 భా. కుముదము 4 భా. పద్మము 1 భా. కంఠము 1 భా. ఊర్ధ్వపద్మము భా. వాజనము 2 భా. పద్మము 1 భా. ఆలింగము 1 భా. త్రిపట్టము 1 భా. ప్రతి 2 భా. వాజనము 1 భా. ఇది స్కందకాంతము. ప్రతిబంధ జాతిలోనిది.

### శిల్పరత్నము 19 వ అధ్యాయము

శ్లో॥ చతుర్వింశతి భాగేన తలోత్సేధే విభాజితే॥ 69

ఉపానం త్వేకభాగేన ద్విభాగం తు దలోదయమ్।
తదూర్ధ్వే కంప మేకాంశం జగత్యుచ్చం శరాంశకమ్॥ 70

వేదాంశం కుముదోత్సేధం పద్మ మంశేన కల్పయేత్।
కంఠ మేకాంశ మిత్యుక్త మూర్ధ్వపద్మం శివాంశకమ్॥ 71

వాజనోచ్చం ద్విభాగేన భూమ్యంశం పద్మతుంగకమ్।
ఆలింగ మేకభాగేన తత్సమం నీరజం భవేత్॥ 72

ప్రతిమానం ద్విభాగం స్యా ద్వాజనం త్వేకభాగతః।
స్కందకాంత మిదంనామ్నా ప్రతిబంధస్య భేదకమ్॥ 73

తా॥ ఎత్తును 24 భాగములుచేసి పాదుక 1 భా. దలము 2 భా. కంపము 1 భా. జగతి 5 భా. కుముదము 4 భా. పద్మము 1 భా. కంఠము 1 భా. ఊర్ధ్వపద్మము 1 భా. వాజనము 2 భా. పద్మము 1 భా. ఆలింగము 1 భా. 1 పద్మము భా. ప్రతిముఖము 2 భా. వాజనము 1 భా. ఇది ప్రతిబంధజాతి. ఈ రెండు శాస్త్రములు ఒక్కరీతిగానే యున్నవి.

## 67. కలశబంధము తద్భేదములు

### మానసారము 14 వ అధ్యాయము

శ్లో॥ ఉత్సేధం తు చతుర్వింశ ద్భాగం కుర్యా ద్విశేషతః।
జన్మోచ్చం తు ద్విభాగం స్యాత్ తత్సమం పద్మతుంగకం॥ 98

కంప మేకం తదూర్ధ్వేతు కర్ణతుంగం గుణాంశకం।
తదూర్ధ్వే కంప మేకాంశం పట్టికోచ్చం కలాంశకమ్॥ 99

తదూర్ధ్వే కంపమంశేన చాధఃపద్మం కలాంశకమ్।
కర్ణ మేకాంశకం చోర్ధ్వే పద్మ మేకేన కారయేత్॥ 100

కుంభం త్ర్యంశం తదూర్ధ్వే స్యా త్పద్మ మేకాంశ మేవచ।
తదూర్ధ్వే నిమ్న మంశం స్యా త్తస్యోర్ధ్వే కంప మంశకం॥ 101

తదూర్ధ్వే తత్సమం నిమ్నం ప్రతి మేకాంశ మేవచ। 101

తా॥ ఎత్తును 24 భాగములుచేసి పాదుక . భా. పద్మము 2 భా. కంపము 1 భా. కర్ణము 3 భా. కంపము 1 భా. పట్టిక 2 భా కంపము 1 భా అధఃపద్మము 2 భా. కర్ణము 1 భా. పద్మము 1 భా. కుంభము 3 భా. పద్మము భా. నిమ్నము 1 భా. కంపము 1 భా. నిమ్నము 1 భా. ప్రతి 1 భా. ఇది కలశబంధము మొదటి పద్ధతి.

శ్లో॥ తదేవ ప్రాగ్వ దుత్సేధం పద్మకర్ణే విశేషతః॥ 102

మధ్యే కుంభం కలాంశం స్యాత్ తస్యోర్ధ్వే నిమ్న మంశకం।
శేషం ప్రాగుక్తవ త్కుర్యాత్ తద్భాగేన విశేషతః॥ 103

తా॥ పైజెప్పిన దానినే మధ్యలోనున్న పద్మమును కర్ణముగా మార్పుచేసి మధ్య కుంభమును 2 భాగములుచేసి దానిపైన నిమ్నము 1 భాగము చేసిన యెడల రెండవ విధమగు కలశబంధమగును.

## 63. కుక్షిబంధము

### మానసారము 14 వ అధ్యాయము

శ్లో॥ చతుర్వింశాంశకే తుంగే జన్మోత్సేధం గుణాంశకం॥ 168

కంప మీశం తదూర్ధ్వే తు నిమ్న మంశేన కారయేత్।
ఏతదూర్ధ్వం పంచభాగే నైకైకం భద్ర సంయుతం॥ 169

తదూర్ధ్వే కంప మేకేన తత్సమం నిమ్నకం భవేత్।
ఏకే నాంతరితం చోర్ధ్వే భాగేన ప్రతిసంయుతమ్॥ 170

తదూర్ధ్వే కంప మంశం చ తత్సమం చోర్ధ్వకంధరం।
కంప మేకం తదూర్ధ్వే తు పద్మ మేకేన కారయేత్॥ 171

కపోతోచ్చం త్రయాంశం స్యా దేకాంశం కంధరం భవేత్।
తథా చోర్ధ్వే ప్రతిం చైవ కుంభ మేకాంశ మేవచ॥ 172

కపోతే భద్రపట్టం స్యాత్ పత్రపట్టక మేవచ।
ఏత చ్చతుర్విధం ప్రోక్తం॥ 172½

**తా॥** ఎత్తును 24 భాగములుచేసి పాదుక 3 భా. కంపము 1 భా. నిమ్నము 1 భా. ఆపైన 5 భాగములు భద్రపీఠము. కంపము 1 భా. నిమ్నము 1 భా. అంతరితము 1 భా. ప్రతి 1 భా. కంపము 1 భా. కంఠము 1 భా. కంపము 1 భా. నిమ్నము 1 భా. కపోతము 2 భా. కంఠము 1 భా. ప్రతి 1 భా. కుంభము 1 భా. ఇట్లు చేసి కపోతమును భద్రపట్టముతో గాని, లేక ప్రతిపట్టముతో గాని చేయవచ్చును. ఇది శ్రీబంధము నందలి నాల్గవ పద్ధతి.

మానసార శ్రీబంధము 1, 2, పద్ధతులు

మానసార శ్రీబంధము 4.

## 69. పద్మబంధము

### మానసారము 14 వ అధ్యాయము

శ్లో॥ తస్మా దాధిక్య మేకాంశం జన్మతుంగం కలాంశకం।
ఏకాంశం క్షుద్రపద్మోచ్చం తూర్ధ్వ మంశేన వాజనం॥ 82

భూతాంశేన మహాపద్మం తదూర్ధ్వాంశం దలాన్వితం।
శేషం ప్రాగుక్తవ చ్చోర్ధ్వే గ్రాహసింహాది భూషితం॥ 83

ఏత చ్చతుర్విధం జ్ఞాత్వా పద్మబంధ ముదీరితం।
దేవానా మపి సర్వేషాం దేవీనాం శంకరాలయే॥ 84

కారయే త్సర్వసంసిద్ధ్యై శ్రీసౌభాగ్య ప్రదాయకమ్॥ 84½

**తా॥** ఎత్తును 24 భాగములుచేసి పాదుక 2 భా. పద్మము 1 భా. వాజనము 1 భా. పద్మము 5 భా. దలము 1 భా. మిగిలిన భాగములు మునుపటి వలెనే చేయవలయును. ఇది పద్మబంధము నాల్గవ పద్ధతి. మొసళ్లు, సింహాములు మొదలయిన అన్ని అలంకారములు చేయవలెను.

మానసార పద్మబంధము.

## 70. పాదబంధభేదములు

### శిల్పరత్నము 19 వ అధ్యాయము

శ్లో॥ వాస్త్వాధార సముచ్ఛ్రయే ప్రకృతిభక్తే వా త్రిభిః పాదుకం।
చందోభి ర్జగతీం రసైః కుముదకం చైకేన తత్పట్టికాం।

భాగాభ్యాం గలపాదకాన్ విరచయే దర్ధాంశతః పట్టికాం।
క్షుద్రాం సార్ధధరాంశకేన మహితం స్వాంశోల్లస ద్వాజనమ్॥ 20

తా॥ ఎత్తును 21 భాగములుచేసి పాదుక 3 భా. జగతి 7 భా. కుముదము 6 భా. పట్టిక 1 భా. గలము 2 భా. క్షుద్రపట్టిక ½ భా. వాజనము 1½ భా. చేసినచో పాదబంధమే.

శ్లో॥ సప్తాంశై ర్జగతీ షడ్భిః కుముదం చైక మంబుజం॥ 21

పట్టంచ కంపం చైకైకం కర్ణోంశా వబ్జ మంశతః।
ద్వౌవాజనం చాబ్జ మేక మంశాభ్యా మూర్ధ్వపట్టికామ్॥ 22

పాదబంధ మధిష్ఠాన మిదం సాకృతి భేదితమ్॥ 22½

తా॥ ఎత్తును 24 భాగములుచేసి జగతి 7 భా. కుముదము 6 భా, పద్మము 1 భా. పట్టము 1 భా, కంపము 1 భా. కర్ణము 2 భా, పద్మము 1 భా, వాజనము 2 భా, పద్మము 1 భా. పట్టిక 2 భా, ఇదియొక పాదబంధము.

## 11. క్రమము

శ్లో॥ మాసూరేఒంశై ర్దినేశద్వయమ మితిజగతీ కైరవే ప్రత్యుపాయై।
స్త్రిభ్యిష్టైః పట్టికా మంతర మపి రచయే ద్వాజనం చ ప్రతిం చ।
ప్రత్యుత్పన్న క్రమాఖ్యే క్రమ ఇతి కథితః సర్వదేవాలయేషు।
సంపూజ్యో మానవానా మపి గృహకరణే ష్వేష ఆద్యంగముఖ్యః॥

తా॥ ఎత్తును 24 భాగములు చేసి, జగతి, కుముదము, పట్టిక, అంతరము, వాజనము, ప్రతి ఇవి ఆఱును ఒక్కొక్కటి నాల్గు భాగముల చొప్పున చేసినని క్రమ మనుపేరు గలది యగును. ఇది ప్రతిబంధజాతి.



శిల్పరత్నం పాదబంధ శాల



శిల్పరత్నం పాదబంధ శాల



శిల్పరత్నం క్రమము.

### కాశ్యప శిల్పము 6 వ పటలము

శ్లో॥ అధిష్ఠానస్య చోత్సేధం పంచవింశతి భాజితే।
శివాంశం పాదుకోత్సేధం జగతీ వసుభాగయా॥ 33

ధాత్వంశం కుముదోత్సేధం వ్యోమాంశం కంపమానకం।
అనలాంశం గలోత్తుంగం శక్యంశం చోర్ధ్వకంపకం॥ 34

మహాపట్టీ గుణాంశం తు తదూర్ధ్వాంశేన కంపకం।
పాదబంధ మితి ఖ్యాత ముపానాన రహితం తథా॥ 35
ఏత చ్చ పాదబంధం చ మానాభేద్యై శ్చ కీర్తితమ్॥ 35

తా॥ ఎత్తును 26 భాగములు చేసి పాదుక 1 భా, జగతి 8 భా, కుముదము 7 భా, కంపము 1 భా గలము 3 భా, కంపము 1 భా, పట్టిక 3 భా, కంపము 1 భా, ఇట్లుచేసిన చో పాదబంధ మగును. ఇందు పాదుకను తీసివేసి 24 భాగములతోను చేయవచ్చును.

శిల్పరత్నము 19వ అధ్యాయము

శ్లో॥ అత్రాధిష్ఠాన కోత్సేధే పంచవింశతి భాగతః।
శివాంశం పాదుకం కుర్యాత్ జగతీం వసుభాగతః॥ 25
ధాత్వం శైః కుముదోచ్ఛంతు వ్యోమాంశం కంప మానకం।
అనలాంశం గలోత్తుంగం శశ్యంశం చోర్ధ్వ కంపకమ్॥ 26
మహాపట్టిం గుణాంశై స్తు తదూర్ధ్వే ఒంశేన కంపకం।
పాదబంధ మిదం ఖ్యాత ముపానం రహితం తు వా॥ 27

తా॥ ఎత్తును 25 భాగములు చేసి పాదుక 1 భా, జగతి 8 భా, కుముదము 7 భా, కంపము 1 భా, గలము 3 భా, కంపము 1 భా, పట్టిక 3 భా, కంపము 1 భా, ఇది ఉపానము లేకుండ 24 భాగములతోను చేయవచ్చును. ఇందు [illegible] శ్లోకములు 8 శ్లోకములు ఇదే కొలతలతో పాదబంధ లక్షణ మే చెప్పబడియున్నది. అదిమాంసిక కాశ్యపశిల్పములోనిదై యుండవచ్చును.

శ్లో॥ పంచవింశతి కోత్సేధే కృతేఒంశే నైవ పాదుకం।
అంబుజం సార్ధభాగేన కంప మర్ధాంశ ముచ్యతే॥ 49
సప్తాంశం జగతే రుచ్చం రసాంశం కుముదోదయం।
ఆలింగ మేకభాగేన గల మగ్న్యంశకం విదుః॥ 50
ఊర్ధ్వవాజన మేకాంశం మహాపట్టి గుణాంశతః।
తదూర్ధ్వే కంప మేకాంశం పాదబంధ మిదం విదుః॥ 51

తా॥ ఎత్తును 25 భాగములు చేసి పాదుక 1 భా, పద్మము 1½ భా, కంపము ½ భా, జగతి 7 భా, కుముదము 6 భా, ఆలింగము 1 భా, కంఠము 3 భా, వాజనము 1 భా పట్టిక 3 భా. కంపము 1 భా చేయవచ్చును. ఇదియును పాదబంధమే.

## 72, కలశబంధ భేదములు

మానసారము 14 వ అధ్యాయము

శ్లో॥ ద్విభాగం జన్మతుంగం స్యా త్పద్మతుంగం తు తత్సమం।
నిమ్న మేకం తదూర్ధ్వే తు కుంభతుంగం కలాంశకం॥ 104

కంప మేకం తదూర్ధ్వే తు కంధరం చైకభాగికం।
కంప మేకం తదూర్ధ్వే స్యాత్తత్సమం చోర్ధ్వ మాంబుజమ్॥ 105

కపోతోచ్ఛ్రం కలాంశం స్యా ద్వాజనం చైకభాగికం।
సార్ధం పద్మం తదూర్ధ్వే స్యా న్నిమ్న మేకేన కారయేత్॥ 106

సార్ధం పద్మం తదూర్ధ్వే తు కుంభతుంగం కలాంశకం।
సార్ధం పద్మం తదూర్ధ్వే స్యా న్నిమ్న మేకేన కారయేత్॥ 107

తస్యోర్ధ్వే క్షేపణం చార్ధం తత్సమం నిమ్న మేవచ।
తస్యోర్ధ్వే ఒంశం ప్రతిం చైవ కారయే ల్లక్షణాన్వితమ్॥ 108

తా॥ ఎత్తును 25 భాగములుచేసి పాదుక 1 భా, పద్మము 2 భా, నిమ్నము 1 భా, కుంభము 2 భా, కంపము 1 భా, కంఠము 1 భా, కంపము 1 భా, ఊర్ధ్వపద్మము 1 భా, కపోతము 2 భా, వాజనము 1 భా, పద్మము 1½ భా, నిమ్నము 1 భా, పద్మము 1½ భా, కుంభము 2 భా, పద్మము 1½ భా, నిమ్నము 1 భా, కంపము ½ భా, నిమ్నము ½ భా, ప్రతి 1 భా, చేయవలెను. ఇది కలశబంధమున మూడవ పద్ధతి.

శ్లో॥ అథ వా ద్వ్యంశకం జన్మ తత్సమం పంకజో చ్ఛ్రయం।
ఏకాంశం కంధరం ప్రోక్తం కుంభతుంగం కలాంశకం॥ 109

ఏకాంశం నిమ్న మంశం చ క్షుద్రపట్ట్య బ్జమంశకం।
కపోతం చోర్ధ్వకే యుగ్మం తదూర్ధ్వే కంప మంశకం॥ 110

ఊర్ధ్వే చాధఃపద్మ మంశం తత్సమం కంధరం భవేత్।
తత్సమం చోర్ధ్వపద్మం స్యాత్ కుంభతుంగం గుణాంశకం॥ 111

అధఃపద్మం శివాంశం స్యా త్తదూర్ధ్వే ఒంశేన కంధరం।
క్షేపణం చార్ధభాగం స్యాత్ క్షుద్రాబ్జం చార్ధకం భవేత్॥ 112

సార్ధాంశం తు కపోతోచ్ఛ్రం శేషం త త్ప్రతివాజనమ్॥ 112½

తా॥ పై జెప్పినదానినే పాదుక 2 భా, పద్మము 2 భా, కంఠము 1 భా, కుంభము 2 భా, నిమ్నము 1 భా, క్షుద్రపట్టము 1 భా, పద్మము 1 భా, కపోతము 2 భా, కంపము 1 భా, అధఃపద్మము 1 భా, కంఠము 1 భా, ఊర్ధ్వపద్మము 1 భా, కుంభము 3 భా, అధః



తాక్ష్యప శిల్పము పాదబంధము



శిల్పరత్న పాదబంధము



మానసార కలశబంధము

పద్మము 1 భా, కంఠము 1 భా, కంపము ½ భా, క్షుద్రపద్మము ½ భా, కపోతము 1½ భా, మిగిలిన 1½ భాగము ప్రతివాజయమున చేయవలెను. ఇది కలశబంధమున నాల్గవపద్ధతి.

శ్లో॥ జన్మాది వాజనాంతం చ తుంగే షడ్వింశ దంశకే॥ 113

ద్విభాగం జన్మతుంగం స్యా త్తత్సమం పద్మతుంగికం।
కంప మేకం తదూర్ధ్వే తు కంధరం తద్ ద్విభాగికం॥ 114

తదూర్ధ్వే కంప మేకాంశం పద్మ మేకేన యోజయేత్।
పట్టికోచ్చం ద్విభాగం స్యా త్తదూర్ధ్వే పద్మ మంశకం॥ 115

ఆలింగ మంశకం చోర్ధ్వే ఊర్ధ్వే పద్మం శివాంశకం।
కుంభతుంగం త్రిభాగం స్యా త్తదూర్ధ్వే పద్మ మంశకం॥ 116

కంప మేకం తదూర్ధ్వే తు కంధరం చ ద్విభాగికం।
కంప మేకం తథాఽబ్జం చ కపోతోచ్చం ద్విలాంశకం॥ 117

శివాంశం చోర్ధ్వకే కంపం శేషం యుక్త్యా ప్రయోజయేత్।
గ్రాహాది చిత్రం సర్వేషాం క్షుద్రనాసాది భూషితం॥ 118

ఏత త్పంచవిధం ప్రోక్తం కుంభదేశే విశేషతః।
వృత్తం విధం త్రిపట్టం వా ధారాయాః కలశాన్వితం॥ 119

ఏత త్కలశబంధాఖ్యం దేవ భూ పాలయేషు చ॥ 119½

తా॥ ఎత్తును 26 భాగములుచేసి పాదుక 2 భా, పద్మము 2 భా, కంపము 1 భా, కంఠము 2 భా, కంపము 1 భా, పద్మము 1 భా పట్టిక 2 భా, పద్మము 1 భా, ఆలింగము 1 భా, పద్మము 1 భా, కుంభము 3 భా, పద్మము 1 భా, కంఠము 2 భా, కంపము 1 భా, పద్మము 1 భా, కపోతము 2 భా, కంపము 1 భా. ఇది కలశబంధమున ఐదవ పద్ధతి. ఇందలి సమస్తమైన పనులు ఆలోచనతో చక్కగా చేయవలెను. క్షుద్రనాసాదుల యందు అన్నిటికిని మకరాది చిత్రములు చేయవలెను. కుంభప్రదేశమున వృత్తముగాని త్రిపట్టముగాని ధారాకలశముగాని చేయవచ్చును.

## 73. పద్మకేసరము

### కాశ్యపశిల్పము 6 వ పటలము

శ్లో॥ షడ్వింశ ద్విభజే దుచ్చ ముపానం చైకభాగయా॥ 41

ద్విభాగేనదలం కుర్యాత్ కంప మేకేన కారయేత్।
షడంశం జగతే రుచ్చ మేకాంశం దలమానకం॥ 42

కర్ణ మేకేన కర్తవ్య మేకే నాఙ్గం తు కారయేత్।
కుముదోచ్చం గుణాంశేన పద్మ మేకేన కారయేత్॥ 43
కంప మేకేన కర్తవ్యం కర్ణోచ్చం తు ద్విభాగయా।
ఏకాంశం కంపమానం తు తత్సమం తు దలోదయమ్॥ 44
మహాపట్టీ ద్విభాగేన దల మేకాంశ మానతః।
కంప మేకేన కర్తవ్య మష్టాశ్రం కుముదం కురు॥ 45
అంభోజ కేసర ఖ్యాతం పాదబంధేతు భేవితమ్॥ 45½

తా॥ ఎత్తును 26 భాగములుచేసి పాదుక 1 భా. దళము 2 భా. కంపము 1 భా. జగతి 6 భా. దలము 1 భా. కర్ణము 1 భా. పద్మము 1 భా. కుముదము 3 భా. పద్మము 1 భా. కంపము 1 భా. కర్ణము 2 భా. కంపము 1 భా. దలము 1 భా. మహాపట్టి 2 భా. దలము 1 భా. కంపము 1 భా. చేయవచ్చును. ఇది పద్మకేసరము. పాదబంధజాతి.

శిల్పరత్నము 19వ అధ్యాయము

శ్లో॥ షడ్వింశ ద్విభజే దుచ్చ ముపానం చైకభాగతః ।
ద్విభాగేన దలంకుర్యాత్ కంప మేకేన కారయేత్॥ 52
షడంశం జగతే రుచ్చ మేకాంశం దలమానకం ।
కర్ణ మేకేన కర్తవ్య మేకే నాఙ్గం తు కారయేత్॥ 53
కుముదోచ్చం గుణాంశేన పద్మ మేకేన కారయేత్।
కంప మేకేన కర్తవ్యం కర్ణోచ్చం తు ద్విభాగతః॥ 54
ఏకాంశం కంపతుంగం తు తత్సమం తు దలోదయం।
మహాపట్టి ద్విభాగేన దల మేకాంశ మానతః॥ 55
కంప మేకేన కర్తవ్య మష్టాశ్రం కుముదాన్వితం।
అంభోజకేసరాఖ్యాతం పాదబంధ విశేషకమ్॥ 56

తా॥ ఇదియును కాశ్యప శిల్పమునవలెనే పాదుక 1 భా. దలము 2 భా. కంపము 1 భా. జగతి 6 భా. దలము 1 భా. కర్ణము 1 భా. పద్మము 1 భా. కుముదము 3 భా. పద్మము 1 భా. కంపము 1 భా. కర్ణము 2 భా. కంపము 1 భా. దలము 1 భా. మహాపట్టి 2 భా. దలము 1 భా. కంపము 1 భా. చేసినని పద్మకేసర మగును. ఇది పాదబంధజాతి.






## 74. శ్రేణీబంధభేదములు

శిల్పరత్నము 19 వ అధ్యాయము

శ్లో॥ తుంగే షడ్వింశ దంశే తు గుణాంశం పాదుకోన్నతం।
ద్విభాగం దలమానం తు కంపోచ్చం శశిభాగతః॥ 43

షడంశం తు జగత్యుచ్చం చతుర్భాగం ఘటోదయం।
కంప మేకేన కర్తవ్యం కర్ణోచ్చం తు ద్విభాగికమ్॥ 44

ఊర్ధ్వకంప మథైకాంశం గలమానం ద్విభాగతః।
వాజనం చైకభాగేన సార్ధాంశం కమలోదయమ్॥ 45

కంపం సార్ధేన కర్తవ్యం శ్రేణీబంధ మిదం భవేత్। 45½

తా॥ ఎత్తురు 26 భాగములు చేసి, పాదుక 3 భా. దలము 2 భా. కంపము 1 భా. జగతి 6 భా. కుంభము 4 భా. కంపము 1 భా. కర్ణము 2 భా. కంపము 1 భా. గలము 2 భా. వాజనము 1 భా. పద్మము 1½ భా. కంపము 1½ భా. ఇట్లుచేసిన శ్రేణీబంధ మగును. ఇది పాదబంధజాతి.

కాశ్యపశిల్పము 6 వ పటలము

శ్లో॥ తుంగం షడ్వింశ దంశం తు గుణాంశం పాదుకం భవేత్॥ 61

ద్విభాగం దలమానం తు కంపోచ్చం శశిభాగతః।
షడంశం తు జగత్యుచ్చం చతుర్భాగం ఘటోదయమ్॥ 62
కంప మేకేన కర్తవ్యం పద్మోచ్చం తు ద్విభాగతః।
ఊర్ధ్వకంప మథైకాంశంగలమానం ద్విభాగతః॥ 63
వాజనం త్వేకభాగేన సార్ధాంశం కమలోదయం।
కంపం సార్ధేన కర్తవ్యం శ్రేణీబంధ మిదం భవేత్॥ 64
పాదబంధేతు భేదం స్యాత్ సింహేభాద్యై ర్విభూషితమ్। 64½

తా॥ ఎత్తును 26 భాగములు చేసి. పాదము 3 భా. దలము 2 భా. కంపము 1 భా. జగతి 6 భా. కుంభము 4 భా. కంపము 1 భా. పద్మము 2 భా. ఊర్ధ్వకంపము 1 భా. గలము 2 భా. వాజనము 1 భా. పద్మము 1½ భా. కంపము 1½ భా. ఇట్లుచేసిన శ్రేణీబంధమగును. సింహ గజాద్యలంకారములు చేయవలెను. ఇది పాదబంధజాతి.

మానసార 14 వ అధ్యాయము

శ్లో॥ జన్మాది వాజనాంతం చ కృత్వా షడ్వింశ దంశకం।
జన్మతుంగం తు సార్ధాంశం యుగళం పద్మతుంగకమ్॥ 62

ఏవం కంపం చ వప్రంతు షడంశం కలశం యుగం।
తస్యోర్ధ్వే కంప మేకాంశం కంధరం చ ద్విభాగికమ్॥ 63

ఏకాంశం కంపకం ద్వాభ్యాం పట్టం క్షేప..ం మంశకం।
ఆలింగం సార్ధకం చోర్ధ్వే కంప మేకేన కారయేత్॥ 64

అధ్యర్ధాంశం ప్రతిం చైవ సార్ధాంశం వాజనం భవేత్।
వ్యాలరూపాది సింహైశ్చ మకరాది విభూషితమ్॥ 65

తా॥ ఎత్తును 26 భాగములుచేసి పాదుక 1½ భా. పద్మము 2 భా. కంపము 1 భా. వప్రము 6 భా. కుంభము 4 భా. కంపము 1 భా. కంఠము 2 భా. కంపము 1 భా. పట్టము 2 భా. కంపము 1 భా. ఆలింగము 1½ భా. కంపము 1 భా. ప్రతి 1½ భా. వాజనము 1½ భా. చేసినేని శ్రేణీబంధము మొదటి పద్ధతి.





శిల్పరత్నంత్రేణీబంధం    తాత్రగుం...శ్రేణీ బంధం    మానసారశ్రేణీ బంధము.

శ్లో॥ ద్విభాగం జన్మతుంగం స్యాత్తత్సమం చాంబుజం భవేత్।
ఏకాంశం క్షేపణం చైవ వప్రతుంగం రసాంశకమ్॥ 66

కుముదోచ్ఛ్రం యుగాంశం స్యా త్కంప మేకేన కారయేత్।
కంధరం చ ద్విభాగం స్యా త్కంప మంశేన యోజయేత్॥ 67

పట్టికోచ్ఛ్రం ద్విభాగం స్యా త్కంప మంశం తదూర్ధ్వకే।
కర్ణ మేకేన కర్తవ్యం వాజనం చైకభాగికమ్॥ 68

ప్రతిం చైకాంశకం కుర్యాద్ వాజనం చైకభాగికమ్॥ 68½

తా॥ పైజెప్పిన దానిసే పాదుక 2 భా. పద్మము 2 భా. కంపము 1 భా. వప్రము 6 భా. కుముదము 4 భా. కంపము 1 భా. కంఠము 2 భా. కంపము 1 భా. పట్టిక 2 భా. కంపము 1 భా. కర్ణము 1 భా. వాజనము 1 భా. ప్రతి 1 భా. వాజనము 1 భా, చేయవచ్చును. ఇది శ్రేణీ బంధము రెండవ పద్ధతి.

శ్లో॥ త్రిపట్టం కుముదం వాపి ప్రతి మేవం త్రిపట్టకమ్॥ 69

శేషంతు పూర్వవ త్కుర్యాత్ ప్రత్యలంకార సంయుతమ్॥ 69½

తా॥ పైజెప్పినదానినే కుముదమును త్రిపట్టముగాను ప్రతిని త్రిపట్టముగాను మాత్రము మార్చి శేషించిన పనులన్నియును మునుపటివలెనే అన్ని అలంకారములతో చేయవలెను. ఇది శ్రేణీబంధమున మూడవపద్ధతి.

శ్లో॥ తదేవ పట్టికం చోర్ధ్వకంధరం చైకభాగికమ్॥ 70
శేషం పూర్వవదుద్దిష్టం యుక్త్యాలంకార కల్పనం।
ఏవం చతుర్విధం ప్రోక్తం శ్రేణీబంధ మితి స్మృతమ్॥ 71
దేవానా మపి సర్వేషాం హర్మ్యాణాం కల్పయే ద్బుధః॥ 71½



మానసారశ్రేణీబంధము 2






తా॥ పైజెప్పినదానినే కంఠమును మాత్రము త్రిపట్టముగా చేసి మిగిలిన పనులన్నియు అదే విధముగా చేసినచో శ్రేణీబంధమున నాల్గవపద్ధతి యగును. ఇది సమస్త దేవాలయములకును సమస్త హర్మ్యములకును యోగ్యమైనవి.

## 75. ప్రతిసుందరము

### కాశ్యపశిల్పము 6 వ పటలము

శ్లో॥ తలం ద్వాత్రింశ దంశేతు ద్విభాగం పాదుకోన్నతం
అబ్జ మేకేన కంపంతు ఏకాంశేన ప్రకల్పయేత్॥ 69
జగతీ పంచభాగేతు కుముదం చతురంశకం।
పద్మ మేకేన కర్తవ్యం కంప మేకేన కారయేత్॥ 70
కంఠతుంగం ద్విభాగేన కంప మేకేన కారయేత్।
శివాంశం దలతుంగం తు మహాపట్టీ ద్విభాగతః॥ 71
కంప మేకేన కర్తవ్యం వప్రబంధ మితి స్మృతం।
పాదబంధస్య వర్ణం స్యాత్ సర్వధామసు పూజయేత్॥ 72
తన్మహాపట్టికా మానం కపోతం వాఽథ కంధరం।
కపోతోపరి కంపోర్ధ్వే త్రిపట్టం త్వేకభాగయా॥ 73

ప్రత్యుత్సేధం ద్విభాగేన వాజనం త్వేకభాగయా।
తుంగే షడ్వింశ దంశే తు కల్పయే త్ప్రతిసుందరమ్॥ 74

తా॥ లోగడ జెప్పిన వప్రబంధమునకు పైన మహాపట్టికను కపోతముగాగాని కంఠముగాగాని చేసి అందుపైనున్న కంపమును మామూలుగానే యుంచి దానిపైన 1 భాగము త్రిపట్టమును, 2 భాగములు ప్రతిని, 1 భాగము వాజనమును చేసినచో మొత్తము 26 భాగములగును. దీనిని ప్రతిసుందర మందురు. ఇది పాదబంధజాతి.

## 76. మయబంధము

శిల్పరత్నము 19 వ అధ్యాయము

శ్లో॥ అధిష్ఠానస్య చోత్సేధే షడ్వింశతి విభాజితే।
ఉపానం త్వేకభాగేన జగత్యుచ్చం రసాంశకమ్॥ 76

కుముదం పంచభాగేన కంప మేకేన కారయేత్।
గుణాంశం గలమానం తు కంప మేకేన కల్పయేత్॥ 77

పద్మ మేకేన కర్తవ్యం కపోతోచ్చం గుణాంశకం।
ఆలింగ మేకభాగేనా ప్యంతరీ తు శివాంశతః॥ 78

ప్రతితుంగం ద్విభాగేన శివాంశం వాజనోదయం।
ప్రతిబంధ విశేషోఽయం మయబంధ ఇతి స్మృతః॥ 79

తా॥ అధిష్ఠానోన్నతమును 26 భాగములుచేసి పాదుక 1 భా. జగతి 6 భా. కుముదము 5 భా. కంపము 1 భా. గలము 3 భా. కంపము 1 భా. పద్మము 1 భా. కపోతము 3 భా. ఆలింగము 1 భా. అంతరితము 1 భా. ప్రతి 2 భా. వాజనము 1 భా. ఇట్లు చేసినచో మయ బంధమగును. ఇది ప్రతిబంధ జాతి. మయమతమునందు చెప్పబడిన పద్మబంధమును గూడ శ్రీకుమారుడు తనశిల్పరత్నమున జేర్చికొనినట్లు శ్లోకములు కన్పట్టుచున్నవి.

## 77. పద్మబంధము

శిల్పరత్నము 19వ అధ్యాయము

శ్లో॥ అధిష్ఠానస్య చోత్సేధే షడ్వింశతి విభాజితే॥ 82
ఉపానం త్వేకభాగేన జగత్యుచ్చం రసాంశకం।
కుముదం పంచభాగేన కంప మేకేన కారయేత్॥ 83

గుణాంశం గలమానం తు కంప మేకేన కారయేత్।
పద్మ మేకేన కర్తవ్యం కపోతోచ్చం గుణాంశతః॥ 64
ఆలింగ మేకభాగేన తత్సమం త్వంతరీ భవేత్।
ప్రతితుంగం ద్విభాగేన శివాంశం వాజనోదయమ్॥ 65
ప్రతిబంధన భేదం తత్ పద్మబంధ ముదాహృతమ్॥ 65½

ఈ శ్లోకమునకు తాత్పర్యమవసరములేదు. పైనిచెప్పిన మయబంధముయొక్క కొలతలేయివి.

## 78. రత్నబంధము

### మానసారము 14 వ అధ్యాయము

శ్లో॥ రత్నబంధ మధిష్ఠానం షడ్వింశ త్యంశకం భవేత్।
అధ్యర్ధాంశం తు జన్మస్యా దర్ధాంశం క్షుద్రవాజనం॥ 141
వప్ర మంశం తు పద్మంస్యా త్తదూర్ధ్వేఒర్ధేన చాసనం।
రత్నవప్రం తు బంధ్వంశ మర్ధే నాబ్జంతు కారయేత్॥ 142
తత్సమం చోర్ధ్వకంపం స్యా న్నిమ్న మర్ధేన కారయేత్।
ఊర్ధ్వ మర్ధేన కంపం స్యా దర్ధే నాబ్జం తదూర్ధ్వకే॥ 143
రత్నకంపం ద్విభాగం స్యా త్తదూర్ధ్వే ఒర్ధేన పంకజం।
ఊర్ధ్వ మర్ధేన కంపం స్యా త్కంధరం చ ద్విభాగికం॥ 144
కంపం పద్మం శివాంశం స్యా ద్రత్నపట్టం కలాంశకం।
తదూర్ధ్వే పద్మకంపం చ వ్యోమాంశే నైవ యోజయేత్॥ 145
అధ్యర్ధాంశం తు కర్ణం స్యా దర్ధాంశం చోర్ధ్వవాజనం।
అర్ధేనాబ్జం తదూర్ధ్వే తు ద్వయాంశం తు కపోతకం॥ 146
ఆలింగం చార్ధభాగేన శేషం తత్ప్రతివాజనం।
తద్దేశం వ్యాలరూపాది మకరాది విభూషితం॥ 147
అన్య త్సర్వాంగకైః రత్నైః పంకజై శ్చ విభూషితం।
శివవిష్ణ్వాలయే కుర్యా ద్రత్నబంధ ముదీరితమ్॥ 148

తా॥ అధిష్ఠానోన్నతమును 26 భాగములుచేసి పాదుక 1½ భా. క్షుద్రవాజనము ½ భా. జగతి 1 భా. పద్మము ½ భా. కంపము ½ భా. రత్నవప్రము 4 భా. పద్మము ½ భా. ఊర్ధ్వ కంపము ½ భా. నిమ్నము ½ భా. కంపము ½ భా. పద్మము ½ భా. రత్నకంపము 2 భా. పద్మము ½ భా. కంపము ½ భా. కంఠము 2 భా. కంపము ½ భా. పద్మము ½ భా. రత్నపట్టము 2 భా. పద్మము ½ భా. కంపము ½ భా. కర్ణము ½భా. వాజనము ½ భా. పద్మము ½ భా. కపోతము 2 భా. ఆలింగము ½ భా. ప్రతివాజము 1½ భా. ఇట్లు చేసినేని రత్నబంధమగును. ప్రతివాజనమునందు వ్యాలములు మకరములు మొదలయినవి చేయవలెను ఇతర ప్రదేశములందును రత్నములతోను అలంకారము చేయవలెను.



కాశ్యప శిల్పము ప్రతిసుందరము.






మానసార రత్నబంధము

## 79. కుక్షిబంధము

### మానసార 14 వ అధ్యాయము

శ్లో॥ తుంగే షడ్వింశ దంశే చ జన్మతుంగం కలాంశకం॥ 163

క్షుద్రోపానం శివాంశం స్యా త్పద్మతుంగం కలాంశకం।
ఏకేన కంపకం చోర్ధ్వే కంధరం చ ద్విభాగికం॥ 164

తదూర్ధ్వే కంప మేకాంశం పద్మ మేకేన కారయేత్।
సప్తాంశం కుముదోచ్చం స్యా త్పద్మ మేకేన కారయేత్॥ 165

కంప మేకం తదూర్ధ్వం చ ద్వ్యంశకై ర్గల మేవచ।
తదూర్ధ్వే కంప మేకాంశం పద్మ మేకేన కారయేత్॥ 166

కపోతోచ్చం ద్విభాగం స్యా చ్ఛేషం తత్ప్రతివాజనం।
వృత్తం వా పట్టకంపం వా కపోతం వాఽపి పట్టకౌ॥ 167

అధఃకర్ణ ద్వయోర్దేశే వ్యాలరూపాది భూషితమ్॥ 167½

తా॥ ఎత్తును 26 భాగములుచేసి, పాదుక 2 భా, క్షుద్రపాదుక 1 భా, పద్మము 1 భా, కంపము 1 భా, కంఠము 2 భా, కంపము 1 భా, పద్మము 1 భా, కుముదము 7 భా, పద్మము 1 భా, కంపము 1 భా, కంఠము 2 భా, కంపము 1 భా, పద్మము 1 భా. కపోతము 2 భా, ప్రతివాజనము 1 భా, పట్టకంపమును వృత్తముగాను, కపోతమును పట్టముగాను చేయవచ్చును.

వ్యాలము మకరము సింహము మొదలగు సమస్త రూపములతో నలంకరించవలెను. ఇది కుక్షి బంధము మూడవ పద్ధతి.

## 80. మంచబంధ భేదములు

శిల్పరత్నము 16వ అధ్యాయము

శ్లో॥ తుంగే షడ్వింశ దంశే ఖుర మథ జగతీ క్షైరవం కంపకర్ణే।
కంపం పద్మం కపోతం తదుపరి చ తథా నిమ్నమంతాదివక్త్రిం।
కంపం భాగేన షడ్భిః శర శశి గుణ చంద్రై9 క వేదాంశ కాంత్రై।
ర్ద్వాభ్యా మేకేన కుర్యా దమర నరపతే ర్మందిరే మంచబంధమ్॥ 59

తా॥ ఎత్తును 26 భాగములుచేసి అందు ఖురము 1 భా, జగతి 6 భా, కుముదము 5 భా, కంపము 1 భా, కర్ణము 3 భా, కంపము 1 భా, పద్మము 1 భా, కపోతము 4 భా, నిమ్నము 1 భా, అంతరితము 2 భా, కంపము 1 భా. చేసినచో మంచబంధమగును. ఇది ప్రతిబంధజాతి.

కాశ్యపశిల్పము 6 వ పటలము

శ్లో॥ అధిష్ఠానస్య చోత్సేధం షడ్వింశతి విభాజితే॥ 56

ఉపానం త్వేకభాగేన జగత్యుచ్చం రసాంశకమ్।
కుముదం పంచభాగేన కంప మేకేన కారయేత్॥ 57

గుణాంశం గలమానం తు కంప మేకేన కల్పయేత్।
పద్మ మేకేన కర్తవ్యం కపోతోచ్చం గుణాంశకం॥ 58

ఆలింగం త్వేకభాగేనాం తరితం తు ప్రకల్పయేత్।
ప్రతిం కుర్యాత్ ద్విభాగేన శివాంశం వాజనోదయమ్॥ 59

ప్రతిబంధస్య వర్గం స్యాత్ మంచబంధ ముదాహృతమ్॥ 59½

తా॥ అధిష్ఠానము యెత్తును 26 భాగములుచేసి ఉపానము 1 భా. జగతి 6 భా. కుముదము 5 భా. కంపము 1 భా. గలము 3 భా. కంపము 1 భా. పద్మము 1 భా. కపోతము 3 భా. ఆలింగము 1 భా. అంతరితము 1 భా. ప్రతి 2 భా వాజనము 1 భా. కలది మంచబంధము ప్రతిబంధ జాతి.



మానసారే కుక్షిబంధము



శిల్పరత్నే మంచబంధము



కాశ్యపశిల్పము మంచబంధము

సింహాముపైన పట్టముగాని, పద్మము గోపానముగాని, పాలికయుంచు ఇమిడ్చి మిగిలిన పనులన్నియును ఆలోచనతో చేయవలెను.

శ్లో॥ అథ వా తస్యమూలే వా పాలికాదీని విన్యసేత్॥
ఏవం తు పాలికా స్తంభం కుంభ స్తంభ మి హోచ్యతే॥ 36

తా॥ లేక సింహామునకు దిగువ పాలిక మొదలైనవి చేయవచ్చును. ఇది పాలికా స్తంభము. ఇక కుంభ స్తంభమును చెప్పుచున్నాను.

శ్లో॥ ఏకదండే నాంఘ్రిమూలే పాలికోన్నత మిష్యతే।
త ద్విస్తారం ద్విదండేన కుంభతుంగం ద్విదండకమ్॥ 37
త ద్విస్తారం త్రిదండం స్యా త్తదర్థం వాఽస్యతుంగకం।
తత్పాద స్యాగ్రకే కుర్యా న్నాసికా పంజరాన్వితమ్॥ 38
శ క్తిధ్వజం చై కదండం నాసితుంగం ద్విదండకమ్।
తత్సమం విహ్వృతం చైవ చై కదండం గలోదయమ్॥ 39
విశాలం తద్ ద్వయం చాధః పంజరోదయ మీరితమ్।
త ద్విశాలం ద్విదండం స్యా దేకై కం దండ మేవచ॥ 40

తా॥ స్తంభము మొదట 1 దండము ఎత్తున పాలికను చేయవలెను. దాని విస్తారము 2 దండములు. కుంభము యెత్తు 2 దండములు. కుంభ విస్తారము 3 దండములు. ఎత్తు 1½ దండము కూడ చేయవచ్చును. స్తంభముయొక్క చివర నాసికను పంజరముతోసహా చేయవలెను. నాసిక యెత్తు 2 దండములు. శక్తిధ్వజము యెత్తు 1 దండము. నాసితుంగముతో సమానముగా విహ్వృతమును చేయవలెను. గలము 1 దండము చేయవలెను. గలముయొక్క విశాలము 2 దండములు చేయవలెను. పంజరము పొడవు 2 దండములు, దాని విశాలము 1 దండము, ఎత్తు 1 దండము చేయవలయును.

శ్లో॥ యథా శోభం తథా కుర్యా త్త స్యాధో వీరకంఠకమ్।
పాదతార సమోత్సేధం విస్తారం తత్సమం భవేత్॥ 41
తస్యాధః ఫలకాదీని పూర్వవ త్కారయే త్క్రమాత్।
కుంభ స్తంభ మితి ప్రోక్తం కోష్ఠస్తంభాది వక్ష్యతే॥ 42

తా॥ అందమును తెలుసుకొని చక్కగా చేయవలెను. ఆ పంజరమునకుదిగువ వీరకంఠమును చేయవలెను. స్తంభముయొక్క విస్తారములతో సమానముగా దాని విస్తారమును ఎత్తు విస్తారముతో సమానముగాను చేయవలెను. దానికి దిగువ ఫలకము మొదలైనవి మునుపటి వలెనే వరుసగా చేయవలెను. దీనిని కుంభ స్తంభమని చెప్పుదురు. కోష్ఠస్తంభము మొదలైనవి చెప్పబోవుచున్నాను,

శ్లో॥ కోష్ఠకం తద్ ద్విపార్శ్వేతు ఋజుపాదాకృతి తథా।
పంజరం చోత్తరాదీం శ్చ కోష్ఠవాసాకృ (శ్రీ) తథా॥ 43

తదేవ కోష్ఠపాదే చ తదూర్ధ్వే పంజరాదికమ్।
మూలపాద విశాలేన పంజరాదీని కారయేత్॥ 44

పంజరం చ ద్విదండేన తదర్ధం చోర్ధ్వకే గలమ్।
తదూర్ధ్వే చ ద్విదండేన నాసికా శిఖరాన్వితమ్॥ 45

తదర్ధం స్తూపికోత్తుంగం త న్మహానాసి కాశ్రయే॥ 45½

తా॥ స్తంభమునకు రెండువైపుల కోష్ఠములను చక్కగా స్తంభములవలెనుచేసి పంజరము ఉత్తరము మొదలైనవిచేసి కోష్ఠమునుండి అన్ని ఆకారములనుచేసి అదియే కోష్ఠస్తంభమునను దానిపైన పంజరము మొదలైనవి, మూలపాదముయొక్క విశాలముతో సమానముగా పంజరము మొదలైనవి చేయవలెను. పంజరము 2 దండములు, దానిపైన గలము 1 దండము, దానిపైన 2 దండములు నాసికయును, శిఖరమును, స్తూపిక ½ దండమును, చేయవలెను అది మహానాసికను ఆశ్రయించి యుండవలెను.

శ్లో॥ అథ వా మూలపాదోచ్చం పంక్తి శం ప్రాప్త భాజితే॥ 46

తత్త ద్భాగే గుణాంశేన కోష్ఠోర్ధ్వే భూషణోదయమ్।
తత్తుంగం పంచధా కృత్వా చైకాంశం పంజరోదయం॥ 47

తత్సమం గ్రీవతుంగం స్యా త్తద్ ద్వయం నాసితుంగకమ్।
స్తూపితుంగం తదర్ధం స్యా న్నాసికాగ్రం చ తత్సమం॥ 48

ద్విదండా ద్దండవృద్ధ్యా చ దశదం డావసానకమ్।
పంజరాది విశాలం య చ్ఛేషం చోర్ధ్వేఽంఘ్రికం భవేత్॥ 49

తా॥ మొదటి స్తంభము యెత్తును 10-9-8 భాగములుచేసి అందులో 3 భాగములు కోష్ఠముపైన భూషణముల అంతము. ఆ యెత్తును 5 భాగములుచేసి అందు పంజరము 1 భా, గ్రీవము 1 భా, నాసి 2 భా, స్తూపి 1 భా, చేసి ఆ స్తూపి చివర నాసికాగ్రముతో సమానముగా నుంచవలెను. 2 దండములు మొదలుకొని 1-1 దండముచొప్పున వృద్ధిచేయుచు ఇట్లు 10 దండముల వరకు పంజరము మొదలైన వానియొక్క విశాలము పోను మిగిలినది పైన స్తంభమగును.

శ్లో॥ ఏకోన వింశదంశం స్యా త్పంజరోచ్చం విభాజితే।
ద్విభాగం చోత్తరోత్తుంగ మేకాంశం వాజనోదయమ్॥ 50

ఊర్ధ్వపద్మం ద్విభాగం స్యా ద్వాజనం చైకభాగికమ్।
అష్టాంశేనకపోతోచ్చ మూర్ధ్వే చాలింగ మంశకమ్॥ 51

తత్సమం చాంతరం చోర్ధ్వే ద్వ్యంశం తత్ప్రతికోన్నతమ్।
తదూర్ధ్వే వాజనం చాంశం శేషం యుక్త్యా ప్రయోజయేత్॥ 52

తా॥ పంజరము యెత్తును 19 భాగములుచేసి అందు ఉత్తరము 2 భా. వాజనము 1 భా దానిపైన పద్మము 2 భా. వాజనము 1 భా. కపోతము 8 భా. అలింగము 1 భా. అంతరితము 1 భా. ప్రతి 2 భా. వాజనము 1 భా. ఇట్లు చేసి మిగిలినవి ఆలోచించి చేయవలెను.

శ్లో॥ గ్రీవతుంగం త్రిధా భజ్య మేకాంశం వేదికోన్నతం।
గ్రీవతుంగం సపాదాంశం శేషాంశం గ్రీవభూషణం॥ 53

వేదికోర్ధ్వం తు సప్తాంశం సార్ధవహ్ని గలోదయం।
తదూర్ధ్వే కంప మేకాంశం సార్ధాంశం పద్మతుంగకం॥ 54

తదూర్ధ్వే వాజనం చాంశ మాయామం వా త్రిభాగికం।
ఏకాంశం మధ్యభద్రం తు మధ్యే యుక్త్యా ప్రకోష్ఠకమ్॥ 55

తా॥ గ్రీవము యెత్తును భాగములుచేసి అందు వేదిక 1 భా. గ్రీవము $1\frac{1}{4}$ భా. గ్రీవ భూషణము $\frac{3}{4}$ భా.అనగా పై అలంకారము. వేదిక యెత్తును 7 భాగములుచేసి అందు గలము $4\frac{1}{2}$ భా. కంపము 1 భా పద్మము $1\frac{1}{2}$ భా. వాజనము 1 భా. చేసి వాజనము యొక్క పొడవు 3 భా. చేయవలెను. మధ్య భద్రమును 1 భా. యుక్తితో చేయవలెను.

శ్లో॥ గ్రీవ భూషణ తుంగేచ విభజే త్తు షడంశకం।
ద్విభాగం చోత్తరోత్సేధం తదర్ధం వాజనం భవేత్॥ 56

ద్విభాగం చ గలోత్సేధం వాజనం చైకభాగిం।
మధ్యకోష్ఠోత్తరం తత్ స్యాత్ క్షుద్రపాదౌ సుభూషితౌ॥ 57

పంజరే ప్రతికాయామే చాష్టభాగే విభాజితే।
సప్తాంశం వేదికాయామం పద్మవాజన మంశకం॥ 58

వేదితారం చతుర్భాగం త్రిభాగం గ్రీవవిస్తృతం।
వేదితార సమం నాసి శాలాయామం ప్రకల్పయేత్॥ 59

తదాయామే త్రిభాగైకం మధ్యనాసి విశాలకం।
విశాలార్ధం త్రిపాదం వా మధ్యనా స్యుదయం భవేత్॥ 60

తా॥ గ్రీవ భూషణము యొక్క యెత్తును 6 భాగములుచేసి అందు ఉత్తరము 2 భా. వాజనము 1 భా. గలము 2 భా. వాజనము 1 భా. చేయవలెను. మధ్యకోష్ఠము నందలి ఉత్తరమున క్షుద్ర స్తంభములు రెండుండవలెను. పంజరము యొక్క ప్రతి పొడవును 8 భా. చేసి వేదిక 7 భా. పద్మము $\frac{1}{2}$ భా. వాజనము $\frac{1}{2}$ భా. చేయవలెను. వేది విస్తారమును 4 భా. చేసి అందు 3 భా. గ్రీవ

విస్తారమును చేయవలెను. వేది విస్తారముతో సమానముగా నాసిశాలాయామమును చేయవలెను. ఆశాలాయామమును 3 భా. చేసి అందు 1 భా. మధ్య నాసి విశాలమును చేయవలెను. ఆవిశాలములో సగముగాని ముప్పాతిక వంతుగాని మధ్య నాసి యొక్క చివర యగును.

శ్లో॥ పార్శ్వయో ర్బహునాసో్య శ్చ శిఖరస్య సమోన్నతం।
తచ్ఛిఖం చోత్తరాంతం స్యాత్కింనరీ వక్త్రి సంయుతం॥ 61

నాసికా పత్రసంయుక్తం మధ్యం క్షుద్రం చ నిమ్నకం।
శిరస్యూర్ధ్వే పట్టికానాం మధ్యనాసి శిఖాంతకం॥ 62

శిరోలంబోత్తరాంతం వా వలభీ యుక్తమేవ వా।
శిఖరస్యోర్ధ్వే పట్టొచ్ఛ ముత్తరోచ్ఛ్రం సమంభవేత్॥ 63

తదూర్ధ్వే వాజనం పద్మం నిమ్నం కుంభం సదండకమ్।
పద్మం వాజన మబ్జంచ తదగ్రే కుడ్మలాన్వితమ్॥ 64

ఏతత్ స్తూపిత్రయం ప్రోక్తం భాగం యుక్త్యా ప్రయోజయేత్।
తచ్ఛిరః సమలంకృత్య పత్రవల్ల్యాది శోభితమ్॥ 65

ఏత త్పంజరశాలాం చ పద్మమేకం శిఖాత్రయం।
సర్వాలంకార సంయుక్తం కుర్యాద్వై తక్షకోత్తమః॥

తా॥ ప్రక్కల బహునాసి యొక్క యెత్తు శిఖరముతో సమానముగా నుండవలెను. వాని యొక్క శిఖరములు ఉత్తరము యొక్క పైభాగమునకు సరిపోవలెను అశ్వముఖమును మానవ శరీరమును గల దేవతాజాతి ప్రతిమలను చేయవలెను. నాసియందు అలంకారమైన పత్రములను చేయవలెను. మధ్య క్షుద్రము నిమ్నము శిఖరము యొక్క పైభాగమున పట్టికల పైభాగము మధ్య నాసి శిఖవరకును. శిఖరము యొక్క లంబము ఉత్తరము పైభాగము వరకును, వలభితో కూడియును ఉండవలెను. శిఖరముపైన పట్టముయెత్తు ఉత్తరము యెత్తుతో సమానముగా నుండవలెను. దానిపైన వాజనము, పద్మము, నిమ్నము, కుంభము ఈనాలుగు 1 దండము ఉండవలెను. పద్మము, వాజనము, పద్మము ఆపైన మొగ్గ ఉండవలెను. దీనిని స్తూపిత్రయమని చెప్పుదురు. వీని యొక్క భాగములు అందమునకు దగినట్లు ఆలోచనతో చేయవలెను. తరువాత శిఖరమును అలంకారముగాచేసి లతలు పత్రములు చక్కగా తీర్చవలెను. ఇది పంజరశాలయగును. దీనికి పద్మము ఒక్కటి చేసి 3 శిఖరములు సమస్తమైన అలంకారములతో శిల్పాచార్యుడు చేయవలెను.

శ్లో॥ అథ వా తోరణం కృత్వా స్తంభస్యోపరి వాజనం।
మూలపాద విశాలే తు చైకదండం తథోన్నతమ్॥ 67

పూర్వవ ద్భాగమానేన చో త్తరాది క్రియాన్వితం।
తతూర్ధ్వే తోరణ స్యాంతే మకరపత్ర సంయుతమ్॥ 68

తదూర్ధ్వే తోరణాంతం స్యా దేకదండం తు తచ్ఛిరః।
మకరీ వ క్త్రసంయు క్తం సర్వాలంకార శోభితమ్॥ 69

కోష్ఠస్య పార్శ్వయో శ్చైవ క్షుద్రపాద సమన్వితమ్।
మూలపాద విశాలేన త్రిపాత్ క్షుద్రాంఘ్రి తారకమ్॥ 70

తస్య పాదవిశాలేన మానయే త్పాదభూషణమ్।
ఫలకాద్యంత కాద్యంచ వీరకంఠం కరై కకమ్॥ 71

తా॥ మరియు తోరణమునుచేసి స్తంభముపైన వాజనమును, మొదటి స్తంభము యొక్క విశాలమున 1 దండము అప్రకారముగా యెత్తును మునుపటివలె భాగమానముచేత ఉత్తరము మొదలైనవిచేసి వానిపైన తోరణము యొక్క పై భాగమున మకర పత్రములను తీర్చి దానిపైన తోరణము చివర 1 దండము దాని శిఖరము. మకర ముఖములనుచేసి సమస్తమైన అలంకారములతో నుండునట్లుచేసి కోష్ఠము యొక్క ప్రక్కలను క్షుద్ర స్తంభములను అమర్చవలెను, మూల స్తంభముయొక్క విస్తారములో మువ్వాతికవంతు క్షుద్ర స్తంభ విస్తారమును చేయవలెను. దానియొక్క స్తంభ విశాలముచేత స్తంభాలంకారమును ఫలకమును మొదలు చివర చేయవలెను. వీరకంఠము 1 దండము పరిమితి కలిగి యుండవలెను.

శ్లో॥ బోధికాదిం వినా యు క్తం ఫలకాది క్రియాం న్యసేత్।
ద్విదండం ఫలకాయామం చా ధ్యర్ధం కుంభవి స్తృతమ్॥ 72

క్రోటివ క్త్రం సపాదంస్యా త్తుంగం ప్రాగు క్తవ న్నయేత్।
సర్వాలంకార సంయు క్తం యుక్త్యాతత్రైవ యోజయేత్॥ 73

బోధికాంతం లలాటే స్యా దుత్సేధం చోర్ధ్వవాజనమ్।
తద్వాజనం తు పాదాంతం పార్శ్వయో స్తన్ముఖావృతమ్॥ 74

తా॥ బోదెలు మొదలైనవి లేకుండ ఫలకములు మున్నగువానితో చేసినట్లయిన ఫలకము యొక్క పొడవు 2 దండములును, కుంభము యొక్క విస్తారము 1½ దండమును, నాసి ముఖము 1¼ భా. యెత్తును పూర్వము చెప్పబడినట్లు చేయవలెను. అన్ని అలంకారములతో చేయవలెను. బోదెల యొక్క పైభాగము వరకు లలాటమునకు యెత్తు అగును. దానిపైన వాజనమును, ఆవాజనము స్తంభములపై భాగమునను ప్రక్కలను ముఖమునకు రెండు వైపులను చేయవలెను.

శ్లో॥ అధోభాగే త్రిభాగై కం మధ్యభద్రాకృతిం న్యసేత్।
తద్ ద్విపార్శ్వేతు చైకైకం కంఠంఛేదన మిష్యతే॥ 75

పార్శ్వయో ర్వాజనస్యాధో వ క్త్రం వజ్రాకృతిం తథా।
ఊర్ధ్వవాజన మప్యుక్త్యా కుర్యాత్ క్షుద్రాది వాజనమ్॥ 76

పార్శ్వయోః స్తంభ స్తయో ర్ధ్వే మధ్య భద్రాది భూషితమ్।
ద్వాభ్యాం తత్కంఠదండాంతం మధ్యే పార్శ్వేచ నిమ్నకమ్॥ 77

బోధికే చ త రంగం స్యా త్సర్వాలంకార సంయుతం।
తదేవ తుంగమానే తు ద్వాదశాంశే విభాజితే॥ 78

అధోభాగే త్రిభాగేన త రంగాకృతిం విన్యసేత్।
తదూర్ధ్వే బోధికోత్సేధం షడంశేన విశేషతః॥ 79

ప్రఫుల్లాస్యం తు సర్పాభం పుష్పసంప ద్వదాననం।
తదూర్ధ్వే శిరసఊర్ధ్వే చాంశేన హారికా భవేత్॥ 80

తా॥ క్రింది ప్రదేశమును 3 భాగములుచేసి నడుమ భద్రాకారమును చేయవలెను. దాని యొక్క యిరు వైపుల ఒక్కొక్క భాగము కంఠమును చేయవలెను. ఇరు ప్రక్కల వాజనము క్రింద వజ్రాకారముగ ముఖమును చేయవలెను. అదే ప్రకారముగా పైన వాజనము కూడ ఆలోచనతో చక్కగాచేసి తరువాత క్షుద్రవాజనము మొదలైనవి కూడ చేయువలెను. ఇరు ప్రక్కల స్తంభములును వానిపైన మధ్య భద్రముతో అలంకారమును చేయవలెను. ఆరెంటిచేత కంఠము యొక్క పరిమితి దండము అంతమున నడుము ప్రక్కలను నిమ్నము చేయవలెను. బోదె యందు అలలను చేయవలెను. అది సమస్తమైన ఆలంకారములతో నుండవలెను. అదియేయెత్తును 12 భా. చేసి దిగువ ప్రదేశమున 3 భా. తరంగముల యొక్క ఆకారమును చేయవలెను. ఆపైన బోదె యొక్క యెత్తును 6 భా. చేసి బాగుగా వికసించిన పాముపడగవలె పుష్పవికాసమువలె ముఖమునుచేసి ఆపైన శిఖమీద 1 భా. హారమును చేయవలెను.

శ్లో॥ ఏకదండం త్రిపాదం వా వాజనాంతం శిఖోన్నతమ్।
తస్మాత్త దాయతే దీర్ఘే నిర్గమస్య అధోముఖమ్॥ 81

కదలీ సూనదండా భ మగ్ని మూర్ధ్వే నిరోపమమ్।
అగ్రే సమగలం చైవ త రంగం త త్సమాదికమ్॥ 82

లలాటే చిత్రం భాగైక మధోమూర్ధ్ని విశాలకమ్।
తదూర్ధ్వే కంఠభాగేన కర్ణ కం పాబ్జ వాజనమ్॥ 83

పత్రవల్ల్యాది రత్నైశ్చ పుష్పచిత్రాది భూషితమ్।
సర్వాలంకార సంయుక్తం పుష్పబోధిక మీరితమ్॥ 84

ఉపపీఠ వదాకారం దండకాదీని విన్యసేత్।
క్షుద్ర కం పైశ్చ పద్మైశ్చ పుష్ప రత్నైశ్చ భూషితమ్॥ 85

తా॥ హారముపైన 1 దండముగాని ముప్పాతిక వంతుగాని వాజనము వరకు శిఖరము యెత్తు. దాని పొడవునుండి నిర్గమము యొక్క నిడుపు అధోముఖముగ నుండవలెను. అది అరటి మొగ్గ కాడవలె అందముగాను పైనదానితో సమానముగా గలమును చేయవలెను. దానితో సమానము కంటె అధికముగా తరంగమును చేయవలెను. లలాటమున చిత్రము 1 భా. చేయవలెను. దాని దిగువ శిరస్సుయొక్క విస్తారమును, దానిపైన కంఠమునందు కరమును, కంపమును, పద్మమును, వాజనమును, లతలతోను పత్రములతోను రత్నములతోను పుష్పములు మొదలైన చిత్రములతోను అలంకారముగా చేయవలెను. దీనిని పుష్పబోధి యందురు. ఉపపీఠమువలె రూపమును దండము మొదలైనవి చేయవలెను. క్షుద్రకంపములచేతను పద్మములచేతను పుష్పముల చేతను రత్నములచేతను అలంకారముగా చేయవలెను

శ్లో॥ తరంగం దండకంచైవ బోధికా దీనిపాలికా।
ఏకవక్త్రం ద్వివక్త్రం వా త్రివక్త్రం చతురాననమ్॥ 86

పంచషట్ సప్తాష్టం వా యథాశక్తి వశాన్న్యసేత్।
తదూర్ధ్వే వీరకంఠే తు ఫలకా బోధికాంతరమ్॥ 87

ఆధారార్థం తు శోభార్థం సింహ చిత్రాది మండితమ్।
వీర కంఠోదయం జ్ఞాత్వా నవభాగే విభాజితే॥ 88

ఏకాంశం పాదుకం కుర్యా త్పంచభాగం తు సంగ్రహమ్।
తదూర్ధ్వే హారి కంఠాంశ మబ్జమంశేన కారయేత్॥ 89

తదూర్ధ్వే వాజనం చాంశం సంగ్రహం చద్వివక్త్రికమ్।
పద్మాగ్రా కృతి రగ్రాదీన్ రేఖా మూలవతీ న్యసేత్॥ 90

రత్న వల్ల్యాదినా భూష్యం శేషం యుక్త్యా ప్రయోజయేత్।
సంగ్రహం రూప మిత్యుక్తం వీరకంఠే పురాన్వితమ్॥ 91

తా॥ తరంగమును 1 దండము పొడవు చేయవలెను. బోదెలు మొదలైనవానిని పాలికలు, ఏకముఖము, రెండుముఖములు, 3 ముఖములు, 4 ముఖములు, 5 ముఖములు, 6 ముఖములు, 7 ముఖములు, 8 ముఖములు. వారివారి శక్తికొలది చేయవచ్చును. దానిపైన వీరకంఠమున ఫలకములు బోదెలు మొదలైన వానిలో ఆధారము కొఱకుగాని. అందమునకుగాని సింహములు మొదలైన చిత్రములను చేయవలెను. వీరకంఠము యొక్క పొడవును తెలుసుకొని 9 భా. చేసి 1 భా. పాదుక సంగ్రహము 5 భా. హారికము 1 భా. పద్మము 1 భా. వాజనము 1 భా. సంగ్రహము ద్వివక్త్రముతోగూడి పద్మము యొక్క చివరవలె చివరనుండి గీతలు మొదలు వరకు కలిగియుండి రత్నములతోను తీగె మొదలైన వానితోను అలంకారముగాచేసి మిగిలినవి కూడ యుక్తితో చేయవలెను. ఇది సంగ్రహము యొక్క రూపము. వీరకంఠమున మునుపు చేయబడిన దానితోకూడి యుండినదై.

శ్లో॥ పదాంగా ద్వదనం కృత్వా పశ్చా దుద్ధృత హస్తవత్।
తదేవ సింహరూపైర్వా నాటకాద్యైరలంకృతమ్॥ 92

ఏతత్తు ముష్టిబంధం స్యాత్ ఫలకోచ్చం త్రిభాగికమ్।
అంశేనోత్సంధి తుంగం స్యా త్తదధః క్షేపణం తథా॥ 93

తదధోఽబ్జ మంశకం పక్షం ద్వ్యంశేనాబ్జ మథాఽపి వా।
కుంభోచ్చం చాష్టభాగేన చాంశేన పద్మ కంపకమ్॥ 94

కుంభాధశ్చో ర్ధ్వదేశేతు వటపత్రాది శోభితం।
నిమ్నంచ త్రోటికాదీని యుక్త్యా ప్రాగుక్త వన్న్యసేత్॥ 95

కుంభ స్తంభ ప్రతి స్తంభే కోష్ఠకాదీని చాంఘ్రికే।
కుంభ స్తంభాని సర్వేషా మేవము క్తం పురాతనైః॥ 96

తా॥ స్తంభరూపమునుండి ముఖమునుచేసి వెనుక యెత్తబడిన హస్తమువలె అదియే సింహరూపముల చేతను లేక నాట్యరూపముల చేతను, అలంకారముగా చేసిరేని ముష్టిబంధ మగును. ఫలకమును 3 భా. చేసి 1 భా. పైన పైరూపముతో కలువునది 1 భా. దానిక్రింద క్షేపణము 1 భా. దానిక్రింద పద్మము 1 భా. లేక క్షేపణము · భా. పద్మము 2 భా. చేయవచ్చును. కుంభము యెత్తు 8 భా. చేసి పద్మము కంపము 1 భా. కుంభమునకు దిగువను పైనను మత్తియాకులు మొదలైనవి చేయవలెను. నిమ్నమును నాసికను ఇంకను అవసరమైనవి యేమైనను యుక్తితో చేయవలెను. కుంభ స్తంభము, ప్రతి స్తంభము, కోష్ఠ స్తంభము ఇట్లు అనేక విధములుగా కుంభ స్తంభములను పురాతన శాస్త్రవేత్తలు చెప్పియున్నారు.

శ్లో॥ భువో (వ ఉ) పరిష్ఠాన్మని భాగ తుంగకే త్రిభాగ మంచం గలమంశ మూర్ధ్వకే।
ఫలం (లకం) ద్విభాగం శిరః కుంభ మంశకమ్ క్రమాత్ప్ర కుర్వం త్వితి పంజరాదికమ్॥
పంచభాగ (०) పురతో (త ఉ) క్తతుంగకే ద్వ్యంశకం త్రిపద సార్ధకం త్రిపాత్।
పంచభాగ గలనాసికాననం కుంభయుక్త చరణాగ్ర భూషణమ్॥ 98

తా॥ అధిష్ఠానము మొదలుకొని చివరవరకు 7 భా. చేసి మంచము 3 భా. గలము 1 భా. ఫలకము 2 భా. శిరఃకుంభము 1 భా. ఇట్లు వరుసగా పంజరము మొదలైనవి చేయవలెను. మరియు 5 భా. చేసి అందు మంచము 2 భా. గలము ¾ భా. ఫలకము 1¾ భా. శిరఃకుంభము ¾ భా. ఇట్లుగల నాసికాముఖములను చేయవలెను. కుంభ స్తంభములకుపై యలంకారము లివియని తెలియవలెను.

## 2. కుంభాలంకారము

శ్లో॥ అథవక్ష్యే విశేషేణ కుంభాలంకార ముచ్యతే।
తన్మూల పాలికోత్సేధే విభజేత్తు షడంశకమ్॥ 99

ఏకాంశం పాదుకం చైవ పద్మ తుంగం తు తత్సమమ్।
కంప మర్ధం తదూర్ధ్వే తు కంధరం చద్విభాగికమ్॥ 100
కంప మర్ధేన తస్యోర్ధ్వే పద్మ మంశేన యోజయేత్।
అథవా చోర్ధ్వకే కంపం తస్యాధః పద్మ మంశకమ్॥ 101
కంఠ మేకాంశకం కుర్యాత్ శేషం ప్రాగుక్తవ ద్భవేత్।
తదే వోర్ధ్వే పద్మమర్ధం తస్యోర్ధ్వైకం కపోతకమ్॥ 102
అర్ధేన వాజనం చోర్ధ్వే యథాశోభం తు కారయేత్।
తదూర్ధ్వే కుంభ మూలేత్వే కైకం పాల్యం తు పద్మకమ్॥ 103
తదూర్ధ్వే కంప మర్ధేన శేషం యుక్త్యా యథాకృతిమ్।
తదూర్ధ్వే వక్త్రితుంగం స్యా న్నవభాగే విభాజితే॥ 104
కుంభార్ధాంశేన జన్మ స్యా ద్వాజనం చార్ధభాగికమ్।
పద్మ మంశేన సంయుక్తం కంప మర్ధేన కారయేత్॥ 105

తా॥ కుంభముల యొక్క అలంకారములను చెప్పుచున్నాను. మొదటి పాలిక యొక్క యెత్తును 6 భా. చేసి అందు పాదుక 1 భా. పద్మము 1 భా. కంపము ½ భా. గలము 2 భా. కంపము ½ భా. పద్మము 1 భా. ఇట్లు చేయవలెను. లేదా పైనకంపము 1 భా. దానిక్రింద పద్మము 1 భా. కంఠము 1 భా. దాని దిగువ కంపము 1 భా. దానిక్రింద పద్మము 1 భా. పాదుక 1 భా. చేయవచ్చును. దానినే పైనపద్మము ½ భా. దానిపైన కపోతము 1 భా. ఆపైన వాజనము ½ భా. చేసి దిగువ నాలుగు భాగములును యిష్టము వచ్చినట్లు అలంకారముగా చేయువచ్చును. దానినే కుంభము యొక్క మొదటి పాల్యము 1 భా. పద్మము 1 భా. కంపము ½ భా. చేసి మిగిలిన పనులు ఆలోచనతో చేయవచ్చును. కుంభము యెత్తు 9 భా. చేసి అందులో సగము పాదుక, వాజనము ½ భా. పద్మము 1 భా. కంపము ½ భా. చేయవలెను.

శ్లో॥ సార్ధద్వ్యంశం గలోత్తుంగం కంప మర్ధేన కారయేత్।
తత్సమం పద్మతుంగం స్యా త్సార్ధాంశం తు కపోతకం॥ 103
ఏకాంశం ప్రతి సంయుక్తం సర్వాలంకార సంయుతం।
కంఠతుంగం ద్విభాగం తు పద్మ మధ్యర్ధ మేవవా॥ 107

తా॥ గలమును 2½ భా. చేసి కంపము ½ భా. పద్మము ½ భా. కపోతములు 1½ భా. ప్రతి 1 భా. చేయవలెను. లేదా కంఠమును 2 భా, చేసి పద్మమును 1½ భా. చేయవచ్చును.

శ్లో॥ అథ వా వక్త్రితుంగం స్యా దేకదండేన కారయేత్।
పాలికం చోక్తవ త్కుర్యా ద్యథాశోభం తు కారయేత్॥ 108
అస్యోర్ధ్వే ఒర్ధేన దండేన కుడ్మలాకృతివి న్యసేత్।
తథా స్యా న్నిర్గమం భాగం కుంభాంతం లంబయే త్పునః॥ 109

కుంభమధ్యే రత్నబంధం పత్రం పుష్పం చ విన్యసేత్।
సర్వాలంకార సంయుక్తం పాదమూలే తు విన్యసేత్॥ 110

తా॥ వక్త్రిమును 1 దండముచేసి పాలికను మునుపు చెప్పిన ప్రకారముచేసి అలంకారము ననుసరించి చేయువలెను. దానిపైన ½ దండము మొగ్గను చేయవలెను. ఆమొగ్గయొక్క నిర్గమము 1 భా, కుంభము వరకు చేయవలెను. కుంభమునడుమ రత్నబంధమును పత్రములను పుష్పములను చేయవలెను. అన్ని అలంకారములతో స్తంభము మొదట నుంచవలెను.

శ్లో॥ తదాస్యం నిర్గమం భాగం కుంభాంతం నాసికం భవేత్।
అథ వా నాసికం త్యక్త్వాపంజర స్యోపరి న్యసేత్॥ 111

పాదస్యోర్ధ్వే తు పాల్యంతం పద్మవల్ల్యాది భూషితమ్॥
మూలపాద విశాలం వా తత్త్రిపాద విశాలకమ్॥ 112

ఏతత్కుంభాంఘ్రికం ప్రోక్తం చాంతరాలం చ యోజయేత్।
కుర్యా ద్బహిఃప్రదేశే తు మధ్యే వా చాంతరాలయే॥ 113

భిత్తిమధ్యే చ కూటే చ శిరోదేశే విశేషతః॥
విశాల పంజరాద్యై శ్చ యోజయే చ్ఛిల్పవిత్తమః॥ 114

తా॥ ముఖము యొక్క నిర్గమము 1 భా. నాసికము కుంభము వరకు చేయవలెను. లేక నాసికను వదలి పంజరముపైన నుంచవలెను. స్తంభము యొక్క పైభాగమున పాలిక వరకు పద్మలత మొదలైన వానితో నలంకారముగా చేయవలెను. మూలస్తంభ విశాలముగాని అందులో ముప్పాతిక వంతుగాని, యీ కుంభము యొక్క పాదమును చేయవలెను. అంతరాలమును కల్పించవలెను. అంతరాలము యొక్క నడుముగాని వెలుపలగాని గోడనడుమను కూటమునను శిరోదేశమునను విశాల పంజరము మొదలైన వానిని శిల్పి చక్కగా చేయవలెను.

## 4. స్తంభములకు విశేషలక్షణములు

శ్లో॥ తత్ స్తంభలక్షణం వక్ష్యే శృంగాదీం శ్చోక్తవ న్న్యసేత్।
మూలస్తంభ విశాలేన త్రిపాదం వాఽర్ధ మేవ వా॥ 115

సంయోగ స్తంభవిస్తారం యన్మానో రమ్య ముత్సృజేత్।
బోధికాం ఫలకాంతం చ మూలదండేన మానయేత్॥ 116

సర్వేషాం పాలికాద్యంగ ముపదండేన మానయేత్।
బోధికాదీని సర్వా ని పూర్వవ త్పరికల్పయేత్॥ 117

ఉపపాదాని సర్వేషాం పూర్వపాదే తు యోజయేత్।
ఉపపాదం మూలపాదాంత ముపదండ సమంతకమ్॥ 118

తద్దండస్య త్రిపాదం వా దండార్ధం వాఽథ వాంశకం।
ఏ కోపపాద యుక్తం ద్వి త్ర్యుపపాదేన సంయుతం॥ 119

ఏవం క్రమ మితి ప్రోక్తం మూలే పద్మాసనాన్వితం।
వే దోపపాద సంయుక్తం బ్రహ్మకాంత మి తీరితమ్॥ 120

పం చోపపాద సంయుక్తం శివకాంత మి తీరితమ్।
ష పాంఘ్రిషట్క సంయుక్తం స్కందకాంత మితి స్మృతమ్॥ 121

అ ష్టోపపాద సంయుక్తం విష్ణుకాంత ముదీరితమ్।
సర్వేషాం పాదమూలే తు పాలికాం చోపపీఠవత్॥ 122

కుర్యాత్ సింహస్య రూపం వా పాదం పత్రాది భూషితమ్।
శిలయా దారుణా వాఽపి కారయే దుక్తవ ద్బుధః॥ 123

తా॥ స్తంభములయొక్క లక్షణములను చెప్పుచున్నాను. ఎత్తు మొదలైనవి శాస్త్రోక్త ప్రకారముగా చేయవలెను. మొదటి స్తంభము యొక్క విస్తారమునందు ముప్పాతిక వంతుగాని లేక సగముగాని దానితో కలిపిచేయు స్తంభము యొక్క విస్తారముండవలెను. బోదెలు, ఫలకములు మొదటి దండముతోనే కొలిచి చేయవలెను. పాలిక మొదలైనవి అన్ని రూపములు రెండవ దండముతో కొలిచి చేయవలెను. బోదెలు మొదలైన అన్ని రూపములు మునుపటివలెనే చేయవలెను. ఉప స్తంభములన్నిటిని మొదటి స్తంభముతో కలుపవలెను. ఉప స్తంభము మొదలునుండి చివరవరకు ఉపదండముతోనే చేయవలెను. ఆ ఉపదండమునందు ముప్పాతికగాని లేక సగముగాని లేక సమానముగాని యిట్లు ఉప స్తంభములు ఒకటిగాని రెండుగాని మూడుగాని నాలుగుగాని యిష్టానుసారముగ చేయవచ్చును. ఉప స్తంభములకు మొదట పద్మాసనమును చేయవలెను. నాలుగు ఉప స్తంభములుకలది బ్రహ్మకాంతము. 5 ఉప స్తంభములు కలది శివకాంతము. 6 ఉప స్తంభములు కలది స్కందకాంతము, 8 ఉప స్తంభములు కలది విష్ణుకాంతము అన్నిటికి స్తంభము

బ్రహ్మకాంతము. రుద్రకాంతము    విష్ణుకాంతము    స్కందకాంతము    శివకాంతము



మొదట పాలిక ఉపవీతమువలె చేయవలెను. సింహరూపమునుగాని పత్రములు మొదలైనవానితో గాని స్తంభములకు అలంకారము చేయవలెను. శిలాస్తంభములైనను దారుస్తంభములైనను ఇట్లు చేయవలెను.

## 5. (కాశ్యపశిల్ప) స్తంభలక్షణము

### కాశ్యపశిల్పము శివ పటలము

శ్లో॥ అథ వక్ష్యే విశేషేణ చరణాయామ విస్తరమ్।
ఆకారం భూషణం చైవ సంక్షేపాత్ శృణు సువ్రత॥ 1

స్తంభం చ తలిపం చైవ జంఘా చరణ మేవ వా।
స్థాణు స్థూణ శ్చ పాదశ్చ పర్యాయ వచనాని చ॥ 2

ఉత్సేధాంశేన మానేన పాదాయామో విధీయతే।
ఉక్తాధిష్ఠాన తుంగస్య ద్విగుణం వా ఒంఘ్రితుంగకమ్॥ 3

తస్మా త్తారత లోచ్చం తు షష్ఠాంశం త్వధికం తు వా।
పాదోచ్చం పంక్తి నం దాష్ట భాగైకం వా ఒంఘ్రివిస్తరమ్॥ 4

దారుపాదతలం హ్యేత త్కుడ్యపాద మథోచ్యతే।
తదర్థం వా త్రిభాగైకం చతుర్భా గోన మేవ వా॥ 5

ఆఢ్య స్తంభ విశాలం స్యా దేత త్సర్వం సుధామసు।
ప్రతే రుత్తరసీమాంతే విశాల స్తంభ ఉచ్యతే॥ 6

ఉపానా ద్యుత్తరాంతసో నిఘాతాంఘ్రి స్త దుచ్యతే।
తుంగం సప్తాంశ మథ వా నవ ధర్మాంశ ఏవవా॥ 7

రుద్ర భా న్వంశకం వాఒథ కృ త్త్యేకాం శాంఘ్రి విస్తరమ్।
త న్మూలతార మాఖ్యాతం తత్తారం తు తథా భజేత్॥ 8

తా॥ స్తంభలక్షణమును చెప్పుచున్నాను. పొడవు, వెడల్పు, మందము, ఆకారము, అలంకారములు మొదలైనవి అన్నియును సంగ్రహముగా చెప్పుచున్నాను. స్తంభము, తలిపము, జంఘ, చరణము, స్థాణువు, స్థూణము, పాదము, ఇవి పర్యాయ నామములు, అధిష్ఠానము యెత్తునకు రెట్టింపుగాని లేక నాల్గవవంతు అధికముచేసిగాని, లేక ఆఱవ భాగమును అధికముచేసిగాని స్తంభము పొడవును చేయవలెను. ఆయెత్తును 10 భా. గాని 9 భా. గాని 8 భా. గాని చేసి అందులో 1 భా. స్తంభము విస్తారమును చేయవలెను. విస్తారమెంతో అంతే మందమును చేయవలెను. ఇది దారుపాదతలము. ఇప్పుడు చేసిన స్తంభములో సగముగాని ముప్పాతిక భా.గాని లేక అందులో మూడవవంతుగాని గోడలో కలిపిచేయు స్తంభమును చేయవలెను. ప్రతియొక్క పైభాగమున నుండునది విశాల స్తంభము. ఉపానమునుండి ఉత్తరము యొక్క పైభాగము వఱకుండునది నిఘాత స్తంభము. దానియెత్తును 7 మొ. 2 వరకు భా. చేసి అందు ఒక్క భాగమును విస్తారము చేయవచ్చును. దాని మందమును వెడల్పుతో సమానముగానే చేయవలెను.

శ్లో॥ ఏకభాగ విహీనం తు శేష మగ్రవిశాలకం।
ఏకాది షోడశాంతం చ తలం ప్రత్యేవ మాచరేత్॥ 9

మూలా దగ్రంయుగాస్రం తు కుంభ మండాది సంయుతమ్।
బ్రహ్మకాంత మితి ఖ్యాతం వస్వస్రం విష్ణుకాంతకమ్॥ 10

రసాస్ర మింద్రకాంతం స్యాత్ స్కందకాంతం తదేవచ।
ద్వాదశాస్రం సూర్యకాంతం చంద్రకాంతం కలాస్రకమ్॥ 11

కంఠమానేన తన్మూలం తద్వైవాగ్రం తు కల్పయేత్।
స్తంభాగ్రే చైవ తన్మానే చతురస్రం సమన్వితమ్॥ 12

తయోర్మధ్యేఽపి వస్వస్రం షోడశాస్ర మథాఽపి వా।
వృత్తాకారం తు వా వప్రం కుంభమండాది సంయుతమ్॥ 13

కుంభమండాది హీనం యత్తదాహూ రుద్రకాంతకమ్॥

తా॥ స్తంభము మొదలు యెన్ని అంగుళములగునో అందులో నాల్గవవంతు తగ్గించి స్తంభము చివర విస్తారమును చేయవలెను. 1 మొదలు 16 అంతస్తుల వరకు తలమును ప్రతియును ఇట్లు చేయుచుండవలెను. మొదలు చివర 5 కోణములుచేసి కుంభమును మండమును చేసినచో బ్రహ్మకాంతమగును. 8 కోణములతో చేసినేని విష్ణుకాంతమగును. 6 కోణములు చేసినేని యింద్రకాంత మగును, స్కందకాంత మనియును చెప్పుదురు. 12 కోణములతో చేసినేని సూర్యకాంత మగును. 16 కోణములు కలది చంద్రకాంత మగును. కంఠమానము చేత మొదలును చివరను 4 కోణములుచేసి నడుమ 8 కోణములుచేసినను లేక 16 కోణములుచేసినను లేక గుండ్రముగా చేసినను, కుంభము మండము కలిగియున్నను, ఒకవేళ కుంభము మండములేకున్నను దీనిని రుద్రకాంతమందురు.

శ్లో॥ మూలా దగ్రవిశాలం తు మధ్యే ఉష్టాశ్రం ద్విదండకమ్।
రుద్రకాంత మితి ఖ్యాతం మూలా దగ్రంతు వర్తులమ్॥ 14

కుంభమండాది త న్మధ్యే అష్టాస్రం తావ దుచ్యతే।
చతురస్ర మధోభాగే అష్టాస్రం మధ్యమం తథా॥ 15

తదూర్ధ్వే వృత్త మేవం స్యా త్త్రిభాగం తుంగసదృశం।
శివచ్ఛంద మితి ఖ్యాతం శివహర్మ్యే ప్రసంస్థితమ్॥ 16

దండం సార్ధం ద్విదండం వా మూలపద్మాస నోదయం
ద్విగుణం పత్రవిస్తారం పద్మాకారం తు కారయేత్॥ 17

తన్మధ్యే కర్ణికాయాం తు చరణస్థాపనం కురు।
యథేష్టాకృతి సంయుక్తం కుంభమండాది సంయుతమ్॥ 18

చక్రవాక తలం మధ్యే భూషితః పద్మపాదుకం।
పత్రమూలాంఘ్రి మధ్యేతు వ్యాలేన వ్యాలపాదుకమ్॥ 19

తా॥ మొదలునుండి చివర వరకు విశాలమును నడుమ ½ దండముల పొడవున 8 కోణములుగాను మొదలు చివరలు గుండ్రముగాను చేసికొని రుద్రకాంతమగును. దాని నడుమ కుంభము మండము కలిగి అటులే 8 కోణములు కల్గియున్నను, క్రింద 4 కోణములును నడుమ 8 కోణములును, చివర గుండ్రమును ఈ యెత్తును సమముగా 3 భాగములు చేసికొని యిది శివచ్ఛందమగును. 1 దండముగాని 1½ దండముగాని మొదలున పద్మాసనము యెత్తును దానికి రెట్టింపుగా పత్రములయొక్క యలంకారమును, తామరపూవువలె చేయవలెను. దాని మధ్య కర్ణిక యందు స్తంభము నుంచవలెను. యిష్టము వచ్చినట్లలంకారముగా చేసి కుంభమును మండమును చేసి నడుమ కపోతమును పద్మతలమును పాదుక తలమును పత్రము మొదటను స్తంభము నడుమను అలంకారముగా చేయవలెను. వ్యాలపాదుకను వ్యాలముచే నలంకరించవలెను.

శ్లో॥ మూలేభ పాదమానేన గజపాద ముదాహృతం।
మూలే బింబాదిభిః కుర్యా ద్యథేష్టాకృతి సంయుతమ్॥ 20

కుంభమండాది సంయుక్తం తత్తన్నామ్నా ప్రకీర్తితమ్।
వృత్తాకారే తదాయామే శుండభేదైః సమన్వితమ్॥ 21

కుంభమండాది సంయుక్తం శుండపాద ముదాహృతమ్।
ముక్తాదామై రలంకారాత్ పిండిపాద ముదాహృతమ్॥ 22

విష్కంభ కర్ణమానేన స్తంభాగ్రే చతురస్రకమ్।
తదధ స్త్వర్ధదండేన పద్మ మష్టాస్ర సంయుతమ్॥ 23

దండమానేన తస్యాధో వ స్వస్రం పరికల్పయేత్।
తదధః పూర్వవ త్పద్మం తస్యాధో దండమానతః॥ 24

చతురస్రసమాయుక్తం తస్య ఛత్రం తు పూర్వవత్।
మూలేవా వేదకోషాస్రం ఛత్రఖండం తదుచ్యతే॥ 25

తా॥ మొదట ఏనుగు పాదము చేసినచో గజపాద స్తంభమగును. మొదట విగ్రహాము లతో స్తంభమును, కుంభమును మండమును చేసినట్లయిన ఏ విగ్రహాముండునో ఆ పేరుగల స్తంభమగును. లేక గుండ్రముగానే చేసి శుండములను యెన్ని విధములుగా జేసినను కుంభము మండముపైన కలిగియుండినచో శుండ స్తంభమగును. ముత్తైపుసరులతో నలంకరింపబడి యుండిన యెడల పిండి స్తంభమగును. స్తంభముయొక్క తలయందు మూలలను బట్టి కైవారమును విశరి అర్ధదండము పరిమాణమున పద్మమును 8 కోణములుగా తీర్చవలెను. దానికి దిగువ 1 దండము పొడవున స్తంభమునకు 8 కోణములు చేయవలెను. దాని దిగువ మునుపటివలెనే పద్మమునుచేసి మరల దాని దిగువ 1 దండము ప్రమాణమున నలుచదరముగా నుంచి దానికి మునుపటివలెనే

గోడుగును చేయవలెను. స్తంభము మొదట 4 కోణములున్నను లేక 8 కోణములున్నను ఆ స్తంభ మును ఛత్రఖండమని చెప్పుదురు.

శ్లో॥ మధ్యపట్టం తు వస్వస్రం శ్రీకంఠం త దుదాహృతమ్।
మధ్యేపట్టం కలాస్రం చే చ్ఛ్రీవజ్రం స్తంభ ముచ్యతే॥ 26

మూలాదగ్రం యుగాస్రం స్యా త్త్రిపట్టం క్షేపణాన్వితమ్।
క్షేపణ స్తంభ మాఖ్యాతం పట్టపత్రాది శోభితమ్॥ 27

స్తంభాకార త్రిభాగైకం చతుర్భాగైక మేవవా।
స్తంభమధ్యే శిఖాం కుర్యా దేత త్ స్తంభవిశేషతః॥ 28

స్తంభమూలే తు పద్మాని స్తంభమానేన కల్పయేత్।
స్తంభలక్షణ మాఖ్యాతం బోధికాలక్షణం శృణు॥ 29

ఇతి కాశ్యపశిల్పే స్తంభలక్షణోఽష్టమఃపటలః

తా॥ స్తంభమునడుమ పట్టము 8 కోణములు చేసినచో శ్రీ కంఠమనిపించుకొనును. అది 16 కోణములుగా చేసినని శ్రీ వజ్రమగును. మొదలు చివర 4 కోణములుగానుండి మధ్య త్రిపట్టము క్షేపణముతో గూడి యుండిన యెడల క్షేపణ స్తంభమగును. అది పట్టములతోను, పత్రములతోను శోభిల్లుచుండవలెను. స్తంభము యొక్క యాకారమును 3 భా. చేసి అందు 1 భా. గాని, లేక 4 భా. చేసి అందు 1 భా. గాని, స్తంభమునడుమ శిఖచుచేసి నట్లయిన శిఖా స్తంభమగును. మరియు స్తంభము మొదట పద్మమును స్తంభముయొక్క లావుతో సమానముగా నిర్మించవలెను. ఇట్లు స్తంభలక్షణములను చెప్పియుంటిని. ఇక బోదెల లక్షణమును చెప్పుచున్నాను.

## 6. బోధికాలక్షణము

### కాశ్యపశిల్పము 9 వ పటలము

శ్లో॥ అథ వక్ష్యే విశేషేణ బోధికాలక్షణం పరమ్।
మూలపాదస్య పాదేన శ్రేష్ఠం మధ్యే తు మధ్యమమ్॥ 1

అగ్రపాద విశాలం స్యా త్సమం కన్యసబోధికా।
విస్తారసదృశోత్సేధం పంచదం డాయతాన్వితమ్॥ 2

ఉత్తమా బోధికా ఖ్యాతా తార ద్విత్ర్యంశ మున్నతా।
చతుర్దం డాయతోపేతా మధ్యమా సా ప్రకీర్తితా॥ 3

విస్తార స్యార్ధతుంగం తు గుణదం డాయ తాన్వితమ్।
కన్యసా బోధికా ఖ్యాతం త్వం త్రయో ర్వ్యధికాన్వితమ్॥ 4

బోధికాయా స్త్రిభాగే తు ఏకాంశే నార్ధపట్టికమ్।
మధ్యాంశేన త దంగం స్యా ల్లతాద్యై ర్భూషితం తు వా॥ 5

తదధ స్త్వేకభాగేన ముష్టిబంధం చ కారయేత్।
దండం త్రిపాద మర్ధం వా ఛాయామానం తదంశకే॥ 6

తా॥ బోదెల కొలతలను చెప్పుచున్నాడు. ప్రధాన స్తంభముయొక్క విస్తారముతో సమానముగా బోదెయొక్క విస్తారమును చేయుట శ్రేష్ఠము స్తంభముయొక్క నడుము విస్తారమును బట్టి బోదె విస్తారము చేయుట మధ్యమము, స్తంభముయొక్క చివర విస్తారమునుబట్టి బోదెయొక్క విస్తారము చేయుట కనిసపద్ధతి. ఆ విస్తారముతో సమానముగా యెత్తుండి 5 దండముల పొడవుగల బోదె యుత్తమము. విస్తారమును 3 భాగములుచేసి అందు 2 భాగముల యెత్తును 4 దండముల పొడవునుకల బోదె మధ్యమము విస్తారములో సగము యెత్తును 3 దండముల పొడవును కల బోదె అధమము. స్తంభములకు బోదెలను పెట్టునప్పుడు ఆ బోదెను 3 భా. చేసి 1భా. అర్ధపట్టిక, నడుము 1 భా. నీటి అల, ఇది తీగలతోను పుష్పములతోను అలంకారముగా నుండవలెను. దానికి దిగువ 1 భా. ముష్టిబంధమును చేయువలెను, 1 దండముగాని ముప్పాతిక దండముగాని ½ దండముగాని ఛాయామానమును చేయువలెను.

శ్లో॥ ఊర్ధ్వాధః పట్టికాధస్తా చ్ఛాయాకారం ప్రకల్పయేత్।
అధస్తా ద్బోదికాకార మలంకారం వదామ్యహం॥ 7

మధ్యే పట్టత్రిభాగైకం విస్తారార్ధ మథాఽపివా।
పార్శ్వయో రుభయోః శేషం తరంగస్థాన ముచ్యతే॥ 8

సక్షుద్రక్షేపణం మధ్యా త్పట్ట పత్రా ద్యలంకృతం।
పార్శ్వయో స్తు తరంగం స్యా త్సమాచ్చాన్యోన్యహీనకమ్॥ 9

బోధివిస్తార రంధ్రం వా త్రిపాదం వాఽగ్రకీలకం।
తన్మూలసదృశం వ్యాసం బోధికాయాః ప్రకల్పయేత్॥ 10

అన్యద్బోధిం షడంశాంశం కృత్వోర్ధ్వం పట్టికాన్వితమ్।
ఊర్ధ్వపద్మ మథాంశేన కంఠ మర్ధేన కారయేత్॥ 11

అధఃపద్మం ద్విభాగేన చోర్ధ్వం పట్టాంశ ముచ్యతే।
అధ స్త్వంబుజ మర్ధాంశం కల్పయే త్తు క్రమేణతు॥ 12

తా॥ పైన అధఃపట్టిక దాని దిగువ ఛాయాకారము. దాని దిగువ బోదె. వీని అలంకారములను చెప్పుచున్నాను. మధ్య పట్టము 3 భా. చేసి అందు 1 భా. లేక విస్తారములో సగముగాని రెండుప్రక్కలను తరంగ స్థానము చెప్పబడుచున్నది నడుము క్షుద్రక్షేపణమును చేయువలెను. పట్టము, పత్రములు మొదలైన వానిచేత అలంకారముగా నుండవలెను. దాని

కిరువైపుల అలలు ఒకదానినొకటి తాకుచున్నట్లుండవలెను. బోదె వెడల్పుతో సమానముగాని లేక మూప్పాతికవంతుగాని దానిపైన బెజ్జముండవలెను పైన పీట నాటవలెను, అది మొదలు యెంత విస్తారమో పైన అంతే చేయవలెను. ఇట్లు బోదెలకు చేయవలెను. కొందఱు 6 భా. చేసి పైన పట్టిన 1 భా, ఊర్ధ్వపద్మము 1 భా. కంఠము ½ భా, అధఃపద్మము ½ భా, పైనపట్టము 1 భా, దాని దిగువ పద్మము ½ భా, ఇట్లు వరుసగా చేయుదురు.

శ్లో॥ పద్మస్య ముకులాకార మగ్రా దధోగతం కురు।
అగ్రనిమ్నమ యుక్తం వా ఛాయాకార మథాఽపి వా॥ 3

పార్శ్వయో ర్ముష్టిబంధాగ్రం వ్యాలం ఛాయాది కల్పితం।
భుజే వా మకరై ర్వ్యాళై: పట్టికాద్యై ర్విభూషితం॥ 14

రత్నబంధ క్రియావల్లీ చిత్రం వా గ్రస్తపట్టికా।
బోధికా స్యాత్తరంగాఢ్యా తన్మధ్యే దండమానత:॥ 15

యుగాస్రం పట్టసంయుక్తం తారోచ్ఛ్రాయం తు వృత్తకమ్।
నానాచిత్రై రలంకృత్య బోధికా చిత్రబోధికా॥ 16

పత్రై ర్విచిత్రితా పత్ర బోధికాతు ప్రకీర్తితా।
మహార్ణవ తరంగాంభ స్తరంగస్తు ప్రకల్పయేత్॥ 17

తా॥ స్తంభముపైన బోదెకు చేయవలసినపని చెప్పుచున్నాడు. పద్మముయొక్క మొగ్గ ఆకారము చివరనుండి మొదలుకు చేయవలెను. పైకిపోవునట్లును చేయవచ్చును. ఛాయాకారముగాగాని చేయవచ్చును. ఇరువైపుల ముష్టిబంధము చివర వ్యాలము మొదలైనవి చేయవలెను. భుజమునందును మకరములచే తను వ్యాలములచేతను పట్టములచేతను అలంకరించవలెను. రత్నబంధమును లతలు మొదలైనవియునుగల పట్టికయును పైన బోదెయును దాని నడుమ 1 దండము పరిమాణమున తరంగములతో నలంకారముగా నుండవలెను, పట్టము 4 కోణములుగాను విశాలముతో సమానమైన యెత్తున గుండ్రమును అనేకవిధములుగల చిత్రములైన పనులుచేసినది చిత్రబోధిక యగును. పత్రములతో చిత్రింపబడినది పత్రబోధిక యగును. గొప్పసముద్రపు అలలవలె అలలను కల్పించవలెను.

శ్లో॥ పాద మర్ధం త్రిపాదం వా భిత్త్యా స్తంభస్యనిర్గతమ్।
చతు రష్టాస్ర వృత్తానాం క్రమాత్ సాధారణం తు వా॥ 18

బోధికాయా స్తథాఽగ్రం తు వీరకంఠం యుగాస్రకం।
అగ్రపాద సమం తచ్చ త్రిపాదం తుంగ ముచ్యతే॥ 19

సర్వేషా మపి పాదానాం వీరకంఠం యుగాస్రకం।
అధస్తా ద్వీరకంఠ స్య ఫలకా లక్షణం శృణు॥ 20

తా॥ గోడనుండి స్తంభము వెలుపలికి నిర్గమము పాతికవంతుగాని లేక సగముగాని, లేక ముప్పాతికవంతు గాని చేయవచ్చును. నలుచదరము లేక యెనిమిది పలకలు లేక గుండ్రము వీనిలో యేదైనను చేయవచ్చును. ఆ స్తంభముపైన బోదెయును బోదెపైననలుచదరముగాను స్తంభముపై భాగముతో సమానముగా అంతేయెత్తునగాని లేక ముప్పాతికవంతు యెత్తునగాని వీరకంఠము నమర్చవలెను. అన్ని స్తంభములకును వీరకంఠమును నలుచదరముగానే చేయవలెను, వీర కంఠమునకు దిగువ ఫలకమును చేయులక్షణము చెప్పుచున్నాడు.

## 7. ఫలకలక్షణము

శ్లో॥ అథ వక్ష్యే విశేషేణ ఫలకానాం తు లక్షణమ్।
త్రిదండం ఫలక వ్యాసం కన్యసార్ధాధికం సమమ్॥ 21
చతుర్దండ విశాలం తు ఉత్తమా ఫలకా భవేత్।
అథ వా ఫలక వ్యాసం కుంభకర్ణ సమం భవేత్॥ 22
సర్వేషాం ఫలకానాం తు తుంగం పాదోనదండకం।
తదుత్సేధం త్రిధాభజ్య ఊర్ధ్వం తత్సంధి రుచ్యతే॥ 23
తథాఽర్ధోపేత మేకాంశం తస్యాధ స్త్వంబుజాంశకమ్।
నాగపత్ర సమాకార ముపేతోపాదరూపకమ్॥ 24
సర్వేషాం ఫలకానాం తు ఉత్సేధార్ధం యుగాంశకమ్।
కర్తవ్య మేవం ఫలకం తస్యాధస్తా ద్ఘటం కురు॥ 25

తా॥ ఫలికచేయు విధానము చెప్పుచున్నాడు. దీనిని ఫలకమనియు చెప్పుదురు. ఫలిక యొక్క విస్తారము 3 దండములు అధమము. 3½ దండములు విస్తారము మధ్యమము. 4 దండముల విస్తారము శ్రేష్ఠము. పొడవుకూడ అంతే యుండవలెను. లేక ఫలకముయొక్క విస్తారము కుంభము యొక్క కర్ణముతో సమానముగా నుండవచ్చును. అన్ని ఫలకములకును యెత్తు ముప్పాతికదండము కలిగి యుండవలెను. దాని యెత్తును 3 భా. చేసి పైన ½ భా. సంధి చేయవలెను. తరువాత 1½ భా. దాని దిగువ పద్మము 1 భా, తమలపాకువలె స్తంభమునకుపైన ఫలకము ఒక్క భాగ ముండవలెను. అన్ని ఫలకములకును యెత్తులో సగమును నాలుగు భాగములును ఫలకమునకు దిగువ కుంభమును చేయవలెను.

శ్లో॥ ద్విదండం పాదహీనం వా సార్ధదండ మథాఽపివా।
సపాదదండ తుంగం వా ఘటోచ్చం తు చతుర్విధమ్॥ 26
ప్రియదర్శన సౌమ్యం చ చంద్రకాంతం చ శ్రీకరం।
యథా క్రమేణ నామాని కలశానాం క్రమోదితః॥ 27

ఘటోచ్చం వై నవాంశేన హృద్భాగే పరికల్పయేత్।
వేదాంశం కలశోత్సేధం కంఠ మేకాంశ మానతః॥ 28

ఆస్యోచ్చ మేకభాగేన పద్మ మేకేన కారయేత్।
అధోఽనావృత్త మర్ధేన హీనం సంకల్పయే ద్బుధః॥ 29

ఊర్ధ్వోదయగతం కుర్యా దనేన విధినా క్రమాత్।
ఏవ ముచ్చం సమాఖ్యాతం విష్కంభ మధునా శృణు॥ 30

కుంభముయొక్క యెత్తు 4 విధములుగా చెప్పబడినది. 2 దండములుగాని లే 1½ దండము గాని 1¾ దండముగాని. 1¼ దండముగాని యిట్లు నాలుగువిధములుగా చేయవచ్చును. ఈ నాలుగు వరుసగా ప్రియదర్శనము, సౌమ్యము, చంద్రకాంతము శ్రీకరము అను నామములు కలిగి యున్నవి. కుంభము యెత్తును 9 భాగములు చేసి అందు 1 భాగమును సన్నముగా తగ్గించి కుంభము యొక్కపొట్టను 4భాగములుచేసి కంఠము 1భా. నోరు 1భా, పద్మము 1భా. క్రిందపాదము ½భా, పాదమును విడగొట్టునప్డు నడుమ, తగ్గింపు ½భా, ఇట్లు క్రమముగా చేయవలెను.

## 8. విష్కంభము

శ్లో॥ పాదవ్యాస సమా హీనా తత్కంఠ స్యాస్య విస్తృతమ్।
అస్య కంఠ విశేషేణ కుంభస్యోపరి విస్తృతమ్॥ 31

స్తంభే వ్యాససమం ప్రోక్తం విస్తారం తస్యకర్ణయోః।
తస్యాధో ఽఖునం మూలా త్కల్పయే చ్ఛిల్పవిత్తమః॥ 32

అథవా బోధికాదీనా ముదయం తు వదామ్యహమ్।
ఊనాంశరావ కోత్సేధం కృత్వాధో వ్యంజనం వ్రజేత్॥ 33

ఊర్ధ్వ భాగం తు సంగ్రాహ్యం ద్వావింశ త్యం శకం వ్రజేత్।
యుగాంశం బోధికోత్సేధం వీరకంఠం చ తత్సమమ్॥ 34

భూతాంశం కలశోత్సేధం మధ్య మూలం శివాంశకమ్।
సమోత్సేధం తు వేదాంశం శివాంశం కంఠమానకమ్॥ 35

తద్దాస్యో దయ మేకాంశం పద్మ మేకేన కారయేత్।
వృత్త మర్ధేన కర్తవ్యం హీనం తత్సమ ముచ్యతే॥ 36

ఘటనాబ్జ లతా యుక్తం మాలా మానాది పూర్వవత్।
స్తంభ భూషణ మేవం స్యాత్ వేదికా లక్షణం తతః॥ 37

ఇతి కాశ్యపశిల్పే ఫలక లక్షణ విధానోనామ నవమఃపటలః

ఫలకము

కుంభము

గళము

ఫలకము

బ్రహ్మకాంతము రుద్రకాంతము విష్ణుకాంతము స్కందకాంతము శివకాంతము



తా॥ స్తంభము యొక్క వ్యాసముతో సమానముగాగాని తక్కువగాగాని కంఠములను చేయుచు, ఆవిస్తారమునుండి లోపలికి సమానముగా తగ్గించినది కుంభముయొక్క తలపై విస్తారము

స్తంభముయొక్క విస్తారముతో సమానముగా కర్ణములుండవలెను. ఆకర్ణములకు దిగువ మొదలు నుండి లశునమును రచించవలెను. స్తంభము నలుచదరముగా నుండును గనుక మూలలతో కలిపి కైవారముచేసి కుంభము పొట్టను చేయవలెను. కుంభము యొక్క పాదమును కంఠముతో సమానముగా తగ్గించవలెను. లేక బోదెలు మొదలైన వానియొక్క పొడవును చెప్పుచున్నాను. కుంభము యొక్క మొత్తము యెత్తునుండిదాని పాదమును చేసికొనవలెను. పైనుండి వరుసగా 22 భా. చేసి బోదెలు 4భా. వీరకంఠము 4భా. కలశము ?భా. మొదలు 1భా. దాని యెత్తు 4భా. కంఠము 1భా. కుంభము మూతి 1 భా. పద్మము 1 భా. దిగువపాదము ½ భా. పాదమును కుంభమును విడగొట్టు స్థలము ½ భాగము చేయవలెను. కుంభము పొట్టయందు లతలు తామరపూలు మొదలైనవి చేయవలెను. హారములు మొదలైనవి పూర్వము చెప్పబడినట్లు చేయువలెను. స్తంభముల యొక్క అలంకారములు చెప్పబడినవి. ఇక వేదిక యొక్క లక్షణమును చెప్పుచున్నాను.

## ౭. (శిల్పరత్న) స్తంభలక్షణము

### శిల్పరత్నము 21 వ అధ్యాయము

శ్లో॥ ప్రస్తరోత్తరయో ర్మధ్యం విశాలస్తంభ మీడ్యతే।
ఉపానోత్తరయో ర్మధ్యం విఘాత స్తంభ ముచ్యతే॥ 40

మూల భూస్తంభ విస్తారో హ్యష్టావింశతి కాంగులః।
ద్వ్యంగుల ద్వ్యంగుల హ్రాస్వాత్ వ్యాసం వప్రతల క్రమాత్॥ 42

షణ్మాత్రం పాదవిస్తారం భవే ద్ద్వాదశకే తలే।
తద్వ్యాసా దర్కభాగా ద్యా షడ్భాగోనా గ్రవిస్తరమ్॥ 43

అథ వా చరణాయామే షట్ స ప్తాష్ట నవాంశితే।
పంక్తి రు ద్రార్క భాగై ర్వా భక్తే భా గాంఘ్రి విస్తరే॥ 44

స్తంభమూల విశాలం స్యా దేవం సకల భూమిషు।
తస్మా దగ్రవిశాలం తు కారయే త్పూర్వ ముక్తవత్॥ 45

కుడ్యస్తం భాగ్రవిపులం యుత్త ద్దండ మితి స్మృతమ్।
తేన మేయాని సర్వాణి విమానాంశాని సర్వశః॥ 46

తా॥ అధిష్ఠానమునుండి యుత్తరము వరకుగల స్తంభమును విఘాతస్తంభమందురు. ప్రస్తరమునుండి యుత్తరము వరకుగల స్తంభమును విశాలస్తంభమందురు. అధిష్ఠాన స్తంభము యొక్క విస్తారము 28 అంగులము లుండవలెను. ఒక్కొక్క అంతస్తునకు 2-2 అంగులముల చొప్పున తగ్గించుచు 12 వ అంతస్తు వరకు వచ్చేటప్పటికి ఆ స్తంభము 6 అం. లావు కలిదియగును. ఆ మొదటి విస్తారమును అందు 1 భా. తగ్గించి చివర విస్తారమును చేయవలెను. లేక స్తంభము పొడవును 6-7-8-9-10-11-12 ఇట్లు భాగములు చేసి అందు 1 భా. తగ్గించి స్తంభము చివరను

చేయవలెను. ఏ స్తంభము మొదలును బట్టి ఆ స్తంభము చివర తగ్గించుచుండవలెను. ఇట్లే 12 అంతస్తులకును చేయవలెను. గోడయందలి స్తంభము యొక్క విస్తారము 1 దండము అని చెప్పబడి యున్నది. దానిని బట్టి పై అంతస్తులకు గూడ క్రమముగా తగ్గించుచుండ వలెను.

శ్లో॥ ప్రత్యుత్తరాంతర్గత చరణ సమున్నాసకే ఉష్టాంశకాద్యైః।
తే ష్వేంకాంశా త్ర మూలప్రభతి తదుర గాంశాది హీ నాగ్రతారాన్।
దారు స్తంభ స్తదర్ధే విహితశతి కలాగ్న్యబ్ధి భాగోన తారాన్।
కుడ్య స్తంభాం శ్చ కుడ్యే రచయతు చరణాగ్ర ప్రతానో ఉత్రదండః॥ 47

తా॥ విశాల స్తంభము యెత్తును 8 భా. చేసి అందు 1 భా. విస్తారము చేయుచు మొదలుకంటె చివరను ఒక్కొక్క భాగమును తగ్గించుచు అన్ని అంతస్తుల స్తంభములను చేయుచుండవలెను. మరియు కుడ్యస్తంభములు గోడయందు చేయునప్పుడు 2-3-4 భాగములు కూడ తగ్గించవచ్చును.

శ్లో॥ స్తం భో త్తరాది కాంగానాం ద్రవ్యం దా రూప లేష్టకాః।
స్తంభాంతరం ద్వి హస్తాది భవే త్పంచ కరాంతతః॥ 48

స్తంభయో రంతరం హస్తా ద్ధీనం నైవ సమాచరేత్।
హ స్త ద్వితయతః కుర్యా చ్చతుర్హా స్తావసానకమ్॥ 49

షడంగుల ప్రవృద్ధ్యా తు నవభేదాః ప్రకీర్తితాః।
గృహీ తాంశవశా ద్వాఽపి యథాయుక్త్యా ప్రయోజయేత్॥ 50

తా॥ స్తంభము ఉత్తరము మొదలైన రూపములను దారువుతోను, రాతితోను, ఇటుకల తోను చేయవచ్చును. స్తంభముల రెంటినడుమ సందు 2 హస్తములు మొదలు 5 హస్తముల వరకు చేయవచ్చును ఈసందును 1 హస్తముకంటె తరుగు యెన్నడును చేయగూడదు. 2 హస్తములు మొదలుకొని పాతిక చొప్పున పెంచుచు యిట్లు 4 హస్తముల వరకు 9 భేదములుగా చేయవచ్చును. ఆచేయుచున్న పనిని బట్టి అందము తెలుసుకొని యెన్ని భాగములతో చేయవలెనో ఆలోచించి చేయవలెను.

శ్లో॥ ప్రాసాదః సకలే ఽంఘ్రి తోరణ చతు ర్ద్వారాన్వితో మండితః।
స్తంభాభ్యంతర జాల పంజర యుతో వా పంచహస్తాదితః।
యుక్తో మూలతలే విదిక్ స్థిత చతుష్కూటైః పరం తత్పరః।
శాలః కూటక నాసికాది విలస జ్జాలోజ్జ్వల త్పంజరమ్॥ 51

తా॥ నాలుగు ద్వారములును సమస్త విధములైన స్తంభములును తోరణములతో నలంకరింపబడి గవాక్షములును పంజరములును కలిగినది ప్రాసాదము, నాలుగు మూలలను కూట ములు కలిగినది. శాలయును, కూటములు, నాసికలు, గవాక్షులు మాత్రమే కలది పంజరమును అగును.

శ్లో॥ మూలే చాగ్రే చ పాదానాం తత్ర ద్విస్తార భాగతః।
చతుష్పంచాంశతో వాఽధ శిఖా స్యా దుచి తాయతా॥ 54

తదర్ధం వా త్రిభాగోనం చతుర్భా గోనమేవ వా।
కుడ్య స్తంభ విశాలః స్యాత్ తదర్ధం వా స్యనిష్క్రమః॥ 55

విస్తారస్య త్రిపాదం వా చతుర్భా గైకమేవ వా॥
అష్టాశ్ర వృత్త వేదాశ్రే ష్వథ సాధారణం తు వా॥ 56

నామా న్యేతే ష్వనేకాని భవం త్యాకార భూషణైః।

తా॥ స్తంభముల యొక్క మొదలు చివర విస్తారములు చేయునప్పుడు మొదలు అంగుళములను 5 వంతులుచేసి అందు 1 వంతును తగ్గించి నాలుగు వంతులు చివర విస్తారమును చేయవలెను. గోడ స్తంభము సగముగాని, పాతికవంతుగాని, ముప్పాతికవంతుగాని విస్తారమును చేయవచ్చును. దాని నిర్గమము సగముగాని, విస్తారములో 3 పాదములుగాని నాల్గు భాగములలో 1 భాగముగాని యుండవలెను. 8 కోణములు గుండ్రము 4 కోణములు ఇట్లు సామాన్యముగా స్తంభములను చేయుదురు. వానివాని ఆకారాది భేదములచేత అనేక నామములు కలుగుచున్నవి.

శ్లో॥ మూలాదగ్రం యుగాశ్రం తు కుంభ మండ్యాది సంయుతమ్।
బ్రహ్మకాంత మితి ఖ్యాతం వస్వస్రో విష్ణుకాంతకః॥ 58

షడస్ర ఇంద్రకాంతః స్యాత్ సోఽయం వా స్కందకాంతకః।
ద్వాదశాస్రో భానుకాంత శ్చంద్రకాంతః। కలాస్రకః॥ 59

వర్తుల శ్చే దీశకాంతః అథ వా స్వస్యదీర్ఘతః।
ఆద్య త్రిభాగో వేదాస్రో వృత్త స్త్వగ్ర త్రిభాగతః॥ 60

తయోర్మధ్యే తు వస్వస్రః స భవే ద్రుద్రకాంతకః।
మూలే పద్మాసన శ్చాథ చక్రవాకై రలంకృతః॥ 61

స భద్ర మధ్యభాగస్తు భద్రకాంతో విమండితః।
వ్యా లేభ భూత సింహైస్తు మూలే యః పరిమండితః॥ 62

ఇష్టకాంత స్తథైవోర్ధ్వం తత్ర త్కాంతాహ్వయో భవేత్।
వృత్త ఏవ స్వదీర్ఘేణ ఖండభేదేన సంయుతః॥ 63

ఖండపాదః పిండిపాదః స చే న్మక్తావిచిత్రితః।
మూలే వేదాస్రక శ్చోర్ధ్వం షోడశాస్రా ద్యలంకృతః॥ 64

స్యా న్మూలచతురస్రాఖ్యం పద్మం పద్మాసనం స్మృతం।
మూలాగ్రయో ఒస్తు వేదాస్రో మధ్యేఽష్టాస్రా ద్యలంకృతః॥ 65

వజ్రకాంత స్తు విజ్ఞేయో భక్తా స్తంభః సమౌ క్తికః।
య ద్రత్నచిత్రత స్తంభ స్తత్త ద్రత్నాభిధో భవేత్॥ 66
మూలే పద్మాసనో మధ్యే షోడశాస్రై రలంకృతః।
ఊర్ధ్వాస్ర చతురస్రోఽంఘ్రి శ్చిత్రఖం డాహ్వయః స్మృతః॥ 67

తా॥ మొదలునుండి చివరవరకు నాలుగు పలకలును కుంభము మండము కలిగినది బ్రహ్మకాంతము, అటులే 8 కోణములు కలది విష్ణుకాంతము, 6 కోణములు గలది యింద్రకాంతము, స్కందకాంత మనియును చెప్పుదురు. 12 కోణములు గలది సూర్యకాంతము, 16 కోణములుగలది చంద్రకాంతము గుండ్రము గలది శివకాంతము లేక మొదలు 3 భాగములు 4 కోణములును, నడుమ 3 భాగములు 8 కోణములును చివర 3 భాగములు గుండ్రమును చేసిన రుద్రకాంతమగును. మొదలు పద్మాసనమును కపోతముతో గూడిన మధ్యభాగము భద్రమును కూడ నడుము చేసిన చో భద్రకాంతమగును. వ్యాలములు, ఏనుగులు, భూతములు, సింహములు మొదలైన వానిలో యేరూపముతో చేయబడిన స్తంభము ఆపేరుగలది యగును దానిని యిష్టకాంత మందురు. స్తంభము గుండ్రముగానుండి నాళభేదమున్నచో శుండ స్తంభమగును. అది మొదలు 4 పలకలు చివర 16 పలకలు కలిగి ముత్తెపుసరులున్నచో పిండిపాదమగును. మొదలు 4 కోణములుండి అడుగున పద్మమున్న యెడల పద్మాసన స్తంభమగును. మొదలు చివర 4 కోణములు నడుమ 8 కోణములు కలది వజ్రకాంత స్తంభమగును. రత్నములతో అలంకరించబడినది రత్న స్తంభము, మొదట పద్మాసనమును 4 కోణములును నడుమ 16 కోణములును, పైన 4 కోణములును కలది చిత్రఖండ స్తంభమగును.

శ్లో॥ స ఏవాష్టాస్రకో మధ్యే శ్రీబంధః పట్టబంధవాన్।
విష్కంభ కర్ణమానేన స్తంభాగ్రే చతురస్రకమ్॥ 68
తదధ స్త్వర్ధదండేనా వ్యబ్జ మష్టాస్రసంయుతమ్।
దండమానేన తస్యాధో వస్వస్రం పరికల్పయేత్॥ 69
తదధః పూర్వవ త్పద్మం తస్యాధో దండమానకమ్।
చతురస్ర సమాయుక్తం తదధః పద్మ ముక్తవత్॥ 70
మూలే ఽవశేషం వేదాశ్రం చిత్రఖం డాహ్వయః స చ॥
మధ్యే కలాస్రం పట్టేన బంధః శ్రీవత్స సంజ్ఞకమ్॥ 71
పట్టక్షేపణ సంజ్ఞః స్యా చ్చ తురస్ర త్రిపట్టవాన్।
మూలాగ్రయో స్తు విపులో మధ్యే దామాంశతః కృశః॥ 72
వృత్త చ్ఛే ద్దండపాదాఖ్యో మూలాం శోలూఖ లాసనః।
మూలవ్యాసే తు సప్తాంశే స్తంభానా మథవా పునః॥ 73

ద్వ్యంశోనో మధ్యభాగః స్యా దేకాంశో నోగ్రవిస్తరః।
ఇత్యుక్తా నిఖిలాః స్తంభాః కుంభ మండ్యాది భూషణైః॥ 7.
సంయుక్తా వా వియుక్తా వా భవం త్యఖిల వేశ్మసు॥ 74½

తా॥ మొదట పద్మాసనమును 4 కోణములును నడుమ 8 కోణములును విష్కంభ కర్ణమానముచేత పైన 4 కోణములును కలది శ్రీబంధ మగును. మరియు స్తంభము యొక్క విస్తారమునందలి కోణమును బట్టి చివర నలుచదరమును. దానికి దిగువ ½ దండము యెత్తున పద్మము 8 కోణములతోను, దానికి దిగువ 1 దండము, 8 కోణములును దానికి దిగువ మునుపటివలె పద్మమును దానికి దిగువ 1 దండము నలుచదరముగాను దాని క్రింద పద్మమును మిగిలినది మొదలు 4 కోణములును చేసిన యెడల చిత్రఖండ మనిపించుకొనును. నడుమ 16 కోణములును పట్టబంధమును చేసిన యెడల శ్రీవత్సమగును. స్తంభము నలుచదరముగానుండి 3 పట్టములు కలిగియున్న యెడల పట్టస్తంభమనియు, శ్రేవణస్తంభమనియు చెప్పుదురు. మొదలు చివర విస్తారములో నడుమ 3 వ భాగము తగ్గించి గుండ్రముగాచేసిన యెడల దండస్తంభమగును. మొదట 1 భాగము నలుచదరముగా ఆసనమునుచేసి మొదలు విస్తారమును 7 భాగములుచేసి దాని చివరను అందు 1 భాగము తగ్గించి 6 భాగములు విస్తారముగాను, నడుమును 2 భాగములు తగ్గించి 5 భాగముల విస్తారముగాను చేయుట సమాన్యముగా అంతటను జరుగుచుండును. స్తంభములకు కుంభము, మండము మొదలైన యలంకారములు చేయవలెను. ఒకే ఫలకమునగాని ప్రత్యేకముగాగా యీ యలంకారములను స్తంభములకు చేయవచ్చును.

శ్లో॥ కుంభాః స్యుః పాదవిష్కంభా చ్చతుర్థాం శాధికోన్నతాః।
సార్థం వా స్త్రిపాదం వా ద్విగుణం వా భవంతి హి॥ 76
శ్రీకరం చంద్రకాంతం చ సౌముఖ్యం ప్రియదర్శమ్।
ఇతి కుంభా శ్చతుర్థా స్యు ర్వృత్తానాం శ్రీకరో భవేత్॥ 77
పాదానాం వసుకోణానాం కుంభః స్యా త్ప్రియదర్శనః।
అథ వా దండమానేన కుర్యా దేవం ఘటోన్నతమ్॥ 78
ఘటోచ్ఛ్రయే నవాంశే హ్యా ద్భాగేన పరికల్పయేత్।
చతుర్భిః కుంభ ఏవ స్యాత్ కంఠోఽంశే నాంశతో ముఖమ్॥ 79
భాగేన పద్మ మేకేన పీఠికోర్ధ్వా దధోగతమ్।
స్తంభాగ్ర కర్ణమానేన యో వ్యాసః సమవిస్తృతః॥ 80
తస్య కర్ణేన సదృశం కుంభవిస్తార మేవ వా
స్తంభవ్యాస। సమం ప్రోక్తం తారం హ్యుత్కర్ణయోః స్మృతః॥ 81
తదధో లశునం మూలం తత్తుంగం దండమానతః।
స్యాష్టాం శాధిక విస్తారం తస్యాధః పంకజం పునః॥ 82

పాదతార సమం తార మర్ధదండ మథాపి వా।
త్రిపాదం వాబ్జక స్యోచ్ఛం తస్యాధః కల్పయే త్పునః॥ 83

మాలాస్థానం తదుత్సేధం దండార్ధం దండ మేవ వా।
తస్యాధో దండమానేన ముక్తాదామ విభూషణమ్॥ 84

ఏతేషాం స్తంభవిస్తార తుల్యం వ్యాస ముదాహృతమ్।
దండం వా సార్ధదండం వా మూలే పద్మాస నోదయమ్॥ 85

తా॥ కుంభము స్తంభము యొక్క విస్తారముకంటె అందు నాల్గవ భాగము అధికముగా యెత్తుండవలెను. శాస్త్రములలో $1\frac{1}{2}$ భా. గాని, $1\frac{3}{4}$ భా. గాని, 2 భా. గాని చేయవచ్చుననియున్నది. శ్రీకరము, చంద్రకాంతము సుముఖము, ప్రియదర్శనము, ఇట్లు నాలుగు పేరులు కలిగియున్నవి గుండ్రముగా నుండునది శ్రీకరము, 8 కోణములుగలది ప్రియదర్శనము లేక దండమానముచేత కుంభము యొక్క యెత్తును చేయవచ్చును. కుంభముయొక్క యెత్తును 9 భా. చేసి అందు 1 భా. సన్నముగా నుండునట్లు విడగొట్టవలెను. తరువాత కుంభము యొక్క పొట్ట 4 భా. కంఠము 1 భా. మూతి 1 భా, పద్మము 1 భా. పీఠము పైనుండి క్రిందికి 1 భా. చేయవలెను. స్తంభము యొక్క చివర కర్ణమానముతో సమానముగా కుంభము యొక్క విస్తారమును కల్పించవలెను. స్తంభము యొక్క వ్యాసముతో సమానముగా పైన విడగొట్టునదియును, కుంభము యొక్క మెడయును చేయవలెను. దాని దిగువలశునము మొదట 1 దండము కలిగి యుండవలెను. దానిలో 8 వ వంతును చేర్చి యీ ప్రకారము దాని దిగువ పద్మమును రచించవలెను. స్తంభ విస్తారముతో సమానముగాని లేక అర్ధహస్త ప్రమాణముగాని లేక ముప్పాతిక దండము ప్రమాణముగాని పద్మము యొక్క యెత్తును చేయవలెను. దాని అడుగున మాలను చేయునట్టి ప్రదేశము ½ దండముగాని 1 దండము గాని చేయవలెను. దానిక్రింద 1 దండము ముత్తెపుసరములను చేయవలెను. ఈస్తంభములకు విస్తారముతో సమానముగా మొదలుననున్న పద్మాసనము వరకు ముత్తెపుసరము లుండవలెను.

శ్లో॥ ద్విగుణం తస్య విస్తారం పద్మాకారం తు కారయేత్।
త త్పద్మాసన తుంగే తు చరణానాం షడంశితే॥ 86

ఊర్ధ్వపట్టం త దేకాంశ మూర్ధ్వపద్మం త థాంశతః।
కర్ణ మర్ధేన క ర్తవ్య మధఃపద్మం ద్విభాగికమ్॥ 87

తదధః పట్ట మేకాంశ మథస్తా దర్ధమంబుజం।
స్తంభానాం కుంభత శ్చోర్ధ్వే సర్వేషాం ఫలకా భవేత్॥ 88

త్రిదండం ఫలకా వ్యాసం కన్యసం సార్ధలోకతః।
చతుర్దండ విశాలం తు మంధ్యా శ్చో త్తమ ముచ్యతే॥ 89

అథ వా ఫలకా వ్యాసః కుంభకర్ణ సమో భవేత్॥
సర్వేషాం ఫలకానాం తు తుంగం పాదోన దండతః॥ 90

స్తంభాగ్ర తుల్యం మండ్యువ్యం పంచభాగోన మేవ వా।
పంచభాగ త్రిభాగం వా యథాయోగ్యం కరోతు చ॥ 91

తదుత్సేధం త్రిధా భక్త్వా భాగే నోత్సంధి యూర్ధ్వతః।
తదధో వేత్ర మేకాంశం తస్యాధో ఽంబుజ మంశతః॥ 92

అథ వా ఫలకా తుంగే పంచభాగ విభాజితే।
సార్ధేన సంధికా తుంగం తత్సమో వేత్ర నిర్గమః॥ 93

ద్వాభ్యా మబ్జం ప్రకర్తవ్యం తదాకారో ఽధు నోచ్యతే।
నాగపత్ర సమాకార మావేత్రా దబ్జం పద్మవత్॥ 94

అథ నాగఫణాకార మబ్జం కుర్యా న్మనోహరం।
విపరీతం విరూపం చ వర్జ్యం త దశుభం యతః॥ 95

తా॥ స్తంభము మొదట పద్మాసనము యొక్క విస్తారము స్తంభ విస్తారమునకు రెట్టింపుగా నుండవలెను. దానిని చక్కగా తామర పుష్పమువలె చేయవలెను. స్తంభము యెత్తులో పద్మమును చేయునపుడు దానిని 6 భా చేసి అందు పైపట్టము 1 భా. ఊర్ధ్వపద్మము 1 భా. కర్ణము ½ భా. అధఃపద్మము 2 భా. దాని దిగువ పట్టము 1 భా. దాని దిగువ పద్మము ½ భా. ఇట్లు చేయవలెను. స్తంభములకు కుంభములకు పై భాగమున ఫలకము ఉండవలెను. ఆఫలకము యొక్క విస్తారము 3 దండములు కనీసము 1½ దండములు మధ్యమము 4 దండములు శ్రేష్ఠము లేక ఫలకము యొక్క విస్తారము కుంభము యొక్క పొట్టతో సమానముగా నుండవచ్చును. సామాన్యముగా ఫలకముల యొక్క యెత్తు ముప్పాతిక దండము చేయుదురు. స్తంభము యొక్క చివరతో సమానముగా మండము యెత్తు కలిగి యుండవలెను. లేక అందలి యైదవభాగము తగ్గియైన నుండవలెను. లేక 5 భా. చేసి అందు 3 భా. చేయవలెను. మండము యొక్క యెత్తును 3 భా. చేసి అందు 1 భా. పైన సంధిచేయవలెను. దాని దిగువ వేత్రము 1 భాగముండవలెను. దాని దిగువ పద్మము 1 భా. చేయవలెను. లేక ఫలకము యొక్క యెత్తును 5 భా. చేసి అందు 1½ భా. పైన సంధిచేసి దాని దిగువ 1½ భా. వేత్రమునుచేసి మిగిలిన 2 భా. పద్మమును చేయవచ్చును. దాని యొక్క ఆకారమెటులంటివేని తమలపాకువలె వేత్రమునుండి పద్మము చక్కని తామర పూవువలె చేయవలెను. లేక పాము పడగవలెను చేయవచ్చును. ఇప్పుడు చెప్పిన పద్ధతుల ననుసరించక చేసిన యెడల కీడుకలుగును.

శ్లో॥ మండ్యూర్ధ్వే వీరకంఠః స్యాత్ తత్తుంగం ఫలకోక్తవత్।
అగ్రపాద విశాలం తు విశాలం త ద్యుగాశ్రకమ్॥ 96

తదూర్ధ్వే బోధికాం కుర్యా న్నానా భేద విచిత్రితామ్।
మూలపాద సమ వ్యాసా బోధికా సా చ ఉత్తమా॥ 97

పాదమధ్య విశాలేన సమవ్యాసా చ మధ్యమా।
అగ్రపాద విశాలస్య సమా కన్యస బోధికా॥ 98

విస్తార సదృ శోత్సేధా పంచదం డాయతాన్వితా।
ఉత్తమా బోధికా ఖ్యాతా తార త్రి ద్వ్యంశ కోన్నతా॥ 99

చతు ర్దండాయ తోపేతా మధ్యమా సా ప్రకీర్తి తా। 100

కన్యసా బోధికా ఖ్యాతా తారే వా భాఉగాంశితే।
ఏకోన ముచ్చం మధ్యాయా నీచాయా స్త్ర్యంశ మున్నతమ్॥ 101

బోధికోచ్చే త్రిభాగే తు భూమ్యంశే నోర్ధ్వపట్టికా।
మధ్యేఽంశేన తరంగః స్యా ల్లతాద్యై ర్భూషితం తు వా॥ 102

తదధ స్త్వేకభాగేన ముష్టిబంధం తు కారయేత్।
త్రిభాగే బోధికోత్సేధే సార్ధాంశే నాగ్రపట్టికా॥ 103

తదర్ధార్ధేన తదధః క్షేప చ్ఛాయాన్వితం భవేత్।
తదుచ్చార్ధాత్ త్రిభాగానా మంశాభ్యాం వాఽత్ర కల్పయేత్॥ 104

తా॥ మండము యొక్క పైన వీరకంఠమును. మండముతో సమానమైన యెత్తుతో చేయవలెను, స్తంభము యొక్క చివర విస్తారముతో సమానముగాను నలుచదరముగాను వీరకంఠమును చేయవలెను. వీరకంఠముపైన బోదెను చేయవలెను. అది అనేక చిత్రములతోను అనేక విధములుగాను చేయవచ్చును. ఉత్తమ బోధిక విస్తారము ప్రధాన స్తంభము మొదలుతో సమానముగా నుండును. స్తంభము యొక్క మధ్య విస్తారముతో సమానము మధ్యమము. స్తంభము యొక్క చివర విస్తారముతో సమానము అధమము, విస్తారముతో సమానముగా యెత్తును 5 దండముల పొడవును కలది ఉత్తమమైన బోదె. విస్తారమును 3 భా. చేసి అందు 2 భా. యెత్తును 4 దండముల పొడవును కలది, మధ్యమమైన బోదె. విస్తారములో సగము యెత్తును 3 దండముల పొడవును గలది కనీసపు బోదె, మరియు బోదె యొక్క విస్తారమును 5 భా. చేసి అందు 1 భా. తగ్గించి 4 భా. యెత్తుగలదియును మధ్యమ మసి యే చెప్పుదురు. ఇప్పుడు చెప్పిన 5 భా.లో 2 భా తగ్గించి 3 భా. మాత్రమే యెత్తుచేసిన యెడల అదియును అధమమనియే చెప్పుదురు. బోదె యొక్క యెత్తును 3 భా. చేసి అందు 1 భా. పైన పట్టికను చేయవలెను. నడుమ 1 భా. తరంగమును చేయవలెను. ఆతంగము లతలు పత్రములు పుష్పములు మొదలగువానితో ప్రకాశించుచుండ వలెను. దాని దిగువ 1 భా. ముష్టిబంధమును చేయవలెను, మరియొక పద్ధతి బోదె యెత్తును 3 భా. చేసి అందు $1\frac{1}{2}$ భా. పైన పట్టికను చేయవలెను. $\frac{3}{4}$ భా. క్షేపమును $\frac{3}{4}$ భా. ముష్టిబంధమును చేయవలెను. లేక యీ $1\frac{1}{2}$ భా. నందు $\frac{1}{2}$ భాగము మాత్రమే క్షేపణము చేసి 1 భా. ముష్టిబంధము చేయవచ్చును.

శ్లో॥ సవ్యాసార్ధా త్త్రిపాదాన్ కుర్యా ద్వా తా స్వగ్రమండనమ్।
దండం త్రిపాద మర్ధం వా ఛాయామానం తదగ్రయోః॥ 105

ఊర్ధ్వస్థ పట్టికాధస్తా చ్ఛాయాత్వాధం ప్రకల్పయేత్।
అధస్తా ద్బోధికాయాం తు స్వాకారం ప్రవదా మ్యహమ్॥ 106

ముష్టిబంధ త్రిభాగైకం విస్తారా దర్ధమేవ వా।
పార్శ్వయో రుభయోః శేషం ఛాయాకారం భవే దిహ॥ 107

సముద్ర శోభణం మధ్య పట్టం పత్రా ద్యలంకృతమ్।
పార్శ్వయో స్తు తరంగాః స్యుః సమా శ్చాన్యోన్య హానకాః॥ 108

తరంగా శ్చాత్ర వేద ర్తు వ స్వా శాదిత్య సంఖ్యకాః।
బహవోఽపి సమా శ్చైకే తుల్యా ఉభయ పార్శ్వయోః॥ 109

సాగరే వీచికాకారః పట్టికా చ్ఛన్నమధ్యమాః।
పార్శ్వయో ర్ముష్టిబంధాగ్రం వ్యాలరూపాది కల్పితమ్॥ 110

మహార్ణవీ చ పత్రీ చ చిత్రీ చేతి త్రి ధైవసా।
భూ తేభ మకరవ్యాల రత్నబంధ విచిత్రితా॥ 111

వల్లీ చిత్రాగ్రపట్టా చ సా ఖ్యాతా చిత్రబోధికా।
కేవలం పత్రవల్లీభి ద్విచిత్రా పత్రబోధికా॥ 112

తరంగమాత్ర చిత్రా యా బోధికా స్యా న్మహార్ణవీ।
బోధీ మూలాగ్రయోః కార్యా వగ్రా కీలసమన్వితా॥ 113

తా॥ బోదెయొక్క విస్తారములో సగమును 8 భా. చేసి అందుపైన 1 దండముగాని ముప్పాతిక దండముగాని లేక అర్ధదండముగాని ఛాయామానమును దానిముందు చేయవలెను. పైనున్న పట్టికకు దిగువ ఛాయాకారమును కల్పించవలెను. క్రిందనున్న బోదెయందుగల ఆకారమును చెప్పుచున్నాను. ముష్టిబంధమును 8 భా. చేసి అందు 1 భా. విస్తారములో సగముగాని యిరుప్రక్కల మిగిలిన దానిని ఛాయాకారము చేయవలెను. సముద్రపు అలలును, మధ్యపట్టము ఆకులు పూలు తీగలు మొదలైనవానితో అలంకారముగా చేసి రెండు ప్రక్కల అలలు ఒకటి నొకటి యొరయుచున్నట్లుండవలెను. ఆతరంగములు 4-6-8-12 ఇట్లు రెండు ప్రక్కల సమానముగా చేయవలెను. ఈ అలలకు మధ్య పట్టిక కమ్మబడి యుండవలెను. ప్రక్కలనున్న ముష్టిబంధము చివర వ్యాలములు మొదలైనవి చేయవలెను. మహాసముద్రము, పత్రపుష్పాదులు, భూతాదిచిత్రములు, వ్యాలములు రత్నములు మొదలైన చిత్రములు చేయవచ్చును. పత్రపుష్పలతాది చిత్రములు గలది చిత్రబోధిక, పత్రములతో చిత్రింపబడినది పత్రబోధిక, తరంగములు

మాత్రమేకలదిఅర్ణవబోధిక. యిట్లు చిత్రములను మూడువిధములుగా శాస్త్రములందు చెప్పి యున్నారు. బోదెలకు మొదట చివర మేకులుండవలెను.

శ్లో॥ బోధి తారార్ధకం వా ఽథ త్రిపాదం వా ఽగ్రనీవ్రకమ్।
తన్నీవ్రసదృశం తార మంభో జాకార కల్పితమ్॥ 114

అగ్ర మధ్య గతం కీలం తత్త్రిభాగ విశాలకం।
అంభోజ ముకులాకారం కీలపృష్ఠం ప్రకల్పయేత్॥ 115

బోధికా ఖండ మండీని కుంభం లశునమూలకం।
అంభోజమాలాం చైతాని పాదపీఠం పునః క్రమాత్॥ 116

క్రమేణ యోజయే దగ్రాత్ సర్వ స్తంభేషు బుద్ధిమాన్।
తత్ర బోధికయా హీనం కారయే ద్వా ఽపి పీఠకమ్॥ 117

దారుపాద ఇతి ప్రోక్తం తద్విస్తార సమంతు వా।
అధ్యర్ధం ద్విగుణం వాఽథ విస్తారం త్విష్టకాంఘ్రిషు॥ 118

పాదే శిలామయే చైవ కారయే త్సర్వవేశ్మసు।
భిత్తిపాదం న కుర్వీత మానుషాణాం గృహే పునః॥ 119

దేవాగారే న దోషాయ భిత్తిపాదా భవంతి హి।
అథ వా క్షుద్రహర్మ్యాణా మన్యథా చరణాః స్మృతాః॥ 120

తా॥ బోదెయొక్క విస్తారములో సగముగాని ముప్పాతికవంతుగాని ముందుకు నిర్గమ ముండవలెను. ఆనిర్గమముతో సమానముగా పద్మము యొక్క రూపమును కల్పించవలెను. చివర నడునునున్న మేకు దాని విసారములో 3 వ వంతును, తామర మొగ్గవలె చీలతలయును చేయ వలెను. బోదె, ఖండము, మండము, కుంభము, లశునము, పద్మమాల, పాదపీఠము ఇవియన్నియును పైనుండి వరుసగా చేయవలెను ఏ స్తంభమునకు బోదె లేకుండునో దానికి పీఠమును చేయవలెను. దారుస్తంభమును గూర్చి చెప్పబడినది. ఇష్టకాస్తంభము దాని విస్తారముతో సమానముగాని లేక $1\frac{1}{2}$ భా. గాని లేక 2 భా. గాని, విస్తారమును చేయవలెను' శిలామయ స్తంభములు చేయునప్పుడు కుడ్యస్తంభములు చేయనక్కరలేదు. మానవ గృహములకు శిలామయస్తంభములు కూడవు. దేవాలయములకు దోషములేదు. భిత్తిస్తంభములుకూడ చేయవచ్చును. మరియు క్షుద్రహర్మ్యము లకు స్తంభముల యొక్క కొలతలు చెప్పబడినవి.

శ్లో॥ మూలతారేణ తన్మూల త్రిభాగం వా ఽథ సార్ధకమ్।
చతుర్భాగం చ కుర్యా ద్వా చతురస్రం తథా ఽగ్రతః॥ 121

మూలతార సమం మధ్యం తయో రష్టాస్ర మాచరేత్।
అష్టాస్రమధ్యే తత్తారం తుల్యం వేదాస్ర ఖండనమ్॥ 122

మధ్యఖండం వినా వాఽత్ర మానుషాణాం నికేతనే॥

ఇతి శిల్పరత్నేభిత్తి వేదికా స్తంభలక్షణం నామ ఏకవింశోఽధ్యాయః

తా॥ క్షుద్రహర్మ్యములకు స్తంభములు. మొదలు విస్తారమును కొలిచి దానితో 3 భా. గాని, 3½ భా. గాని, 4 భా. గాని చేయువచ్చును. (అనగా సమానము) మొదలు 4 కోణములును నడుమ 8 కోణములును చివర 4 భాగములును చేయవలెను. మనుష్యాలయములకు మధ్య ఖండమును చేయనక్కర లేదు.

## 10. వేదికాలక్షణము తద్భేదములు

### కాశ్యపశిల్పము 10 వ పటలము

శ్లో॥ అథ వక్ష్యే విశేషేణ వేదికా లక్షణం పరం।
అధిష్ఠా నోపరిష్ఠాత్తు స్తంభమూలే చ కల్పయేత్॥ 1

ప్రస్తర స్యోపరిష్ఠా త్తు కర్తవ్యా వేదికా ద్విజ।
అధ్యర్ధ దండమానం తు కన్యసా వేదికా మతా॥ 2

ద్విదండోదయం మధ్యం స్యా చ్ఛ్రేష్ఠం తుంగం త్రిదండకమ్।
అథవా ఽన్యప్రకారేణ వేదికోత్సేధ ముచ్యతే॥ 3

పాదోదయం తు షట్ సప్త వసుభాగ విభాజితే।
ఏకాంశం వేదికా మానం కార్యం శ్రేష్ఠ మధోఽధమమ్॥ 4

ఏవం హి చరణానాం తు మూలే తు వేదికోదయమ్।
ఊర్ధ్వమ ప్యంఘ్రితుంగే తు స ప్తభాగ విభాజితే। 5

ఏకాంశం ఖండహర్మ్యాణాం వేదికోదయ మిష్యతే।
త్రి చతు ష్పంచ భాగం తు గలోత్సేధే విభాజితే॥ 6

గలముచ్చం తమేకాంశం శ్రేష్ఠ మ ధ్యాధమం తథా।
అథోత్సే ధాంశమానం వా దండం మూలే తు వేదికా॥ 7

షడంశం వేదికోత్సేధం గుణాంశం గలమానకమ్।
గలోర్ధ్వే కంప మేకాంశ మేకే నాబ్జం ప్రకల్పయేత్॥ 8

తదూర్ధ్వే కంప మేకాంశం కర్తవ్యం ద్విజస త్తమ।
సప్తాష్టాంశే తు వేద్యుచ్చే ర్వేదభూతం క్రమాద్గలమ్॥ 9

కంఠం పద్మం చ కంపంచ ప్రాగివైవ ప్రకల్పయేత్।
కర్ణమానేన తన్మూలే కంప మేకేన కల్పయేత్॥ 10

తా॥ వేదికా లక్షణము చెప్పుచున్నారు. అధిష్ఠానముపైనను, స్తంభమూలమునను, ప్రస్తరముపైనను వేదికను చేయవలెను. 1½ దండము యెత్తుగలది అధమవేదిక 2 దండముల యెత్తుగలది మధ్యమ వేదిక 3 దండముల యెత్తుగలది యుత్తమ వేదిక మరియు స్తంభము యొక్క పొడవును 6 గాని, 7 గాని, 8 గాని భాగములు చేసి అందు 1 భాగము చొప్పున వేదికను చేసినేని వరుసగా ఉత్తమ, మధ్యమ, అధమ వేదికలగును. ఇట్లు స్తంభమూలమున వేదికలు చెప్పబడినవి. పైనను స్తంభము యెత్తును 7 భాగములుచేసి అందు 1 భాగము ఖండహర్మ్యములకు వేదికను చేయవలయును. గలము యెత్తును 3-4-5 భాగములు చేసి అందు ఒక్కొక్క భాగమును గలమును చేసినట్లయిన శ్రేష్ఠము, మధ్యమము, అధమము అని గలములను చెప్పవలెను. లేక మొదలున 1 దండము వేదికను చేయవచ్చును, మరియు వేదిక యెత్తును 6 భాగములుచేసి అందు గలము 3 భాగములు, దానిపైన కంపము 1 భా. పద్మము 1 భా. దానిపైన కంపము 1 భా. ఇట్లు చేయవలెను. వేదిక యెత్తును 7 భా. చేసి అందు గలము 4 భా. కంపము 1 భా. పద్మము 1 భా. మరల కంపము 1 భా. చేయవచ్చును. లేదా 8 భా. చేసి అందు గలమును 5 భా. చేసి మిగిలినవి మునుపటివలెనే చేయవచ్చును. కర్ణమానముచేత వేదికా మూలమున 1 భా. కంపము చేయవలెను.

శ్లో॥ శేషం కంఠోదయం ప్రోక్తం తత్కంపరహితం తు వా।
అర్ధ్యర్ధాంశం తు వా పద్మం తుంగం ద్వ్యంశ మథాఽపి వా॥ 11

పద్మ శైల సుపత్రాభా చిత్రాంశా వేదికా ఽథవా।
సర్వేషాం వేదికానాం తు గల మంఘ్రి విభూషితమ్॥ 12

కుడ్య స్తంభ సమవ్యాసా స్త్రీవ్రం వా వేదికాంఘ్రికా।
ప్రస్తరోపరి వేదీనాం వేశనం శృణు సువ్రత॥ 13

గర్భభిత్తి త్రిభాగైక మంఘ్రే ర్వేద్యంఘ్రి వేశనం।
చతుర్భాగైకభాగం వా పంచభాగైక మాభజేత్॥ 14

ఏకాంశ రహితం శేషం వేదికాయా స్తు విస్తృతమ్।
యుగాశ్రం వేదికాకారం నాగరే ప్రస్తరోపరి॥ 15

ద్రావిడే వేసరే హర్మ్యే వస్వశ్రం వేదికాకృతి।
అథ వా వేసరే హర్మ్యే వేదికా వర్తులం తు వా॥ 16

అనేకాశ్రయుతాశ్చా వా కలాశ్రం వేదికాశ్రయా।
వేదికాలక్షణం ప్రోక్తం తతో జాలకలక్షమ్॥ 17

ఇతి శ్రీ కాశ్యపశిల్పే వేదికా లక్షణో దశమఃపటలః

తా॥ పూర్వశ్లోకములో కర్ణమానముచేత దాని మొదలున కంపము 1 భా. చేయవలెనని చెప్పియున్నది కనుక మిగిలినది కంఠము యొక్క యెత్తు అని తెలియవలెను. లేక అటుల కంపము

తేకుండ పద్మము 1½ భా. గాని లేక 2 భా. గాని చేయవచ్చును. లేక పద్మము నాచు నానావిధ పత్రములు మొదలగువానితో వేదిక చిత్రించవలెను. అన్ని విధములైన వేదికలకు గలము, పాదము, అలంకారము ఇవి యుండవలెను. కుడ్య స్తంభము యొక్క వ్యాసముతో సమానముగా వేదిక యొక్క పాదనిర్గమమును చేయవలెను ప్రస్తరము యొక్క పై భాగమున వేదియొక్క వేశనమును చెప్పుచున్నాను. గర్భము యొక్క గోడను 3 భా. చేసి అందు 1 భా. స్తంభముయొక్క వేదికయందలి పాదవేశనము చేయవలెను. లేక గోడను నాల్గు భాగములుచేసి అందు 1 భాగమైనను చేయవలెను. లేక గోడను 5 భా. చేసి అందు 1 భా. తీసివేసి 4 భా. వేదికయొక్క విస్తారమును చేయవలెను. నాగర ప్రస్తరముపై వేదిక నలుచదరముగా నుండవలెను. ద్రావిడ వేసరహర్మ్యముల యొక్క ప్రస్తరముపై వేదిక 8 కోణములు గలిగి యుండవలెను. లేక వేసరహర్మ్యముల యొక్క ప్రస్తరముపై వేదిక గుండ్రముగా నుండవలెను. 16 గాని, 24 గాని, 32 గాని యిట్లు అనేక కోణములుగల దానికిని వేదిక గుండ్రముగానే యుండవలెను. అయితే గలముయొక్క కోణములును వేదిక కోణముల ననుసరించియే యుండవలెను. వేదికా లక్షణము చెప్పబడినది. తరువాత జాలకములయొక్క లక్షణము చెప్పబడును.

శిల్పరత్నము 21 వ అధ్యాయము

శ్లో॥ పుష్పఖండా చిత్రఖండా శైవలా చిత్రశైవలా।
ఇతి నామ్నా భవే ద్వేదీ తత్త ద్భూషణ భేదతః॥ 25

కంపనీవ్రా కంపయుతా పుష్పవ త్ఖండమండితా।
మూలే పాదాన్వితా యాసా పుష్పఖం డేతి కథ్యతే॥ 26

సైవనీవ్రా కంపపట్ట పద్మ పత్ర విచిత్రితా।
పాద పాదాంతరే చిత్రా చిత్రఖం డాభిధీయతే॥ 27

స్తంభ కం పాబ్జ పట్టాఢ్యా పట్టే శైవలచిత్రితా।
ఊర్ధ్వాధః పద్మపత్రాఢ్యా పాదే పాదాంతరే ఒపిచ॥ 28

నరనారీ పత్రచిత్రా శైవలాఖ్యా హి వేదికా।
సై వాధరోర్ధ్వాంబుజయోః వేత్రయుగ్మ మనోరమా॥ 29

ప్రా గ్వద్విచిత్ర వేషా స్యాత్ సా వేదీ చిత్రశైవలా।
అధ్యర్ధాంశం తు వా పద్మ మాద్యం ద్వ్యంశ మథాపి వా॥ 30

చిత్రశైవల విఖ్యాత వేదికా యా విశేషతః॥ 30½

తా॥ పుష్పఖండ వేదిక, చిత్రఖండ వేదిక, శైవల వేదిక, చిత్రశైవల వేదిక అను నాలుగు విధములు గలవు. అందు కంపము, నీవ్రము, కంపము, పుష్పములవలె ఖండములును మొదట పాదుకయును కలది పుష్పఖండ వేదిక యనబడును. అదియే నీవ్రము, కంపము, పట్టము, పద్మము, పత్రములు చిత్రింపబడి ప్రతి స్తంభమునందు కలది చిత్రఖండ వేదిక యనబడును. స్తంభము, కంపము,

పద్మము, పట్టము కలిగి ఆపట్టమున నాచు అలలు మొదలైన చిత్రములు కలదియును క్రిందనుపైనను పద్మములును పత్రములును కలదియును స్తంభ స్తంభమునందును స్త్రీ పురుష చిత్రములు మొద లైనవి కలది శైవలవేదిక యనబడును. పై జెప్పినచే దిగువను పైనను పద్మములుండి చక్కని స్తంభములు రెండు కలిగి మునుపటిదానివలె రమ్యముగా నున్నచో చిత్రశైవలవేది యనబడును. మొదట పద్మము 1½ భాగముగాని లేక 2 భాగములుగాని యున్నయెడల చిత్రశైవలవేదిక యనియే చెప్పబడును. శిల్పరత్నమున కాశ్యపశిల్పము నందలి శ్లోకములే కన్పట్టుటచే వ్రాయలేదు.

## 11. జాలక లక్షణము (కిటికి)

### కాశ్యపశిల్పము 11 వ పటలము

శ్లో॥ అథ వక్ష్యే విశేషేణ శృణు జాలక లక్షణమ్।
పాదవర్గ గలే చైవ జాలకస్థాన ముచ్యతే॥ 1

ప్రాసాదేషు మహావాస్తు అంతరా లైవ మధ్యమమ్।
పాదా త్పదం నకర్తవ్య మనేన విధినా బుధః॥ 2

యోజయే ద్వేదికోర్ధ్వే తు జాలకం తు ద్విజోత్తమ।
వేదికా జాలకార్ధం న చ్ఛేద్యా సర్వవినాశనమ్॥ 3

త ద్యథా వేదికాజాలం కార్యం నచ్ఛేదయే త్తథా।
ద్విదండం కన్యసం వ్యాసం త్రిదండం మధ్యమం భవేత్॥ 4

చతుర్దండ విశాలం తు హ్యుత్తమం పరికీర్తితమ్।
విస్తార సదృశోత్సేధ మేకదండ వివర్ధనాత్॥ 5

విస్తార ద్విగుణం వాఽథ తావ ద్ద్వై జాలకోత్తమమ్।
యేషు తుంగవిశాలేషు యదిష్టం తు పరిగ్రహేత్॥ 6

స్తంభ వ్యాసార్ధమానం తు ఘనం వ్యాసాంఘ్రికంపయోః।
విస్తారార్ధాయతం వా త త్త్రిచతుర్ధాంశమేవ వా॥ 7

మధ్యస్థం చర రంధ్రం చ వర్జ్యం జాలక మాచరేత్।
యుగ్మపాద సమాయుక్త మయుగ్మం కంప ముచ్యతే॥ 8

తా॥ జాలకముల యొక్క లక్షణములను చెప్పుచున్నాను. స్తంభముల యొక్క గల స్థానములందు జాలకములను నిర్మించవలెను. ప్రాసాదములయందును, మహాభవనముల యందును, అంతరాలమునను, గల స్తంభమునకు జాలకమును చేయరాదు. వేదికయొక్క పై భాగమున జాలక ముల నుంచవలెను. జాలకము కొఱకు మాత్రము ప్రత్యేక వేదికను చేసిరేని మహాదోషము కల్గును. ఆదోషము సమస్తమును నశింపజేయును. జాలకము యొక్క విస్తారము 2 దండములు కనీసము,

3 దండములు మధ్యమము, 4 దండములు శ్రేష్ఠము, విస్తారముతో సమానముగా యెత్తునుచేసి ఒక్కొక్క దండమును వృద్ధిచేయుచు విస్తారమునకు రెట్టింపువరకు చేయవచ్చును. స్తంభము యొక్క విస్తారములో సగము కంపముల యొక్క ఘనమును చేయవలెను. అందులో సగము నిడుపును అందులో 3 వ భాగముగాని 4 వ భాగముగాని దానిమధ్య చరరంధ్రమును కల్పించవలెను. జాలకములకు అటుల చేయరాదు. జాలకములకు నిలువు కమ్ములు జతలుగా నుండవలెను. కంపద్వారములకు నిలువు కమ్ములుబేసి సంఖ్యగా నుండవలెను—

శ్లో॥ గోనేత్రం హస్తినేత్రం చ నంద్యావర్తం ఋజుక్రియమ్।
పుష్పకర్ణం సకర్ణం చ జాలకం షడ్విధం భవేత్॥ 9

దీర్ఘాశ్రం కంఠ మచ్ఛిద్రం గోనేత్ర మితి సంజ్ఞితమ్।
యుగాశ్రం కర్ణకచ్ఛిద్రం హస్తినేత్ర ముదాహృతమ్॥ 10

పంచసూనం తు యచ్ఛిద్రం ప్రదక్షిణవశా త్కృతి।
నంద్యావర్తస్య పుష్పాభం నంద్యావర్త మితి స్మృతమ్॥ 11

ఆర్జుకాలౌ స్తంభతంపౌ ద్వౌ జాలం త ద్రుజుక్రియమ్।
పుష్పకర్ణ సకర్ణాభం నంద్యావర్త మి వాకృతి॥ 12

స్తంభయోగం కవాటం చ భిత్తిమధ్య బహిఃస్థితమ్।
యుగ్మాయుగ్మం కవాటం వా ఘాట నోద్ఘాటన క్షమమ్॥ 13

జాలకం తు సభాదీనాం పదతో ఒర్ధేన కల్పయేత్।
లోహ ద్రు మోపలై ర్ధివ్యై ర్వేష్టకా భిత్తిజాలకమ్॥ 14

యత్రోచితం తు తద్గ్రివ్యం తేన తత్రైవ యోజయేత్।
జాలకం హ్యేవమాఖ్యాతం తత స్తోరణలక్షణమ్॥ 15

ఇతి కాశ్యపశిల్పే జాలకవిధాన మేకాదశః పటలః

తా॥ గోనేత్రము, గజనేత్రము, నంద్యావర్తము, ఋజుక్రియము, పుష్పకర్ణము, సకర్ణము, అని జాలకములు 6 విధములు. దీర్ఘచతురస్రమును కంఠమునందు ఛిద్రములు లేకుండునది గోనేత్రము. నలుచదరమును కర్ణమున ఛిద్రములును కలది గజనేత్రము 5 పుష్పములుగా ఛిద్రములు గలది నంద్యావర్తము, మధ్య కమ్మియుండి రెండు కిటికీలుగా చేసినేని ఒక్కటియే రెండుగాను కనుపడునది ఋజుక్రియము, నంద్యావర్తమువలె రంధ్రములు గలది పుష్పకర్ణము, ఆయతవృత్తము కలది సకర్ణము, స్తంభముతో కలిసియున్న కిటికీగాని గోడయందున్న కిటికీగాని తలుపులు యిష్టానుసారముగా చేయవచ్చును. సభ మొదలైనవానికి కిటికీలు అర్ధపదముననే చేయవలెను. ఇనుముతోను, దారువుతోను, రాతితోను, ఇటుకలతోను కిటికీని చేయవచ్చును. ఎక్కడ అవసరమని తోచిన అక్కడ కిటికీని పెట్టవలెను. శిల్పరత్నము 4 అధ్యాయము దీని ననుసరించియే యున్నది.

## 12. తోరణలక్షణము

### కాశ్యపశిల్పము 12 వ పటలము

శ్లో॥ అథ వక్ష్యే విశేషేణ తోరణానాం చ లక్షణమ్।
పాదోదయే దశాంశే తు సప్తాంశం తోరణోదయమ్॥ 1

శేషం త్వనలభాగం తు ఝషమాన ముదాహృతమ్।
నవాంశే పాదతుంగం తు షడంశం తోరణోదయమ్॥ 2

శేషం ఝషోదయం ఖ్యాత మష్టాంశే చాంఘ్రితుంగకే।
పంచాంశం తోరణోత్సేధం గుణాంశం కంపతుంగకమ్॥ 3

తుంగం వా విపులంవాఽపి వేద భూత ర సాంఘ్రికమ్।
తోరణస్య తు పాద్బాహ్యే వ్యాస మేవం చతుర్విధమ్॥ 4

ప్రాసాద మండపాదీనాం మధ్యభాగే తు తోరణమ్।
అనేన విధినా విప్ర కర్తవ్యం కుడ్యబాహ్యకే॥ 5

పత్రాఖ్యం తోరణం చైకం ద్వితీయం నక్రతోరణమ్।
తృతీయం చిత్రసంజ్ఞం తు త్రివిధం తోరణాకృతి॥ 6

అర్ధచంద్ర మి వాకారం పత్రరాజ విరాజితమ్।
పత్రతోరణ మాఖ్యాతం తతో నకర ముచ్యతే॥ 7

నక్రపంచక సంయుక్తం పార్శ్వయో ర్మకరాస్యకమ్।
మధ్యే తు త్రిక సంయుక్తం నానాపుష్ప లతాన్వితమ్॥ 8

నానాలంకార సంయుక్తం వృత్తం మకరతోరణమ్॥ 8½

తా॥ స్తంభము యొక్క యెత్తును 10 భా. చేసి అందు 7 వ భాగమున తోరణమును చేయువలెను. దానిపైన 3 భాగములు మకరములను చేయువలెను, స్తంభము యెత్తును 9 భా. చేసి నట్లయిన తోరణము 6 భాగమున సరిపుచ్చవలెను. మిగిలిన 3 భా. మకరమును చేయవలెను. స్తంభము యెత్తును 8 భా. చేసినప్పుడు తోరణమును 5 భా. చేయవలెను, మిగిలిన 3 భా. కంపమును చేయువలెను. దాని విస్తారము యెత్తుతో సమానముగాని లేక 4 భా. గాని, 5 భా. గాని, 6 భా. గాని చేయువచ్చును. ఇట్లు నాలుగు విధములు కలవు. ప్రాసాదములకును మండపములకును మధ్య భాగమున తోరణమును చేయవలెను. ఈవిధముగా గోడ వెలుపలను చేయవలెను. పత్రతోరణము 1, మకరతోరణము 2, చిత్రతోరణము 3 ఇట్లు భేదములు కలవు. అర్ధచంద్రాకారముగాను, చక్కని ఆకులతో ప్రకాశించునట్లును చేయునది పత్రతోరణము, 5 మొసళ్లను కలిపి చేయవలెను. ఎట్లనగా ప్రక్కల రెండు ముఖములు కనుపడునట్లును. నడుమ ఒకటికొకటి తలలు యెదురుగా

రెండును వీనినడుమ ఒక తలయును. ఇట్లు ఈ మకర ముఖములగుపడునట్లు చేయునది మకరతోరణము. అయినను అనేక లతలు పుష్పములు అలంకారములతో గూడ నుండవలెను.

శ్లో॥ తదేవ పార్శ్వయో ర్మధ్యే ఛురీ మస్య ద్వయో రపి॥ 9
నక్రతుండం ప్రకర్తవ్యం భూతవిద్యాధరా స్తథా।
సింహ వ్యాలక హంసాద్యై ర్వలగ్రా న్మ్రక్తదామకైః॥ 10
అన్యై శ్చ వివిధై శ్చి త్రైః రత్నసంఘై శ్చ భూషయేత్।
చిత్రతోరణ మేవం స్యాత్ ప్రోచ్యతే తోరణత్రయమ్॥ 11
తోరణా న్యంతరాధస్తా త్ప్రయోజ్యాని విచక్షణైః।
మధ్యే శూలం పార్శ్వయో శ్చ ద్వికరండ సమన్వితమ్॥ 12
బోధికా రహితం య త్తత్ స్తంభం తు గలకాస్మృతా।
స్తంభతోరణవ న్మూర్ధ్ని క ర్తవ్యం తోరణద్వయమ్॥ 13
ఏవం త త్త్రివిధం నీత్వా ద్విజ కుంభలతోచ్యతే॥

ఇతి కాశ్యపశిల్పే తోరణ కుంభ లతాలక్షణం ద్వాదశః పటలః

తా॥ పైజెప్పిన రీతిగా యిరుప్రక్కలను నడుమను పై భాగమున కత్తులనుచేసి మకర ముఖములనుచేసి భూతగణము విద్యాధరగణము. సింహములు, వ్యాలములు హంసలు, నడుమ ముత్తెపు దండలను ఇంకననేక విధములగు చిత్రములును, రత్నములు మొదలగు అలంకారములును చేసిన యెడల చిత్రతోరణమగును. ఈ తోరణమునకు నడుమ త్రిశూలమును యిరుప్రక్కల ఖడ్గములును చేయవలెను. బోదెలేని స్తంభమునకు గలమున తోరణము చేయవలెను. స్తంభతోరణమువలెనే మండపములకును ప్రాసాదములకును తోరణమును చేయవలెను. ఇక కుంభలతను చెప్పబోవు చున్నాను. (స్తంభతోరణ లక్షణము చెప్పిన తరువాత కుంభలత లక్షణము చెప్పబోవు చున్నాము కనుక యిచ్చట మానివేయడమైనది.)

శిల్పరత్నము 23వ అధ్యాయము

శ్లో॥ ప్రస్తరోత్తరయో ర్మధ్యే యోజ్యాన్యేతాని సర్వశః॥ 16
గృహేషు తోరణానాంతు యథార్హాం ప్రతిమాం తథా।
న్యస్యే న్నా రీనదాదిర్వా యథా శోభ విచిత్రితః॥ 17
శిలాదార్విష్టకా మృత్స్నా ద్రవ్యాణి స్యుశ్చతోరణే।
కుడ్యతోరణ మేవం స్యా ద్యథాశోభ విచిత్రితమ్॥ 18
ద్వారే ద్వారేషు క ర్తవ్యం గృహేషు ద్వార తోరణమ్।
ద్వార తు ల్యోన్నత వ్యాసం తోరణాం ప్ర్యుదయం తతః॥ 19

తా॥ ప్రస్తరమునకు ఉత్తరమునకు నడుమ తోరణములను చేయవలెను. గృహముల యందు అందమును చూచి చేయవలెను. ప్రతిమలను పుష్పములను రత్నములను తోరణముల యందు చిత్రించవచ్చును జాతితోను దారువుతోను మట్టితోను యిట్లు దేనితో నిర్మాణము చేయుచున్నారో దానితోనే చేయవచ్చును. గృహము యొక్క ద్వారములయందు చేయునది ద్వారతోరణమగును. తోరణము యొక్క వ్యాసమును యెత్తును సమానముగా నుండవలెను.

## 1?. వృత్తస్ఫుటితలక్షణము

### కాశ్యపశిల్పము 13 వ పటలము

శ్లో॥ అథ వక్ష్యే విశేషేణ వృత్తస్ఫుటిత లక్షణమ్।
షడంగులం సమారభ్య ద్వి ద్వ్యంగుల వివర్ధనాత్॥ 1

కలాంగు లావధిం యావత్ తావత్ వ్యాసం తు షడ్విధమ్।
విస్తారార్ధంతు తన్నీవ్రం త్రయాంశే చ ద్విభాగికమ్॥ 2

వృత్తాకారసమం తచ్చ తోరణాంఘ్రి వ దాయతమ్।
కంధరం తు తదూర్ధ్వే తు శుకనా స్యన్వితం తు వా॥ 3

కర్ణకూటాకృతి ర్వాఽథ వృత్తాకారం ప్రకల్పయేత్।
స్తంభోత్సేధే యుగాంశే తు ద్విభాగం తోరణోదయమ్॥ 4

ప్రస్తరోదయ మేకాంశం శుకనా స్యుదయాంశకమ్।
తదేవ కూటమానం తు తత్త దుక్తవశా న్నయేత్॥ 5

అథ వా తరమంచస్య ప్రోక్తమార్గేణ వా కురు।
వృత్తస్ఫుటిత మేవం హి లతామండల మండితమ్॥ 6

స్తంభాద్యం తోరణం చైవ తథా కుంభలతాద్విజ।
వృత్తాఖ్యం స్ఫుటితం చైవ హారం తారేషు కల్పయేత్॥ 7

స్తంభాంతరేవ కర్తవ్యం హర్మ్యాదీనాం విశేషతః॥ 8

ఇతి కాశ్యపశిల్పే వృత్తస్ఫుటిత లక్షణం త్రయోదశః పటలః

తా॥ వృత్తము యొక్క విశాలమును చెప్పుచున్నాడు. 6 అం. మొదలుకొని 2.2 అం. వృద్ధిచేయుచు 16 అంగుళముల వరకు వ్యాసము 6 విధములుగా చెప్పబడినది. విస్తారములో సగము నిర్గమము చేయవలెను. లేక 3 భా. చేసి అందు 2 భా. నిర్గమమును చేయవచ్చును. ఆయతముకూడ విస్తారముతో సమానముగనే యుండవలెను. దానిపైన గలము శుకనాసిగాని, కర్ణకూటాకారముగాని వృత్తాకారముగు చేయవలెను. స్తంభముయొక్క యెత్తును 4 భా. చేసి అందు తోరణము యొక్క పైభాగము వరకు 2 భా. ప్రస్తరము యొక్క పైభాగము వరకు

1 భా. శుకనాసి పైభాగము వరకు 1 భా. అదియే కర్ణకూటములుగా చేసేయెడల ఆ యా కొలతల ననుసరించి చేయవలెను. లేదా మంచకములకు జెప్పినరీతిగానైన చేయవలెను. అయితే వృత్త స్ఫుటితము అనేక విధములైన లతలచేత ప్రకాశించునట్లు చేయవలెను. స్తంభము మొదట తోరణ మును కుంభలతను చేయవలెను. వృత్తము యొక్క ముఖము విస్తారముగాచేసి అవిస్తారములో హారమును కల్పించవలెను. స్తంభములకును హార్మ్యములకును వానివాని అలంకారములు సరిపోవు నట్లు చేయవలెను. మరియు శిల్పరత్నము 27 వ అధ్యాయమున కాశ్యపశిల్పమునకు సమానముగా 4 శ్లోకములు మాత్రమున్నవి. పూర్తిగాలేదు.

## 14. స్తంభ తోరణము

### కాశ్యపశిల్పము 14 వ పటలము

శ్లో॥ అథ వక్ష్యే విశేషేణ స్తంభ తోరణ లక్షణం।
పాదోచ్చం దశధా భజ్య శుద్ధద్వారం నవాంశకమ్॥ 1

చరణం నవధా భజ్య అష్టాంశం ద్వారమానకమ్।
అథవాంఘ్రేస్తు తుంగం తు వసుభాగ విభాజితే॥ 2

సప్తమం ద్వారమానం తు రసభాగ విభాజితే।
సార్ధవహ్న్యంశ మూర్ధ్వే తు భువంగ స్యోదయం భవేత్॥ 3

పతంగోచ్చ మధస్తాత్తు సార్ధ యుగ్మాంశ ముచ్యతే।
శుద్ధద్వారే తదర్ధాంశం శుద్ధద్వారస్య విస్తృతమ్॥ 4

ఏక ద్వి త్రి చతు ష్పంచ షట్ సప్తాష్ట నవాంగులమ్।
తుంగార్ధా దధికం హీనం తార మేకోనవింశతిః॥ 5

భేద మేవం సమాఖ్యాతం ద్వారతుంగం త్రిధాభవేత్।
సర్వేషా మపి హర్మ్యాణాం ద్వారం మధ్యే తు యోజయేత్॥ 6

తా॥ స్తంభతోరణ లక్షణము చెప్పుచున్నాడు. స్తంభము యెత్తును 10 భా. చేసి ద్వారమును 9భా.చేయవలెను. లేక స్తంభము 9భా.చేసి ద్వారము 8భా. చేయవలెను. లేక స్తంభము యెత్తును 8భా. చేసి ద్వారము 7భా. చేయవలెను. మరియు స్తంభమును 6భా. చేసి అందు 3½భా. పైన భువంగద్వారమును చేయవలెను. స్తంభము యెత్తునుండి క్రింద 2½భా. పతంగ ద్వారమును చేయవలెను. శుద్ధద్వారము యొక్క పొడవులో సగము విస్తారమును చేయవలెను. మరియు ద్వారము యెత్తు 19 అంగులములలో వెడల్పు సగముగాక 1-2-3-4-5-6-7-8-9 అంగుళములు యిట్లు యిష్టము వచ్చిన అంగుళములను కలిపికూడ చేయవచ్చును. లేక ద్వారము యెత్తును సగముచేసి యీ చెప్పిన అంగుళములను తగ్గించికూడ చేయవచ్చును. ఇట్లు మూడు విధములుగా చెప్పబడినది. అన్ని విధములైన హార్మ్యములకును ప్రధాన ద్వారము నడుమనే చేయవలెను.

శ్లో॥ పాద విష్కంభమానం వా సపాదం సార్ధ మేవవా।
ద్వారయోగస్య విస్తారం తస్యార్ధం ఘన ముచ్యతే॥ 7
సాష్టే సార్ధత్రయం వాఽథ త్రిపాదం వాఽథ తద్ఘనమ్।
యోగతుంగంతు వేదాంశే త్వేకాంశాశ్రయ యోగతః॥ 8
గుణాంశ మూర్ధ్వగం ఖ్యాతం బాహ్యేబ్జక్షేపణాన్వితం।
బాహ్యేఽబ్జక్షేపణోపేతం భూతారం తదధో భవేత్॥ 9
పతంగ తారయోగస్య తుల్య మబ్జం విహీనకమ్॥
భువంగం చ పతంగం చ మధ్యస్థ వలయాన్వితమ్॥ 10
తామ్రజౌ వాఽఽయసౌ వాఽథ వలయౌ కీలబంధితౌ।
తద్విస్తార త్రిభాగైకం శిఖాయోగ ప్రవేశితౌ॥ 11
శైలజం చే ద్భువంగాది యోగభూమౌ శిఖాన్వితౌ।
భువంగాగ్రే పతంగాగ్రే ఛిద్రయో ర్వేశనాన్వితౌ॥ 12
ఏవం దృఢీకృతే పశ్చాత్ యోగావస్థాన మాచరేత్।

తా॥ స్తంభము యొక్క విస్తారముతో సమానముగాని, దానికంటె పాతికవంతు యెక్కువ గాని, లేక అర్ధభాగము యెక్కువగాని ద్వారము యొక్క విస్తారమును చేయవలెను. అందులో సగము ద్వారశాఖల మందమును చేయవలెను. లేక దానిని 8 భా. చేసి అందు 3½ భా. గాని లేక 3 భా. గాని చేయవచ్చును. ద్వారయోగము యెత్తును 4 భా. చేసి పైన 1 భా. ఆశ్రయముగా చేసి 3 భా. పైకి పోవునట్లు చేయవలెను. వెలుపల పద్మమును క్షేపణమును చేయవలెను. మరియు వెలుపల పద్మమును క్షేపమును చేసి భూవిస్తారమును గూడ అడుగున చేయవలెను. పతంగము యొక్క విస్తారయోగమునకు సమానముగాను పద్మము లేకుండ సరిపోవునట్లు భువంగ పతంగముల యొక్క మధ్యస్థ వలయమును లోహపు మేకుతోగాని యిత్తడి మేకుతోగాని బిగించవలెను. దాని విస్తారమును 3 భా. చేసి అందు 1 భా. శిఖాయోగ ప్రవేశమును చేయవలెను. రాతితో చేయబడినది యయ్యెనేని యోగస్థలమునందు శిఖతో గూడిన భువంగపతంగముల యొక్క తలలు. ఛిద్రముల యందు ప్రవేశించునట్లు చేయవలెను. ఇట్లు గట్టిగాచేసి తరువాత కూడికచేయు స్థానమును కల్పించవలెను.

శ్లో॥ సునక్షత్రే శుభేవారే శుభహోరా ముహూర్తకే॥ 13
యోగే సంస్థాపయే ద్విప్ర శాంతిహోమ పురస్సరమ్।
భిత్తివ్యాసే తు భాస్వంశే బాహ్యే త్వంచావసానకమ్॥ 14
అభ్యంతరం తు సప్తాంశం సీమాయోగస్య మధ్యమమ్।
తద్బాహ్యే ఽభ్యంతరం చైవ యోగవ్యా సోభయాశ్రితం॥ 15

సర్వాలంకార సంయుక్తం యోగసీమా దృఢీకృతం।
యోగే వా పంచ షట్ సప్త భాగే ద్వౌతోరణాగ్రకం॥ 16

శేషం పాదోదయం ఖ్యాత మేవం వై త్రివిధం భవేత్।
యుగాస్రం వసుకోణం వా వృత్తం వా తోరణద్వయం 17

కుంభ మండాది సంయుక్తం బోధికా సహితం తథా।
బోధికా రహితం వాఽథ వీరకంఠ సమన్వితం॥ 18

కుడ్య స్తంభ విశాలార్ధం త్రిపాదం వా సమం తు వా।
తోరణాంఘ్రి విశాలం తు ప్రోచ్యతే ద్విజసత్తమ॥ 19

తా॥ నక్షత్రము, వారము, హోర, ముహూర్తము ఇవి యన్నియు మంచివిగా చూచి యోగస్థానమున శాంతి హోమపురస్సరముగా స్థాపించవలెను. గోడ విస్తారమును 12 భా. చేసి వెలుపల 5 భా. లోపల 7 భా. చేయవలెను. ఈరెంటి నడుమ యోగమును చేయవలెను. యోగ సీమ అన్ని విధములైన అలంకారములతో గట్టిగాను ఉండవలెను. యోగమునందును 5-6-7 భాగములు తోరణము యొక్క పైభాగముగాచేసి శేషించినది స్తంభము యొక్క చివర యిట్లు 3 విధములు, ఈతోరణములు నలుచదరము, 8 కోణములు గుండ్రము. యిట్లు 3 విధములుగా చేయవచ్చును. కుంభము, మండము, బోదె వీటితోకూడి యున్నను. లేకున్నను వీరకంఠముతో గూడి యున్నను తోరణమును చేయవచ్చును. గోడ స్తంభము యొక్క విస్తారములో సగముగాని లేక ముప్పాతిక వంతుగాని, లేక విస్తారముతో సమానముగాని తోరణము యొక్క విస్తారమును చేయవలెను.

శ్లో॥ ఉత్తరం వాజనం చాబ్జం క్షేపణం క్షుద్రవాజనం।
యథా క్రమేణ సంకల్ప్య అనేన విధినా బుధః॥ 20

తోరణాంఘ్రి విశాలం వా త్రిపాదం వోత్తరోదయం।
తదర్ధం వాజ నోచ్చం తు తస్యార్ధం గలమానకం॥ 21

గలార్ధం క్షేపణం ఖ్యాతం తస్యార్ధం క్షుద్రవాజనం।
ఉత్తరం బోధికోర్ధ్వే చ వీరకంఠం తు వా భవేత్॥ 22

ఉత్సంధి తానతాగ్రం తు కుర్యా న్మకరవిష్టరం।
తోరణాగ్ర విశాలం తు కుడ్యస్తంభో ఽథ అర్ధకం॥ 23

కుడ్య స్తంభస్య తారాంత ర్వ్యాసం వా తోరణాగ్రకం।
స్వాంఘ్రివే త్రావసానం వా తస్మా ద్దండాధికం తు వా॥ 24

ఏవం చతుర్విధం ఖ్యాతం తోరణాగ్ర విశాలకం।
కుడ్యతోరణ మాఖ్యాతం ద్వారతోరణ ముచ్యతే॥ 25

తా॥ ఉత్తరము, వాజనము, పద్మము, క్షేపణము, క్షుద్రవాజనము ఇవి వరుసగా చేయవలెను. వానివాని భాగములను చెప్పుచున్నాను. తోరణము యొక్క పాదముతో సమానముగా విస్తారముగాని లేక అంశములో ముప్పాతిక వంతుగాని లేక సగముగాని వాజనము యొక్క యెత్తును చేయవలెను. వాజనములో సగము యెత్తున గలమును చేయవలెను. గలములో సగము యెత్తు క్షేపణమును చేయవలెను. క్షేపణములో సగము యెత్తు క్షుద్రవాజనమును చేయవలెను. ఉత్తరమును బోదె వీనిపైన వీరకంఠమునుగాని చేయవచ్చును. పైన కూర్చబడిన ఆనతము యొక్క పైభాగమున మకరము నుంచవలెను. తోరణముపై విశాలము గోడయందలి స్తంభము అందులో సగము చేయవలెను. గోడ స్తంభము యొక్క విస్తారముతో సమానముగా తోరణము యొక్క విస్తారమును చేయవలెను. ఆ స్తంభము యొక్క వేత్రము పైభాగము వరకుగాని, దానినుండి 1 దండము అధికముగాని చేయవచ్చును ఇట్లు 4 విధములుగా చెప్పబడియున్నది. కుడ్యతోరణ విధమును చెప్పితిని. ద్వారతోరణ విధమును చెప్పుచున్నాను.

శ్లో॥ ద్వారతుల్యోన్నతం వ్యాసం తోరణాం స్త్ర్యుత్తరం సమం।
ఉత్తరం వాజనం చాబ్జం క్షేపణం చాష్టమంగలం॥ 26

ఫలకం పంచనక్రాఢ్యం ప్రాగుక్తవిధినా కురు।
పత్రాఖ్యం మకరాఖ్యం వా చిత్రతోరణ మేవ వా॥ 27

మధ్యోర్ధ్వే శూలసంయుక్తం పార్శ్వయో శ్చ సమన్వితం।
దర్పణం పూర్ణకుంభం చ వృషభం యుగ్మచామరం॥ 28

శ్రీవత్సం స్వస్తికం శంఖం దీపం దేవాష్టమంగలం।
శ్రీవత్సం మధ్యమే కుర్యాత్ శేషాంశం తస్య పార్శ్వయోః॥ 29

లోహై ర్దారుశిలాభి ర్వా కర్తవ్యం ద్వారతోరణం।
ద్వారతోరణ మేవం హి స్తంభతోరణ ముచ్యతే॥ 30

తా॥ ద్వారముతో సమానముగా విస్తారము తోరణమునకును స్తంభమునకును ఉత్తరమునకును చేయవలెను. ఉత్తరము, వాజనము, పద్మము, క్షేపణము, అష్టమంగలము, ఫలకము, పంచమకరములతో గూడినదియును, ఇవి యన్నియు మునుపు చెప్పిన రీతిగా చేయవలెను. పత్రతోరణము, మకరతోరణము, చిత్రతోరణము ఈమూడును మధ్య పైభాగమున శూలమును, ఇరుప్రక్కలను శూలములును, అద్దము, పూర్ణకుంభము, వృషభము, చామరయుగ్మము, శ్రీవత్సము, స్వస్తికము, శంఖము, దీపము ఈ యెనిమిది దేవతలకు అష్టమంగళ వస్తువులు. అయితే శ్రీవత్సమును నడుమచేసి మిగిలినవి యిరుపైపులను చేయవచ్చును. లోహముతోను, దారువుతోను, శిలతోను ద్వారతోరణమును చేయవచ్చును. ఇట్లు ద్వారతోరణ లక్షణములను చెప్పితిని. స్తంభతోరణమును చెప్పబోవు చున్నాను.

శ్లో॥ పాదోచ్చం తు త్రిధాభజ్య ద్విభాగం తోరణోదయమ్।
పాదం సర్వాంగ సంయుక్తం బోధికా రహితం కురు॥ 31

ఉత్తరం వాజనం చాబ్జం క్షేపణం నిమ్న వాజనమ్।
తదూర్ధ్వం ఝషకర్ణం తు నానాపత్రై ర్ద్విచిత్రితమ్॥ 32
తోరణం మకరాఖ్యం తు మృణాల్యన్విత కంధరమ్।
సర్వాలంకార సంయుక్త మేతత్ స్యాత్ స్తంభతోరణమ్॥ 33
పాదాంతరే హారాయాంవా కర్ణప్రాసాద మధ్యమే।
శాలామ ధ్యాంతరాలే వా కర్తవ్యం సర్వధామసు॥ 34
స్తంభతోరణ మాఖ్యాతం శృణుకుంభలతా విధిమ్॥

ఇతి కాశ్యపశిల్పే స్తంభతోరణ విధి శ్చతుర్దశః పటలః

తా॥ స్తంభము యొక్క యెత్తును ౬ భా. చేసి అందు ౩ భా తోరణము యొక్క అ త్తు చేయవలెను. స్తంభమునకు అన్ని అలంకారములు చేయవలెను. బోదె లేకుండచేసి ఉత్తరము, వాజనము, పద్మము, క్షేపణము, నిమ్న వాజనము, ఝషకర్ణము అనేక పత్రములతో అలంకారము చేసినచో స్తంభతోరణము, స్తంభములకును హారములయందును కర్ణప్రాసాద మధ్యమునను, శాలయొక్క నడుమను అన్ని విధములైన హర్మ్యములకును పై జెప్పిన రీతిగా తోరణములను చేయవలెను. కుంభలత యొక్క విధానమును చెప్పుచున్నాను. శిల్పరత్నము ౨౦ వ అధ్యాయమున కాశ్యప శిల్పము ననుసరించి చెప్పినాడు. మంగళ వస్తువులను మాత్రము విశేషించి చెప్పినాడు.

శిల్పరత్నము ౨౩వ అధ్యాయము

శ్లో॥ పూర్ణఘట ధ్వజవజ్రౌ స్వస్తిక శక్తిచ చామరద్వితయమ్।
నాగ మయూరక మష్టౌ స్కందేఽపి కరోతు మంగలాన్యత్ర॥ 34
దర్పణం పూర్ణకుంభం చ వృషభం చామరద్వయమ్।
శ్రీవత్సం స్వస్తికం శంఖం దీపం విఘ్నేశశాస్తరి॥ 35
పీఠం ఖడ్గం సుధాకుంభం కైరవాదరపుస్తకాన్।
కాల్యాంసహ స్రక్ తాంబూల మిఘదండ మిత్రి క్రమాత్॥ 36
దీపికా దర్పణం హేమ ధాన్యపాత్రం ఫలం దధి।
పుస్తా మంగల పాత్రాణి లౌకికం మంగలాష్టకమ్॥ 37

తా॥ పూర్ణకుంభముల జత, ధ్వజము, వజ్రము, స్వస్తికము, శక్తి, చామరయుగ్మము, నాగము, మయూరము ఈయెనిమిది కుమారస్వామికి మంగళ వస్తువులు. అద్దము, పూర్ణకుంభము, వృషభము, చామరద్వయము, శ్రీవత్సము, స్వస్తికము, శంఖము, దీపము ఈయెనిమిది గణపతికిని, బుద్ధునికిని మంగళ వస్తువులు. పీఠము, ఖడ్గము, అమృతకలశము, తెల్లకలువ, పుస్తకము, పూల

దండ, తాంబూలము, చెఱకుగడ ఈయెనిమిది కాళికాదేవికి అష్టమంగళ వస్తువులు. దీపము అద్దము, బంగారము, ధాన్యపాత్రము, ఫలము, దధి, పుస్తకము, మంగళ పాత్రములు. ఇవి యెనిమిది లౌకిక మంగళ వస్తువులు.

## 15. కుంభలతాలక్షణము

### కాశ్యపశిల్పము 15 వ పటలము

శ్లో॥ స్తంభమూలే తు వేదూర్ధ్వే పద్మాసనం ప్రకల్పయేత్।
పాదవ్యాససమం తుంగం సపాదం పద్మవిస్తృతమ్॥

పద్మోచ్ఛ్రం వసుధా భజ్య కంప మేకాంశ మేవ చ।
అధఃపద్మం గుణాంశం తు ఏకాంశం గల ముచ్యతే॥

ఊర్ధ్వపద్మం ద్విభాగే తు కంప మేకేన కారయేత్।
తదూర్ధ్వే కుంభతుంగం తు పద్మోచ్ఛ్రేన సమం భవేత్॥

తత్తుంగద్విగుణం కుంభ వ్యాస మి త్యభిధీయతే।
కుంభాస్యే స్తంభనిర్యూహం వలిమండల సంయుతమ్॥ 4

కుంభమండాది సంయుక్తం వీరకంఠ విహీనకమ్।
ఫలకోపరి పద్మం తు కుంభమానేన కల్పయేత్॥ 5

కుంభం కుంభలతా హ్యేతా హ్యన్యథా వక్ష్యతే పునః।
తదే కోత్సంధికోర్ధ్వే తు వీరకంఠ సమన్వితమ్॥ 6

బోధికా రహితం యత్నాత్ స్తంభకుంభలతాస్మృతా।
స్తంభతోరణవ న్మూర్ధ్ని కర్తవ్యం తోరణే లతా॥ 7

ఏవం త్రివిధంభిత్వాతూ చ్యతే కుంభలతా ద్విజ॥

ఇతి కాశ్యపశిల్పే కుంభలతాలక్షణం పంచదశః పటలః

తా॥ స్తంభము మొదట వేదికయొక్క పైభాగమున పద్మాసనమును చేయవలెను. స్తంభము యొక్క విస్తారముతో సమానముగా యెత్తును స్తంభ విస్తారముకంటె ఒక పాతికవంతు యెక్కువగా విస్తారమును చేయవలెను. పద్మము యొక్క యెత్తును 8 భా. చేసి కంపము 1 భా. అధఃపద్మము 3 భా. గలము 1 భా. ఊర్ధ్వపద్మము 2 భా. కంపము 1 భా. చేయవలెను. దానిపైన కుంభముయొక్క యెత్తును పద్మము యెత్తుతో సమానముగా చేయవలెను. దాని యొక్క విస్తారము యెత్తునకు రెట్టింపుగా చేయవలెను కుంభము యొక్క ముఖమునందు స్తంభము యొక్క తల రేఖలతోకూడి యుండవలెను కుంభము మండమును ఉంచవలెను. వీరకంఠము పనికిరాదు ఫలకము పైన పద్మమును కుంభము యొక్క వ్యాసముతో సమానముగా నిర్మించవలెను. కుంభము కుంభలత

వీనియొక్క పద్ధతులు చెప్పబడినవి. మరియు ఆ స్తంభమునే పైసంధి యొక్క యుపరిభాగమున వీరకంఠమును చేసి బోదెలేకుండ నుంచినచో స్తంభకుంభలత యగును. స్తంభతోరణమువలె తలయందు కుంభలత నుంచవచ్చును. ఇట్లు మూడు విధములుగ చేయవచ్చును. కాశ్యపశిల్పము 16 వ పటలమున వృత్తస్ఫుటితమును రెండవసారిగా చెప్పినాడు. అది 18 వ పటలమునందున్నది కనుక దానిని వదలివేయడమైనది.

## 22 ద్వారవిన్యాసము

### కాశ్యపశిల్పము 17 వ పటలము

శ్లో॥ అథ వక్ష్యే విశేషేణ ద్వారవిన్యాస లక్షణమ్।
పాదోచ్చం దశధా భజ్య శుద్ధద్వారం నవాంశకమ్॥ 1

చరణం నవధా భజ్య అష్టాంశం ద్వారమానకమ్।
అథవాఽంఘ్రే స్తు తుంగం తు వసుభాగ విభాజితే॥ 2

సప్తాంశం ద్వారమానం తు రసభాగ విభాజితే।
సార్ధవహ్న్యంశ మూర్ధ్వే తు భువంగ స్యోచ్ఛ్రయం భవేత్॥ 3

పతంగస్యాప్యధస్తాత్తు సార్ధయుగ్మాంశ ముచ్యతే।
శుద్ధద్వారే తు తుంగార్ధం శుద్ధద్వారస్య విస్తృతమ్॥ 4

ఏక ద్వి త్రి చతు ష్పంచ షట్ సప్తాష్ట నవాంగులమ్।
తుంగా దర్ధాధికం హీనం తావ మేకోన వింశతిః॥ 5
భేద మేవం సమాఖ్యాతం ద్వారతుంగం త్రిధా భవేత్।
సర్వేషా మపి హర్మ్యాణాం ద్వారం మధ్యే తు యోజయేత్॥ 6

పాదవిష్కంభ మానం వా సపాదం సార్ధ మేవ వా।
ద్వారయోగస్య విస్తారం తస్యార్ధం ఘన ముచ్యతే॥ 7

స్యాష్టే సార్ధత్రయం వాఽథ త్రిపాదం నాఽథ తర్ఘనమ్।
యోగతుంగం తు వేదాంశే త్వేకాం శాశ్రయ యోగః॥ 8

గుణాంశ మూర్ధ్వగం ఖ్యాతం బాహ్యేబ్జక్షేపణాన్వితమ్॥ 8½

తా॥ ద్వారము నుంచెడి విధానమును చెప్పుచున్నాడు. స్తంభము యెత్తును 10 భా. చేసి శుద్ధద్వారమును 9 వ భాగమున నుంచవలెను. లేక 9 భా. చేసి 8 భాగమున నుంచవచ్చును. లేదా 8 భా. చేసి 7 వ భాగమున నుంచవచ్చును ఇట్లు మూడు విధములు కలవు ద్వారమును 6 భా. చేసి 3½ భా. పైన భువంగము యెత్తును, క్రింద పతంగము యెత్తు 2½ భా. చేయవలెను. శుద్ధ ద్వారము యొక్క యెత్తులో సగము శుద్ధద్వారము యొక్క విస్తారమును చేయవలెను. ఆ చెప్పిన

సగము వంతు కాక 1-2-3-4-5-6-7-8-9 అంగులములు యెక్కువ చేయవచ్చును. తక్కువ చేయవచ్చును. అయితే విస్తారము 16 అంగులములకు తగ్గకూడదు. ఇట్లు 3 భేదములు చెప్పబడినవి. అన్ని విధములైన హర్మ్యములకును ద్వారమును మధ్యనుంచవలయును. స్తంభముయొక్క విస్తారముతో సమానముగాని లేకపాతికవంతు యెక్కువగాని, సగముపంతు యెక్కువగాని యిట్లు 3 విధములుగా ద్వారయోగము యొక్క విస్తారము చేయవచ్చును. అందులో సగము మందమును చేయవలెను. లేదా స్తంభవిస్తారమును 4భా. చేసి 3½భా. గాని లేక 3భా. గాని చేయవచ్చును. యోగముయెత్తును 4భా. చేసి అందు 1భా. ఆశ్రయముగను, పైకి బోపుటకు 3భా. చేయవలెను. దానికి వెలుపల పద్మమును క్షేపణమును చేయవలెను.

శ్లో॥ బాహ్యే ఽబ్జ క్షేపణోపేతం భూతారం తదధో భవేత్॥ 9
పతంగతార యోగస్య తుల్య మబ్జ విహీనకమ్।
భువంగం చ పతంగం చ మధ్యస్థ వలయాన్వితమ్॥ 10
తామ్రజౌ వాఽఽయసౌ వా ఽథ వలయౌ కీలబంధితౌ।
తద్విస్తార త్రిభాగైకం శిఖాయోగ ప్రవేశితౌ॥ 11
శైలజం చే ద్భువంగాది యోగభూమౌ శిఖాన్వితౌ।
భువంగాగ్రౌ పతంగాగ్రౌ ఛిద్రయో ర్వేశనా న్వితౌ॥ 12
ఏవం దృఢీకృతౌ పశ్చాత్ యో గావస్థాన మాచరేత్।
సునక్షత్రే శుభేవారే శుభహోరా ముహూర్తకే॥ 13
యోగే సంస్థాపయే ద్విప్ర శాంతిహోమ పురస్సరమ్।
భిత్తివ్యాసే తు భాన్వంశే బాహ్యే త్వం చావసానకమ్॥ 14
అభ్యంతరం తు సప్తాంశం సీమాయోగస్యమధ్యమమ్।
తద్బాహ్యే ఽభ్యంతరంచైవ యోగవ్యా సోభయాశ్రితమ్॥ 15
సర్వాలంకార సంయుక్తం యోగసీమా దృఢీకృతమ్॥ 15½

తా॥ వెలుపల పద్మముక్షేపణము, ఇవిభూతారములోచేయవలెను. (అనగా దిగువప్రదేశము, పతంగముయొక్క విస్తారము యోగమునకు సమానముగాను పద్మములేకుండా చేయవలెను. భువంగము పతంగము యీరెంటిమధ్యనున్న వలయముల యందు యినుముతోగాని యిత్తడితోగాని రెండుచీలలను బిగించవలెను. దానివిస్తారమును 3భా. చేసి అందు 1భా. యోగముయొక్క తలయందుంచవలయును శిలామయము అయినచో భువంగాదియోగభూమిని శిఖతోగూడిన దానిగాజేయవలెను. ఈ భువంగము, పతంగము, వీనియొక్కతలలు రంధ్రములున్నచోట నిలుపవలెను. ఇట్లు గట్టిగా బిగించి యోగస్థానములను కల్పించవలెను. మంచినక్షత్రము, శుభకరమైన వారము, శుభహోర, శుభముహూర్తము. తెలుసుకొని యోగమునందు స్థాపించవలెను. అటులస్థాపించు

నవుడు ముందుగా శాంతిహోమాదులను చేయవలెను. గోడయొక్క విస్తారమును 12 భా చేసి వెలుపలినుంచి 5 భా, లోపలినుండి 7 భా. చేసి ఆప్రదేశము యోగమునకు మధ్యస్థానముగా తెలిసి కొని దానికి వెలుపలను, లోపలను యోగముయొక్క విస్తారము రెంటికిని ఆశ్రయమగునట్లు సమస్తమైన అలంకారముతో గట్టిగా నుండునట్లు చేయవలయును.

శ్లో॥ దక్షిణే తు కవాటే తు యోజయేత్ ద్వారపట్టికామ్।
త్రి చతు ష్పంచమాత్రం వా ద్వారపట్టిక విస్తృతమ్॥ 16

తత్త్రిభా గైకభాగం తు తస్యనీవ్ర ముదాహృతమ్।
తన్నీవ్రా ద్విగుణం ఖ్యాతం నీవ్రం వై తత్కవాటయోః॥ 17

నీవ్రభూమౌ చ మధ్యే తు ద్వారపట్టిక పార్శ్వయోః।
లోహజం వలయోపేత మేతాని కీలబంధనమ్॥ 18

లోహజం దారుజం వాఽథ బాహ్యేభ్యంతరగం తథా।
తాసాం త్రిమంగలం నీవ్రం తారార్ధఘన సంయుతమ్॥ 19

బధ్వా కవాటే యోగౌద్వౌ దారులోహై ర్దృఢీకృతం।
అర్గలాది సమోపేతం ఘాట నోద్ఘాటన క్షమం॥ 20

సర్వేషాం ఘటయన్ తత్ర మధ్యసూత్ర క్రియాఽచరేత్।
ప్రాసాదే మండపే చైవ గోపురే చైవ మాచరేత్॥ 21

ద్వార మేవం సమాఖ్యాతం కంపద్వార మథః శృణు॥ 22

ఇతి కాశ్యపశిల్పే ద్వార విన్యాస లక్షణం సప్తదశః పటలః

తా॥ దక్షిణపు కవాటము నందు ద్వారపట్టికను కల్పించవలెను. దానివిస్తారము 3, 4, 5, అంగుళములు చేయవచ్చును. ఆవిస్తారమును 3 భా. చేసి అందు 1 భా. ముందుకు నిర్గమును చేయవలెను. ఆనిర్గమునకు రెట్టింపుగా తలుపునబిగించే భాగముండవలెను. ఆ చెక్కను బిగించే ప్రదేశము గుర్తుపెట్టుకొని యిరువైపుల యినుపచీలలను బిగించవలెను. యినుముతో గాని కఱ్ఱతోగాని త్రిమంగలములను చేసి స్థాపించవలెను. త్రిమంగలముల యొక్క నిర్గమము లోపలను వెలుపలను చేయవలెను. విస్తారములో సగము మందము కలిగియుండవలెను. తలుపులకు రెండువైపుల రెండు యోగములను దారువుతోగాని యినుముతోగాని చేసి గట్టిగా బిగించవలెను. వెనుకకు ముందుకు నడుచునట్లును నిలిపి నప్పుడు కదలకుండ నుండునట్లును సరిచూడవలెను. గడియమ్రానును గూడ పెట్టవలెను. ఇంకా అవసరమైన అలంకారములుగూడ చేయవచ్చును. ద్వారము మధ్య సూత్రమును పట్టి ఆసూత్ర ప్రకారము తలుపులు మెగుడుదిగుడు లేకుండ సరిచూడవలెను. ప్రాసాదముగాని, మండపముగాని, గోపురముగాని, యేదైననుసరే యీ చెప్పిన ప్రకారము ద్వారములను కవాటములను పెట్టవలెను. కంపద్వార విధానము చెప్పబోవు చున్నాను.

## 23. కంపద్వారలక్షణము

### కాశ్యపశిల్పము 18 వ పటలము

శ్లో॥ అథ వక్ష్యే విశేషేణ కంపద్వార విధిం పరం।
ప్రాసాద మండపాదీనాం చతుర్దిక్షు విదిక్షు వా॥ 1

తయో ర్మధ్యాంతరాలే వా వ్యోమాభీష్టం తు యత్ర వై।
తత్రై వ కల్పయేత్ సమ్యక్ కంపద్వారం ద్విజోత్తమ॥ 2

వస్త్యా ద్వితకృతం పత్రి వ్యాసయుక్తం విశాలకమ్।
స్థలా దుత్తరసీమాంతం కంపద్వా రోదయం భవేత్॥ 3

భువంగం చ పతంగం చ యోగం ప్రాగుక్తకం ఘనమ్।
కృత్వా దృఢీకృతం బధ్వా యోజయే దంతరా పురా॥ 4

యోగవ్యాసఘనం దీర్ఘ మాయామాంఘ్రి స్తథా కురు।
మూలాగ్ర యోజకోపేతం తరంగాంఘ్రిం ప్రకల్పయేత్॥ 5

భువంగం చ పతంగం చ ఛిద్రే యుంజ్యాత్ దృఢీకృతమ్।
చతు షడష్ట సంఖ్యావా దశ ద్వాదశ ఏవ వా॥ 6

మను షోడశ సంఖ్యా వా కల్పయే దంతరాంఘ్రియా।
అంతరాం ఘ్ర్యంతరా ప్రత్య గ్గమాగమ క్షమం వినా॥ 7

అంతరాంఘ్రీన్ ప్రయుంజీయాత్ స్థాపయే ద్ద్వారయోగవత్।
యోజయేత్తు కవాటాది వ్యోమే ప్రత్యేక మేవ తు॥ 8

కవాటే ద్వివ్యోమగ్రాస త్రివ్యోమగ్రాస ఏవ వా।
కల్పయే త్సుదృఢం ద్వారం త్వచలం హస్తినా ఽపి వా॥ 9

కంపద్వారం సమాఖ్యాతం ప్రస్తరం తు తతః శృణు॥ 10

ఇతి కాశ్యపశిల్పే కంపద్వారలక్షణ మష్టాదశః పటలః

తా॥ ప్రాసాదమునకుగాని మండపమునకుగాని నాలుగుదిశల యందును నాలుగు మూలలను లేక నడుమను పైనను యిష్టము వచ్చినచోట కంపద్వారమును పెట్టవచ్చును. గృహమునందలి స్తంభము యొక్క విస్తారమునుబట్టి మూడురెట్లుచేసి అధిష్ఠానమునుండి పై అంతస్తువరకు కంపద్వారము యెత్తుండవలెను. భువంగద్వారము, పతంగద్వారము ఇవి మునుపు చెప్పిన లక్షణములతో చేసి ఆయాప్రదేశములందు శాస్త్రములో చెప్పినట్లుగా బిగించవలెను. యోగప్రదేశమునకు గూడ మునుపు చెప్పినతీరున పొడవు వెడల్పు మందము చేయవలెను. మొదలు చివర కలుపు చోట

తరంగ స్తంభమును కల్పించవలెను. దానికి రంధ్రమునుచేసి భువంగద్వారమును పతంగద్వారమును గట్టిగా బిగించవలెను 4-6-8-10-12-14-16 ఇట్లు సమసంఖ్యతో అంతర స్తంభములను చేయవలెను. అంతర స్తంభములలో వెనుకకుగాని ముందుకుగాని పోవుటకు వీలు లేకుండునట్లు చట్టమును ఆలోచనతో బిగించవలెను. ఇట్లు అంతర స్తంభములను కూర్చి ద్వారము మాదిరిగానే స్థాపించవలెను. తలుపులుపైన ప్రత్యేకముగా నిర్మించవలెను. రెండు వ్యోమములుగాని మూడు వ్యోమములుగాని మ్రింగునట్లు తలుపులను చేయవలెను. ద్వారమను యేనుగు నెట్టినను కదలకుండునట్లు గట్టిగా చేయవలెను. ప్రస్తరలక్షణము చెప్పుచున్నాను.

## 24. స్తంభస్థాపనము

### మానసారము 14 వ అధ్యాయము

శ్లో॥ దేవాలయాది సర్వేషాం స్తంభస్థాపన ముచ్యతే॥ 179
యథాభా గావసానేతు స్థాపయే దఖిలాంఘ్రికమ్।
స్తంభాంతే స్తంభయుక్తం చే ద్వాస్తు వస్తువినాశనమ్॥ 180
యద్వా స్త్వంతర్బహిః సూత్రం స్థాపయే దృజుసూత్రకమ్।
స్తంభమధ్యా తు బాహ్యాంతం యథా పాదం తథాశ్రయమ్॥ 181
యత్ర దేశే విశాలార్ధం తత్ర దోషో నవిద్యతే।
పుష్యం మాఘం చ చైత్రం చ వైశాఖం చోత్తరాయణే॥ 182
ఆషాఢం శ్రావణాశ్వ్వి చ కార్తికం దక్షిణాయనే।
సుముహూర్తే సులగ్నే చ శుక్లపక్షే శుభే దినే॥ 183
స్తంభ మావాహనం కుర్యాత్ శేషమాసే త్వభావకే।
అంకురార్పణ కర్మాదౌ స్థాపనాంతం యథాక్రమమ్॥ 184
జలాధివాసనం స్నానం కుర్యాత్త మపి సర్వశః।
ఈశే నైరృతికోణే తు మధ్యే చాంఘ్రిక మేవచ॥ 185
పాదస్థానస్య యద్దేశే వాస్తో శ్చ సుదృఢం యథా।
తదూర్ధ్వే ఒఽధారపట్టం స్యా ద్దండాధ్యర్థం ద్విదండకమ్॥ 186
ఘనం చ విస్తృతం చైవ చాయామం తదృదేష్టకమ్।
శిలా స్తంభే శిలాధారం దారుస్తంభే ద్రుమం తథా॥ 187

తా॥ దేవాలయము మొదలగు అన్నిటికి స్తంభమును స్థాపించు విధానమును చెప్పుచున్నాడు. స్తంభమునకు నిర్ణయించిన భాగమును గుర్తుపెట్టుకొని యే మాత్రము హద్దు చెదర

నీయ కుండ స్తంభము నుంచవలెను. ఒక స్తంభము యొక్క ప్రక్కకు మరియొక స్తంభము వచ్చిన ట్లయిన ఆ యాలయము వలన సమస్తము నశించును. స్తంభములు నాటు నప్పుడు లోపల ఒక సూత్రమును వెలుపల ఒక సూత్రమును పట్టి చక్కగా స్తంభములను నిలువవలెను. స్తంభము యొక్క మధ్యనుండి వెలుపలకు యెంత యుండవలెనో అంత యుండునట్లు చేయవలెను. ఎక్కడ మనకు విశ్రాంతికావలెనో అక్కడ స్తంభమునుంచక పోయినను దానివలన దోషములేదు. ఉత్తరాయణ కాలమున పుష్యమాసము, మాఘమాసము, చైత్రమాసము, వైశాఖమాసము ఈనాలుగు ముఖ్యము, దక్షిణాయన కాలమున ఆషాఢము, శ్రావణము, ఆశ్వయుజము, కార్తీకము ఈ నాలుగు మాసములు ముఖ్యము, శుక్లపక్షమును పంచాంగశుద్ధిగల దినమును శుభలగ్నమును చూచి అందు పుష్కరకాలమున స్తంభమును షోడశోపచారములతో పూజించి నిలువవలెను. మిగిలిన నాలుగు నెలలయందును పనికిరాదు. అంకురార్పణము మొదలుకొని స్థాపనము యొక్క అంతము వరకు విధ్యుక్తముగా చేయవలెను. జలాధివాసము చేయించి తదుపరి స్థాన నిర్ణయ ప్రకారము స్తంభమును నిలుపవలెను ఈశాన్యము, నైరృతి, యీరెండుమూలల నడుమ ఈమూడు ప్రదేశము లందు ముందుగా స్తంభములను నిలుపవలెను. స్తంభమును నిలువు ప్రదేశమును గట్టిగా నుండునట్లుచేసి స్తంభము నుంచవలెను. స్తంభముపైన ఆధారపట్టము 1½ దండముగాని 2 దండములుగాని పొడవు కలుగునట్లు చేయవలెను దాని యొక్క విస్తారమును మందమును పొడవునకు దగినట్లు చేయవలెను జాతితో చేసిన స్తంభమునకు జాతితోనే అధార పట్టమును చేయవలెను. దారువుతో చేసిన స్తంభమునకు దారువుతోనే ఆధార పట్టమును చేయవలెను.

శ్లో॥ అథ వా చాశ్మనం సర్వ మాధారం చతురస్రకమ్।
ఏకహస్తం ద్విహస్తం వా త్రిహస్తం విపులం భవేత్॥ 189

ఆధారస్య తు మధ్యే స్యా ద్రత్నస్థాపనతో ఒవటమ్।
ప్రాసా దాభిముఖే చైవ మండపం పరికల్పయేత్॥ 188

మండపాంతః ప్రదేశే తు స్తంభం సంగ్రాహ్య వేశయేత్।
స్థండిలే చండితం కృత్వా బీజం వ్రీహ్యాది విన్యసేత్॥ 190

తత్ర స్తంభం చ విన్యస్య పూర్వే వా ప్యుదగగ్రకమ్।
నవవస్త్రేణ సంవేష్ట్య కుంభం కుర్యాత్సుభూషణమ్॥ 191

కర్పటం శితశూకా ది ధాన్యం కార్పాసబీజకమ్।
సూత్రేణాబద్ధ్వా పశ్చాత్తు స్తంభకంఠే చ బంధనమ్॥ 192

తదగ్రే స్థండిలం కృత్వా శుద్ధశాలిభి లాజకైః
దర్భై రాస్తీర్య తత్రై వ ప్రాగుదక్ స్యా త్తదగ్రకమ్॥ 193

పీఠం వా చోపపీఠం వా చోక్తవ త్కల్పయేత్ పదం।
జలసంపూర్ణకుంభాది తత్రచావాహయే ద్బుధః॥ 194

సూత్ర పల్లవ కూర్చాదీన్ నవవస్త్రేణ వేష్టయేత్।
తదగ్రే స్థండిలం కృత్వా రత్నలోహాది చావహేత్॥ 195

తా॥ లేక శిలను 1 హస్తముగాని 2 హస్తములుగాని 3 హస్తములుగాని విస్తారముచేసి దానిని చతురస్రముగా ఆధారము చేయవచ్చును. ఆధారము యొక్క మధ్య ప్రదేశమున గుంటను చేసి దానియందు రత్నములనుంచి ప్రాసాదమునకు ఎదురుగా మండపమును కల్పించవలెను. మండపము యొక్క అంతమువరకు ఆ ప్రదేశమున స్తంభమును తెచ్చి అలికిననేలయందు చండితమ. అనువాస్తు పీఠమును కల్పించి అనగా 13-13 చదరముగా మొత్తము 169 గదులు వచ్చునట్లు చేయునది చండితమగును. వడ్లు మొదలగు నవధాన్యములనుంచి దానియందు స్తంభము యొక్క శిరస్సు తూర్పుగాగాని లేక ఉత్తరముగాగాని యుండునట్లుంచి దానిని నూతన వస్త్రముతో చుట్టి దాని యెదుట నొక కుంభమునుంచి నూతన వస్త్రమును గోధుమలు ప్రత్తివిత్తులు ఇవి సూత్రముతో గట్టి స్తంభము యొక్క కంఠమున కట్టవలెను. దానిముందు అలికిన నేలయందు తెల్లని బియ్యము గాని పేలాలుగాని ఉంచి పైనదర్భల నుంచవలెను. ఆదర్భలయొక్క చివరలు తూర్పుగాగాని ఉత్తరముగాగాని యుండవలెను. నలుచదరముగా 16 గదులు చేయునది మహాపీఠము అటులే 25 గదులు చేయునది ఉపపీఠము. శాస్త్రమునందు చెప్పబడిన విధముగా పైరెంటిలో ఏ పీఠము నైన కల్పించి యచట జలముతోనిండిన కుంభమును ఆవాహనము చేయవలయును. ఆ కుంభమునకు సూత్రమును చుట్టి పంచపల్లవములను దర్భలను అందుంచి నూతన వస్త్రమును కుంభము యొక్క కంఠమునకు చుట్టి దానిముందు అలికిననేలయందు రత్నములను సువర్ణాది లోహములను ఆవాహనము చేయవలెను.

శ్లో॥ పాదప్రక్షాళనం కుర్యా దాచమ్య స్థపతి ర్బుధః।
భస్మం వా చందనం వాఽపి ధారయే త్త్రిపుండ్రకమ్॥ 196
సకలీకరణం కృత్వా పుణ్యాహం వాచయే త్తతః।
బ్రహ్మాదిదేవతాః సర్వాః పాదస్థానే సమర్చయేత్॥ 197
హృల్లేఖా మధ్యకుంభాంతం పూజయే త్తు విశేషతః।
దేవ్యావకరణం సర్వేషాం పరితః కలశోదకే॥ 198
ఆవాహ్య పశ్చాదభ్యర్చ్య గంధపుష్పాక్షతాదిభిః।
రత్నాధివాసనంకుర్యాత్ తత్తద్దేవస్యనామభిః॥ 199
గంధపుష్పాది ధూపైశ్చ నైవేద్యాంకం సమర్చయేత్।
తదగ్రే పూర్వదిగ్దేశే హోమం కుర్యా ద్విచక్షణః॥ 200
పశ్చాత్తు శిల్పీ సంప్రాప్య సంస్పృశే త్స్తంభమూలకమ్।
గైరికార్పితసూత్రైశ్చ చతుః సూత్రాణి విన్యసేత్॥ 201

స్వర్ణసూచీం సదర్భాం చ ఘృతక్షీరేణ యోజయేత్।
ధూపదీపం దదేత్పశ్చా ద్గంధపుష్పైః సమర్చయేత్॥ 202

హిమాద్రిరూపం తత్ స్తంభం ధ్యాత్వా హస్తేన సంస్పృశేత్।
తతోఽధివాసనం కుర్యాత్ స్తంభం తద్దేశికోత్తమః॥ 203

తా॥ తరువాత పాదములను కడిగికొని ఆచమనముచేసి స్థపతియును ఆచార్యుడును విభూతిగాని గంధముగాని మూడు రేఖలుగా నొసట బెట్టికొనవలయును. సకలమను పేరుగల వాస్తుపీఠమును కల్పించి అందు పుణ్యాహవాచనముచేసి స్తంభమును నిలుపునట్టి ప్రదేశమున బ్రహ్మ మొదలగు దేవతలను అందరిని షోడశోపచారములతో పూజించవలెను. మధ్యనున్న కుంభములో దేవతలనందరిని అవాహనముచేసి షోడశోపచారములతో పూజించవలెను. కలశములోని జలము చేత అంతటను ప్రోక్షించి మాతృకాది దేవతలనుగూడ ఆవాహనముచేసి గంధపుష్పాదులతో పూజించి దేవతలనందరిని వారివారి నామములతో పూజించురత్నాధివాసము చేయించవలెను తదుపరి గంధపుష్పాదులతోను ధూపదీపములతోను నైవేద్యమును సమర్పించి దానిముందు తూర్పుభాగమున ఆచార్యుడు హోమమును చేయవలెను తరువాత శిల్పాచార్యుడు స్తంభము యొక్క మొదలును తాకి యెఱుపువన్నెగల సూత్రమును నాలుగుచుట్లు చుట్టవలెను. బంగారపు శలాకను దర్భతోకూడ నేతితోను పాలతోను తడిపి ధూపదీపాది సహితముగ గంధపుష్పాదులతో పూజించి హిమవత్పర్వతమువంటి రూపముగల దానినిగా ధ్యానించి చేతితో తాకవలెను. తరువాత అధివాసమును చేయవలెను.

శ్లో॥ పశ్చాత్తక్షకముఖ్యైస్తు స్తంభ ముద్ధృత్య హస్తతః।
వాస్తుప్రదక్షిణం కుర్యాత్ స్వకీయానుచరైః సహ॥ 204

సర్వమంగళఘోషైశ్చ స్తంభస్థాపనదేశకమ్।
సంప్రాప్య హస్తతః స్తంభ మవరోహ్య చ పశ్చిమే॥ 205

తత్స్తంభం పూర్వవదన మాధారం ప్రోక్ష్య సంస్థితమ్।
అధివాసితరత్నాని వ్యాహృత్యావటతః క్షిపేత్॥ 206

మధ్యే తు హేమం నిక్షిప్య చైంద్రే తామ్రం వినిక్షిపేత్।
యామ్యే తు చాయసం స్థాప్య కాంస్యం వా వారుణే న్యసేత్॥ 207

సౌమ్యే తు రజతం స్థాప్య పద్మరాగం తు మధ్యమే।
పుష్యరాగ మింద్రకోష్ఠే గోమేధం చాగ్నికోణకే॥ 208

మహానీలం చ యామ్యే తు మరకతం నైరృతే న్యసేత్।
స్ఫటికం వారుణే కోష్ఠే ప్రవాళం వాయుకోష్ఠకే॥ 209

సౌమ్యే తు మౌక్తికం న్యస్య చేంద్రనీలం తథైశకే।
తత్ స్తంభం తత్ర నిక్షిప్య స్థపతిః కర్మృభిః సహ॥ 210

సర్వమంగళఘోషైశ్చ బ్రాహ్మణైః స్వస్తివాచనమ్।
అధివాసితకుంభాని సర్వాణ్యాదాయ శిల్పికః 211
వాస్తుప్రదక్షిణం కృత్వా స్తంభ మంత్రాభిషేచయేత్।
ధూపదీపం దదేత్పశ్చా ద్వస్త్రమాల్యై ర్విభూషితమ్॥ 2 2
గంధపుష్పైః సమభ్యర్చ్య నైవేద్యం చ నివేదయేత్॥ 212

తా॥ తరువాత శిల్పాచార్యుడు మొదలగువారు స్తంభమును చేతులతో యెత్తి తన అనుచరులతో సహా స్తంభమును నిలుపు ప్రదేశము నను సమస్త శుభవాద్యములతో శిల్పాచార్యుడు చేతితో తాకి స్తంభము యొక్క పడమర వైపును అనగా పాదము వైపును క్రిందికి దించవలెను. ఆ స్తంభము యొక్క తూర్పుముఖమును ఆధారమును జలముతో ప్రోక్షించి యచటనున్న రత్నములను ఓంకార సహితముగా చెప్పబడు వేదమంత్రములతో ఆధారము యొక్క మధ్యనున్న రంధ్రములో నుంచవలెను. మధ్య బంగారమును. తూర్పున రాగియును, దక్షిణమున యినుమును, పడమర కంచునుగాని యిత్తడినిగాని, ఉత్తరమున వెండిని ఉంచవలెను. పద్మరాగమును నడుమను తూర్పున పుష్యరాగమును, ఆగ్నేయమున గోమేధికమును, దక్షిణమున మహానీలమును, నైరృతిన మరకతమును. పడమర స్ఫటికమును లేక వజ్రమును వాయవ్యమున పగడమును, ఉత్తరమున ముత్యమును, ఈశాన్యమున ఇంద్రనీలమును స్థాపించవలెను. తరువాత స్తంభమును దానిపై నుంచవలెను. ఆ విధానమును చెప్పుచున్నాడు. శిల్పాచార్యుడును కర్తయును సమస్త మంగళవాద్యములతోను స్వస్తివాచకములతోను అధివాసమునందలి కుంభము మొదలైన వానిని అన్నిటినితీసి శిల్పాచార్యుడు తన యధీనములో నుంచికొని వాస్తు ప్రదక్షిణము చేయవలయును. తరువాత స్తంభమును మంత్రోదకముతో చల్లవలెను. ధూపదీపనైవేద్యములను సమర్పించి మరల వస్త్రములను పుష్పమాలలను గంధమును పుష్పములను అలంకరించి మహానైవేద్యమును సమర్పించవలెను.

## 25. మంత్రము

ఓం స్తంభ మహామేరోవాస్తు దధ్యా త్యా వచ్చంద్రది వాకరౌ॥ 213
అన్యాత్ స్తంభాంశ్చమూర్ధ్నితే ధృత్వారక్షతుచోన్నతమ్।
ఏతన్మంత్రం పఠిత్వాతు కుర్యా దనునయం బుధః॥ 214

తా॥ పై మంత్రమును పఠించుచు ఆచార్యుడు వాస్తుపురుషుని ప్రార్థించవలెను.

శ్లో॥ ప్రాసాదే మండపే వాఽపి ప్రాకారే గోపురే తథా।
ద్విజాతీనాం చ వర్ణానాం సద్మమండపకాదినామ్॥ 215
స్తంభ ప్రతిష్ఠాం సర్వత్ర చైవం కుర్యా ద్విచక్షణః।
పురాతనైశ్చ ఋషిభిః బ్రహ్మాది భిః సురైరపి॥ 216

స్తంభ ప్రతిష్ఠా చోక్తా స్యా ద్వినాచే దశుభం భవేత్।
తస్మాత్ స్తంభ ప్రతిష్ఠాం తు కారయే చ్ఛిల్ప విత్తమః॥ 217

స్థపతిం స్థాపకం విప్రం స్థాపన కర్మణి వృతాన్।
పూజయే ద్విధినాకర్తా స్వస్వాత్మ శిబిరాం తతః॥ 218

ఇతి మానసారే వాస్తుశాస్త్రే కుంభలక్షణం నామ పంచదశోఽధ్యాయః

తా॥ ప్రాసాదము, మండపము, ప్రాకారము, గోపురము మొదలైనవాని యందును, బ్రహ్మక్షత్రియాది వర్ణములవారి యొక్క భవనములు మండపములు మొదలైనవాని యందును, అంతట ఈవిధముగా స్తంభప్రతిష్ఠను చేయవలెను. పూర్వము మహర్షులును బ్రహ్మ మొదలగు దేవతలును చెప్పియున్న వాస్తుశాస్త్రముల ననుసరించని యెడల అశుభములు ప్రాప్తించును. కనుక శిల్పాచార్యుడు స్తంభప్రతిష్ఠను శాస్త్రోక్త ప్రకారము చేయవలెను. స్తంభ ప్రతిష్ఠానంతరము కర్త శిల్పాచార్యుని అధ్వర్యుని ఆకార్యమునందు పాల్గొనిన యితరులను విధ్యుక్తముగా పూజించవలెను.

## 26. ప్రస్తరలక్షణము

### కాశ్యపశిల్పము 19 వ పటలము

శ్లో॥ అథ వక్ష్యే విశేషేణ ప్రస్తరస్య తు లక్షణమ్।
స్తంభార్ధం మంచమానం తు అర్ధోత్సేధాంశ మేవవా॥ 1

తదుచ్చ స్యైక వింశాంశే కృత్వా గుణాంశ ముత్తరమ్।
వాజన స్యైక భాగేన భూత మాలోన్నతం త్రిభిః॥ 2

భూతమాలో పరిష్ఠాత్తు వాజన స్యైక భాగయా।
సప్తాంశం తు కపోతోచ్చ మాలింగ స్యైక భాగయా॥ 3

అంశేనాంతరితం కుర్యాత్ ప్రత్యుత్సేధం గుణాంశకమ్।
వాజనం త్వేకభాగేన కుర్యా ద్వైవాన్య భేదతః॥ 4

తా॥ ప్రస్తరలక్షణము చెప్పుచున్నాడు. స్తంభములో సగము యెత్తుగాని, అలయములో సగము యెత్తుగాని ప్రస్తరమును చేయవలెను. ఆయెత్తును 21 భాగములుచేసి అందు ఉత్తరము 3 భా. వాజనము 1 భా. భూతమాల 3 భా. వాజనము 1 భా. కపోతము 7 భా ఆలింగము 1 భా. అంతరితము 1 భా. ప్రతి 3 భా. వాజనము 1 భా. ఇట్లు చేయవలయును.




శ్లో॥ తుంగ మేకోన వింశాంశం కృత్వోత్తరం త్రిభాగయా।
భాగేన వాజనం కుర్యా దధ్యంశే వలభీభవేత్॥ 5

వాజనం త్వేకభాగేన కపోతోచ్చం రసాంశకమ్।
ఆలింగ మంశ మంశేనాం తరితం తు ప్రకల్పయేత్॥

ప్రత్యుత్సేధం త్రిభాగేన వాజనం త్వేకభాగినా।
ఉత్సేధ శ్చైవ మాఖ్యాత స్త్వంగి జాత మథోచ్యతే॥




తా॥ మానసారము యొక్క యెత్తును 19 భాగములుచేసి ఉత్తరము 3 భా. వాజనము 1 భా. వలభి 2 భా. వాజనము 1 భా. కపోతము 6 భా. ఆలింగము 1 భా. అంతరితము 1 భా. ప్రతి 3 భా. వాజనము 1 భా. ఈ ప్రకారముగాను చేయవచ్చును.

శిల్పరత్నములో గూడ 21 భా. గల ప్రస్తరమును చెప్పినాడుకాని కాశ్యపశిల్పమునందలి శ్లోకములే యగుటచేత వ్రాయలేదు.

## శిల్పరత్నము 30వ అధ్యాయము

శ్లో॥ త్రింశద్భాగ విభక్త మత్ర విధివత్ కృత్వోన్నతం ప్రస్తరే।
కుర్యాచ్చోత్తర మంశకైస్త్రి భి రత స్తేషాం త్రిభాగం ఘనమ్।
ద్వాభ్యాం వాజన మత్ర వేదవలభి ర్భ్వాయః కపోతం ఘణీ।
తస్మిన్ స్యా న్ముఖపట్టికా ద్వితయతో గోపాన యుక్తం తు తత్॥
ఆలింగ త్రిభి రంశతో ద్వితయతః కార్యాం చ తద్వాజనమ్।
భూయోంశైః ప్రతిమత్ర వహ్నిభి రుభాభ్యా మేవ తత్పట్టికామ్।
ప్రత్యగ్రం మకరాస్యకం విరచయేత్ వ్యాలేభ సింహాదిభిః।
కార్యం చారు కపోతకం ప్రమథకై రారూఢ మత్యుజ్జ్వలమ్॥



తా॥ మానసారము యెత్తును 30 భాగములుచేసి ఉత్తరము 3 భా. వాజనము 2 భా. వలభి 4 భా. కపోతము 8 భా. ముఖపట్టిక 2 భా. గోపానము 8 భా. ఆలింగము 1 భా. వాజనము 2 భా. ప్రతి 3 భా. పట్టిక 2 భా. ఇట్లు చేయవలెను.

## మానసారము 16 వ అధ్యాయము

శ్లో॥ ప్రస్తరస్య విధిం వక్ష్యే శాస్త్రే సంక్షిప్యతేఽధునా।
అధిష్ఠాన త్రిపాదం వా సమంవా పాదమధికమ్॥

అర్ధ త్రిపాద ఘ్నాధిక్యం తత్సమాధిక మేవవా।
షడ్విధం కుట్టిమోత్తుంగం ప్రస్తరోదయ మీరితమ్॥

అథవా హస్త మానేన దేవజాతి వశాదపి।
సప్తహస్తం సమారభ్య సార్ధవేద కరాంతకమ్॥ 3

అర్ధారత్నిక హాన్యేన షడ్విధం ప్రస్తరోదయం।
దేవానాం భూసురాణాం చ భూపతీనాం యువాదయః॥ 4

వైశ్యానాం శూద్రజాతీనాం హస్త్యత్వం జాతి వశాత్క్రమాత్।
అథవా పాదతుంగార్ధం తత్సమం వా విశేషతః॥ 5

చతుర్భాగైక హీనం వా తత్పాదాధిక మేవచ।
అర్ధాధికం త్రిపాదం వా తత్సమాధిక మేవవా॥ 6

ఏతత్తు షడ్విధం ప్రోక్తం యుక్త్యా క్షత్ప్రస్తరోదయమ్।
అథవాంఽఘ్ర్యుదయే చాష్ట భాగం కుర్యా ద్విచక్షణః॥ 7

సప్త షట్పంచభాగాబ్ధి త్రిభాగద్వ్యంశ మేవచ।
ఏవం తు షడ్విధం ప్రోక్తం ప్రస్తరోచ్చం మునీశ్వరైః॥ 8

ఉత్తరాది ప్రదేశాంతం సర్వేషాం ప్రస్తరోదయమ్।
కపోతం ప్రస్తరం చైవ మంచం ప్రచ్ఛాదనం తథా॥ 9

గోపానం చ వితానంచ వలభీ మత్తవారణమ్।
విధానం చ లుపం చైవ మేతే పర్యాయవాచకాః॥ 10

తా॥ ప్రస్తరము యొక్క విధానమును చెప్పుచున్నాడు. అధిష్ఠానమును 4 భా. చేసి అందు 3 భా. గాని, లేక దానితో సమానముగాని, లేక దానికంటె ఒక పాతికవంతు యెక్కువగాని, లేక సగము యెక్కువగాని, ముప్పాతికవంతు యెక్కువగాని, దానికంటె రెట్టింపుగాగాని, ఇట్లు 6 విధములుగా ప్రస్తరమును చేయవచ్చును. లేక హస్తముల కొలతతోను దేవ బ్రాహ్మణ క్షత్రియ వైశ్య శూద్ర భేదములతోను చేయవచ్చును 7 హస్తములు దేవతలకును 6½ హస్తములు బ్రాహ్మణులకును, 6 హస్తములు రాజులకును, 5½ హస్తములు యువరాజులకును, 5 హస్తములు వైశ్యులకును, 4½ హస్తములు శూద్రులకును ఇట్లు 6 భేదములు చెప్పబడియున్నది. లేక స్తంభము యొక్క యెత్తులో సగముగాని, దానితో సమానముగాని, స్తంభము యొక్క యెత్తును 4 భా. చేసి అందు 1 భా. తగ్గించిగాని, లేక దానికంటె ఒక భాగమును అధికము చేసిగాని, లేక సగమును యెక్కువచేసిగాని, ముప్పాతికవంతు యెక్కువచేసిగాని, రెట్టింపుగా చేసిగాని ఇట్లు 6 విధములుగాను ప్రస్తరము యొక్క యెత్తును చేయవచ్చును. లేక స్తంభము పొడవును 8 భా. చేసి 7-6-5-4-3-2 భాగములు చేయవచ్చును. ఇదియును 6 విధములు. ప్రస్తరము యెత్తు అనగా ఉత్తరము యొక్క మొదలు అను ప్రదేశము వరకు అని తెలియవలెను. కపోతము, ప్రస్తరము, మంచము, ప్రచ్ఛాదనము, గోపానము, వితానము. వలభి, మత్తవారణము, విధానము, లుపము, ఇవి ప్రస్తరము యొక్క పర్యాయనామములు.

శ్లో॥ ప్రస్తరోచ్చాది సర్వేషాం మంగైః సర్వ ఏహోచ్యతే।
ఉత్సేధం చైక త్రింశంతు భాగం కుర్యాద్ద్వి చక్షణః॥ 11

ఉత్తరం సార్ధవహ్న్యంశ మంశం తద్వాజనం భవేత్।
వలభ్యుచ్చంతు బంధ్వంశం సార్ధాంశం వాజనం భవేత్॥ 12

ఉత్తరోచ్చం త్రయాంశం వా వాజనం చైకభాగికమ్।
తత్సమం క్షుద్రపద్మం స్యాత్త్రియం చోర్ధ్వే మహాంబుజమ్॥ 13

తదూర్ధ్వే వాజనం చైకం ధాతుభాగం కపోతకమ్।
ఆలింగ మంశకం చైవ మంశార్ధ మంతరితం తథా॥ 14

ద్వ్యంశకం తు ప్రతిం చైవ సార్ధాంశం వాజనం భవేత్॥ 14½



తా॥ ప్రస్తరము యొక్క యెత్తును దానియొక్క స్వరూపములన్నియును చెప్పుచున్నాడు. ప్రస్తరోన్నతమును 31 భా. చేసి ఉత్తరము 2½ భా. వాజనము 1 భా. వలభి 4 భా. వాజనము 1½ భా. ఉత్తరము 3 భా. వాజనము 1 భా. క్షుద్రపద్మము 1 భా. మహాపద్మము 3 భా. వాజనము 1 భా. కపోతము 7 భా. ఆలింగము 1 భా. అంతరితము ½ భా. ప్రతి 2 భా. వాజనము 1½ భా. ఇట్లు చేయవలయును.

శ్లో॥ ఉత్తరోర్ధ్వే చతుష్పంచ షట్ సప్తంచాష్టకం భవేత్॥ 15

తత్తదేకాంశమానేన హర్మ్యపాదం తు బాహ్యకే।
యన్మానో రమ్యమానేన చోత్తరే నిర్గమం భవేత్॥ 13

ఉత్తరాద్వాజనం చైవ తత్సమం నిర్గమం భవేత్।
వలభీ తత్సమం వాపి త్రిపాదం నిర్గమం భవేత్॥ 17

తదూర్ధ్వే వాజనం యుక్త్యా తచ్చతుర్థాంశ (ం) నిర్గమమ్।
కపోతం తత్సమం వాఽపి వాజనం నిర్గమం భవేత్॥ 18

అథ త్రిపాద మర్ధం వా పాదం వా నిర్గమం న్యసేత్।
ఆలింగ పాద బాహ్యస్య నీవ్ర మేవంతు కారయేత్॥ 19

తస్మాదం తరితం చోర్ధ్వే తత్సమం నిర్గమం తు వా
త్రిపాదం చార్ధ మేవం వా ప్రతిం తత్సమ నిర్గమమ్॥ 20

ఊర్ధ్వే వాజన ముచ్చే తు నిర్గమం పాద బాహ్యతః।
ప్రతిం చ ప్రస్తరం చైవ ప్రతివాజన మేవచ॥ 21

అన్వంతం చావసానం చ విధానంచ విధానకమ్।
ఏతత్సర్వ మితి ప్రోక్తం పర్యా యాఖ్యాని పండితైః॥ 22

తా॥ ఉత్తరము పైన 4-5-6-7-8 ఇట్లు భాగములుచేసి ఏ భాగములోనైనానసరే ఒక్క భాగమును వెలుపల హార్మ్యము యొక్క పాదమును చేయవలయును. ఏ భాగములతో చేసినప్పటికిని దాని అందమును చూచుకొని నిర్గమము నుంచవలెను. ఉత్తరమునుండి వాజనము దానియెత్తు యెంతో అంతే నిర్గమమును చేయవలెను. వలభియును దాని యెత్తుతో సమానముగా నిర్గమమును చేయవలెను. లేదా యెత్తును 4 భా. చేసి అందు ముప్పాతికవంతు నిర్గమమును చేయవచ్చును. దానిపైన వాజనమును ఆలోచనతో చేయవలెను. యెత్తులో నాల్గవవంతు నిర్గమముంచవలెను. కపోతము దాని యెత్తుతో సమానము నిర్గమముండవలెను. అనగా వాజనమునుండి యనుట లేక ముప్పాతిక వంతుగాని సగముగాని పాతికవంతుగాని చేయవచ్చును ఆలింగముయొక్క నిర్గమమును కూడ యిట్లు చేయవచ్చును. దానిపైన అంతరితము దాని యెత్తుతో సమానముగా నిర్గమముగాని ముప్పాతికవంతుగాని సగముగాని చేయవచ్చును. ప్రతిని దాని యెత్తుతో సమానముగా నిర్గమమును చేయవలెను. దానిపైన వాజనము యొక్క నిర్గమము పాతికవంతు చేయవలెను. ప్రతి, ప్రస్తరము, ప్రతివాజనము, అన్వంతము, అవసానము, విధానము, విధానకము ఇవి యన్నియును ప్రతి యొక్క పర్యాయనామములు.

శ్లో॥ ప్రతిరూపం దలాకారం వాజనం చ ద్వయాంశకమ్।
వాజనం క్షేపణం వేత్రం పట్టికా పట్ట ముత్తరమ్॥ 23
ధృక్కం త్రికం చ మందాది చాంతరితం పర్యాయ మేవచ।
తులాదండం జయంతీ చ ఫలకా పర్యాయ వాచకమ్॥ 24
కపోతం వక్త్రి హస్తం చ లుపా గోపానకం తథా।
చంద్ర మేతత్తు సర్వంపై ప్రోక్తం పర్యాయ వాచకమ్॥ 25
సంగ్రహం ముష్టిబంధం చ మల ముద్ధృత హస్తకమ్।
వలభీ ధారణం చైవ మేతే పర్యాయ వాచకాః॥ 26
తదూర్ధ్వే తత్రిక్రియాః సర్వా నాటకాంత మృణాళికా।
వల్లికా పత్రవల్లీచ చిత్రాంగం కులికాంఘ్రికమ్॥ 27
ఏతత్పర్యాయ వాక్యాని పురాతన మునీశ్వరైః।
ఉత్తరం వాజన మాధార మాధేయంశయనం తథా॥ 28
ఉద్ధృతం మూర్ధకం చైవ మహాతౌలి స్వవంశకమ్।
ప్రచ్ఛాదనస్య చాధార మేతత్ పర్యాయ మీరితమ్॥ 29

తా॥ ప్రతి యనగా దళమువలె నుండును, వాజనము రెండవభాగము సాదా. వాజనము, క్షేపణము, వేత్రము, పట్టిక, పట్టము, ఉత్తరము యీ యేడును వాజనమునకు నామములు. ధృక్కము, త్రికము, మందము, అంతరితము ఈనాల్గును అంతరితమునకు పేళ్లు. తులాదండము,

జయంతి, ఫలకము ఈనాల్గును ఫలకమునకు పేళ్లు. కపోతము, వక్త్రహస్తము, ఉపగోపానకము, చంద్రము, ఈ 5 ను కపోతమునకు పేళ్లు. సంగ్రహము, ముష్టిబంధము, మలము, ఉద్ధృతహస్తము, వలభి, ధారణము. ఈ 3 ను వలభికి పేళ్లు. మృణాళికలో నాట్యవిశేషములు, వల్లిక, పత్రవల్లిక. చిత్రాంగము, కలికాంఘ్రికము ఈ 4 వల్లిక పేళ్లు. ఉత్తరము, వాజనము, ఆధారము, ఆధేయము, శయనము, ఉద్ధృతము, మూర్ధము, మహాతౌలి, స్వవంశము, ప్రచ్ఛాదనాధారము ఈ 16 ఆధారమునకు పేళ్లు.

శ్లో॥ పూర్వభాగిక మానేన చోత్తరోచ్ఛ్రం గుణాంశకమ్।
తదూర్ధ్వే కంప మేకేన వలభీ తత్సమోదయమ్॥ 30
నిమ్న మంబుజవ త్కుర్యా త్తదూర్ధ్వేఽర్ధేన వాజనమ్।
ద్వ్యంశార్ధం ముష్టిబంధం చాంశేనోర్ధ్వేఽర్ధేన వాజనమ్॥ 31
ద్వ్యంశం మృణాల కోత్తుంగ మేకాంశే నోర్ధ్వకంధరమ్।
తదూర్ధ్వే క్షేపణం కుర్యాత్ పద్మం తు తత్సమం భవేత్॥ 32
తదూర్ధ్వే వాజనం చాంశం పత్రవల్ల్యాది భూషితమ్।
కదలీస్తంభ సంజాతా పుష్పవతీ మృణాలికా॥ 33
తదూర్ధ్వే ద్వ్యంశ మాధారం పట్టం చార్ధేన వాజనమ్।
అధ్యర్ధం ముష్టిబంధం చ వాజనం చైకభాగికమ్॥ 34
తదూర్ధ్వే చ ద్విభాగేన మహావాజన మీరితమ్।
తదర్ధేనాబ్జం తస్యాధః శోభయే త్సమలంకృతమ్॥ 35
తదూర్ధ్వే తుంగార్ధ మానేన చైత త్రికయాంగ మేవచ।
తదూర్ధ్వే పాదమూలోచ్ఛ్రం తత్త ద్భాగేన విన్యసేత్॥ 36
తదూర్ధ్వే ద్వ్యంశ భాగేన చాలింగోదయ మేవచ।
తదూర్ధ్వే వాజనం చాంశం త్ర్యంశ మంతరితం తథా॥ 37
ఏకాంశం చోర్ధ్వకంపం స్యాత్ ప్రతిం ద్వ్యంశేన కారయేత్।
తదూర్ధ్వే వాజనం చాంశం షట్ షట్ భాగోదయం భవేత్॥ 38

తా॥ ప్రస్తరము యొక్క యెత్తును 36 భా. చేసి అందు ఉత్తరము 3 భా. కంపము 1 భా. వలభి 1 భా. నిమ్నము 1 భాగము పద్మమువలె చేయవలెను. వాజనము ½ భా. ముష్టిబంధము 2½ భా. వాజనము 1 భా. మృణాళము 2 భా. కంఠము 1 భా. క్షేపణము 1 భా. పద్మము 1 భా. వాజనము 1 భా. ఆధారము 2 భా. పట్టము 2 భా. వాజనము ½ భా. ముష్టిబంధము ½ భా. వాజనము 1 భా. మహావాజనము 2 భా. పద్మము 1 భా. ఆలింగము 2 భా. వాజనము 1 భా. అంతరితము 3 భా. కంపము 1 భా. ప్రతి 2 భా. వాజనము 1 భా. ఈ ప్రకారము చేయవలయును.



శ్లో॥ అథ వా ప్రస్తరోత్సేధం త్రింశ ద్భాగే విభాజితే।
ఉత్తరోచ్చం త్రిభాగం స్యా త్కంప మేకేన కారయేత్॥ 39

ఊర్ధ్వే వలభీ యుగ్మాంశం వాజనం చైకభాగికమ్।
కపోతం పంచభాగం తు త్వంశ మాలింగ మేవచ॥ 40

ద్వ్యంశ మంతరితం చైవ నిమ్న మర్ధేన కారయేత్।
తదూర్ధ్వే ఉధ్యర్ధభాగేన కారయే త్ప్రతివాజనమ్॥ 41

తదూర్ధ్వే కంధ ద్వ్యంశం వాజనం చైకభాగికమ్।
తదూర్ధ్వే గ్రీవం యుగ్మాంశ మేకభాగేన వాజనమ్॥ 42

వేదాంశం త త్కపోతోచ్చ మర్ధే నాలింగ మేవచ।
అంశ మంతరితం చోర్ధ్వే నిమ్న మర్ధేన యోజయేత్॥ 43

అంశేన ప్రస్తరం చైవ సర్వాలంకార సంయుతమ్॥ 43½

తా॥ ప్రస్తరము యొక్క యెత్తును 30 భాగములుచేసి అందు ఉత్తరము 3 భా. కంపము 1 భా. వలభి 2 భా. వాజనము 1 భా. కపోతము 5 భా. ఆలింగము 1 భా. అంతరితము 2 భా. నిమ్నము ½ భా. ప్రతివాజనము 1½ భా. గలము 2 భా. వాజనము 1 భా. గలము 2 భా. వాజనము 1 భా. కపోతము 4 భా. ఆలింగము ½ భా. అంతరితము 1 భా. నిమ్నము ½ భా. ప్రస్తరము 1 భా. ఇట్లు సమస్తమైన అలంకారములతో చేయవలెను.



శ్లో॥ తదేవ మూలం గోపాన మూర్ధ్వే ద్వ్యంశేన వాజనమ్॥ 44
తదూర్ధ్వే పంచభాగేన కులికాంఘ్రిక తుంగకమ్।
తత్ప్రదేశే విశేషోఽస్తి భూషితం నాటకాదిభిః॥ 45

కపోత క్షుద్రనా స్యంగైః పత్రవల్ల్యాది భూషితమ్।
ప్రస్తరే సర్వదేశే తు మకరాది విభూషితమ్॥ 46

మకరై ర్భ్రమరై ర్యుక్తం శేషం ప్రాగుక్తవ న్నయేత్।
ఏకదండం ద్విదండం వా చార్ధదండ మథాపి వా॥ 47

క్షుద్రనాసి విశాలం స్యా త్తుంగం గోపానసీమకమ్।
అధః పాదవశా న్న్యస్యం సర్వేషాం క్షుద్రనాసికమ్॥ 48

కర్ణపాదవశాత్ క్షుద్ర నాసం స్తంభాగ్ర మర్ధకమ్॥ 48½

తా॥ పైజెప్పిన దానిసే మొదట గోపానము 3 భా పైనవాజనము 2 భా. దానిపైన పత్రవల్లిక 5 భాగములు. పత్రవల్లికయందు [illegible] విశేష [illegible] చేయవలెను కపోతముక్షుద్ర నాసిక యీరెండు రూపములందు పత్రవల్లి మొదలయిన అలంకారములను చేయవలెను. ప్రస్తరము నందంతట మకరాది చిత్రములను చేయవలెను. మకరములచేతను భ్రమరములచేతను మిగిలినవి మునుపు చెప్పిన రీతిగా చేయవలెను. ½ దండముగాని 1 దండములుగాని లేక 1½ దండముగాని క్షుద్ర నాసిక యొక్క విస్తారమును చేయవలెను. తుంగమును గోపానము ననుసరించి చేయవలెను. దిగువ నున్న స్తంభమును మించకుండ క్షుద్రనాసికలన్నియు నుండవలెను. కోణ స్తంభముల ననుసరించి కూడ క్షుద్రనాసికను స్తంభముపైన అర్ధభాగమును చేయవచ్చును.

శ్లో॥ అష్టాధికం తు వింశాంశం భాగం తు ప్రస్తరోదయమ్॥ 49
త్రిభాగం చోత్తరోత్తుంగ మూర్ధ్వే చాంశేన వాజనమ్।
తదూర్ధ్వే పద్మ మంశం స్యా ద్వాజనం చైకభాగికమ్॥ 50

ముష్టిబంధం త్రిభాగం స్యా దంశేన వాజనం భవేత్।
త్ర్యంశం మృణాళికోత్తుంగం చాంశేన వాజనం భవేత్॥ 51

యుగాంశం పట్టికోత్తుంగం వాజనం చైకభాగికమ్।
అర్ధేన కంప మంశేన పద్మ మర్ధేన వాజనమ్॥ 52

కపోతం బంధుభాగం స్యా దర్ధే నాలింగ మేవచ।
వాజనం తత్సమం తు స్యా దంశే నాంతరితం తథా॥ 53

తదూర్ధ్వే చైకభాగేన ప్రతివాజన సంమితమ్।
నాటకే తత్సపాదైస్తు చాధః పాదం సమన్వితం॥ 54

తదూర్ధ్వే ఒర్థం చ సర్వేషాం తత్పాదం నిర్గమం బహిః।
ఏకదండం ద్విదండం వా త్రిదండం వాఽథ నిర్గమం॥ 55

భూతరూప గణైశ్చైవ యక్ష విద్యాధరైస్తథా।
నరైర్వా నాటకాంగే తు కుర్యా ద్దేవాలయాదిషు॥ 56

యక్ష విద్యాధరాదీనాం భూపహర్మ్యే తు యోజయేత్।
హర్మ్యాభ్యంతరాలయాః సర్వాః నృణాం నాటక సంయుతం॥ 57

సర్వేషాం ముష్టిబంధానాం కుర్యా త్పాదాన్ ఋజూన్ తథా।
శేషం ప్రాగుక్తవ త్కుర్యా త్సర్వాలంకార సంయుతం॥ 58

ఏతత్తు ప్రస్తర స్యోర్ధ్వే నాటక స్యోర్ధ్వ స్యాంశవత్।
కుర్యాదే తత్కపోతం స్యా దష్టభాగాధికం తథా॥ 59

శేషం తు పూర్వ వత్కుర్యాత్ ప్రస్తరం చాష్టభేదకమ్॥ 59½

తా॥ ఎత్తును ౩౨ భాగములుచేసి అందు ఉత్తరము 1 భా. వాజనము 1 భా. పద్మము 1 భా. వాజనము 1 భా. ముష్టిబంధము 3 భా. వాజనము 1 భా. మృణాళిక 3 భా. వాజనము 1 భా, పట్టిక 4 భా. వాజనము 1 భా. కంపము ½ భా. పద్మము ½ భా. వాజనము ½ భా. కపోతము 4 భా. ఆలింగము ½ భా వాజనము ½ భా. అంతరితము 1 భా. ప్రతివాజనము 1 భా, మృణాళికలు ఒక్క పాళిక నిర్గమ ముండవలెను. దానిపైన అన్నియును సగము నిర్గమముండవలెను. ఆపైన అన్నియును స్తంభమునకు వెలుపల నిర్గమముండవలెను. 1 దండముగాని 2 దండములుగాని 3 దండములుగాని నిర్గమమును చేయవచ్చును. భూతగణ ములను యక్షులను విద్యాధరులను మానవులను మృణాళికయందు నిర్మించ వలెను. దేవాలయములకు మాత్రమే యిట్లు చేయవలెను. రాజహర్మ్య ములకు యక్షులను విద్యాధరులను మాత్రమే చేయవలయును. మానవరూపములను గూడ చేయవచ్చును అన్ని ముష్టిబంధములకు స్తంభములు చక్కగా నుండవలెను. మిగిలిన అన్ని అలం కారములను మునుపు చెప్పినరీతిగా చేయవలెను. ప్రస్తరముపైన మృణాళికయును ఇట్లే చేయ వలెను. దీనినే 8 భాగము లెక్కువచేసి మొత్తము 12 భాగములు కపోతమును చేసి మిగిలిన సమస్తాలంకారములను పైజెప్పిన రీతిగనే చేయవచ్చును. ఇట్లు 8 విధములుగా ప్రస్తరలక్షణములు చెప్పబడినవి.




శ్లో॥ ప్రస్తరోచ్ఛ మితి ప్రోక్తం ప్రచ్ఛాదన మిహోచ్యతే॥ 60
ప్రాసాదాదీనాం సర్వేషాం ప్రచ్ఛాదనాది లక్షణం।
ఉత్తరాంత త్రికాంతం వా వలభీ చోర్ధ్వ మేవవా॥ 61
కపోతాంతక మేవం స్యాత్త స్యోర్ధ్వే ప్రస్తరాంశకం।
ఏతత్ప్రచ్ఛాదన స్థానే దండం చోపరిశాయయేత్॥ 62
ఏతద్ ద్వార వశాద్దీర్ఘం తస్యోపరి జయంతికాం।
దారుదండం శిలావాఽపి చేష్టకేన జయంతికాం॥ 63
అథవా దారు జయంతిశ్చ శిలాచేత్స హదండకం।
వినాదండం తథా కుర్యా త్పాషాణం ఫలకాం న్యసేత్॥ 64
ఏతత్సర్వాలయే కుర్యా ద్దేవహర్మ్యే విశేషతః।
శుద్ధం మిశ్రం చ సంకీర్ణం త్రివిధం తద్వశాన్న్యసేత్॥ 65

తా॥ ప్రస్తరము యొక్క యెత్తు చెప్పబడినది. కప్పు యొక్క విధానమును చెప్పు చున్నాడు. ఉత్తరము వరకుగాని, త్రికము వరకుగాని, వలభియొక్క పైభాగము వరకుగాని కపోతము యొక్క అంతము వఱకుగాని యిట్లుచేసి ఆపైభాగము ప్రస్తరమును చేయవలెను.

ఈ ప్రస్తర ప్రదేశమున 1 దండముపైన శయనము చేయవలెను. దీనియొక్క ద్వారము ననుసరించి నిశివి చేయవలయును. దీనిపైన ఫలకమును దారువుతోగాని శిలతోగాని యిటుకలతోగాని చేయవలెను. లేక దారువుతో ఫలకమునుగాని రాతిదిగాని పలకలు శిలతో చేయవలెను. అయితే అన్ని దేవాలయములకును రాతితో ఫలకమును చేయవలయును. శుద్ధము, మిశ్రము, సంకీర్ణము, అను మూడు విధములు కలవు. దానిని తెలిసికొని చేయవలయును.

## 27. శుద్ధ మిశ్ర సంకీర్ణముల వివరము

శ్లో॥ ఏకద్రవ్యం తు శుద్ధం స్యాద్ ద్విద్రవ్యాం మిశ్రకం భవేత్।
త్రిద్రవ్యైస్తు సంకీర్ణం తజ్జ్ఞాత్వా కారయేద్బుధః॥ 66

కేవలం చేష్టకా హర్మ్యే దారుప్రచ్ఛాద నాన్వితం।
శిలాహర్మ్యే శిలాతౌలిం కుర్యాత్తత్ర ద్వి శేషతః॥ 67

కర్ణం చ పట్టికాయుక్తం మధ్యం మధ్యావసానకం।
చతురశ్ర మాయతాశ్రం వా యథా కర్మానుకూలతః॥ 68

ఏకపట్టం ద్విపట్టం వా త్రిపట్టం తూర్ధ్వ ముచ్యతే।
తన్మధ్యే ఫలకం వాఽపి శిలాతౌలి జయంతికం॥ 69

కుర్యా త్ప్రాగ్వ ల్లుపాకారం దలస్యాకృతి మేవ వా।
ఏవం గేహే సమప్రోక్తం దృష్ట మర్థం తు కారయేత్॥ 70

తా॥ ఒక్కజాతి ద్రవ్యముతో నిర్మించబడినది శుద్ధము. రెండు జాతుల ద్రవ్యములతో చేయబడినది మిశ్రము మూడు విధములగు ద్రవ్యములతో చేయబడినది సంకరము. వీనిని బాగుగా తెలిసికొని చేయవలెను. ఇటుకలతో గట్టిన హర్మ్యమునకు చెక్కలతో కప్పు చేయుడము మిశ్రము. రాతితో గట్టిన దానికి రాతితో కప్పును చేయవలయును. మధ్య కర్ణమున పట్టికను చేయవలెను. నలుచదరము, పొడుగుగల నలుచదరము ఏలాగో పనికి అనుకూలమైన విధముగా 1 పట్టముగాని, 2 పట్టములుగాని, 3 పట్టములుగాని పైన చేయవలెను. దాని మధ్య ఫలకమును రాతితోనే చేయవలెను. కపోతము యొక్క ఆకారము మునుపటివలెనే చేయవలయును. దలము యొక్క ఆకారమును గూడ పూర్వమువలెనే చేయవలయును. ఇట్లు దేవాలయమును నిర్మించవలెను. మానసారమున గూడ "ఏకద్రవ్యేణయుక్తంచ, కుర్యాత్తు శిల్పవిత్తమః." అని 18 వ అధ్యాయము 70 వ శ్లోకమున చెప్పియున్నాడు.

## 28. ప్రస్తరాంగముల రచన

శ్లో॥ కుర్యాద్దిశి తులాం వాఽపి పట్ట స్యోపరిత స్తు వా।
తన్మధ్యే పై దారుణా చ దండంకృత్వా ప్రయోజయేత్॥ 71

ఏత త్ప్రచ్ఛాదనం గేహే ప్రోక్తం మహ్యాం మునీశ్వరైః।
అన్య ద్వాస్తూనాం సర్వేషాం ప్రచ్ఛాదన మిహోచ్యతే॥ 72

మధ్యే ప్రాగుక్తవ త్కుర్యా దూర్ధ్వే ప్రస్తర మేవచ।
బాహ్యే ప్రాగుక్తవ త్సంగం ప్రస్తరం తు యథోచ్ఛ్రయం॥ 73

కుర్యా దధఃప్రదేశే స్యా న్మధ్యేవృత్తం తదగ్రకే।
మహాభారం తులాం వాఽపి క్షుద్రదండ మథాఽపివా॥ 74

ఆధారపట్ట సంయుక్తం సతులం తు జయంతికం।
ప్రస్తరావృత మధ్యోర్ధ్వే తులయా ఛాదయే త్తతః॥ 75

అధస్తా త్తద్విధానస్య క్షుద్రపట్టై స్సలక్షకం।
అథవా చతురశ్రైశ్చ కుర్యా త్తత్ర విశేషతః॥ 76

తత్రపట్టై శ్చతుష్కానాం సంధి ర్మధ్యేతు కుడ్మలం।
పాదేషు ఫుల్లపద్మం చ కుర్యా ద్యుక్త్యా చ శోభితం॥ 77

మధ్యరంగం తదుద్దిశ్య చోర్ధ్వే ఽలంకృతి వక్ష్యతే।
ఉత్తరాధః ప్రదేశే తు పూర్వోక్త చరణాగ్రకే॥ 78

విజ్ఞాయ బోధికాకారం స్తంభస్యార్ధాగ్రదేశతః।
పీనకర్ణోపరిప్రాంతే విన్యసేత్ ఫలకాకృతిమ్॥ 79

తా॥ దిశయందు పట్టముపైన తులనుగాని చాని యొక్క మధ్య ప్రదేశమున దండమును గాని చేయవలెను. ఇది ప్రచ్ఛాదనము. మరియొక విధముగా ప్రచ్ఛాదనమును చెప్పుచున్నాను. మధ్యను మునుపు చెప్పినట్లుచేసి దానిపైన ప్రస్తరమును, వెలుపలను పూర్వము చెప్పినట్లు కూడికను ప్రస్తరమునకు వలెనే చేయవలయును. దిగువను మధ్యను గుండ్రమును, ఉత్తరము పైభాగమున మహాభారమను తులనుగాని క్షుద్రదండమునుగాని, ఆధారపట్టముతో గూడ నిర్మించ వలెను. తులతోగూడిన జయంతికను చేయవలెను. ప్రస్తరముతో నావరింపబడిన మధ్య ప్రదేశమున పై భాగమున తులతో కప్పును చేయవలెను. ఆవిధానము యొక్క దిగువ ప్రదేశమున క్షుద్రపట్టమును చేయవలెను. లేక చతురశ్రమును చేయవచ్చును. అచ్చట నాలుగు పట్టములను మధ్యకలిపి మొగ్గను స్తంభములయందు విప్పారిన పద్మమును ఆలోచనతో అలంకారముగా చేయవలెను. మధ్య రంగమున ఉత్తరము యొక్క దిగువ ప్రదేశమున మునుపు చెప్పిన స్తంభములకుపైన బోదె యొక్క రూపమును తెలిసికొని స్తంభము యొక్క సగమునుండి పైభాగమున స్థూలముగానున్న కర్ణము యొక్క పై భాగమున పాలిక రూపమును చేయవలెను.

శ్లో॥ తదూర్ధ్వే నాటకాంగైశ్చ పాలికా ద్విగుణోన్నతా।
మృణాళోచ్ఛ్రం తు తస్యోర్ధ్వే నాటకోచ్ఛ్రయతః సమం॥ 80

మహాబోధిక సంయుక్తం మృణాలోపరి విన్యసేత్।
తన్మహాబోధి కోర్ధ్వేచ మహాతౌలిం న్యసే ద్బుధః॥ 81

పూర్వవత్ బోధికో త్తుంగం తత్సమం తౌలికోన్నతం।
మహాతౌలిం వినా కుర్యా దాధారార్థం తు పట్టికా॥ 82

పూర్వోక్త ప్రస్తరాంగైశ్చ యన్మానోపమ్యావర్గకం।
ఆధారస్యోపరి ప్రాంతే కుర్యాత్తు శిల్పవిత్తమః॥ 83

ఊర్ధ్వే ప్రచ్ఛాదనం కుర్యా దాధార స్యోర్ధ్వకేఽథవా।
ఏత త్ప్రచ్ఛాదనం కుర్యా త్పూర్వవ త్సమలంకృతమ్॥ 84

ఊర్ధ్వాలంకార మేవం తు మధ్యరంగే షు విన్యసేత్।
తత్తుంగం పూర్వవ త్కుర్యా చ్ఛేషం యుక్త్యా ప్రయోజయేత్॥ 85

తద్బహిః ప్రాంత భక్తీనాం ప్రచ్ఛాదన మి హోచ్యతే।
ప్రాగుక్త మూలపాదానాం స్తంభే చ ప్రతిపాదకే॥ 86

తా॥ దానిపైన నాట్యరూపములచేతను, దానికంటె రెట్టింపు యెత్తుగల పాలికను చేయవలెను. ఆపాలికపైన మృణాలికను నాట్యాంగముతో సమానముగా చేయవలెను. మృణాలము పైన గొప్ప బోదెనుకూడ నుంచవలెను. ఆబోదెపైన కప్పును చేయవలెను. బోదె యెత్తు మునుపు చెప్పినట్లు చేయవలెను. దానితో సమానము ఆచ్ఛాదనము చేయవలెను. ఆచ్ఛాదనము లేనియెడల ఆధారము కొఱకు పట్టికను పూర్వము చెప్పినట్లు ప్రస్తరము యొక్క రూపములచేత యే కొలతలు ఉండెనో ఆ కొలతలతో చేయవలెను. ఆధారము యొక్క పైభాగమున చేయవలెను. పైన కప్పును అధారము యొక్క పైనను ఇట్లు కప్పును చేయవలెను. కప్పు కూడ అలంకారముగా చేయవలెను. పై అలంకారమును మధ్య రంగమున అలంకారమును చక్కగా చేయవలెను. ఎత్తు మునుపు చెప్పిన కొలత ప్రకారము చేయవలెను. మిగిలిన పనులు ఆలోచించి చేయవలెను. దాని వెలుపల విభజించియున్న అన్ని భాగములకును కప్పును చెప్పెదను. మునుపు చెప్పిన మొదటి స్తంభములకు స్తంభము లన్నిటియందును. (చెప్పబోవు శ్లోకముతో నన్వయము)

శ్లో॥ తదూర్ధ్వే చోత్తరం న్యస్యేత్ వాజనం ముష్టిబంధనం।
మృణాలం వాజనం వాఽపి చోత్తరాది యథోర్ధ్వకే॥ 87

కుర్యా త్తు తస్య చోర్ధ్వే తు దండైస్తచ్ఛ్రోణికాం న్యసేత్।
త్రి చతు ష్పంచ షణ్మాత్రం దండాంతర విశాలకం॥ 88

తత్త ద్ద్విగుణదండం స్యాద్యుక్త్యా బలవశా న్న్యసేత్।
చతురశ్రం చతుష్పట్టం తులానా మాకృతి స్తథా॥ 89

పత్రవల్ల్యాది యుక్తం వా యథాశోభం తు కారయేత్।
తదూర్ధ్వే జయంతికం స్యా దంతరాలే తు విన్యసేత్॥ 90

అథవా చోత్తరాసర్వా సాంతర్వై ప్రాంతరాంతరం।
యత్ర ద్భక్తివశా త్సర్వం ప్రస్తరం స్యా త్తదంతరం॥ 91

బాహ్యకే చోత్తరం సర్వం యుక్త్యా కాష్ఠవశా న్న్యసేత్।
తస్యాంతః పాదమధ్యాంతః ప్రస్తీర్యాత్తు యథోత్తరం॥ 92

ఏతత్తు సర్వతోభద్ర మలక్ష్మాకృతి రుచ్యతే।
తద్వై కర్ణవశాద్వంశం ప్రస్తీర్యాత్తుహి సర్వశః॥ 93

ఉత్తరైః ప్రాగుక్తాంఘ్రిః స్యా త్తద్వశా త్పరితో న్యసేత్।
తదేవాంత మలక్షం చ కర్ణయో శ్చోత్తరం వినా॥ 94

తా॥ స్తంభములకు పైభాగమున ఉత్తరమును, వాజనమును, ముష్టిబంధమును, మృణాలమును, వాజనమును, ఉత్తరమును చేయవలెను. ఆపైన [illegible] దండముల వరకు యెత్తును, విస్తారము దానికి రెట్టింపుగాను యుక్తితోను బలము ననుసరించియును శ్రోణిని చేయవలెను. నలుచదరమును నాలుగు పట్టములును తులలయొక్క రూపములు, పత్రములు తీగలు మొదలైన వానితోగాని యేలాగో అందముగా చేయవలెను. దానిపైన జయంతికను అంతరాలమున నిర్మించవలెను. లేక ఉత్తరములన్నియు వెలుపలను లోపలను మధ్యను భాగముల ప్రకారమున నిలిపి వానిపై ప్రస్తరమును చేయవచ్చును. వెలుపలి యుత్తరములన్నియు ఆలోచనలతో దారువుతో నుంచవలెను. దానియొక్క లోపలను స్తంభముల మధ్యను చివరను దాటిపోవునట్లు చేయవలెను. ఇది సర్వతోభద్రమునందు లక్ష్మము యొక్క ఆకారము. అది యే మూలలను అంతటను చేసి ఉత్తరములచేత మునుపటివలెనే స్తంభములకు చుట్టునిలిపిన యెడల కర్ణమలక్షమగును. దీనికి ఉత్తరము అవసరములేదు.

శ్లో॥ ఇంద్రాది యామ్యపర్యంతం యామ్యాది వారుణాంతకం।
వారుణా త్సౌమ్యపర్యంతం సౌమ్యాది పూర్వకాంతకం॥ 95

బాహ్యాంతరం చాంతరం చ యుక్త్యా వంశే తు యోజయేత్।
శేషం ప్రాగుక్తవ త్కుర్యాద్బహిర్వై తద్వశాన్న్యసేత్॥ 96

బహిశ్చాప్యావృతా (దీని) చోత్తరాదీని కారయేత్।
ఉత్తరా ద్యుత్తరాంతం తు తలై ర్విన్యాస మీరితమ్॥ 97

బాహ్యే లంబావభక్తిశ్చే ర్దండికోర్ధ్వం లుపాస్థిరం।
పూర్వోక్త మంచతుంగై ర్వా యథాశోభం తు యోజయేత్॥ 98

శిలాయాం దారుకే వాఽపి చేష్టకే వాఽథ కారయేత్।
యథాబలం యథాభారం తథా వంశాది యోజయేత్॥ 99

అంత ర్బహిశ్చ తత్సర్వే చోత్తరైః సమతాం న్యసేత్।
అన్యథాంగాని సర్వేషాం కుర్యాత్త త్తద్వశాత్క్రమేత్॥ 100

ఉత్తరం వైపరీత్యం చే త్కర్తుః తద్వాస్తునాశనం।
దేవానాం భూపతీనాం హి చోర్ధ్వే మధ్యే తరంగకం॥ 101

మలక్షాది విధానంచ కుర్యాత్తు సంపదాస్పదం।
తైతిలానాం ద్విజాతీనా మన్యత్సర్వం శుభావహమ్॥ 102

**ఇతిమానసారే వాస్తు శాస్త్రే ప్రస్తర విధానంనామ షోడశోధ్యాయః.**

**తా॥** తూర్పు మొదలు దక్షిణము వరకును, దక్షిణము మొదలు పడమర వరకును, పడమర మొదలు ఉత్తరము వరకును, ఉత్తరము మొదలు తూర్పు వరకును. వెలుపలను లోపలను మధ్యను ఆలోచనతో ఆచ్ఛాదనమును కలుపవలెను. మిగిలినవన్నియు మునుపు చెప్పినట్లు చేయవలెను. వెలుపల నావరించిన ద్వారములను ఉత్తరములను చేయవలెను. ఉత్తరము మొదలు ఉత్తరము వరకు ఒక అంతస్తు అని తెలియవలెను. వెలుపలి లంబము యొక్క విభాగములతో దండిక యొక్క పై భాగము లుపలతో నుంచవలెను. లేక మునుపు చెప్పిన మంచముల కొలతతోనైనను చేయవచ్చును. రాతితోను కఱ్ఱతోను ఇటుకలతోను చేయవచ్చును. బలము ననుసరించి కప్పును చక్కగా చేయవలెను. లోపలను వెలుపలను అంతటను కప్పును సమానముగా చేయవలెను. వేఱుభాగములతోనైన కప్పును చక్కగా చేయవలెను. కప్పును మాత్రము శాస్త్రమునకు విరుద్ధముగా చేసిన యెడల యజమానులును ఆదేవాలయమును నశించును. దేవతలకును రాజులకును పైనమధ్యతరంగ ముండవలయును. మలక్షము మొదలైన విధముల తోను చేయవచ్చును. సంపదలను. శుభములను కలిగించును.

## 29. మరియొక పద్ధతి

### కాశ్యపశిల్పము 19వ పటలము

శ్లో॥ స్తంభాత్తు బోధికా నీవ్రం బోధికాదుత్తరం తథా।
వాజనస్య తు నిష్క్రాంత ముత్తరం వాజనోన్నతం॥ 8

వాజనా ద్వలభేర్నీవ్రం వలభీ తుంగ సదృశం।
త్రిపాదం వా తదర్ధం వా ప్రాగ్వ ద్వాజన విస్తృతం॥ 9

వాజనాత్తు కపోతస్య నీవ్రం తుంగ సమానకం।
ఉపనాస్యవ సానం వా జగత్యంత మథాపివా॥ 10

వాజనా దర్ధ దండం వా దండం సార్ధ ద్విదండకం।
వాజనాత్తు కపోతస్య నీవ్రం చాలంబనం సమం॥ 11

కపోతం గోపానయుతం గోపాన రహితం తు వా।
పాదబాహ్య సమం ప్రోక్తం కులికాంఘ్రి ప్రతిరుచ్యతే॥ 12

ఆలింగాంతరితం వేశం నీవ్రం చోత్సేధ సదృశం।
వాజనోచ్ఛ సమం ప్రోక్తం వాజనస్య తు నిర్గమం॥ 13

దండం త్రిపాదమర్ధం వా చోత్తరాగ్రస్య నీవ్రకం।
ఉత్తరస్యానుకూలం తు వాజనే నీవ్రవేశనం॥ 14

వలభిం భూతహంసాద్యై ర్భూషయే దుత్తరోపరి।
నానాపత్ర లతాద్యైస్తు కపోతం కర్ణపాలికం॥ 15

ప్రత్యగ్ర మకరీబంధ ప్రతిసింహాది భూషితం।
ఏవం ప్రస్తరవర్గం తు ప్రోచ్యతే తత్ ద్విజోత్తమ॥ 16

ఇతి కాశ్యపశిల్పే ప్రస్తర లక్షణ మేకోనవింశః పటలః

తా॥ స్తంభమునుండి బోదెనిర్గమమును, దానినుండి ఉత్తరముయొక్క నిర్గమమును, దానిపైన వాజనముయొక్క నిర్గమమును. వాజనమునుండి వలభినిర్గమమును ఇవి యన్నియును ఎత్తుతో సమానముగా నుండవలయును. లేక వాజనము విస్తారము ముప్పాతికగాని సగముగాని చేయవచ్చును. కపోతమునకు యెత్తుతో సమానము విస్తారమును చేయవలెను. కపోతము గోపానముతోగాని లేక గోపానము లేకుండగాని చేయవచ్చును. పత్రవల్లిక స్తంభము వెలుపలి వరకే యుండవలెను. ఆలింగము అంతరితము: ఇవి యెత్తుతో సమానము విస్తారముండవలెను. వాజనముమీాద యెత్తుతో సమానము విస్తారము. ఉత్తరముయొక్క నిర్గమము 1 దండముగాని లేక ముప్పాతిక వంతుగాని లేక సగముగాని చేయవలెను. ఉత్తరము ననుసరించి వాజనముయొక్క నిర్గమమును చేయవలెను. వలభిని భూతములు హంసలు మొదలైన వానిచేత చిత్రించవలెను. కపోతము కర్ణపాలిక అనేక పత్రము:లతోను లతలతోను అలంకారముగ చేయవలెను. ప్రతియొక్క చివర మకరీ బంధమును ప్రతిని సింహములతోను గజములతోను అలంకారముగ చేయవలెను. ప్రస్తరముయొక్క వర్గమును ఈవిధముగా తెలిసికొని చేయవలెను.

క్షుద్రహార్మ్యములకు ప్రస్తరములు 4, 5 భేదములుగా శిల్పరత్నమున జెప్పబడియున్నవి. అందలి యొకపద్ధతిని చెప్పుచున్నాను.

**శిల్పరత్నము 29వ అధ్యాయము**

శ్లో॥ దండమర్ధం త్రిపాదం వా తూత్తరోచ్ఛ్రం త్రిధాభవేత్॥ 12

వలభి ర్దండమానా స్యా ద్వాజనం పూర్వవద్భవేత్।
కపోతోచ్ఛ్రం త్రిదండార్ధ లంబం తస్యార్ధ దండకం॥ 13

తత్సమం నిర్గమం సార్ధ దండం వాపి ద్విదండకం।
శేషం ప్రస్తరమానం తు పంచభాగే కృతేపునః॥ 14

ఆలింగ మంశం కంఠం చ ద్వ్యేకాభ్యాం ప్రతివాజనే।

తా॥ $1-\frac{1}{2}-\frac{3}{4}$ దండము ఉత్తరము. 1. దండము వలభి, వాజనము మునుపటివలెనే. కపోతము యెత్తు $2\frac{1}{2}$ దండములు. లంబము అందులో సగము. మిగిలినది ప్రస్తరము. అందులో ఆలింగము 2 భా. కంఠము 1 భా. ప్రతివాజనము 2 భా. ఇట్లు 5 భాగములతో ప్రస్తరమును చేయవలెను.

## 30. గలభూషణము

**కాశ్యపశిల్పము 20 వ పటలము**

శ్లో॥ అథవక్ష్యే విశేషేణ గలభూషణ లక్షణం।
ఊర్ధ్వ భూమ్యంఘ్రి తుంగం తు గలమాన ముదాహృతం॥ 1

ఆద్యోత్సేధాంశ మానం వా గలమాన ముదాహృతం।
తదుచ్చాత్త్రి చతుష్పంచ భాగైకం వేదికోదయం॥ 2

శేషం గలోదయం ఖ్యాత మశేషం వా గలోదయం।
వేదికాయాస్తు విస్తారం చతుష్పంచ షడంశకే॥ 3

త్రిచతు ష్పంచభాగం తు గల వ్యాసం యథాక్రమం।
అంఘ్రేర్వేద్యంఘ్రి వేశం స్యా త్తద్వద్వా గలవేశనం॥ 4

త్రిపాదం వాతదర్ధం వా వేద్యంఘ్రే ర్గల వేశనం।
ఏవం త్వనేక భేదేషు కర్తురిచ్ఛావశాన్నయేత్॥ 5

వేదాశ్రం నాగరేకంఠం వస్వంశం ద్రావిడేగలం।
వృత్తం తు వేసరే హర్మ్యే గలం శీర్షానుకూలతః॥ 6

దిశి భద్ర సమాయుక్తం నాసికా కులికాంఘ్రికం।
భానుద్వ్యంశే గలోత్సేధే కలాంశం తద్గలోదయం॥ 7

ఉత్తరోచ్చం గుణాంశం తు వాజనం త్వేకభాగయా।
అగ్న్యంశం వలభేర్మానం వ్యోమాంశం వాజనోదయం॥ 8

ఉత్తరోర్ధ్వ గలాన్నీవ్రం వాజనాదీని పూర్వవత్॥ 8½

**తా॥** గల భూషణ లక్షణము చెప్పుచున్నాడు పై అంతస్తుయొక్క పాదక యెత్తుగాని, దానికి దిగువనున్న దానియొక్క యెత్తును బట్టిగాని గలమానమును చేయవలెను. ఆ యెత్తును 3-4-5, ఇట్లు భాగములుచేసి ఇందులో యేపద్ధతిలోనైన 1 భాగమును వేదిక చేయవలెను. మిగిలిన భాగములు గలము అని తెలియవలెను, లేక అంతయును గలము చేయవచ్చును. వేదిక యొక్క విస్తారము 4-5-6 భాగములుచేసి అందు 3గాని, 4గాని, 5గాని, వరుసగా గలముయొక్క విస్తారమునకు భాగములు చెప్పబడినవి. స్తంభమునకు వేదికూడ యిట్లేయని గ్రహించవలెను. గలమునకు వేశనముకూడ అదేవిధము. వేదియొక్క విస్తారములో ముప్పాతికవంతుగాని లేక సగము గాని గలముయొక్క వేశనమును చేయవచ్చును ఇట్లు అనేకవిధములుగా గలవేశనము చెప్పబడి యున్నది. ఇట్లు చెప్పబడిన భాగములలో యేభాగములననుసరించియైన చేయవచ్చును. నాగరజాతి దేవాలయమునకు కంఠము నలుచరదముగా జేయవలయును. ద్రావిడజాతి దేవాలయమునకు గలమును 8 పలకలుగా జేయవలెను. వేసరజాతి దేవాలయమునకు గలమును గుండ్రముగా జేయవలెను. దిశలయందు భద్రమును, నాసికను, చిత్రాంగమును చేయవలెను. గలముయొక్క యెత్తును 14 భాగములుచేసి అందు 13 భాగములు గలమును, ఉత్తరము 3 భా, వాజనము 1 భా, వలభి 3 భా, వాజనము 1 భా, ఉత్తరముపైన గలముయొక్క నిర్గమమును వాజనము మొదలైన వానియొక్క నిర్గమములను పూర్వము చెప్పబడినరీతిగా చేయవలెను.

శ్లో॥ అథవా భాను భాగే తు గలోదయ ముదాహృతం॥ 9

ఉత్తరోచ్చం గుణాంశం తు శివాంశం వాజనోదయం।
తదూర్ధ్వే ముష్టిబంధోచ్ఛ మధ్యర్ధాంశ ముదాహృతం॥ 10

మృణాల్యుచ్చం గుణాంశం తు ఏకాంశం పట్టికా భవేత్।
సార్ధాంశం దండికోచ్చం తు వ్యోమాంశం పద్మపట్టికా॥ 11

గోపానం కల్పయే దూర్ధ్వ ముపారోహణ మేవవా।
వాజనా దీని నిష్క్రాంతం తత్త దుచ్చసమం భవేత్॥ 12

ఏవం గలోన్నతం వ్యాసం సాలంకారం చ కీర్తితం॥ 12½

**ఇతి కాశ్యపశిల్పే గలవిధానం, వింశః పటలః**

**తా॥** గలముయొక్క యెత్తును 12 భాగములుచేసి, అందు ఉత్తరము 3 భా, వాజనము 1 భా, ముష్టిబంధము 1½ భా, మృణాలి 3 భా, పట్టిక 1 భా, దండిక 1½ భా, పద్మపట్టిక 1 భా, ఇట్లుచేసి దానిపైన గోపానమును నిర్మించవలెను. లేక గోపానమునకు దిగువ వరుసగా మెట్లవలె మట్టములు




పెట్టిగాని చేయవచ్చును. శిల్పరత్నమున 'గోపానం కల్పయే దూర్ధ్వమవరోహణ మేవ వా' అని చెప్పియున్నాడు. అవరోహణమనగా గోపానమును తలక్రిందుగా చేయుటయని యర్థమగుచున్నది. వాజనము మొదలయిన వానియొక్క నిర్గమము వానివాని యెత్తుతో సమానమని తెలియవలెను. గలముయొక్క యెత్తును విస్తారమును దానికి చేయవలసిన యలంకారములును ఇట్లు చెప్పబడి యున్నవి

## 31. శిఖరలక్షణము

### కాశ్యపశిల్పము 21 వ అధ్యాయము

శ్లో॥ అథ వక్ష్యే విశేషేణ శిఖరస్య తు లక్షణం।
ఊర్ధ్వ భూస్తంభ తుంగస్య సదృశం శిఖరోదయం॥ 1

అధోత్సేధాంశ మానం వా తుంగం వై శిఖరస్య తు।
యదివిస్తార తుల్యం వా శిఖరే వోత నీవ్రకం॥ 2

వలభిర్వాజనాన్నీవ్రం దండం వా ద్వ్యర్ధమేవవా।
ద్విదండం వా తథా కుర్యాత్ నీవ్రం చాలంబనం సమం॥ 3

తన్నీవ్ర సదృశం తుంగం కపోతం వలభీ జనాత్।
శిరస్తారం కపోతోర్ధ్వం వలభీ వాజనైః సమం॥ 4

శిఖరే మధ్యవిస్తారం కంప నిష్క్రాంత సదృశం।
సమం త్రిపాదమర్ధం వా తారమేవం చతుర్విధం॥ 5

తత్రతారం చ పంచాంశే త్ర్యంశం ఫలిక విస్తృతం।
శిఖరే వల్లికస్థానం భూతాంశేషు శిరోదయం॥ 6

వేద భాగవసానేతు ఫలికా మండలాకృతిం।
త్రిచతుష్పం చ మాత్రం వా వల్లికం మండలం తథా॥ 7

తత్తారే తు చతుర్థాంశే ఽంతర్మండల ఘనం భవేత్।
యుగ్మం వాఽయుగ్మ సంఖ్యావా పరితః కల్పయేత్సమం॥ 8

వల్లికానామథ శ్చోర్ధ్వే వేత్రం తస్యార్ధ మానతః।
వల్లికా వ్యాస భూతాంశే యుగ్మాంశం పద్మ విస్తృతం॥ 9

తా॥ శిఖర లక్షణమును చెప్పుచున్నారు పై అంతస్తుయొక్క స్తంభముయెత్తుతో సమానముగాని దిగువ అంతస్తుయొక్క యెత్తుకు తెలిసినంతగాని శిఖరమును చేయవలెను. విస్తారముతో సమానముగాను శిఖరమును చేయవచ్చును. శిఖరమున వలభియొక్క నిర్గమము వాజనమునుండి 1 దండముగాని 1½ దండములుగాని, 2 దండములుగాని చేయవచ్చును లేక యెత్తుతో సమానముగాను చేయవచ్చును. దానితో సమానముగా కపోతముయొక్క నిర్గమమును చేయవలెను. శిఖరముయొక్క విస్తారముతో సమానముగా కపోతముయొక్క పైభాగమును రచించవలెను. వలభి వాజనముతో సమానముగా నుండవలెను. శిఖరముయొక్క మధ్య విస్తారము కంపముయొక్క నిర్గమముతో సమానముగా నుండవలెను. కంపముతో సమానముగాని,








ముప్పాతిక వంతుగాని లేక సగమువంతుగాని ఇట్లు నాలుగు విధముల చేయవచ్చును. ఆ విస్తారమును 5 భాగములుచేసి అందు 3 భాగములు ఫలిక విస్తారమును చేయవలెను. శిఖరముయొక్క వల్లిక స్థానమును చేయుపద్ధతిని చెప్పియుంటిమి. శిఖరమును 6 భాగములుచేసి 4వ భాగముయొక్క చివర ఫలికను గుండ్రముగా చేయవలెను. 3-4-5 భాగములు వల్లికనుగూడ గుండ్రముగా చేయవలెను. ఆ విస్తారములో నాలుగవవంతు లోపలి వలయముయొక్క మందమును చేయవలెను. వెలుపల దళములను సమసంఖ్యగాని బేసిసంఖ్యగాని అన్నియును సమానముగా చేయవలెను. వల్లికములయొక్క అడుగునను పైనను వేత్రమును అందులో సగము కొలతతో చేయవలెను. వల్లికముయొక్క విస్తారమును 6భా. చేసి అందు 2భా. పద్మమును చేయవలయును.

శ్లో॥ శిఖరస్య తు మానాంతం పద్మతుంగ ముదాహృతం।
పద్మతార త్రిభాగైకం కుంభస్యాధోఽవలగ్నకం॥ 10

వలగ్నస్య త్రిభాగైకం కుంభస్యోపరికంధరం।
కంధర త్రిగుణం పాలి తత్త్రిభాగం తు కూశ్మలం॥ 11

పాలినాల విశాలం తు కంధరాదిషు బృహితం।
వల్లికాంతం శిరోమధ్యా దానుపూర్వ్యం కృశం కురు॥ 12

మధ్యా ద్వాజన తుల్యాంతం క్రమేణ కృశతాం కురు।
తస్మా త్కపోతనీవ్రాంతం క్రమేణైవ బృహద్ఘనం॥ 13

శిఖరస్య తు తుంగార్ధం పద్మార్ధే స్తూపితుంగకం।
ద్వావింశతి భవే దుచ్చం పద్మ మధ్యర్ధభాగయా॥ 14

కంప మర్ధాంశ మిత్యుక్తం గల మర్ధాంశమానతః।
తత్సమం చోర్ధ్వకంపం తు పద్మ మంశేన కల్పయేత్॥ 15

ఘాతభాగం ఘటోత్సేధం కంప మర్ధాంశమానతః।
పద్మ మంశేన కర్తవ్యం కంప మధ్యర్ధమానతః॥ 16

పంచాంశం పాలికానాం తు ద్విభాగం కంప ముచ్యతే।
పద్మ మంశేన కర్తవ్యం పాలికోచ్చం తు భాగయా॥ 17

అర్ధేన పద్మ మర్ధేన పద్మశేషం తు కూశ్మలం।
శిఖరాకృతివ త్కుంభం ఫలికా కూశ్మలం తథా॥ 18

నాగరే చతురశ్రం త ద్వస్వశ్రం ద్రావిడే శిరః।
వృత్తం వేసరహర్మ్యే తు శిరసో వర్తనం క్రమాత్॥ 19

నానాపత్ర లతాభి స్తు శిఖరం తు సుభూషయేత్।
లక్షణం శిఖరస్యైవం నాసికాలక్షణం శృణు॥ 20

**ఇతి కాశ్యపశిల్పే శిఖరలక్షణమేకవింశః పటలః**

తా॥ శిఖరముయొక్క చివరవరకు పద్మముయెత్తు చేయవలెను పద్మముయొక్క విస్తారమును 3భా. చేసి అందు భా. కుంభముయొక్క అడుగున సన్నము చేయవలెను. దానిని 3 భా. చేసి అందు 1 భా. కుంభముయొక్క మెడను చేయవలెను. ఆమెడ విస్తారమును 3 రెట్లు చేసి పాలికను చేయవలెను. దానిని ½ భా. చేసి అందు ½ భా. మొగ్గను చేయవలెను. పాలినాలముయొక్క విస్తారము కంధరము మొదలయిన వానియందు వల్లికయొక్క పైభాగమువరకు వృద్ధిచేయవలెను శిఖరముయొక్క మధ్యనుండి చివరవరకు క్రమముగా తగ్గించవలెను. అనగా శిఖరముయొక్క మధ్యనుండి వాజనముయొక్క ప్రదేశమువరకు తగ్గించవలెను. అక్కడినుండి కపోతముయొక్క నిర్గమమువరకు వరుసగా లావుచేయవలెను. శిఖరముయెత్తులో సగము పద్మమును సగము స్థూపిని చేయవలెను. శిఖరముయొక్క యెత్తును 32 భా. చేసి పద్మము 1½ భా, కంపము ½ భా, గలము ½ భా, ఊర్ధ్వకంపము ½ భా, పద్మము 1 భా, కుంభము ⅓ భా, కంపము ½ భా, పద్మము 1 భా, కంపము 1½ భా, పాలిక 5 భా, కంపము 2 భా, పద్మము 1 భా, పాలిక 1 భా, పద్మము ½ భా, మొగ్గ ½ భా. శిఖరముయొక్క ఆకారమువలె కుంభమును చేయవలెను ఫలిక యొక్కయు పద్మముకుళము యొక్కయు ఆకారములనుగూడ చక్కగా శిఖరముయొక్క చివరకు సరిపోవునట్లు చేయవలెను. నాగరజాతి శిఖరము నలుచదరముగాను, ద్రావిడజాతి శిఖరము 8 కోణములుగాను, వేసరజాతి శిఖరము గుండ్రముగాను చేయుచు అనేకవిధములైన లతలతోను పత్రములతోను అందముగా చేయవలయును. శిఖరలక్షణమును చెప్పియుంటిని. ఇక నాసికాలక్షణమును చెప్పెదను వినుము.

శిల్పరత్నము 32 వ అధ్యాయము

శ్లో॥ తారా త్వంచ త్రి భాగం నా సవ సప్తాంశ మేవ వా।
త్రయోదశాంశ రుద్రాంశం విమానానాం విభాగతః॥ 1

అత్యష్టి తిథిభాగం వా వేద రామాంశకం తు వా।
ష ట్పంచాంశం తు వా నాగ స ప్తభాగ మథాపివా॥ 2

విస్తారార్ధంతు వా కుర్యా దష్టధా శిఖరోదయం।
వై దేహం మాగధం చాపి కౌరవం కౌసలం తథా॥ 3

శౌరసేనం చ గాంధారం క్రమే ణావంతికం స్మృతం।
వ్యాసార్ధం శిఖరోత్సేధం కించిన్న్యూనం చ మానుషం॥ 4

వ్యాసార్ధం తుంగమాద్యం తు తత్తుంగే స ప్తభాజితే।
ఏకైకాంశ వివృద్ధ్యాష్టౌ భవంతి శిఖరోదయాః॥ 5

వ్యామిశ్రకం కలింగం చ తథా కౌశిక మేవచ।
వై రాటం ద్రావిడం చైవ బాహ్లికం కౌల్లకం పునః॥ 6

తథా శౌండిక మి త్యేతే వ్యామిశ్రాది యుపోదయాః।
ఏతే దేవవిమానానాం పాషం డాశ్రమిణాం తథా॥ 7

ప్రతిలోమ కులానాం తు విశేషేణ శుభావహాః॥

తా॥ విస్తారము ను 5 భా. చేసి అందు 3 భా. గాని, లేక 9 భా చేసి అందు . భా. గాని 13 భా. చేసి అందు 11 భా. గాని. 7 భా. చేసిఅందు 5 భా గాని, 4 భా. చేసి అందు భా. గాని, 6 భా. చేసి అందు 5 భా. గాని, 8 భా. చేసి అందు 7 భా. గాని, విస్తారములో సగము గాని, యిట్లు 8 విధములుకలవు. వై దేహము, మాగధము. కౌరవము, కౌసలము, శౌరసేనము, గాంధారము, ఆవంతికము వ్యాసములో సగము శిఖరము యెత్తునకు కొంచెము తగ్గితే మానుషము వ్యాసములో సగమును మొదటిదానిని గుర్తించి దానిని 7భా. చేసి ఒక్కొక్క భా. కలువుచు రాగా శిఖరముయొక్క భేదములు 8 అగును. మరియు వ్యామిశ్రమము, కలింగము, కౌశికము, వై రాటము ద్రావిడము, బాహ్లికము, కౌల్లకము, శౌండికము ఈయెనిమది పాషండాశ్రమములకును తక్కువ జాతివారలకును పనికి చున్నని చెప్పినాడు.

శిల్పరత్నము 32 వ అధ్యాయము

శ్లో॥ వలభీ బాహ్యతుల్యం వా తదర్ధం వా త్రిపాదకం।
చతురశ్రం చ వృత్తం చ షడ శ్రాష్టాశ్ర మేవ చ॥ 21

ద్వాదశాశ్రం షోడశాశ్రం పద్మకుడ్మలసన్నిభం।
తథా కమలసంకాశం దీర్ఘం వృత్తం చ కోమలం॥ 22

అష్టా ద్యష్టాష్ట ధారాణి హర్మ్యాదీనాం శిరాంసి చ।
షడాద్యం షష్టికోణం చ సమంతం శిఖరాకృతి॥ 23

శిఖరస్య తు విస్తారే బా ణాగ్న్యంశం తు వి_స్తృతం।
శిఖరే వల్లికస్థానం భూతాంశే తు శిరోదయే॥ 24

తా॥ శిఖరముయొక్క విస్తారము వలభియొక్క వెలుపలి అంచుతో సమానముగాగాని అందులో సగముగాని ముప్పాతికవంతుగాని చేయవచ్చును నలుచదరము, గుండ్రము ఆఱు పలకలు, 8 కోణములు, 16 కోణములు 32 కోణములు, తామర మొగ్గవలె నుండవలెను. 8_16_24_32_40_48_56_64 ఇట్లు దళములయొక్క భేదములు 8 కలవు. 6_12_18_24_30_36_42_48_54 60. ఇట్లు దళములయొక్క సంఖ్యచే 10 భేదములును కలవు. శిఖరము యొక్క విస్తారమును 8. భా. చేసి అందు 3 భా. విస్తారమును చేయవలెను. వల్లికస్థానమును 5వ భాగమున చేయవలెను.

మానసార 18 వ అధ్యాయము

శ్లో॥ షోడశైకాంశకం కృత్వా పాలికా పద్మలాంతకం।
సార్ధాంశం పాలికోచ్చం స్యా దర్ధాంశం వాజనం భవేత్॥ 56

పద్మతుంగం త్రిభాగం చ కంధరం చైకభాగికం।
అర్ధేన కంప పద్మం స్యా త్కుంభతుంగం ద్వయాంశకం॥ 57

ఊర్ధ్వే చ సార్ధభాగేన దలపద్మం ప్రకల్పయేత్।
తదూర్ధ్వే చ త్రిభాగేన తద్దండోదయ మీరితం॥ 58

అర్ధాంశం కంపపద్మం స్యా ద్వాజనం చార్ధభాగికం।
తదూర్ధ్వే కంపం పద్మంతు చార్ధే నార్ధేన యోజయేత్॥ 59

ద్విభాగం కుడ్మలోత్తుంగం దండతుంగస్య మధ్యమే।
యథాలంకార యు_క్తం చేత్పద్మకేసర మావృతం॥ 60

అథ వా స్థూపికోత్తుంగం దండమానేన కారయేత్।
దండేన పాలికోత్తుంగం పద్మతుంగం త్రిదండకం॥ 61

కంధరం చైకదండం స్యా త్కుంభం సార్ధద్విదండకం।
ఏకదండ మూర్ధ్వపట్టం స్యాద్ ద్విదండం కుడ్మలోదయం॥ 62

శేషం తన్మధ్యదండం స్యా త్పూర్వవ త్సమలంకృతం।
శిరస్తారం తు భూతాంశం వహ్న్యంశం పాలికాయతం॥ 63

తద్విశాలే తు భూతాంశం సార్ధవేదాంశం విస్తృతం।
అబ్జతారం త్రిభాగంచ తత్త్రిధా గైకభాగికం॥ 64

పద్మస్యోపరి కర్ణం స్యాత్తత్త్రిధా కుంభవిస్తృతం।
కుంభతారం నవాంశం చ భాగం దండవిశాలకం॥ 65

దండతార త్రిధా పాలి భాగైకం కుడ్మలం తథా।
మహాబ్జ మష్టదళం కుర్యా చ్ఛేషంయుక్త్యా ప్రయోజయేత్॥ 66

తద్ద్వయం విహ్యాతం చాథ స్తదర్ధమాధారపట్టికా।
తదర్ధం చ తథా పట్టం స్యా త్తద్ద్వయం పద్మంతదధః॥ 67

శేషం తు కుడ్మలం కుర్యా ద్విస్తారం యుక్తితోన్యసేత్।
శిలాం వా చేష్టకం దారు లోహం చైవ ప్రకల్పయేత్॥ 68

తా॥ శిఖరము యొక్క యెత్తును 17 భాగములు చేసి అందు పాలిక 1½ భా, వాజనము ½ భా, పద్మము 3 భా, గలము 1 భా, కంప పద్మము ½ భా, కుంభము 2 భా, దలపద్మము 1½ భా, దండము 3 భా, కంపపద్మము ½ భా, వాజనము ½ భా, కంపము ½ భా, పద్మము ½ భా, మొగ్గ 2 భా, దండమునకు మధ్యనుండవలెను. ఇట్లు అలంకారముగా చేయవలెను. లేక స్తూపిక యెత్తును దండము కొలతతో చేయవచ్చును. పాలిక 1 దండము, పద్మము 3 దండములు, గజము 1 దండము, కుంభము ½ దండములు, ఊర్ధ్వపట్టము 1 దండము, మొగ్గ 2 దండములు, మిగిలినది మధ్యదండమును చేయవలెను. చక్కగా అలంకారమును చేయవలెను. శిఖరముయొక్క విస్తారమును 5 భాగములుచేసి అందుపాలిక ½భా, దాని విశాలమును 5 భాగములు చేసి అందు 4½ భాగము విస్తారమును చేయవలెను. పద్మముయొక్క విస్తారమును 3 భాగములు చేసి అందు 1 భాగమును యెత్తు చేయవలెను. పద్మముపైన కర్ణమును అదే కొలతను చేయవలయును కుంభముయొక్క విస్తారము కర్ణముకంటె 3 రెట్లు చేయవలెను. కుంభము యొక్క విస్తారమును 9 భాగములు చేసి అందు 1 భాగము దండముయొక్క విస్తారమును చేయవలెను. దండముయొక్క విస్తారమునకు 3 రెట్లు పాలికను చేయవలెను. తరువాత మొగ్గను 1 భాగము చేయవలెను. మహాపద్మమునకు దళములు 8 చేయవలెను. మిగిలిన పనులు ఆలోచనతో చేయవలెను. ఆ రెండును వదలి వాని దిగువ అందులో సగము ఆధారపట్టికను చేయవలెను: ఆధారపట్టికలో సగము పట్టమును చేయవలెను. ఈ రెంటికిని దిగువ పద్మమును రచించవలెను. మిగిలినది మొగ్గను చేయవలెను. ఆ మొగ్గయొక్క విస్తారము యుక్తితో చేయవలెను. శిలలతోను ఇటుకలతోను దారువుతోను లోహముతోను చేయవచ్చును.

## 32. నాసికా లక్షణము

### కాశ్యపశిల్పము 2౹ వ పటలము

శ్లో॥ అథ వక్ష్యే విశేషేణ నాసికాలక్షణం పరం।
లలాటనాసికా ఖ్యాతం శిఖరే తార సదృశం॥ 1

శిఖరస్య తు విస్తారం త్రి చతు ష్పంచ భాగయా।
క్రమా న్నాసీవిశాలాంశ ముత్త మాధమ మధ్యమాః॥ 2

మహానాసీ తు విఖ్యాతా త్రివిధా సా ప్రకీర్తితా।
సమం త్రిపాద మర్ధం వా శిఖరే నాసినీవ్రకం॥ 3

తత్తార త్రి చతుర్థాంశ హీనం శీర్షోదయం భవేత్।
నాసికాతుంగ మాఖ్యాతం తదర్ధోచ్చ మథాపివా॥ 4

గలాదుపరి తత్తుంగం నాసికానాం ప్రకీర్తితం।
శక్తిధ్వజం తదూర్ధ్వేన నాసీతుంగార్ధ ఏవవా।
త్రిపాదం వా త్రిభాగైకం భాగం వా స్యాత్ తదున్నతం॥ 5

తచ్ఛక్తి ధ్వజ తుంగం తు గుణభాగ విభాజితే।
ద్విభాగం కిన్నరీ వక్త్రం తచ్ఛేషం గలమానకం॥ 6

దండం తద్గల సారం స్యాత్ ద్విగుణం కిన్నరీముఖం।
ఏవం శక్తిధ్వజం కార్యం తదూర్ధ్వే త్రి శిఖం న్యసేత్।
శక్తి ధ్వజోపరిష్ఠంతు పత్రం వాఽథస సూనకం॥ 7

కిన్నరీ వక్త్ర తుంగం స్యా త్సమం శూలోదయం భవేత్।
పత్రం చోక్తేన మానేన యథా సౌందర్య మాచరేత్॥ 8

తా॥ నాసికయొక్క లక్షణము చెప్పుచున్నాడు. ముఖనాసయొక్క విస్తారము శిఖరము యొక్క విస్తారముతో సమానముగా నుండవలెను. శిఖరముయొక్క విస్తారమును 3-4-5 భాగములు చేసి అందు ఒక్కొక్క భాగము విశాలము చేసిన యెడల వరుసగా ఉత్తమము, మధ్యమము, అధమము అగును ఇట్లు మూడు విధములుగ మహానాసిక చెప్పబడి యున్నది. శిఖరమున నాసిక యొక్క నిర్గమము విస్తారముతో సమానముగాని ముప్పాతికవంతుగాని సగముగాని చేయవచ్చును. ముఖనాసిక యొక్క విస్తారములో 3వ వంతుగాని, 4వ వంతుగాని, తగ్గించినయెడల శిఖరమును చేయ వలయును. లేక అందులో సగముకూడ చేయవచ్చును. గలముయొక్క పైభాగమున నాసిక యుండవలెను. దానిపైన శక్తిధ్వజము నాసిక యెత్తులో సగముగాని ముప్పాతికవంతుగాని లేక మూడవ వంతుగాని యుండవలెను. ఆశక్తిధ్వజమును 3 భాగములుచేసి 2 భాగములు కిన్నర

ముఖములును మిగిలిన భాగము గలమును చేయవలెను. 1 దండము గలమను. 2 దండములు కిన్నర ముఖములును, పైన శిఖరములును ఇట్లు శక్తిధ్వజమును చేయవలెను. దానిపైన పత్రము గాని పుష్పముగాని చేయవలెను. కిన్నర ముఖముతో సమానముగా శూలమును చేయవలెను. పత్రము అందముగా చేయవలెను.

శ్లో॥ విస్తారం ముఖ పట్ట్యాస్తు దండం వా ధ్యర్ధమేవ వా।
నీవ్రం తదష్ట భాగం వా కర్ణకోచ్చం తదున్నతిః॥
వల్లీ మండల చిత్రా ద్యైర్భూషయే న్ముఖపట్టికాం॥ 9

ముఖపట్ట్య వశేషం తదవగాఢ ముదాహృతం।
త దధస్థిత పట్టీభ్యాం త్రిణాల్య ప్రతిభూషితం॥ 10

శూలాభం వా స్థలాభం వా సవ్యాలం వా సనాటకం।
మాలికా కూటకోష్ఠాది మండి తం వా విమానవత్॥ 11

చిత్ర పత్రాఖ్య మకర తోరణాఢ్య మథాపి వా।
తోరణాభ్యంతరే లక్ష్మీః సాభిషే కాంబుజాసనా॥ 12

నానావిధై స్తథా న్యైర్వా నాసి గాఢం తు మండయేత్।
సుభద్రం తు మహానాసీ పాదం సర్వాంగ సంయుతం॥ 13

ఉత్తరం వాజనం చాబ్జం క్షేపణం నాసికా దధ।
కల్ప యిత్వా విశేషేణ కంఠస్తారాది మానతః 14

ఊర్ధ్వ భూ స్తంభ తారం వా త్రిపాదం వాఽర్ధమేవ వా।
నాసికా స్తంభ విస్తారం కర్ణోచ్చం తు తదున్నతం॥ 15

వస్వశ్రం వాఽథ వృత్తం వా యుగాశ్రం వా తదాకృతి।
నాసికా యాస్తు విస్తారాద్ ద్విదండం వా త్రిదండకం॥ 16

హీనం శేషం విశాలం స్యా న్నాస్యంఘ్రి బాహ్యా సీమకం।
నాసికాంఘ్రి ద్వయోర్మధ్యే దిఙ్మూర్తి స్థాపనం కురు॥ 17

తా॥ ముఖపట్టికయొక్క విస్తారమును 1 దండముగాని, 1½ దండముగాని చేయవలెను. అందు 8వ భాగమును నిర్గమము చేయవలెను. కర్ణముయొక్క యెత్తుతో సమానముగాను, లతలతోను పత్రములతోను అలంకారముగాను చేయవలెను. ముఖపట్టిక పోగా మిగిలినది అవగాఢము (దిగువ ప్రదేశము) దిగువ పట్టికలను త్రినాలములచేత నలంకరించవలెను. శిఖరముతో సమానముగాని, పట్టికతో సమానముగాని, వ్యాలములతోగాని, నాట్యరూపములతోగాని అలంక

రించవలెను. విమానమునకువలె కూటములకును కోష్ఠములకును తోరణము రచించవలెను. చిత్ర తోరణముగాని, పత్రతోరణముగాని, మకరతోరణముగాని చేయవచ్చును ఆ తోరణముమధ్య యేనుగులు తొండములతో జలమును చిమ్ముచున్నట్లును. పద్మములపై లక్ష్మీదేవి కూర్చుండినట్లును చేయవలెను. ఇంకను అనేక విధములైన చిత్రములతోను నాసికయొక్క గాధమును (దిగువప్రదేశ మును) అలంకరించవలెను. ముఖభద్రమను పేరుగల మహానాసికయొక్క స్తంభమునకు ఉత్తరము, వాజనము, పద్మము, క్షేపణము మొదలగు అన్నిరూపములను కల్పించవలెను. అది నాసికకు దిగువ కంఠము యొక్క విస్తారమును చేయవలెను. నాసిక యొక్కయు స్తంభముయొక్కయు మధ్య ప్రదేశమున నందీశ్వరుడు మొదలగు వారిని నిర్మించవలెను.

శ్లో॥ మహానాసి మిదం ప్రోక్తం క్షుద్రనాసి విధిం శృణు।
సార్ధదండం ద్విదండం వా త్రిదండం వాఽథ విస్తృతం॥ 18

తత్తార త్రిచతుర్థాంశ హీనశేషం త దున్నతం।
కపోతాలంబనాత్ క్షుద్రనాసికోచ్ఛం తు కల్పయేత్॥ 19

ప్రతివాజన సీమాంతం తస్య శక్తి ధ్వజోన్నతం।
తదుచ్ఛం తు త్రిధాభజ్య కంఠ మేకాంశ మానతః॥ 20

శేషం కిన్నరీ వక్త్రి ద్వౌ తారం యుక్తి వ శా న్నయేత్।
నాసి తారార్ధం గాఢం స్యాత్ గాఢార్ధం ముఖ పట్టికా॥ 21

నాసిం తలాదిభి ర్భూష్య నానాలంకార సంయుతం।
పాదం ప్రతి కపోతేషు కల్పయేత్ స్వస్తికాకృతి॥ 22

మధ్యే చ కూట శాలానాం పంజరే చాల్ప నాసికం।
కల్పయేత్తు విశేషేణ శిఖరే భద్రనాసికం॥ 23

శాలాగ్రే తు ప్రకర్తవ్యా లలాటాఖ్యా తు నాసికా।
నాసికా లక్షణం ప్రోక్తం తతః ప్రాసాదమానకమ్॥ 24

**ఇతి కాశ్యపశిల్పే నాసికాలక్షణం ద్వావింశః పటలః**

**తా॥** క్షుద్రనాసికయొక్క విధానమును చెప్పుచున్నాడు. విస్తారము 1దండముగాని, 1½ దండ ములు గాని, 3. దండములు గానిచేయవలెను ఆవిస్తారములో ¼వ వంతుగాని ⅓వవంతుగాని తగ్గించి మిగిలినది యెత్తు చేయవలయును కపోతముయొక్క ఆధారమునుండి క్షుద్రనాసికపు యెత్తును నిర్మించవలెను. ప్రతి వాజన ప్రదేశమువరకు దానియొక్క శక్తిధ్వజము యెత్తును చేయవలెను. ఆశక్తిధ్వజముయొక్క యెత్తును 3 భా. చేసి అందు 1 భా. కంఠమును చేయవలెను మిగిలిన 2 భాగములు కిన్నరీ ముఖములను చేయవలెను. ఈపనులు యుక్తితో చేయవలెను. నాసిక యొక్క విస్తారములో సగము గాఢమును చేయవలెను. అందులో సగము ముఖపట్టికను

చేయవలెను. నాసికను ఆ యా రూపములతో నలంకరించవలయును. కపోతముండినచోట స్తంభమును నలుచదరముగా చేయువలయును. మధ్యను, కూటకోష్ఠముల యందును, పంజరమునను, క్షుద్ర నాసికను రచించవలెను. శిఖరమున భద్రనాసికను నిర్మించవలెను. శాలయొక్క ముందుభాగమున ముఖ నాసికను సృజించవలెను. మూడు విధములగు నాసికలయొక్క లక్షణములను చెప్పియుంటిని. ఇక ప్రాసాదముయొక్క పరిమాణమును చెప్పెదను.

## 33. స్తూపికాలక్షణము

### శిల్పరత్నము ౩౦ వ అధ్యాయము

శ్లో॥ శిఖరే స్తూపికాస్థానే కార్యా మూర్ధేష్టకా తథా।
తత ఆచ్ఛాద్య శిఖరం ద్రవ్యైః కార్త స్వరాదిభిః 2

స్తూపి దండం సమాచ్ఛాద్య కలశం చైవ విన్యసేత్।
పద్మతారా త్సపాదం స్యాత్ స్తూపి కుంభ విశాలకం॥ 3

విస్తారేణ సపాదం వా సార్ధం వా స్తూపికోచ్ఛ్రయం।
పంకజం తోరణం స్రక్చ క్షేపణం పత్రక్షేపణం॥ 4

ధృక్చ కంపం చ పద్మం చ వేత్రత్రితయ కుడ్మలౌ।
ఏవం తస్యై వావయవం యథా శోభం సమాచరేత్॥ 5

చతురష్ట ద్విరష్టాశ్రం సధారం వర్తులం తు వా।
స్యాదాకృతిః సురోర్వీశ విప్రాణాం చ విశాం మతమ్॥ 6

తా॥ శిఖరమున స్తూపిక యుండవలసినచోట తలను ఇటుకలనుంచి శిఖరమును కప్పవలెను. బంగారముతోగాని, కనీసము యినుముతోగాని, స్తూపికీలమును చేయవలెను. దానిమీద కలశము నుంచవలెను. పద్మముయొక్క విస్తారమును 4 భాగములుచేసి అందు ఒకభాగమును కలిపి కలశము యొక్క విస్తారమును చేయువలెను. విస్తారమును నాల్గుభాగములుచేసి అందు 1 భాగమును కలిపిగాని లేక సగము కలిపిగాని కలశము యొక్క యెత్తును చేయువలెను పద్మము, తోరణము, పూలదండ, క్షేపణము, పత్రక్షేపణము, అంతరితము, కంపము, పద్మము, వేత్రములుమూడు, మొగ్గ ఇట్లు అన్ని అవయంగములతో స్తూపిని చేయవలెను. 4, 8, 16 కోణములుగాను లేక గుండ్రము గాను చేయవచ్చును.

## 34. స్తూపికీలలక్షణము

### మానసారము 18 వ అధ్యాయము

శ్లో॥ స్తూపి కీలాయతం తారం లక్షణం వక్ష్యతేఽధునా।
ఊర్ధ్వ భూమ్యా యథా పాదం తస్యా యామం సమం తు వా॥ 71

గలోచ్చా ధ్యర్ధం తుంగం వా స్తూపి కీలాయతం తథా।
తద్విష్కంభ సమం వ్యాసం స్తూపి కీలస్య మూలకే॥ 72

అథ వాంగులమానేన కీల మూల విశాలకం।
త్రి చతుర్వేం శాంగులం లోహే దారుకీలం తు (వా) పూర్వవత్॥ 73

కీలాయామం త్రి భాగైకం మూలే వేదాశ్ర మీరితం।
మధ్యే చాష్టాశ్ర సంయుక్తం చాగ్రే వృత్తాకృతి స్తథా॥ 74

ఏకాంగులాగ్ర విస్తారం మూలాగ్రాం తం క్షయం క్రమాత్।
అథవా శిఖరాకారం కీలం మధ్యాకృతి స్తథా॥ 75

స్తూపికీల విస్తృతిః త్రిగుణాస్యాత్। తద్బహిశ్చరణ దైర్ఘ్య ముచ్యతే।
కీలాధార విస్తృతార్ధ (ం) తద్ఘనం। కీలమూల మథ తత్ర యోజ్యతాం॥ 76

తామ్రజం చాయసం దారు (జం) లభేత కీలం ప్రకల్పయేత్।
ఖదిరం చందనం చైవ తింత్రిణీ సాల మేవచ॥ 77

ఉక్తవ ద్దారు సంగృహ్య స్థపతిః స్థాపకైః సహ।
తత్కాలే క్షపయే ద్విద్వాన్ స్తూపికీలస్య వక్త్రకం॥ 78

ఋజ్వంగం చ న భిన్నం చ తక్షణా త్తక్షకేన తు।
స్తూపికీల మిదం ప్రోక్తం తదూర్ధ్వేష్టక లక్షణం॥ 79

మానం ప్రాగుక్తవ త్కుర్యా త్తత్పుంస్త్రీచేష్టకాంవిదుః।
మూలాగ్రం చ సమతారం తు చేష్టకం పురుషం స్మృతం॥ 80

అనుపూర్వం కృశం తారం వనితా చేష్టకా తథా।
శిలాహర్మ్యే శిలాయుక్తం చేష్టకే చేష్టకా తథా॥ 81

పుంవిమానే చ పురుషం వనితాయాం వనితాం క్షిపేత్।
శిలా సంగ్రహకాలే తు క్షపయే త్పుంస్త్రియం తథా॥ 82

ఏషా మూర్ధ్నిష్టకా ప్రోక్తా ఉపాలక్షణ ముచ్యతే॥

**తా॥** స్తూపికీలముయొక్క లక్షణము చెప్పుచున్నాడు. పైఅంతస్తుయొక్క స్తంభము యెంత యుండవలయునో అంత యెత్తుగాని, గలముయొక్క యెత్తులో సగము కలుపుకొనిగాని, యెత్తును చేయవలెను. పై అంతస్తుయొక్క స్తంభ మెంత విస్తారముండునో స్తూపికయొక్క మొదలు అంత యుండవలెను. లేక స్తూపిక మొదలు 4౩ అంగులముల విశాలము కలిగియుండవలెను. మేకును

యినుముతోగాని, చంద్ర మొదలగు గట్టి కఱ్ఱతోగాని చేయవచ్చును. ఆ మేకుయొక్క పొడవును స్తూపికలో మూడవవంతు చేయవలెను. మొదలు 4 కోణములు మధ్య 8 కోణములు, చివర గుండ్రము. మొదలునుండి చివరకు క్రమముగా సన్నము చేసి చివర మాత్రము 1 అంగుళము లావుండునట్లు చేయవలెను. లేక శిఖరము యొక్క ఆకారమును మేకుయొక్క మధ్యను మొదలు కంటె 3 రెట్లు విస్తారముగా వెలుపలి స్తంభముయొక్క నిడివిని చేయవలెను. స్తూపియొక్క విస్తారములో సగము దాని లావును చేయవలెను. ఆ మేకుయొక్క మొదలును అచ్చట కలుపవలెను. రాగితోను. ఇనుముతోను, చంద్ర, చందనము, చింత, మద్ది మొదలగు గట్టి చేవగల కఱ్ఱతోను శాస్త్రోక్తముగా చేయవలెను. శిల్పాచార్యుడు సుముహూర్తమున స్తూపి కీలమును వంకరగాని, పగులుగాని, తొఱ్ఱగాని లేకుండ చక్కగా చేసి అచ్చట స్థాపించవలెను. దానిపైన యిటుకలను పురుష దేవాలయములకు పురుషేష్టకములను, స్త్రీ దేవతాలయములకు స్త్రీ యిష్టకములను ఉంచవలెను. మొదలు చివర సమానమైన కొలతగలవి పురుషేష్టకములు మొదలు యెక్కువ చివర తక్కువ కలవి స్త్రీ యిష్టకలని తెలియవలెను. ఇట్లు శిఖరమున యిటుకలను స్థాపించవలెను.

## 35. స్తూపికీల ప్రతిష్ఠా విధానము

### మానసారము 18 వ అధ్యాయము

శ్లో॥ స్తూపికీల ప్రతిష్ఠాం చ విధినా వక్ష్యతే ఽధునా।
ప్రాసాదాభి ముఖేవాఽపి చోత్తరే చైశకే ఽపివా॥ 169

యాగమండపం సంకల్ప్య చోక్తవ ల్లక్షణాన్వితం।
అంకురార్పణ మాదౌచ కారయే దధివాసనం॥ 170

మండపే స్థండిలం కృత్వా శాలిభిశ్చ స్థలంన్యసేత్।
పంచ వింశత్పదం న్యస్య శుద్ధతండుల రేఖయా॥ 171

దర్భైరాస్తీర్య తత్పశ్చాత్పాద ప్రక్షాళనం కురు।
తత శ్చాచమనం కుర్యా త్సకలీకరణం కురు॥ 172

పుణ్యాహం వాచ యిత్వా తు స్థపతి ర్బ్రాహ్మణైః సహ।
బ్రహ్మాది దేవతానాం చ గంధపుష్పాది ధూపకైః॥ 173

స్తూపికీలం సముద్ధృత్య స్థండిలోపరి విన్యసేత్।
కీలస్య పరితోదేశే నిక్షిపే చ్ఛతు రిష్టకాం॥ 174

తద్బహిః పరితః శుద్ధ తోయపూర్ణాన్ ఘటాన్ న్యసేత్।
ఈశస్యాంతః ప్రదేశేతు మూలకుంభం వినిక్షిపేత్॥ 175

ససూత్రాంగాన్ సవస్త్రాన్ చ సకూర్చాన్ రుద్రపల్లవాన్।
సవిధాన ఫలయుక్తాన్ పరితోష్ట ఘటాన్ న్యసేత్॥ 176

కీలస్య పూర్వదిగ్దేశే రత్నం హేమం చ నిక్షిపేత్॥
నవ వస్త్రేణ సకూర్చం చాచ్ఛాద్య రత్నపాత్రకం॥ 177

స్తూపికీలం చ సంఛాద్య నవవస్త్రేణ కూర్చకం।
ఆరాధ్య మూలకుంభే తు భువనాధిపతిం జపేత్॥ 178

తా॥ స్తూపియొక్క మేకును స్థాపించు విధానమును చెప్పుచున్నాడు. ప్రాసాదమున కెదురుగాగాని లేక ఉత్తరపుప్రక్కగాని లేక యీశాన్యమునగాని ప్రతిష్ఠా యజ్ఞమండపమును చేయవలెను. శాస్త్రమునందు చెప్పబడినరీతిగా యజ్ఞశాలను కల్పించవలెను. మొదట అంకురార్పణముచేసి అధివాసము చేయవలెను. మండపమున గోమయముతో అలికిన నేలయందు శాలిధాన్యము నుంచవలెను. 25 గదులు నలుచదరముగా యేర్పడునట్లు తెల్లని వరిబియ్యముతో రేఖలను గీయవలెను. దానిపై దర్భలనుంచి పాదప్రక్షాళనమును చేయవలెను. తరువాత ఆచమనముచేసి సకలమను పేరుగల వాస్తుమండలమున పుణ్యాహవాచనము స్వస్తి బ్రాహ్మణులతోసహా చేయవలయును. బ్రహ్మ మొదలగు దేవతలను గంధము, పుష్పము, ధూపము మొదలగు 16 విధములగు ఉపచారములతో పూజించవలెను. స్తూపి కీలమును తీసి అలికిన నేలపై నుంచవలెను. దానిచుట్టును నాలుగు ఇటుకల నుంచవలెను. ఆ యిటుకల వెలుపల చుట్టును శుద్ధోదకముతోగూడిన పూర్ణకుంభముల నుంచవలెను. ఈశాన్యమున ప్రధాన కుంభము నుంచవలెను. ఆ కుంభమునకు సూత్రమునుజుట్టి నూతన వస్త్రమును దర్భలును 1. విధములగు పల్లవములును, మారేడుపండును దానియందుంచవలెను. చుట్టును 8 ఘటముల నుంచవలెను. ఆ యెనిమిది ఘటములుకూడ ప్రధాన కలశముతో సమానముగా నలంకరించవలెను. స్తూపి కీలముయొక్క తూర్పువైపున రత్నములను సువర్ణమును ఉంచవలెను. క్రొత్తవస్త్రము దర్భలతోకూడ రత్నములు, సువర్ణము నుంచిన పాత్రమును కప్పవలెను. స్తూపి కీలమునుగూడ అదేవిధముగా నూతన వస్త్రముతో కప్పవలెను. ప్రధానకుంభమున లోకాధిపతియైన భగవంతుని ఆవాహనము చేసి షోడశోపచారములతో పూజించవలయును. శక్తికొలది జపమునుకూడ చేయవలయును.

శ్లో॥ గంధ పుష్పైః సమభ్యర్చ్య నైవేద్యాని నివేదయేత్।
ధూపదీపం దద్యాత్పశ్చా న్నృత్త గీతాది ఘోషణైః॥ 179

ఇంద్రాది చాష్టకుంభానా మష్టశక్తీః ప్రపూజయేత్।
ప్రణవాది నమోఽంతేన తత్తన్నామ్నా ప్రపూజయేత్॥ 180

స్తూపికీలం సమభ్యర్చ్య గంధ పుష్పైశ్చ ధూపకైః।
కుండే వా స్థండిలే వాఽపి హోమం కుర్యా త్తదగ్రకే॥ 181

సమిధాది చరులాజాన్ ప్రత్యేకం పంచవింశతిః।
హృల్లేఖ బీజముచ్చార్య ప్రణవాది నమోఽంతకం॥ 182

వ్యాహృత్యన్తే తతః శిల్పీ స్థండిలే ప్రాంతమాశ్రయేత్।
దద్యాద్దేవాలయే కీలం ధ్యాత్వా తత్పర రూపకం॥ 183

తత్తన్మంత్రం సముచ్చార్య చార్చయేత్ స్తూపికీలకం।
తత్తద్దేవాసనం ధ్యాత్వా చతుర్మూర్ధేష్టకాన్ సుధీః॥ 184

నవవస్త్రేణ గోప్త్వాంగ మిష్టకై రక్షరం లిఖేత్।
ప్రాగాదిషు కకారాదీన్ వర్ణాన్ శస్త్రేణ లేఖయేత్॥ 185

స్తూపికీల చతుర్దిక్షు సూత్రం ప్రాగాది వేష్టయేత్।
శ్రీవత్సాకార మగ్రే తు వస్త్రం ధృత్వా లిఖే ద్బుధః॥ 186

స్వస్తి వాచన ఘోషేణ జయశబ్దాది మంగలైః।
గైరికం వైమధుక్షీరం స్వర్ణతూలికయా లిఖేత్॥ 187

తా॥ లోకాధిపతియగు పరమేశ్వరుని గంధపుష్పాదులతో పూజించి ధూప దీపములతోను నృత్యగీతాది మంగళధ్వనులతోను నైవేద్యమును నివేదనముచేసి యింద్రుడు మొదలగు దిక్పాలురను అష్టశక్తులను అష్టకుంభములయందు పూజించవలెను. ఆ యా దేవతలను ఓంకారము మొదలుగాను నమః అంతముగాను ఆ యా దేవతల పేరులతో పూజించవలెను. స్తూపి మేకును పూజించి గంధము పుష్పము ధూపము మొదలగువానిచేతను కుండమునగాని లేక అలికిన నేలయందుగాని దాని ముందుప్రదేశమున హోమమును చేయవలెను. తరువాత శిల్పాచార్యుడు వేదపఠనముతో స్థండిలముయొద్దకు రావలెను. దేవాలయమునందు కీలమును ఆ దేవుని స్వరూపముగా ధ్యానించి ఆ యా మంత్రముల నుచ్చరించుచు స్తూపియొక్క మేకును పూజించవలెను. ఆ యా దేవతలయొక్క పీఠములను ధ్యానించి నాలుగు మూర్ధేష్టకలను నూతన వస్త్రముతో కప్పి స్తూపిని యిటుకలతో అక్షరములను లిఖించి తూర్పు మొదలగు నాలుగు దిశలయందు కకారము మొదలుగా అక్షరములను శస్త్రముతో లిఖించవలెను స్తూపి కీలముయొక్క నలుదిశలయందు తూర్పు మొదలుకొని ప్రదక్షిణక్రమముగా సూత్రమును చుట్టవలయును. దానిముందు శ్రీవత్సముయొక్క రూపమును, వస్త్రమును ధరించి లిఖించవలెను. స్వస్తివాచనము శుభవాద్యము మొదలగు వానితోగూడి బంగారము, తేనె, పాలు మొదలగువానితోనహా బంగారపు శలాకతో లిఖించవలయును.

శ్లో॥ విసృజ్యాచ్ఛాదనంతత్ర వత్సగోకన్యకైః సహ।
మధు సర్పిర్ధాన్యరాశిం దర్శయే చ్ఛిల్పవిత్తమః॥ 188

ఆరాధ్య గంధ పుష్పైశ్చ సర్వ మంగల ఘోషణైః।
నానావస్త్రేణ సంవేష్ట్య పుష్పమాల్యై రలంకృతం॥ 189

లంబకూర్చం సమభ్యర్చ్య గ్రామాదీనాం ప్రదక్షిణం।
స్థూపికీలం సమాదాయ చారురోహ విమానకం॥ 190

పాలికోపరి వప్రాంతే నాసికోపరి ప్రాంతేచ।
రత్నగర్తం తు సంకల్ప్య కీలం ప్రాగ్దర్శనం న్యసేత్॥ 191

నవరత్నైశ్చ లోహైశ్చ తత్తన్మంత్రేణ చార్చయేత్।
త్రిత్రికోష్ఠే తు తద్గర్తే మధ్యే స్వర్ణం వినిక్షిపేత్॥ 192

ఇంద్రే తామ్రం వినిక్షిప్య యామ్యే నిక్షిప్య చాయసం।
పశ్చిమే త్రపు విన్యాసం చోత్తరే రజతం క్షిపేత్॥ 193

మధ్యే తు పద్మరాగం తు వజ్రం చైవేంద్ర కోష్టకే।
విద్రుమం చాగ్నికోణే తు యామ్యే నీలం తు విన్యసేత్॥ 194

నైరృత్యే పుష్యరాగం తు ప్రత్యఙ్మరకతం క్షిపేత్।
వైడూర్యం చ న్యసే ద్వాయౌ సౌమ్యే గోమేధికం న్యసేత్॥ 195

మౌక్తికం నిక్షిపే దీశే తత్త ద్దేవాన్ స్వనామతః।
ప్రణవాది నమోఽంతేన చోచ్చరన్ రత్నం విన్యసేత్॥ 196

**తా॥** తరువాత ఆచ్ఛాదన వస్త్రమునుతీసి శిల్పాచార్యుడు దూడతోగూడిన యావును, కన్యలను, తేనె, నేయి, ధాన్యరాశి, పుష్పములు, ఫలములు మొదలగు మంగళ వస్తువులను చూపించవలెను. గంధ పుష్పాదులతో పూజించి సమస్తమైన మంగళవాద్యములతో అనేకవిధములైన నూతన నూతన వస్త్రములను చుట్టి పూలదండలతో నలంకరించి పొడవైన దర్భలతోను పూజించి గ్రామ ప్రదక్షిణముచేసి స్థూపి కీలమునుతీసి దేవాలయముయొక్క శిఖరముననుపాలిక పైభాగమున నున్న వప్రముపైనను, నాసికపైభాగమును, గుంటలనుచేసి యందు రత్నములను సువర్ణము మొదలగు లోహములను ఉంచి కీలమును తూర్పుముఖముగ నుంచవలెను. నవరత్నములను లోహములను ఆ యా మంత్రములచేత పూజించి ఆ రంధ్రముయొక్క అడుగుభాగమును 9 గదులుగా చేసి, వానిమధ్యస్థానమున బంగారమును, తూర్పున రాగిని, దక్షిణమున యినుమును, పడమర తగరమును, ఉత్తరమున వెండిని ఉంచి మరల మధ్య పద్మరాగమును, తూర్పున వజ్రమును, ఆగ్నేయమున పగడమును, దక్షిణమున నీలమును, నైరృతిన పుష్యరాగమును, పడమర మరకతమును, వాయవ్యమున వైడూర్యమును, ఉత్తరమున గోమేధికమును, ఈశాన్యమున ముత్యమును ఉంచవలెను. ఒక్కొక్క రత్నము నుంచునపుడు ఆదేవుని నామమును ఓంకారము మొదలుగాను నమః అనునది చివరగాను అగునట్లు పఠించుచు రత్నములను గుంటలయందుంచవలెను.

శ్లో॥ స్థపతి ర్వరవేషాఢ్యః ప్రాప్తపంచాంగ భూషణః।
సుముహూర్తే సులగ్నే చ జయ శబ్దాది మంగళైః॥ 197

బ్రాహ్మణైశ్చ యథాశక్తి వాచయేత్ స్వస్తివాచనం।
స్తూపికీలం సముద్ధృత్య స్థపతిః స్థాపకైః సహ॥ 198

ఏతద్గర్భోపరి స్థాప్య మూలమంత్రం సముచ్చరన్।
స్తూపికీలస్య పరితః స్థాపయే చ్చతు రిష్టకాన్॥ 199

పూర్వాదౌ చ శకారాదీ నీశాన్యాంతం క్రమా న్న్యసేత్।
ప్రాజ్ మూల కుంభ ముద్ధృత్య చాలయన్ తు ప్రదక్షిణం॥ 200

స్థపతిః స్తూపిమూర్ధాగ్రే తజ్జలే నాభిషే చ యేత్।
ఇంద్రాది కుంభతో యేన పూజయే చ్చతురిష్టకాన్॥ 201

శుద్ధతోయేన సంపూర్య గంధ పుష్పైః సమర్చయేత్।
పూర్వవ త్సమలంకృత్య నైవేద్యాదీన్ నివేదయేత్॥ 202

షోడశం తూపచారాంశ్చ కుర్యా ద్గంధాక్షతైః సహ।
స్తూపిహర్మ్యే మూర్ధ నస్తు హం సపాదః స్థితోభవేత్॥ 203

సమస్తే కర్తృ రాజ్యాది గ్రామం రక్ష తు సర్వదా।
సుధా గులోదకైశ్చాపి చేష్టకై ర్వసుభిస్తతః॥ 204

స్తూపి కీలం దృఢీకృత్య పశ్చాత్ ప్రాగుక్త వత్కురు॥ 205

బ్రహ్మ విష్ణు మహేశ్వరాది నిలయే స్తూపి ప్రతిష్ఠాం కురు।
కుర్వన్ త ద్యజమాన భూపనిలయే భుక్తిశ్చ ముక్తిర్లభేత్।
యస్మాద క్రియమాణ కర్తృ నృపయో ర్నార్యాశ్చ పీడా భవేత్।
తస్మా త్సర్వ సుఖప్రదం నృపగృహే కుర్యాచ్చ దేవాలయే॥ 206

విప్రవాహన యుతం చ సద్గురుం । శిల్పికాది గజ వాహనం తథా।
నృత్తగీత సహ సర్వ ఘోషణైః । సేవితాని స్వగృహం ప్రవేశయేత్॥ 207

ఇతి మానసారే వాస్తుశాస్త్రే విమానం విధానం నామ అష్టాదశోఽధ్యాయః

తా॥ శిల్పాచార్యుడు శ్రేష్ఠమైన వస్త్ర భూషణాద్యలంకారములను చేసికొని తిథి వార నక్షత్రములు మొదలైనవానిని చూచి శుభగ్రహములతో గూడిన లగ్నమున పుష్కరకాలమున మంగళవాద్యఘోషములతోను, వేదమంత్రములతోను, బ్రాహ్మణులచేత శక్తికొలది స్వస్తివాచ

కములను చెప్పించి స్తూపి కీలమును లేవదీసి శిల్పాచార్యుడు యజమానునితోసహా ఆ గర్తమును నుంచి మూలమంత్రమును జపించుచు స్తూపీ కీలముయొక్క చుట్టును నాలుగు యిటుకలను స్థాపించవలెను. తూర్పు మొదలుగా ఈశాన్యము వరకు వరుసగా శకారము మొదలగు బీజముల నుంచవలెను. ముందు ప్రధానకుంభమును పైకిదీసి చుట్టునున్న అన్ని కుంభములను కదలించుచు శిల్పాచార్యుడా స్తూపియొక్క శిరోగ్రమున ఆ ప్రధాన కుంభమునందలి జలముతో నభిషేకము చేయవలెను. వరుసగా ఇంద్రాదులను పూజించిన కుంభములయందలి జలముతోగూడ నభిషేకము చేయవలెను. తరువాత నాలుగు యిటుకలను పూజించవలెను. శుద్ధోదకముతో నింపించి గంధ పుష్పాదులతో చక్కగా నలంకరించి పూజించి నైవేద్యమును సమర్పించవలెను. గంధ పుష్పాది షోడశోపచారములను చేసిన పిమ్మట స్తూపిని హంసపాదమువలె నుంచవలెను పిమ్మట స్తూపి కీలమును దైవస్వరూపముగా భావించి నమస్కరించవలెను కర్తను, గ్రామమును దేశమును ఎల్లప్పుడు కాపాడవలయు నని ప్రార్థనము చేయవలెను. స్తూపి కీలమును ఒరుగులేకుండా నిలిపి బంగారము రత్నములు మొదలయిన వానితోగూడ దానిని సున్నముతోను, బెల్లపు నీళ్ళతోను గట్టిగా బిగించవలెను. బ్రహ్మ, విష్ణువు, ఈశ్వరుడు మొదలగు సమస్త దేవతలయొక్క ఆలయముల శిఖరములయందు స్తూపి ప్రతిష్ఠను తప్పక చేయవలయును. ఆప్రకారముగ చేసిరేని వారి యింటియందు సంపూర్ణముగా ఐశ్వర్యమును, వారికి మోక్షమును లభించును. ఎవరైన శాస్త్రోక్తముగా స్తూపి ప్రతిష్ఠను చేయనియెడల ఆకర్తయును, ఆరాజు, ఆగ్రామము పీడలను అనుభవించుటయే కాక స్త్రీలకుగూడ పీడ కలుగును. కనుక దేవాలయమున శాస్త్రవిధానముగ చేసిరేని సమస్త సంపదలును సుఖమును కలుగును." ఆచార్యుని బ్రహ్మరథముతోను (అనగా బ్రాహ్మణులు మోయునది) శిల్పాచార్యుడు తన శిష్యవర్గము మొదలగు వారిని యేనుగులమీదను యెక్కించి, నృత్యగీతాది శుభవాద్యములతో వారి గృహములకు బంపవలయును.

## 36. లుపాలక్షణము

### మానసారము 18 వ అధ్యాయము

శ్లో॥ స్తూపితుంగద్వయం వాఽథ విమానవశా దుదయం॥ 83

ఏతత్తు శిఖరోత్తుంగం తదర్ధం గలతుంగకం।
లుపారూపం శిఖరం స్యాత్ గ్రీవాంతం తల్పవాసనం॥ 84

ఉత్తరాది మృణాలాంతం ప్రస్తరస్యోక్తవద్గలం।
తదూర్ధ్వే దండకం కుర్యా ల్లుపమాన మిహోచ్యతే॥ 85

దేవానాం మానుషాణాం చ లుపమానం యథాక్రమం।
అంబరం చ వియ జ్జ్యోతి ర్గగనం చ విహాయసః॥ 86

అనంతం చాంతరిక్షం చ పుష్కరం చాష్టధా లుపాః
దేవానాం హర్మ్యకే కుర్యా దుక్తమేవం పురాతనైః॥ 87

మహీ జ్యా కాశ్యపీ క్షోణీ చోర్వీ గోత్రా వసుంధరా।
వసుధా చాష్టధా ప్రోక్తా కారయే న్మానుషాలయే॥ 88

సర్వేషాం దేవతాయోగ్యం నరాణాం చోక్తయోగ్యకం।
సురాణా ముక్తమానం య న్మర్త్యై స్త న్నేష్టం యత్నతః॥ 89

శిఖరోదయ తత్తుల్యం విస్తారోన్నత మంబరం।
అష్టాంశం చైకహీనం తు పస్తారోన్నతం వియత్॥ 90

స ప్తభా గైకహీనం తు వి స్తృతం జ్యోతిర్మానతః।
షడ్భా గైకహీనం తు విస్తారం గగనం స్మృతం॥ 91

పంచభా గైకహీనం తు విస్తారం త ద్విహాయసి।
చతుర్భా గైకహీనం తు చానంతే త ద్విశాలకం॥ 92

ఉత్తుంగం తు త్రిభాగైక హీనం తార మంతరిక్షకం।
తుంగే ద్వ్యం శైకహీనం స్యా ద్వ్యాసం పుష్కర మీరితమ్॥ 93

**తా॥** ఉపయొక్క కొలతలను చెప్పుచున్నాడు. స్తూపి తుంగమునకు రెట్టింపుగాని, విమానము ననుసరించిగాని పొడవును చేయవలెను. ఇది శిఖరముయొక్క యెత్తు. అందులో సగము గలము యెత్తు. ఉప యొక్క రూపము శిఖరము అగును. గలమువఱకు దానియెత్తు. ఉత్తరము మొదలు మృణాళము వఱకు ప్రస్తరమునకు చెప్పబడినట్లుగా గలముండవలెను. దానిపైన దండమును చేయవలెను. ఉపయొక్క పరిమాణమును చెప్పుచున్నాను. దేవతలకును మానవులకును ఉపలు యెట్లుండవలెనో వరుసగా చెప్పుచున్నాను. అనంతము, అంబరము, వియత్తు, జ్యోతి, గగనము, విహాయసము, అంతరిక్షము, పుష్కరము ఈ 8 దేవతాహార్మ్యములకును, మహి, జ్యా, కాశ్యపి, క్షోణి, ఉర్వి, గోత్ర, వసుంధర, వసుధ ఈ 8 మానవ గృహములకును చేయవలెను. లేదా అన్నివిధములైన ఉపలు దేవాలయమునకు పనికివచ్చును. మానవ హార్మ్యములకు మాత్రము పై జెప్పిన 8 మాత్రమే పనికివచ్చును. శిఖరము యెత్తుతో సమానముగా విస్తారమును యెత్తుకలది అంబరము. శిఖరమును 8 భాగములుచేసి అందు 1 భాగము తక్కువగా విస్తారమును యెత్తును కలది వియత్తు. శిఖరమును 7 భాగములుచేసి అందు 1 భాగము తక్కువగా విస్తారమును యెత్తును కలది జ్యోతి. శిఖరమును 6 భాగములుచేసి అందు 1 భాగము తక్కువగా విస్తారమును యెత్తును కలదిగగనము శిఖరమును 5 భాగములు చేసి అందు 1 భాగము తగ్గించి విస్తారమును యెత్తును చేసిన యెడల విహాయసము. శిఖరమును 4 భాగములుచేసి అందు 1 భాగమును తగ్గించి విస్తారమును యెత్తును చేసినయెడల అనంతము. శిఖరమును 3 భాగములుచేసి అందు 1 భాగమును తగ్గించి విస్తారమును యెత్తును చేసినయెడల అంతరిక్షము. శిఖరమును 2 భాగములుచేసి అందు 1 భాగమును తగ్గించి విస్తారమును యెత్తును చేసినయెడల పుష్కరము.

శ్లో॥ తుంగద్వయాంతం య త్కర్ణం మానం హస్తాయతం తథా।
అథవా శిఖరోత్తుంగ మష్టభాగే విభాజితే॥ 94

ఏకాం శాధికవిస్తార ముక్త మేత న్మహీబుధైః
తుంగే సప్తాంశే చాష్టభా గాఢ్యం జ్యా చేతి సంస్మృతం॥ 95

తుంగే షడ్భాగవిస్తారే సప్తాంశం కాశ్యపి తథా।
తుంగే పంచాంశే షడ్భాగం వ్యాసం క్షోణి రితి స్మృతం॥ 96

తుంగే వేదాంశకే వ్యాసే పంచాంశం చోర్వి కథ్యతే।
తుంగే గుణాంశే వేదాంశం విస్తారం గోత్ర మీరితం॥ 97

తుంగే ద్వ్యంశే చవిస్తారే త్ర్యంశ మేవ వసుంధరా।
తుంగే చైకాంశకే వ్యాసే ద్విభాగం వసుధా భవేత్॥ 98

పూర్వవ త్కర్ణమానం చ హస్తదీర్ఘ ముదీరితం।
శిఖరే చావృతే పారే సభా మంటప గోపురే॥ 99

శాలాయాం నాసికా భద్రే కూటనీవై స్తు తోరణే।
కపోతే పంజరే చైవ ముష్టిబంధాదౌ సర్వశః॥ 100

హస్తిహస్తాది మానానాం మానయే చ్ఛిల్పవి త్తమః।
ఏతత్తు మధ్యదేశే తు తస్మా త్కర్ణావసానకం॥ 101

క్రమా త్సోపానవ త్కుర్యా త్తన్మానం వక్ష్యతేఽధునా।
మధ్యకర్ణద్వయో ర్మధ్యే వికల్పం కల్పయే త్సుధీః॥ 102

తా॥ శిఖరముయొక్క యెత్తునకు రెట్టింపుగల కర్ణ మానము కలచోట అదేమాదిరిగా 1 హస్తము యెత్తుగాని, లేక శిఖరము యెత్తును 8 భాగములుచేసి, అందు 1 భాగమును కలిపి విస్తారమును చేసినట్లయిన మహి యగును. లేక శిఖరోన్నతమును 7 భాగములుచేసి అందు 1 భాగమును కలిపి విస్తారమును చేసినేని జ్యా యగును. శిఖరము యెత్తును 6 భాగములుచేసి అందు 1 భాగమును కలిపి విస్తారమును చేసినచో కాశ్యపి యగును. శిఖరము యెత్తును 5 భాగములుచేసి 1 భాగమును కలిపి విస్తారమునుచేసినచో క్షోణి యగును. శిఖరోన్నతమును 4 భాగములుచేసి అందు 1 భాగమును కలిపి విస్తారమును చేసినచో ఉర్వి యగును. శిఖరము యెత్తును 3 భాగములుచేసి అందు 1 భాగమును కలిపి విస్తారమునుచేసినయెడల గోత్ర యగును. శిఖరము యెత్తును 2 భాగములుచేసి అందు 1 భాగమును కలిపి విస్తారమును చేసినయెడల వసుంధర యగును. శిఖరముయెత్తును 1 భాగముచేసి అందు భాగమును కలిపి విస్తారమును చేసిరేని వసుధ యగును. మునుపటివలెనే కర్ణమానముచేత 1 హస్తముయెత్తును చేసి శిఖరమును చుట్టును వెలుపలివరిస, సభామండప గోపు

రమున, శాలయందు, నాసికాభద్రమున, కూటనిర్గమములయందు, తోరణమున, కపోతమున, పంజరమున, ముష్టిబంధము మొదలైన అన్నిటియందున ఉపలతోడను మొదలైన పరిమాణములలో శిల్పాచార్యుడు చేయవలెను. ఇవి మధ్యప్రదేశమునందు అష్టమనుండి కర్ణముయొక్క అంతము వరకును క్రమముగా మెట్లవలె చేయవలయును. ఆ లెక్కలను చెప్పుచున్నాను — మధ్యనున్న రెండు కర్ణములమధ్య వికల్పమును చేయవలెను

శ్లో॥ ఏక ద్వి త్రి చతు ష్పంచ ష ట్స ప్తాష్టక త్రిత్రికం।
దశ మేకాదశం చైవ ద్వాదశం చ లుపాన్వితం॥ 103

కేచి త్త్వేకేన వృద్ధ్యాతు ఏకాత్ పంచలుపాంతకం।
య త్సోపానక్రమం కుర్యా దేత చ్ఛందలుపాదికం॥ 104

దేవానాం చక్రవర్తినాం వికల్పం యోగ్యం సాపరం।
తస్మా ద్విద్వాన్ లుపయైవ హీనం వై శూద్రతః క్రమాత్॥ 105

ముఖ్యం హర్మ్యాదికం కుర్యాత్ క్షుద్రహర్మ్యే విశేషతః।
ఏకాదశ వికల్పాంతం భూసురాణాం తు యోగ్యకం॥ 106

నవాంతం భూపతీనాంచ ఏకా ద్వికల్ప మీరితం।
ఏకా ద్యష్టవికల్పాంతం యువరాజస్య యోగ్యకం॥ 107

ఏకా త్సప్తవికల్పాంతం వైశ్యానాం చ ప్రకీర్తితం।
ఏకా త్పంచవికల్పాంతం శూద్రాణాం యోగ్యకం తథా॥ 108

అథవా చాన్యజాతీనాం వికల్పత్రయ ముక్తవత్।
ఏవ ముక్తం లుపాశ్రేణీం కుర్యాత్తు శిల్పవిత్తమః॥ 109

తా॥ మరియు 1, , 3, 4, 5, 6, 7, 8, 9, 10, 11, 12 లుపలతోను. కొందరు ఒక్కొక్కటి పెంచుచు 5 లుపల వరకు మెట్లవరుసవలె చేయుదురు. ఇది అంతస్తు లుప యగును. దేవతలకును చక్రవర్తి మొదలగువారికిని వికల్పముపైది యోగ్యము (అన్నిటిలో చివరది) కనుక ఒక్కొక్క లుప తగ్గించుచు శూద్రజాతి వరకు క్రమముగా చేయువలెను ఇట్లు ముఖ్యమైన హర్మ్యములను రచించవలెను. క్షుద్రహర్మ్యములుకూడ వాని ననుసరించి చేయవచ్చును. 11 వికల్పముల వరకు బ్రాహ్మణులకును, 9 వికల్పములవరకు రాజులకును, 8 వికల్పములవరకు యువరాజులకును 7 వికల్పముల వరకు వైశ్యులకును, 5 వికల్పముల వరకు శూద్రులకును, ఇతర జాతులకు 3 వికల్పముల వరకును చేయవచ్చును. లుపలయొక్క వరుసలను యిట్లు చేయవలయును. ఇట్లు శిల్పాచార్యుడు బాగుగా తెలిసికొని చేయవలెను.

శ్లో॥ మధ్యే లుపాయతం మానం కర్ణవిస్తార మిష్యతే।
మధ్యాది చాన్యథా సర్వం వికల్పం త ద్విభాజితం॥ 110

తత్తత్కర్ణస్య మానేన విశాలం స్యాత్తు పూర్వవత్।
తత్తత్కర్ణస్యమానేన లుపాదైర్ఘ్య ముదీరితం॥ 111

తత్సమం వా సపాదం వా సార్ధ మంశక మేవ వా।
దీర్ఘత్వ మాలంబనం లంబ్య విస్తారస్య చ నిర్గమం॥ 112

తస్యమానం యథాభాగం యుక్త్యా తత్రైవ యోజయేత్।
త్రి చతు ష్పంచ షణ్మాత్రం లుపామూల విశాలకం॥ 113

సమం వాఽథ త్రిపాదం వా చార్ధం వా లంబనాంతరం।
ఏక ద్వి త్ర్యంగులం వాఽపి ఘనం సర్వాంగసంయుతం॥ 114

అన్య త్సర్వాంగవిస్తారం యథాయుక్తి వశా న్న్యసేత్।
ఏక ద్వి త్ర్యవసానాంతం స్తంభస్యోపరి విన్యసేత్॥ 115

లుపాయా శ్చోక్తవిస్తారం తత్త ద్వంశాంఘ్రికాంతకం।
అధఃపాదస్య లుపాద్యై స్తత్రదోషో న విద్యతే॥ 116

కర్ణా త్కర్ణావసానం స్యా న్నవసూత్రం ప్రసారయేత్।
స్యాత్తత్సూత్రా దధోదేశే కుక్షిం జ్ఞాత్వా పురోర్ధ్వకే॥ 117

లుపాకుక్షిప్రదేశే తు చతుఃసూత్రావసానకం।
అర్ధచంద్రవ దాకారం యుక్త్యా చంద్రం యథేష్టకం॥ 118

మూలాది వాజనాంతం స్యా చ్ఛిద్రమేకం ద్వయం తు వా।
చంద్రాంతే క్షేపణం యుక్తం ఛిద్రంసూత్రా దధో న్యసేత్॥ 119

తచ్ఛిద్రే వేత్రయుక్తం లు పాధారాచ్ఛిల్పవి త్తమః
శ్రేణ్యాం మధ్యలుపాః సర్వా లుపాసంఖ్యా యథేష్టకా॥ 120

తా॥ మధ్య లుప యొక్క పొడవు విస్తారము, కర్ణవిస్తారమును చెప్పుచున్నాడు. మధ్యనుండి వికల్పమురొయొక్క భాగములు చేయవలెను. కర్ణముయొక్క పరిమితితో విశాలమును చేయవలెను. ఆ కర్ణ మానముతోనే లుపయొక్క యెత్తునుగూడ చేయవలెను. దానితో సమానముగాని లేక ఒక పాతిక ఎక్కువగాని లేక సగము యెక్కువగాని పొడవును చేయవలెను. విస్తారము యొక్క నిర్గమమును కర్ణము ననుసరించి చేయవలెను. దానియొక్క కొలతను యుక్తితో చేయవలెను. 3-4-5-6 అంగులములు లుపయొక్క మొదలు విస్తారమును సమానముగాని, ముప్పాతికవంతు

గాని, సగమువంతుగాని, ఆధారమువరకు కల్పించవలెను. 1-2-3 అంగులముల లావు అంతట నుండవలెను. మరియు ఇతరరూపములయొక్క విస్తారము యుక్తితో యెంత అవసరమో అంద చేయవచ్చును. 1-2-3 అంగులముల వరకు స్తంభముపైన నుంచవచ్చును. లుపలకు పూర్వము చెప్పబడిన రీతిగా విస్తారము ఆ యా వరుస స్తంభముల అంతము వరకు కల్పించవలెను. దిగువ స్తంభమునకు లుప మొదలైనవానిచేత దోషములేదు. ఒక కర్ణము వరకు క్రొత్త సూత్రమును వేయవలెను. ఆ సూత్రమునుండి దిగువ ప్రదేశమును గర్భముగా భావించి దానిముందు పై భాగ మున లుపయొక్క పొట్టయందు నాలుగు సూత్రములవరకు అర్ధచంద్రునివంటి యాకారమును యుక్తితో చేయవలెను. మొదలునుండి వాజనముయొక్క కడవరకు ఒక్కటిగాని, రెండుగాని బెజ్జములనుంచి అర్ధచంద్రాకారముపైన క్షేపణమును బెజ్జము సూత్రమునకు దిగువ నుండవలెను. లుపయొక్క ఆధారమునుండి ఆ బెజ్జమున వేత్రము నుంచవలెను. వరుసయందు మధ్య లుపలు యిష్టమువచ్చినట్లు కల్పించవచ్చును.

శ్లో॥ కరవీర బహువర్ణ సంపుటాభం వికల్పయేత్।
ఏకకుడ్మలయోగేన కర్ణయోశ్చ లుపాన్వితం॥ 121

అగ్రం వికాసితాభం స్యాన్మూలం చ నిభృతాన్వితం।
కర్ణే చైకలుపా పార్శ్వే లుపాబహులం యోజయేత్॥ 122

హ్రస్వదీర్ఘాయతం సర్వం నాలికేరదలాకృతి।
బహుబాహులుపా కర్ణేషు బహుకుడ్మలం యోజయేత్॥ 123

ఏవం చ లక్షణం ప్రోక్తం కటకాకారం తు యోజయేత్।
దండికోర్ధ్వే వాజనం స్యాల్లుపాంత స్యోపరి న్యసేత్॥ 124

క్షేపణం చ ఝషాకారం వామవామం తు యోజయేత్।
ఏతత్తు మామకం వృత్తం దేవానాం హర్మ్యకే న్యసేత్॥ 125

వృత్తం వాఽథ షడశ్రం వా చాష్టాశ్రం వా తదాయతం।
కుర్యాత్తత్ర లుపామానం పూర్వవత్పరికల్పయేత్॥ 126

అహమేతం చైకపంచాంశం లుపావర్ణం యథాక్రమం।
తస్మాత్ ద్విసంఖ్యాయోగేన సత్రిచత్వారి కాంతకం॥ 127

దేవానాం మానుషాణాం చ శూద్రజాత్యవసానకం।
మధ్యకర్ణలుపా న్యేతత్సర్వం సోపానవత్కురు॥ 128

తా॥ వికల్పమును వెదురుకొమ్మవలెను, ఊసరవెల్లి ముడుతలవలెను చేయవలెను, ఒక్క మొగ్గతోనున్నప్పుడు రెండుపైపుల కర్ణములయందు లుపలును, చివర వికసించిన యాకారమును

మొదలు కృశించిన రూపమును కర్ణమున ఒక్క లుప కొయొక్క ప్రక్కలను అనేక లుపలనుకూడ చేయవచ్చును, కుచుచలు పౌడవ్రులు అన్నియును కలసి కొన్నరి మల్లెవలె నుండవలెను. అనేక భుజములు లుపలుగల కర్ణములయందు మొగ్గలనుకూడ [illegible] రించి చేయవలెను. కడియమువలె గుండ్రముగా నుండవలెను. దండిక యొక్క పై భాగమున వాజనమును లుపయొక్క చివరను పై భాగమున నుంచవలెను. క్షేపణమును చేపరూపములో చక్కగాను ఉంచగాను చేయవలెను ఇది వామ వామమున నుండవలెను, దేవాలయమున నుంచవలెను గుండ్రముగాని, 6 కోణములుగాని, 8 కోణములుగానిఆ ప్రకారము పొడవును చేయవలెను. ఆయా లుపలయొక్క పరిమితి మునుపు చెప్పినట్లు చేయవలెను. ఒక్కటి మొదలు ఐదుభాగములు లుపయొక్క భేదములును, ఒక్కటి మొదలు రెండేసి కూడికతోను 3.. వరకు కలుపును దేవతలకును మానవులకును అందు బ్రాహ్మణాది శూద్ర జాత్యంతమువరకును, మధ్య తర్ణముయొక్క లుపలు అన్నియును మెట్లవలె చేయవలెను.

శ్లో॥ శంఖతుండవ దాకారం శంఖావర్త వికల్పకం।
ప్రాగుక్త దక్షిణావర్తం కుర్యాత్తు బహువాజనం॥ 129

శంఖావర్త మిదం ప్రోక్తం దేవహర్మ్యే తు యోజయేత్।
సర్వాసాం చ లుపానాం చ ఋజువక్త్రం తు వా పునః॥ 130

బహుచిత్రం బహుచ్ఛిద్రం బహునేత్రం యథాబలం।
యథా శోభం తథా కుర్యా చ్ఛేషం యుక్త్యా ప్రయోజయేత్॥ 131

ఏవముక్తం లుపాచోర్ధ్వం శిఖరే చాంబరే ఽపి వా।
ఫలకా క్షేపణం వాఽపి కీలయే ల్లోహతామ్రకైః॥ 132

హేమజేన కరోటీం వా మృత్కరోటీం విధానయేత్।
గుడోదక సుధా యుక్తం యుక్త్యా చ లేపయే త్సుధీః॥ 133

అంతర్వాఽపి బహిర్వాఽపి చోర్ధ్వే చ ప్రతిసంయుతం।
ప్రస్తర స్యోక్తవ త్కుర్యా చ్ఛోపపీఠ స్యేతి తథా॥ 134

కుర్యాత్తు లుపామూలం తత్తద్బలార్థం శోభితం।
ఉక్తా దనుక్తమానం చే ద్విపత్యహిత్య మావహేత్॥ 135

తస్మాత్తు చోక్తవ త్సర్వం కుర్యాత్తు సంపదాస్పదం।
కంపవృత్తం లుపామూలే శోభార్థం తు బలార్థకమ్॥ 136

తా॥ శంఖముయొక్క ముఖమువలెను శంఖముయొక్క సుడిపలెను, దక్షిణావర్తముగా వికల్పమును అనేక వాజనములతో చేయవలెను. దీనిని శంఖావర్త మందురు. ఇది దేవాలయము

లకు ముఖ్యము. అన్ని లుపలకును మూల కోణములు తిన్నగా నుండవలెను. మరియు అనేక చిత్రములతోను అనేక రంధ్రములతోను అనేక నీరు పోవు ద్వారములు బలముగా నుండునట్లును అందముగా నుండునట్లును చేయవలెను. మిగిలిన పనుల యుక్తితో చేయవలెను. లుపలయొక్క పైనను, శిఖరమునను స్తూపిక యందును ఫలకము నుంచుటయును రాగితోగాని ఇనుముతోగాని మేకును నాటుటయును చేయవలెను. సువర్ణము మొదలగు లోహములతోగాని, లేక మట్టితోగాని దిమ్మెను చేయవలెను. సున్నము బెల్లపునీళ్ళు కలిపి పైన చక్కగా పూయవలెను. ప్రస్తరమునకు చెప్పినట్లు ఉపపీఠమునకు గూడ చేయవలెను. లుపయొక్క మొదలు బలముగా నుండునట్లును అందముగా నుండునట్లును శాస్త్రమున చెప్పినట్లు చేయవలెను. శాస్త్రమునకు విరుద్ధముగా చేసినట్లయిన ఆపదలు కలహాములు కల్గును. కనుక అన్నియును శాస్త్రము ననుసరించి చేసినచో సంపదలు సుఖము కలుగును. లుపయొక్క మొదలున బలమునకును అందమునకును కంపవృత్తమును చేయవలెను.

## 37. ముఖభద్రలక్షణము

### మానసార 18 వ అధ్యాయము

శ్లో॥ సర్వేషాం ముఖభద్రం స్యాల్లక్షణం వక్ష్యతే ఒధునా।
శిఖరాలంబనం చాదౌ త త్పాలికావసానకం॥ 137

అథవా ప్రస్తరోర్ధ్వాదా చోత్తరావనీతం తథా।
మఖభద్రోదయ మేవం చోక్తవ ద్విస్తృతం భవేత్॥ 138

సప్తదశాంశకంతుంగే ద్విభాగం ప్రస్తరోదయం।
ఏకాంశం వేదికోత్తుంగం గలతుంగం గుణాంశకం॥ 139

తద్ద్వయం తలతుంగం స్యా త్తస్మా దూర్ధ్వే శిఖాంతకం।
వేదాంశం తచ్ఛిఖాంశేన గల వక్త్రం గుణాంశకం॥ 140

శేషం తు మౌలికాంతం చ పంచదశాంశ మేవచ।
ప్రస్తరస్యకుర్యా దంత చ్ఛేషం ప్రాగుక్తవ న్నయేత్॥ 141

నాసికాలంబనం చైకం లంబనం తద్ద్వయం తు వా।
పంచాంశ ద్వ్యంశ తారం స్యాత్తదర్ధం కుక్షివిస్తృతం॥ 142

కుక్ష్యంతైః పద్మసంయుక్తం వాతాయన మథాపివా।
గవాక్షకారపత్రం వా పట్టికాస్పద పత్రయుక్॥ 143

అథవా చిత్రసంయుక్తం సర్వాలంకార సంయుతం।
నాసికావృతబాహ్యే తు గవాక్షకారం తు పత్రకమ్॥ 144

తా॥ అన్నివిధములైన ముఖ భద్రములయొక్క లక్షణములను చెప్పుచున్నాడు. శిఖరముయొక్క ఆధారము మొదలుకొని పాలికవరకుగాని, లేక ప్రస్తరము యొక్క పైభాగము మొదలుకొని ఉత్తరము వరకుగాని, ముఖభద్రముయొక్క యెత్తును చేయవలెను. దాని విస్తారమును శాస్త్రమున చెప్పబడినట్లు చేయవలెను. ఎత్తును 17 భాగములుచేసి అందు ప్రస్తరము 2 భా, వేదిక భా, గలము 3 భా, తలము 6 భా, తలమునుండి శిఖరమువరకు 4 భా ఆశిఖయొక్క భాగము ననుసరించి గలము 1 భా, మిగిలినది స్తూపిక వరకు 15 భాగములు, ప్రస్తరమునకు చేయవలెను. లోపల మిగిలినది పూర్వము చెప్పియుండినట్లు చేయవలెను. నాసికయొక్క ఆధారము 1 భా, లంబము 2 భా, దానిని 5 భాగములుచేసి అందు 3 భాగములు విస్తారమును అందులో సగము పొట్టయొక్క మధ్య పద్మమును కిటికీగాని, కిటికీయొక్క ఆకారముగల పత్రముగాని చేయవలెను. పట్టికయొక్క స్థానమున పత్రములతో అలంకారము చేయవలెను. లేక యేమైనను చిత్రములనుగూడ చేయవచ్చును. అన్ని అలంకారములతో నాసికచుట్టును వెలుపల గవాక్షములవంటి ఆకారములుగల భద్రములను రచించవలయును.

శ్లో॥ తస్మా దంతర్గతై శ్చాది దేవభూతాది రూపకైః।
వ్యాల సింహాది హంసాద్యై ర్ద్రుమవల్ల్యాది భూషితం॥ 145

తదూర్ధ్వే కీర్తివక్త్రం తు నిర్గమాకృతి భావయేత్।
తన్నీడ లంబన పార్శ్వే తద్వక్షఃస్థల పార్శ్వయోః॥ 146

విద్యాధరాది సంయుక్తం గ్రాహచిత్రై ర్విభూషితం।
దీర్ఘనేత్రం విశాలం స్యా ద్వృత్తం గండస్థలం తథా॥ 147

గజశ్రోత్రాకృతి శ్రోత్రం గండం చాంతే తరంగవత్।
ఆస్యాగ్రే తద్ద్విదంతం స్యా ద్వేదపాదం మృగాంఘ్రివత్॥ 148

నేత్రాధో వళగా దూర్ధ్వే చోర్ధ్వమేవం త్రివక్త్రకం।
అబ్జ మత్స్యాననాకారం క్షుద్రదంతే చ జిహ్వాయుక్॥ 149

వక్త్ర పుచ్ఛాది సర్వాంగం పత్రవల్ల్యాది భూషితం।
మానం యుక్త్యా ప్రకుర్వీత గ్రాహమేవ ముదీరితం॥ 150

కీర్తివక్త్రం హరివక్త్రం చోక్తవ త్కారయే త్సుధీః।
కర్ణమూలే కపోలాగ్రే స్తూపికే శృంగదేశకే॥ 151

వక్త్రయు క్నేత్రయోర్మధ్యా చ్ఛిఖామూలం తు విన్యసేత్।
మందస్మితాననాకారం సర్వం హృష్టాకృతిం దృశి॥ 152

**తా॥** అక్కడనుండి ఆ పత్రములయొక్క సూక్ష్మ బ్రహ్మాది దేవతలనుగాని, భూతాది రూపములనుగాని, వ్యాల సింహాది రూపములనుగాని, వృక్ష వల్లీ రూపములనుగాని, చేయవచ్చును. ఆపైన కీర్తిముఖమును ముందుకు నిర్గమము వచ్చునట్లు చేయవలెను దాని లంబముయొక్క ప్రక్కలను, దాని బొమ్మయొక్క ప్రక్కలను, విద్యాధరులు మొదలగు వారిని మకరములు మొదలగు చిత్రములను చేయవలెను. మొసలి రూపమునకు విశాలములు దీర్ఘములైన కన్నులును, చెక్కిళ్లు గుండ్రముగాను, ఏనుగు చెవులవలె చెవులును, చెక్కిళ్ళయొక్క అంతమున తరంగములవలె నుండవలెను. దాని నోటిలో ముందు రెండు కోరలును మృగముయొక్క పాదములవలె నాలుగు పాదములును నేత్రములకు క్రిందుగాను పైనను మూడు ముఖములును, పద్మము చేపముఖము ఈరూపముతో చిన్న దంతములయందు నాలుకతోగూడి యుండవలెను. ముఖము తోక మొదలయిన అన్ని అవయవములు పత్రములతోను, లతలతోను అలంకరింపబడి యుండవలెను. కొలతలు యుక్తితో చేయవలెను. మొసలి రూపము ఇట్లు చెప్పబడినది, కీర్తి ముఖమని చెప్పబడు సింహముఖమును శాస్త్రోక్తప్రకారము చేయవలెను. కర్ణమూలమునను కపోలముపైనను - స్తూపికయందును, శృంగమునందును, సింహ ముఖములను చేయవలెను.

శ్లో॥ వరాహశ్రోత్రవ త్కర్ణౌ శృంగౌ మేషస్యశృంగవత్।
దంతైకం కరాలదంతాభం దంష్ట్రాది దథ తదంతయుక్॥ 153

పార్శ్వకే సస్మితే గండం చాగ్రయో రృజుకాయతః।
వేగాదూనం చ కుర్యాత్తు చోగ్రదృష్టిం పుటోజ్జ్వలం॥ 154

శ్యామవర్ణం ముఖం సర్వం కింపురీ మకరాననం।
దంతోష్ఠం శ్వేతవర్ణం స్యా దాస్య మీక్షశ్రోత్రద్వయ యుక్॥ 155

మకరస్య తు నిష్క్రమ్య భుజపుచ్ఛాది సర్వశః॥
గ్రాహసింహాకృతి వ్యాలైః స్తూపితుంగయుత ముక్తవత్॥ 156

గ్రీవే చ లంబకేశం స్యా చ్చతుర్థ్యా దీర్ఘపుచ్ఛకం।
శ్యామవర్ణ నిభం సర్వం హంససింహౌ చోక్తవ త్తురు॥ 157

గజ మశ్వాదికాన్ సర్వాన్ శిల్పీ యుక్త్యా ప్రయోజయేత్।
దేవ భూతాది రూపైస్తు యక్ష విద్యాధరై స్తథా॥ 158

ఉక్తవ త్తారయే ద్దేవీం భూపతీనాం చ హర్మ్యకే।
అన్యేషాం చాలయే సర్వస్మిన్ దేవై ర్భూతై ర్వినా న్యసేత్॥ 159

సరస్వత్యా శ్చ లక్ష్మ్యా శ్చ సర్వహర్మ్యేషు కారయేత్।
ప్రాసాదే మండపే సర్వే గోపురే ద్వారకే తథా॥ 160

దేవానాం భూసురాదీనాం వర్ణానాం సర్వహర్మ్యకే।
కుర్యా త్తన్ముఖభద్రం స్యా త్సర్వాలంకారసంయుతమ్॥ 161

**తా॥** పంది చెవులవలె చెవులును, మేక కొమ్ములవలె కొమ్ములును, ఒక్కటే భయంకర మైన దంతమును, దంతములకు దిగువ లోపలను ప్రక్కలను నవ్వుతోగూడిన చెక్కిళ్లును, చక్కగా ముందుకు వచ్చిన తిన్నని శరీరమును, లొందరవలన తగ్గిన భయంకరమైన చూపును, ముక్కుపుటలును. గొప్పవిగాను నలుపు వన్నెగల ముఖమును గల భయంకరమైన మకరముఖమును, దంతములును పెదవియును తెలుపువన్నెయును నోరు. కన్నులు, చెవులు ఇవి ముందుకు సాగి యుండవలెను. భుజము తోక అన్నియును కనుపడుచుండవలెను. మొసలి, సింహము, వ్యాలము ఈ మూడు రూపములు స్తూపి తుంగము తో కూడియుండవలెను. గ్రీవమున వ్రేలాడుచున్న వెంట్రుకలును, పొడవైన తోకయును, నలుపువన్నెయును గల సింహరూపమును హంసరూపమును శాస్త్రప్రకారము చేయవలెను. ఏనుగులు, గుఱ్ఱములు మొదలయిన అన్నిరూపములను శిల్పాచార్యుడు చక్కగా ఆలోచించి చేయవలెను. దేవతారూపములను భూతగణముయొక్క రూపములను, యక్షులయొక్కయు విద్యాధరులయొక్కయు రూపములను లక్షణయుక్తముగా చేయవలెను. దేవీరూపమును రాజాలయములయందు చేయవలెను. ఇతర హర్మ్యములయందు దేవగణమును, భూతగణమును చేయరాదు. సరస్వతి, లక్ష్మి మాత్రము అన్ని హర్మ్యముల యందుండవచ్చును. అన్ని ప్రాసాదములయందును, మండపములయందును, గోపురములయందును, ద్వారములయందును దేవతలకును, బ్రాహ్మణులకును, రాజులకును అందరి గృహములయందు ముఖభద్రము సమస్తమైన యలంకారములతో చేయవలెను.

శ్లో॥ నీడస్య చా ధోగ్రీవం వాతాయనం కారయే ద్బుధః।
మధ్యే చ ద్వారసంయుక్తం వాతాయనం కవాటయుక్॥ 162

ప్రధానోర్ధ్వతలే వాఽపి శిఖలే వాఽథ కల్పయేత్।
మధ్యే తు చాగ్రకే వాఽపి చాంతరా లైరలంకృతం॥ 163

ఉపాకారాది జడానాం మానయే న్మానవిత్తమః।
అంబరా ద్యష్టనామాని నీడానాం మానయే ల్లఘం॥ 164

వినా కర్ణం ఉపాయుక్తం యుక్త్యా సంఖ్యా మథఉపా।
యత్ర హర్మ్యేషు సంకల్ప్య తత్రదోషో న విద్యతే॥ 165

శాలా కూటే చ నీడే చ శిఖర స్యోర్ధ్వకూటకే।
ఉపాయుక్త భ్రమాకారే తత్త ద్దుష్టిషదీశకే॥ 166

స్థూలవస్తౌ తదగ్రార్ధం స్తూపికా వాహనం భవేత్॥ 167

వింశత్యేకం త్రైతిలానాం సర్వేషాం భూపాలానాం వైశ్యకానాం పరేషాం,
సైకారాంతం యుగ్మయుక్తం త్యజేత్ త ద్ధర్మ్యోర్ధ్వకే కల్పకం తద్విక ల్పమ్॥ 168

తా॥ నీడముయొక్క దిగువ గ్రీవమున గవాక్షములను చేయవలెను. మధ్యను ద్వారమును రచించవలెను. గవాక్షములను అల్పములుగనవలెను. మధ్యమైన ఊర్ధ్వ ప్రదేశమునను లేక శిఖరమునను ఇట్లు చేయవలెను. మధ్యను పైనను లోపలను అలంకార యుక్తముగా చేయవలెను. లుపాకారము మొదలయిన అన్నిటిని శాస్త్రజ్ఞుడై శిల్పాచార్యుడు అంబరము మొదలగు 8 విధములగు లుపలను ముఖభద్రములను చేయవలెను. నీడములకు లుపలను పొలతతో చేయవలెను. కర్ణమునందు లుప లేకుండినచో యుక్తితో యేహార్మ్యమునకైన లుపలను చేయవచ్చును. అందు వలన దోషములేదు శాలయొక్క కూటమునందును, నీడమునందును. శిఖరముయొక్క పైకూటమునందును, లుపలతోగూడి చుట్టునున్న ఆ యా శిఖరములందును, స్థూలమైన వస్తువునందును ఆ యా శిఖరములలో సగము స్థూపిక స్థానమును కల్పించవలెను. దేవాలయమునకు 21 యును, అక్కడినుండి 2-2 చొప్పున తగ్గించుచు కడకు 13 భూమ్రములకు చేయవలయును. ఇట్లు వికల్పములను చేయవలయును.

## 38. మూర్ధేష్టకాన్యాసము

### శిల్పరత్నము 34 వ అధ్యాయము

శ్లో॥ శిఖరస్యోదయార్ధాంతే మహానాస్యవసానకే।
శక్తి ధ్వజావసానే వా మూర్ధేష్టకాం తు విన్యసేత్॥ 1

శిలాభిస్తు శిలాహర్మ్యే త్విష్టకా త్విష్టకాలయే।
దారుణా దారుహర్మ్యే తు కర్తవ్యం విచక్షణయా॥ 2

తా॥ శిఖరోదయముయొక్క సగమునుండి పైభాగమునను, మహానాసియొక్క చివరను, శక్తిధ్వజముయొక్క చివరను, మూర్ధేష్టకల నుంచవలెను. రాతితోగట్టిన యాలయమునకు రాతితోను, ఇటుకలతోగట్టిన యాలయమునకు యిటుకలతోను దారువుతో నిర్మించిన యాలయమునకు దారువుతోను మూర్ధేష్టకల నుంచవలెను.

శ్లో॥ చత్వార శ్చేష్టకాః స్థాప్యా శుభేఽహని విశేషతః।
ఆచార్యో మండపే సర్వ మధివాస్య యథావిధి॥ 4

రాత్రౌ జాగరణం కృత్వా ప్రాతః స్నానాది కృద్బుధః।
నవవస్త్రాంగులీ యాద్యై రనులేపై రలంకృతః॥ 15

యజ్ఞ సూత్రం వినాఽన్యైస్తు భూషితే నాథశిల్పి నా।
సహ ప్రాసాద శిఖర మారుహ్యా చగురు స్స్వయమ్॥ 16

తా॥ శుభదినమున శిల్పాచార్యుడును గురువును అధివాసముచేసి యా రాత్రి జాగరణమును చేయవలెను. మరుదినమున ప్రాతఃకాలమున స్నాన సంధ్యాది విధులు నెరవేర్చుకొని నూతన వస్త్రములు ఉంగరములు గంధ పుష్పాది సమస్తమైన యలంకారములు చేసికొని స్థపతియును

ఆచార్యుడును దేవాలయము యొక్క శిఖరమును యొక్క యీ యిరువురు స్వయముగా మూర్ధేష్టకా న్యాసమును చేయవలయును.

శ్లో॥ క్రమేణ బ్రహ్మ విష్ణ్వీశ సదా శివకృతేశ్వరాః।
పూర్వాది దిక్షు చ త్వారశ్చేష్టకాః ప్రథమం న్యసేత్॥

తా॥ నాలుగు యిటుకలను పూజించునప్పుడు బ్రహ్మ, విష్ణువు, శివుడు, సదాశివుడు అను నామములతో పూజించి తూర్పు మొదలుగా నాలుగు దిక్కులయందు యిష్టకలను స్థాపించవలెను.

శ్లో॥ యజమానో హృష్టమనా దక్షిణాద్యై స్వశక్తితః।
ఆచార్యం శిల్పినం చాన్యాన్ కర్మ కారాంశ్చ తోషయేత్॥ 22

తా॥ యజమానుడు సంతోష చిత్తముతో ఆచార్యునకును శిల్పికిని యితర శిల్పులను తన శక్తికొలది దక్షిణ మొదలైనవి యొసంగి సంతోషపరచవలెను.

శ్లో॥ ప్రథమం నీవ్రలోష్టాని క్రూర్వా న్యస్త్వా చ తదూర్ధ్వతః।
ఏకావృత్త్యా పునస్తత్ర తుర్యాశ్రాణి చ విన్యసేత్॥ 25

క్రూరలోష్టాని విన్యస్య చతురశ్రం పునః క్రమాత్।
ద్వ్యశ్రాణి విన్యసేత్పశ్చా దేవ మేవ పునః పునః॥ 26

నీవ్ర పట్ట్యా అపిధానం విన్యసేత్ ప్రతిపట్టికం।
కోణపారావతం నీవ్ర కోణేష్వథ చ విన్యసేత్॥ 27

పశ్చాత్త దూర్ధ్వతః కోణ లోష్టాని చ ప్రవిన్యసేత్।
తత్పార్శ్వయోః పుటాఖ్యాన్ తా న్యూర్ధ్వలోష్టాని చోర్ధ్వతః॥ 28

తా॥ మొదట నిర్గమము చేసిన యిటుకలు మూడువరుసలును, ఆపైన నొక్క వరుసయును, తరువాత దానిపై నాలుగు వరుసలును గట్టియిటుకల నుంచవలెను. దానిని నలుచదరముగా రచించవలెను. నీవ్రపట్టిచేత అపిధానము (అనగా రహస్యస్థలము) మేకులు నాటుటకు ప్రతిపట్టిద్వారా యుంచవలెను. మూలలయందును గూడ నుంచవలెను. తరువాత దానిపై కోణమున యిటుకల నుంచవలెను. వానియొక్క ప్రక్కలను పుటములను పేరుగల ఊర్ధ్వలోష్టములను పైననుంచవలెను.

శ్లో॥ అథశౌల్పే రాజతైర్వా సౌవర్ణైర్వా సురాలయే।
శిఖరాచ్ఛాదనం కుర్యాత్ ఫలకైరర్ధ సౌలభాత్॥ 30

తా॥ దేవాలయమున శిఖరమును కప్పుటకు బంగారముతోను లేక వెండితోను లేక రాగితోను చేయవచ్చును.

శ్లో॥ అష్టాంగులాది విస్తారం ఫలికానాం స్వృతం బుధైః।
ప్రాదక్షిణ్యేన విన్యస్య గూఢకీలై ర్దృఢీకృతః॥ 31

తా॥ ఎనిమిది అంగులముల వెడల్పుగల రేకులను చుట్టును చీలలతో గట్టిగా బిగించవలెను, ఆచీలలు యితరులకు కనుపడకుండ చేయవలెను

## 39. మూ ర్తి న్యా స ము

### శిల్పరత్నము 45 వ అధ్యాయము

శ్లో॥ నందీశ్వర మహాకాలౌ పూర్వ ద్వారోపరి న్యసేత్॥ 28

దక్షిణే దక్షిణామూర్తి పశ్చిమేలింగ సంభవం।
విష్ణుం వాఽప్యథ కౌబేర్యాం దుర్గాం బ్రహ్మాణ మేవ వా॥ 29

దక్షిణే చ గణేశాన ముత్తరే నృత్తరూపిణం।
క్షేత్రేశం చైవ చైశాన్యాం ద్వారే తత్ ద్వారపాలకాన్॥ 30

ఈశావతార క్రీడాది కథారూపాణి చైవహి।
మూలభిత్తౌ చ పరితో విన్యసే దుక్తలక్షణం॥ 31

అ థోపరితలే ప్రాచ్యా మింద్రం షణ్ముఖ మేవ వా।
దక్షిణే దక్షిణామూర్తి వీరభద్ర మథాపి వా॥ 32

పశ్చిమే నరసింహం వా ప్యుత్తరే చార్ధదం విధిం।
ద్వితీయే తు తలే చైవం తృతీయే తు మరుద్గణాన్॥ 33

తలే తలేఽమరాన్ సిద్ధాన్ యక్షవిద్యాధరా నపి।
గంధ ర్వాప్సరసో వాఽథ నాగేంద్రాం స్తు మునీశ్వరాన్॥ 34

ప్రమథాం శ్చైవ దైత్యాదీన్ షోడశప్రతిమాం స్తథా।
కర్ణాదధః ప్రతే రూర్ధ్వం కోణే కేతు స్వవాహనం॥ 35

కర్ణాదధ శ్చాంత్యతలే ప్రాకారాదౌ చ విన్యసేత్॥

తా॥ తూర్పు ద్వారముపైన నందీశ్వరుడు, మహాకాలుడు, అనువారిని. దక్షిణమున దక్షిణామూర్తిని, పడమర లింగసంబంధమైన కథారూపములును లేక విష్ణువును, ఉత్తరమున దుర్గను గాని లేక బ్రహ్మనుగాని, చేయవలయును, మరల దక్షిణమున గణపతిని, ఉత్తరమున నాట్యరూపమును, ఈశాన్యమున క్షేత్రపాలుని, ద్వారమున ద్వారపాలకులను, ఈశ్వరునియొక్క అవతార క్రీడలు మొదలగు కథారూపములు చేయవలెను. ప్రధానమైన గోడయందు చుట్టును యిట్లు చేయవలెను.

తరువాత పై అంతస్తున తూర్పు ఇంద్రునిగాని లేక షణ్ముఖునిగాని, దక్షిణమున దక్షిణామూర్తిని గాని లేక వీరభద్రునిగాని, పడమర నృసింహరూపమునుగాని లేక యేదైన శివకథారూపముగాని, ఉత్తరమున కుబేరునిగాని లేక బ్రహ్మనుగాని చేయవలయును. మూడవ అంతస్తున దేవతాగణమును చేయవలెను. ఇట్లు అంతస్తు అంతస్తున దేవతలను, సిద్ధులను, యక్షులను విద్యాధరులను గంధర్వులను, అప్సరసలను శేషుడు మొదలైనవారలను, మునీశ్వరులను, ప్రమథగణమును, దైత్యులను, షోడశప్రతిమలను. కర్ణమునకు దిగువను ప్రతికి పైభాగమునను మూలలయందు ప్రధానదేవుని యొక్క వాహనరూపములను రచించవలెను. కర్ణమునకు దిగువ పై అంతస్తునను ప్రాకారము మొదలగు వానియందును గూడ యిట్లే చేయవలయును.

సమరాం ౯౫ వ అధ్యాయము

శ్లో॥ ఆదిత్యం పూర్వతో న్యస్యేత్ కుమారం పూర్వదక్షిణే॥ 118
దక్షిణే మాతృదేవీస్తు గజాస్యం దక్షిణోపతి।
విన్యసే ద్వారుణే గౌరీం వాయవ్యేఽపి చ చండికామ్॥ 119

విష్ణుం కుబేరదిగ్భాగే తథైశాన్యాం మహేశ్వరమ్।
అన్యేషా మపి దేవానాం కథ్యతే తు క్రమోఽధునా॥ 120

తా॥ తూర్పున సూర్యుడు, ఆగ్నేయమున షణ్ముఖుడు, దక్షిణమున మాతృదేవతలు, నైరృతిన గణపతి, పడమర గౌరి, వాయవ్యమున చండిక ఉత్తరమున విష్ణువు, ఈశాన్యమున మహేశ్వరుడు. ఇట్లు దేవతలను నిర్మించవలెను.

సమరాం ౯౬ వ అధ్యాయము

శ్లో॥ తత్రైశాన్యాం దిశి న్యస్యే దీశానం లోకనాయకమ్।
దానవానాం నిహంతారం పూర్వస్యా మపి వాసవమ్॥ 121

వైశ్వానరం తథాఽఽగ్నేయ్యాం ధర్మరాజం చ దక్షిణే।
నైరృత్యాం నిరృతిం న్యస్యేత్ ప్రతీచ్యాం తు ప్రచేతసమ్॥ 122

వాయుం వాయవ్యదిగ్భాగే కుబేర మపి చోత్తరే।
అష్టౌ హ్యేతే మహాత్మానో లోకపాలాః ప్రకీర్తితాః॥ 123

పాలయంతి జగత్సర్వం స్వస్వస్థానే ప్రతిష్ఠితాః॥

తా॥ ప్రస్తరముపైన ఈశాన్యము మొదలు 8 దిశలయందు ఈశ్వరుడు మొదలు కుబేరుని వరకు లోకపాలకులను వారివారి వాహనములపై పత్నీయుక్తముగ సుఖాసీనులుగ రచించవలెను.

విశ్వకర్మోవాచ అప. 150 వ సూత్రము.

శ్లో॥ ప్రాసాదే దేవతాన్యాసం స్థాపయే చ్ఛ సమంతతః।
త దనుక్రమతో వక్ష్యే శృణు చైకాగ్రమానసః॥ 1

పాదే పరాక్రమం దేవం ప్రతిష్ఠాప్య భూసద్వృతః।
పూర్వభాగోద్భవం దేవం శిలాయాం చ తదూర్ధ్వతః॥ 2

శిలోద్భ వోద్ధృతా పాదౌ దంష్ట్రాగ్రి భూమిసమన్వితా।
వరాహరూపేణ ఖుర శిలాయా ధరణీధరః॥ 3

సూత్రపాతం సమాసాద్య స్థాప్య శ్చింతామణి స్తథా।
ఆద్యస్థలోర్ధ్వదేశేచ తత్ర నాగకులాని చ॥ 4

ప్రతిష్ఠాప్యాః పన్నగా శ్చ స్థానే పాల్యభిద నకే।
తదూర్ధ్వే కుంభకాఖ్యే చ సంస్థాప్యా జలదేవతాః॥ 5

పుష్పకం చ తదూర్ధ్వే తు చిప్పికా పుష్పకాన్వితా।
సంస్థాప్యాః కిన్నరా స్తత్ర చిప్పికా పుష్పకాకలాః 6

జాడ్యకుంభే స్థితో నందీ కర్ణాల్యాం చ తతో హరిః।
గజపీఠే గణేశ శ్చ అశ్వపీఠే తథాశ్వినౌ॥ 7

నరపీఠే నరాం శ్చైవ స్థాపయేత్ క్రమయోగతః।
క్షమాం దేవీం చ ఖురకే ప్రస్తారం కుంభకే తథా॥ 8

నిర్గ మోద్గమ సీమాయాం తతః సృష్టి ర్వినిర్గతా।
సంధ్యాత్రయం ప్రతిష్ఠాప్యం క్రమతో భద్రకత్రయే॥ 9

కలశే చ స్థితా దేవీ పార్వతీ తు హరప్రియా।
ధనదో ఽంతరపత్రే చ ప్రతిష్ఠాప్యో యథాక్రమమ్॥ 10

కపోతాల్యాం తు గంధర్వా అంతః పత్రే చ కిన్నరాః।
శారదా మంచికాయాం చ జంఘాయాం మేరుదేవత॥ 11

లోకపాలా శ్చ దిక్పాలాః సురా శ్చాథ గణేశ్వరాః।
ఉదీచ్యా మింద్రదేవ శ్చ సావిత్రీ భరణే స్థితా॥ 12

భారాధారః శిరోవట్యాం పట్టే దేవ్య శ్చ సంస్థితాః।
విద్యాధరాః కపోతాల్యా మంతః పత్రే సురా స్తథా॥ 13

పర్జన్యః కూటచ్ఛాద్యే తు భాద్యనిర్గమ సంస్థితః
తదనంతరతో దేవాన్ స్థాపయే ద్గర్భమధ్యతః॥ 14

శాఖయో శ్చంద్రసూర్యౌ తు త్రిమూర్తి శ్చోత్తరంగకే।
ఉదుంబరే స్థితా యక్షా అశ్వినా వర్ధచంద్రకే॥ 15

క్షోణికాయాం ధరాధారః క్షితి శ్చోత్తాన పట్టకే।
స్తంభేషు పర్వతాః ప్రోక్తా ఆకాశం చ కిరోటకే॥ 16

జాలకే ఋషిసంఖ్యా శ్చ సురా మధ్యే ప్రతిష్ఠితాః।
మకరే జాహ్నవీ గంగా చండేశే గౌతమీ తథా॥ 1.

శిఖరే చేశ్వరం విద్యా చ్ఛిఖాయాం తు సురాధిపం।
గ్రీవాయాం త్వంబరం దేవ మండకే చ సశాకరిమ్॥ 19

పద్మాక్షం పద్మపత్రే చా మలమామలసారకే।
కలశే చ స్థితో రుద్రో వ్యోమవ్యాపీ సదాశివః॥ 20

సద్యో వామ స్తథా ఘోర స్తత్పురుష శ్చేశ ఏవచ।
కర్ణే ప్రతిరథే చైవ రథే పంజర భద్రయోః॥ 21

పంచవక్త్రాణి పంచాంగ సంఖ్యా భద్రాంతగా భవేత్।
ఇత్యేతే చ సమాఖ్యాతః ప్రాసాదే త్రిదశాః ఖలు॥ 22

న్యూనాధికం స్థితా యత్ర దేవా స్తత్రైవ తే పునః।
హీనే హీనాః ప్రతిష్ఠాప్యా అధికే చాధికాః శుభాః॥ 23

ఇతి సూత్రసంతాన గుణకీర్తి ప్రకాశప్రోక్తౌ శ్రీభువనదేవాచార్యోక్తాపరాజిత పృచ్ఛాయాం ప్రాసాద దేవన్యాసాధికారో నామ పంచాశదుత్తర శతతమంసూత్రమ్

**తా॥** ఆలయమున దేవతల నుంచు విధానమును చెప్పుచున్నాడు. ముందుగా కూర్మ రూపము నుంచవలెను. అది మధ్యస్థానము. ఆ పైన అనంతుని స్థాపించవలెను, అటుపైన ఖురమున ఆదివరహామును భూదేవి సహితముగా నుంచవలెను. ఆపైన సూత్రమునుబట్టి సదుప చింతామణియును, చుట్టును 8 దిశలయందు వసువులును ఉండవలెను దానిపైన పాలికయందు సర్ప జాతిని రచించవలెను. ఆపైన కుంభమున జలదేవతలను రచించవలెను. పుష్పమును ఆపైన చిప్పికను పుష్పయుక్తముగను రచించవలెను. జాడ్య కుంభమున నందిని, కర్ణములయందు విష్ణువును, గజపీఠమున గణపతిని, అశ్వపీఠమున అశ్వినీదేవతలను, నరపీఠమున మానవులను వరుసగా నిర్మించవలెను. మఱియు ఖురమున భూదేవిని, కుంభమున బ్రహ్మను, నిర్గమమునను ఆ పై ప్రదేశమును జగత్ సృష్టియంతయును రచించవచ్చును. భద్రములు మూడింటియందు సంధ్యాదేవి యొక్క

మూడు రూపములను చిత్రించవలెను. కలశమున సావిత్రీదేవిని, అంతరపత్రమున షణ్ముఖుని, కపోతమునందు గంధర్వులను, పై అంతరపత్రమున కిన్నరులను, మంచికయందు సరస్వతిని, జంఘయందు మేరువును, లోకపాలకులను, దిక్పాలకులను, సురలను ప్రమథులు మొదలగు వారలను రచించవలెను ఉత్తరమున ఇంద్రుని, స్తంభముపై దూలమున సావిత్రిని, దాని క్రిందనున్న శిరోపట్టికయందు స్త్రీ దేవతలను, కపోతములయందు విద్యాధరులను ఆ పై అంతరపత్రమున దేవతలను, ప్రస్తరమునను కూటములయందును పర్జన్యుని, నిర్గమమునందు దేవతలను గర్భమునను దేవతలను, ద్వారశాఖలయందు చంద్ర సూర్యులను ఉత్తరాశియందు త్రిమూర్తులను, గొడుగుబల్లయందు యక్షులు, అర్ధచంద్రాకారమున అశ్వినీదేవతలు, ముంజూరునందు కూర్మమును, ఆపైన ఉత్తాన పట్టమున భూదేవియును, స్తంభములయందు పర్వతములును, వాని తలలయందు ఆకాశమును, కిటికీలయందు ఋషులను, లోపల దేవతలను, మకరపత్రములయందు జాహ్నవిని చండేశ్వరుని యందు గోమతిని, బ్రహ్మ, విష్ణువు, సూర్యుడు, పార్వతి సదాశివుడు, ఈ 5 గురు ఉరఃశృంగమునను లేక 5 భద్రములయందు వరుసగాను రచించవలెను. శిఖరమున ఈశ్వరుని, ఆపై భాగమున ఇంద్రుని, గ్రీవయందు అంబరమును, అండకమున చంద్రుని, పద్మపత్రమున సూర్యుని, ఆమలసారమున అమలుని, కలశమున ఏకాదశ రుద్రులను, సదాశివుని, సద్యోజాత, వామదేవ, అఘోర, తత్పురుష, ఈశాన ముఖములతోను, కర్ణమునను ప్రతిరథమునను, రథమునను, పంజరమునను భద్రమునను ఒక్కొక్క దానియందు సద్యోజాతము మొదలగు 5 ముఖముల యందుద్భవించిన బ్రహ్మలను రచించవలెను. ఋషులను రచించవచ్చును. హెచ్చు తగ్గుగల ప్రదేశములను తెలిసికొని దేవతలనుగూడ అధికమున అధికుని హీనమున హీనుని రచించవలెను. అంతకు వ్యతిరేకముగ చేసిన యెడల దోషములు కలుగును.

## 40. ప్రాసాదనామములు

### కాశ్యపశిల్పము 2వ పటలము

శ్లో॥ అథవక్ష్యే విశేషేణ ప్రాసాదే మానలక్షణమ్।
ప్రాసాదః సదనః సద్మ వస్త్య ధామ నికేతనమ్॥ 1

మందిరం భవనం వాసో గేహ వేశ్మ విమానకమ్।
ఆశ్రయం చాస్పదం చైవ ఆధారం చ క్రమేణ తు॥ 2

ఆధార ప్రతిధిష్ణ్యం చ హర్మ్య పర్యాయ వాచకాః।
తస్మాదత్ర పరోనాస్తి పరిమాణం సముచ్యతే॥ 3

తా॥ ప్రాసాదము, సదనము, సద్మము, వస్త్యము, ధామము, నికేతనము మందిరము, భవనము, వాసము, గేహము, వేశ్మము, విమానము, ఆశ్రయము, ఆస్పదము, ఆధారము, ఆధార ప్రతి. ధిష్ణ్యము, హర్మ్యము, ఈ 18 ప్రాసాదమునకు పర్యాయనామములు.

## 41. ఏకతలము మొదలు షోడశతలమువరకు విస్తారోన్నతములు

### కాశ్యపశిల్పము 24 వ పటలము

శ్లో॥ అథ వక్ష్యే విశేషేణ మానసూత్రస్య లక్షణం।
త్రి చతు ర్హ_స్తమారభ్య ద్వి ద్వి హ_స్త వివర్ధనాత్॥ 1

నవ పం_క్తి కరాంతం తు హస్తే నైకతలం భవేత్।
ఏవ మష్టవిధం మానం యు గ్మాయుగ్మం చ తు శ్చతుః॥ 2

తా॥ ఒక్క అంతస్తుగల దేవాలయమునకు విస్తారమును చెప్పుచున్నాడు. 3 హ_స్తములు మొదలు 2-2 చొప్పున పెంచుచు 9 హ_స్తములవరకు 4 విధములు చేసి సంఖ్యతోను, 4 హ_స్తములు మొదలు 2-2 హ_స్తములు పెంచుచు 10 హ_స్తములవరకు సమసంఖ్యతో 4 విధములను ఇట్లు 8 విధములు చేయవచ్చును.

శ్లో॥ పంచ షడ్ఢ_స్త మారభ్య ద్వి ద్వి హ_స్త వివర్ధనాత్।
తిథి ద్విరష్ట హస్తాంతం ద్వితలత్రి తలస్య తు॥ 3

తా॥ రెండంతస్తుల నుండి మూడంతస్తులు గల దేవాలయము వరకు 5 హ_స్తములు మొదలు 2-2 హ_స్తములు పెంచుచు 15 హ_స్తముల వరకు బేసి సంఖ్యతోను, 6 హ_స్తములు మొదలు 2-2 హ_స్తములు పెంచుచు 16 హ_స్తములవరకు సమసంఖ్యతోను 12 విధములుగా చేయవచ్చును. 3 అంతస్తులు గల దేవాలయమునకు కొలతలు చెప్పబడియుండ లేదు కాని {7-9-11-13-15-17 / 8-10-12-14-16-18} ఇట్లు చేయవచ్చును.

శ్లో॥ గ్రహ ధర్మ కరా ద్యావత్ స ప్తాష్టవింశతి కరాః।
చతు ష్పంచ తలం వాఽథ యు గ్మాయుగ్మం చ తే దశ॥ 4

తా॥ నాలుగు మొదలు ఐదు అంతస్తుల వరకు 9 హ_స్తములు మొదలు 2-2 హ_స్తములు పెంచుచు 27 హ_స్తముల వరకు బేసి సంఖ్యతోను, 10 హ_స్తములనుండి 2-2 హ_స్తములు పెంచుచు 28 హ_స్తములవరకు సమసంఖ్యతోను యిట్లు 20 విధములుగా చేయవచ్చును.

శ్లో॥ విస్తారం స_ప్త ష ట్పంచ భాగం కృత్వా ద్విజో_త్తమ।
రస భూత యుగాంశం తు విస్తారా ద్రోపయే త్క్రమాత్॥ 5

విస్తారా ద్ద్విగుణం చైవ తస్మా దష్టాంశ మాధిక్యం।
పంచధా వర్ధితం తుంగ మాభాసే సదనే ద్విజ॥ 6

శాంతికం పౌష్టికం చైవ జయదం చాద్భుతం తథా।
సార్వకామిక మిత్యేతే అభిదానం యథాక్రమం॥ 7

హస్తద్వయ ప్రవృద్ధ్యాఽథ వ్యాసా త్సంపూర్ణ మాచరేత్।
అభాసహర్మ్య మాఖ్యాతం వికల్ప మథునా శృణు॥ 8

తా॥ విస్తారమును 7-6-5 భాగములను చేసి వరుసగా 6-5-4 భాగములను విస్తారమున కంటె యెక్కువ చేయుచు దేవాలయములయొక్క యెత్తును చేయవచ్చును. (అనగా 7లో 6 కలిపి గావి) యిట్లు లేక విస్తారమునకంటె రెట్టింపుగాని చేయవచ్చును. లేదా రెట్టింపుచేసి అసలులో 8వ వంతుకూడ కలిపి చేయవచ్చును. ఇట్లు 5 విధములు కలవు శాంతికము పౌష్టికము, జయదము, అద్భుతము, సార్వకామికము అను పేరులు కలిగియున్నవి. చాలవరకు విస్తారమునకు రెట్టింపుతోనే యెత్తును చేయుట ముఖ్యము. వీనిని ఆభాస హర్మ్యము లందురు. ఇక వికల్పములను చెప్పుచున్నాను వినుము.

శ్లో॥ నవ పంక్తి కరా త్పంచ షట్పంచాశ త్కరాంతకం।
ద్వి ద్వి హస్త వివృద్ధ్యా తు చతుర్వింశతి సంఖ్యయా॥ 9
పంచభూమి సమారభ్య యావ దర్కతలాంతకం।
అధమం మధ్య మోత్కృష్టం వికల్పం చ యథాక్రమమ్॥ 10

తా॥ 9 హస్తము లు మొదలుకొని 2-2 హస్తములు పెంచుచు యిట్లు 24 సార్లు పెంచగా 55 హస్తములవరకు వేసి సంఖ్యతోను, 10 హస్తములు మొదలు 2-2 హస్తముల చొప్పున 24 సార్లు పెంచుచు రాగా 56 హస్తములు సంఖ్యతోను యేర్పడును, 5వ అంతస్తు మొదలుకొని 12వ అంతస్తువరకు 8 అంతస్తులు ఒక్కొక్కటి అధమము మధ్యమము, ఉత్తమము, అను భేదములతో యిరువది నాలుగు భేదములు అగును. ఇట్లు 12వ అంతస్తువరకు విస్తారము చెప్పబడియున్నది.

శ్లో॥ షట్త్రింశ ద్ధస్త విస్తారే సప్త పంచాశ దుచ్ఛ్రయే।
త్రయోదశతలం కుర్యా న్మమ ప్రీతికరం భవేత్॥ 11

తా॥ 36 హస్తముల విస్తారమును 57 హస్తముల యెత్తును కలుగునట్లు 13 అంతస్తులు చేయవలెను. ఇది చాల ముఖ్యమైనది,

శ్లో॥ విస్తారే సప్తపంచాశ న్నవతి ర్హస్తపంచకం।
తలం షోడశభి ర్యుక్తం శివహర్మ్యం శివప్రియమ్॥ 12

తా॥ విస్తారము 57 హస్తములను, ఎత్తు 95 హస్తములును కలిగి 16 అంతస్తులతో శివ హార్మ్యమును నిర్మించినేని శివునకు ప్రియముగా నుండును.

శ్లో॥ ఏవం వికల్ప మాఖ్యాతం ఛందమార్గ మథ శృణు॥
త్రి చతు ర్దశహస్తాది ద్వి ద్వి హస్త వివర్ధనాత్॥ 13

పంచ షట్ షష్టిహస్తాంతం వ్యాసో వై సప్తవింశతిః।
వేదభూమిం సమారభ్య భానుభూ మ్యవసానకం॥ 14

అధమం మధ్య మోత్కృష్టం మానం వేదతలం ప్రతి।
స ప్తాష్టాదశ హస్తాది త్రి త్రి హస్త వివర్ధనాత్॥ 15

పంచ షణ్ణవతి ర్యావ దుచ్ఛం ప్రాగివ సంఖ్యయా।
అధమం మధ్య మోత్కృష్టం తుంగ భేద తలం ప్రతి॥ 16

తా॥ ఛందమును చెప్పుచున్నాను. 13 హస్తములు మొదలు 2-2 హస్తముల చొప్పున పెంచుచు 65 హస్తములవరకు బేసిసంఖ్యతో 27 భేదములును. 14 హస్తములు మొదలు 2-2 హస్తముల చొప్పున పెంచుచు 66 హస్తముల వరకు సమసంఖ్యతో 27 భేదములును కలిగియున్నవి ఈ విస్తార భేదములు నాల్గవ అంతస్తు మొదలుకొని అధమము, మధ్యమము ఉత్తమము అను భేదములతో 12వ అంతస్తు వరకు గల 27 భేదములు గాను యని తెలియవలయును. 17 హస్తములు మొదలుకొని 3-3 హస్తముల చొప్పున 95 హస్తములవరకు బేసిసంఖ్యతోను, 18 హస్తములు మొదలు 96 హస్తములవరకు సమసంఖ్యతోను 27 భేదములు కలుగుచున్నవి. ఇవి 4వ అంతస్తు మొదలుకొని 12వ అంతస్తు వరకు అధమము, మధ్యమము, ఉత్తమము అను భేదములతో 27 విధముల యెత్తును నిర్ణయించవలెను.

శ్లో॥ ఛంద మేవం తలం ఖ్యాతం జాతి హర్మ్య మథ శృణు।
స ప్తాష్ట దశహస్తాది ద్వి ద్వి హస్త వివర్ధనాత్॥ 17

స ప్తతి ర్మానకం వాఽపి స ప్తవింశతి సంఖ్యయా।
చతుర్భూమిం సమారభ్య యావ ద్దర్కతలం ప్రతి॥ 18

తావ ద్విస్తార మాఖ్యాత ముత్సేధం శృణు సువ్రత।
త్రిస ప్త వింశ ద్ధస్తాది త్రి త్రి హస్త వివర్ధనాత్॥ 19

యావ దాశతహస్తాంత ముచ్ఛం ప్రాగివ సంఖ్యయా।
అధమం మధ్య మోత్కృష్టం వ్యాసోచ్ఛం చ క్రమోదితం॥ 20

ఏవం జాతివిమానం తు స ప్తవింశతి భేదితం।
జాతి చ్ఛందం వికల్పం చ అభాసం చే ద్విజో త్తమ॥ 21

తా॥ మరియు 17 హస్తములు మొదలుకొని 2-2 హస్తములు పెంచుచు 69 హస్తముల వరకును 18 హస్తములు మొదలుకొని 2-2 హస్తములు పెంచుచు 70 హస్తముల వరకును యిట్లు సమసంఖ్యతో 27 ను, బేసిసంఖ్యతో 27 ను భేదములు కలిగియున్నవి నాల్గవ అంతస్తు మొదలుకొని 12వ అంతస్తు వరకు అధమ, మధ్యమ, ఉత్తమ భేదములతో 27 విధముల విస్తారములను

చేయవలెను. ఇక యెత్తును చెప్పుచున్నారు. 6 హస్తములు మొదలు 3-3 హస్తముల చొప్పున పెంచుచు 93 హస్తముల వరకు సరి సంఖ్యతో 27 భేదములును, 2 హస్తములు మొదలుకొని 3-3 హస్తముల చొప్పున పెంచుచు 27 భేదములతో బేసిసంఖ్య రూపములును కలవు. నాల్గవ అంతస్తు మొదలుకొని పదిరెండవ అంతస్తు వరకు భేదము మధ్యమము, ఉత్తమ భేదములతో 27విధము లగు యెత్తును నిర్ణయించవలెను.

శ్లో॥ మహతీ ద్వ్యంత రాల్పంచ చ క్షుద్రనాసా ప్రచోదితం।
యుగాగ్రే భూతమానే తు మానసూత్రం చ విన్యసేత్॥ 22

త దన్యాకృతి హర్మ్యాణాం వేదం శృంగాంతపూరణం।
యత్రైవ భజ్యతే తత్ర మానసూత్రం విధీయతే॥ 23

ప్రాసాదానాం తు విస్తారం భిత్తిపా ద్బాహ్యమేవ వా।
తత్పా దాభ్యంతరం వాఽథ తత్పాదమధ్యమం తు వా॥ 24

ఉత్సేధం త దుపానాది స్తూప్యంతం వా శిరోన్నతం।
సభా మండప శాలానాం భిత్తిమ ధ్యావసానకం॥ 25

భిత్తిమధ్యే ఽంఘ్రిబాహ్యే వా మధ్యే వాఽప్యంతరేఽపి వా।
భిత్తి బాహ్యగతం సా తు బాహ్యేవా ఽభ్యంతరేఽపి వా॥ 26

త దంఘ్రిమ ధ్యావసానం మానసూత్రం ద్విజోత్తమ।
భిత్తిమధ్యే ఽంఘ్రివిస్తారం చాంఘ్రిస్థానేషు చోచ్యతే॥ 27

భిత్తి బాహ్యగతం పాదం ప్రాగేవ ప్రోచ్యతే తదా।
సాలానాం భిత్తి మధ్యే వా బాహ్యే వాఽభ్యంతరేఽపివా॥ 28

తా॥ మహానాసి, ముఖనాసి, క్షుద్రనాసి మొదలైనవియును, నాలుగింటిపైన ఒకభాగమును కలిపి మానసూత్రము నుంచవలెను. నలుచదరముగాక యితర రూపములు గల హర్మ్యములకు స్థూపి వరకు యిట్లే విభజించవలెను ప్రాసాదముయొక్క విస్తారము గోడ స్తంభము వీనియొక్క వెలుపలకుగాని లేక స్తంభముయొక్క లోపలకుగాని లేక స్తంభముయొక్క మధ్యకుగాని చేయవలెను. ఎత్తు జన్మస్థానము మొదలు స్థూపిక వరకుగాని లేక శిఖరమువరకుగాని చేయవచ్చును. సభామండపము శాల మొదలగువానికి గోడయొక్క మధ్యవరకును లేక గోడ మధ్యనుండి స్తంభముయొక్క వెలుపలకు గాని, మధ్యకుగాని, గోడ వెలుపలనుండి స్తంభము వెలుపలకుగాని స్తంభము లోపలికిగాని లేక స్తంభముయొక్క మధ్యకుగాని మానసూత్రమును నిర్ణయించవలెను గోడ మధ్యను స్తంభము యొక్క విస్తారము స్తంభముల కొలతలలో చెప్పబడియున్నవి గోడ వెలుపలనున్న స్తంభమును గూర్చి మునుపు చెప్పబడియున్నది. సాలలకును గోడ మధ్యనుండిగాని, వెలుపలకుగాని, లోపలకు గాని కొలతలు చేయవచ్చును.

శ్లో॥ యానానాం శయనానాం చ స్యా న్మధ్యే మానసూత్రకం।
మానసూత్రం సమాఖ్యాతం సర్వేషాం సదనాదినాం॥ 29

మానసూత్రం తు బాహ్యే స్యా త్కూటశాలాది నీవ్రకం।
కూటా ద్వావ ద్విశాలం వా త్రిపాదం వాఽర్ధ మేవవా॥ 30

పాదం సార్ధం సపాదం వా మానసూత్రా చ్చ నిర్గతిం।
అథ వా దండమానేన తుంగాదీనాం తు నిర్గతిం॥ 31

దండం వా హ్యర్ధదండం వా ద్విదండం వా సార్ధదండకం।
త్రిదండ నా ఽథనిష్క్రాంతం మానసూత్రా త్తు బాహ్యతః॥ 32

మాన స్యాభ్యంతరే వేశం విపదా మాస్పదం సదా।
తస్మా త్సర్వప్రయత్నేన మానసూత్రా ద్బహిర్గతమ్॥ 33

తా॥ యానములకును, శయనములకును మధ్య సూత్రమును చేయవలెను. అన్ని విధములైన గృహములకును మధ్యకు మానసూత్రమును చేయవలెను. కూటములు, శాలలు వీనియొక్క నిర్గమము మాత్రము మానసూత్రమునకు వెనుపలికి చేయవచ్చును. కూటము యెంత యుండునో అంతగాని, అందులో ముప్పాతికవంతుగాని, సగముగాని, పాతికవంతుగాని లేక 1¼ వంతుగాని, 1½ వంతుగాని, మానసూత్రమునుంచి నిర్గమము చేయవచ్చును. లేక దండముతో కొలత చెప్పుచున్నాడు. 1 దండముగాని, ½ దండముగాని, 2 దండములుగాని, ½ దండముగాని 3 దండములు గాని మానసూత్రమునుండి వెలుపలకు నిర్గమము చేయవచ్చును. వేశములు మాత్రము మానసూత్రము లోపలనే నిర్గమములను చేసినచో దోషము. దీని వలన ఆపదలు కలుగును. కనుక మానసూత్రమునకు వెలుపలనే నిర్గమములను చేయవలెను.

శ్లో॥ ఏత ద్విన్యాససూత్రం స్యాత్ సమసూత్రా త్సమం తు వా।
హోమా వాగతసూత్రం వా అవసాన ముదాహృతం॥ 34

మానవిన్యాస సూత్రం చ అవసానం చ లే త్రయం।
ఖ్యాతం సంక్షేపతో విప్ర శృణు షాయాదిలక్షణమ్॥ 35

ఇతి కాశ్యపశిల్పే మానసూత్రాది లక్షణం చతుర్వింశః పటలః

తా॥ ఇది విన్యాససూత్రము, సమసూత్రము వలన సమానమును చేయవలెను. హోమము నుండి బయలుదేరి పైకి బోవు సూత్రము ననుసరించి స్థూపికయొక్క కొలతను చేయవలెను. మాన విన్యాస సూత్రము అనగా దేనికి దానిని విభజించునట్టి కొలతలకు దగిన సూత్రము. ఇది మూడు విధములు కనుక మానము, ఉన్మానము, ఉపమానము అను పేరులతో పిలువబడుచున్నవి కనుక వాని ననుసరించి చేయవలెను.

## 43. మరియొక పద్ధతి కొలతలు 12 అంతస్తులవరకు

### మానసారము 11 వ అధ్యాయము

శ్లో॥ భూమిలంబ విధిం వక్ష్యే శాస్త్రే సంక్షేపతః క్రమాత్॥ 1

చతురశ్ర మాయతాశ్రం వర్తులం చ తథైవ తత్।
అష్టాశ్రం చ షడశ్రం వా ద్వ్యశ్రవృత్తం త థోత్తరం॥ 2

ఏత ద్విన్యాసభేదం వా క్షయవృద్ధి విధానకం।
ఉక్తం హి భూమిలంబం తు స్యా దేకా దర్క భూమికం॥ 3

ద్వికరం త్రికరం చాదౌ ద్విద్వికరేణ వృద్ధితః।
దశైకాదశ హస్తాంతం స్యా త్పంచ విస్తార మేకతలే॥ 4

ఇదం క్షుద్రం మధ్యమం తు చతుష్పంచ హస్తమారభ్య।
ద్వాద శైకార్క హస్తాంతం ద్విద్విహస్తేన వృద్ధితః॥ 5

ఏతత్తు పంచ విపులం యుగ్మాయుగ్మే నోత్తమం హి।
షట్ సప్త కరం చాదౌ ద్వి సప్త పంచత్రయ కరాంతం చ॥ 6

ఏతే పంచధా విపులం శ్రేష్ఠాంత మేకతలం కథితం।
విశాలద్వయ ముత్తుంగం సోపానాత్ స్తూపికాంతం స్యాత్॥ 7

ఏవం కనిష్ఠహర్మ్యేషు తంత్ర విద్భిస్తు కథితం।
విశాలే చతురంశం స్యాత్ త్ర్యంశాధిక ముత్సేధం స్యాత్॥ 8

క్షుద్ర మధ్యమ హర్మ్యేణా ముక్తం హిచైక భూమికం।
విశాలా ర్ధాధికోత్సేధ మేకభూ శ్రేష్ఠహర్మ్యకే॥ 9

తా॥ భూమియొక్క లంబమును చెప్పుచున్నాడు. నలుచదరము, దీర్ఘచతురశ్రము, గుండ్రము 8 కోణములు, 6 కోణములు, దీర్ఘవృత్తము ఇట్లు మొదటి అంతస్తు మొదలు 12 అంతస్తుల వరకు కొలతలు చెప్పుచున్నారు. 2 హస్తములు మొదలు 2-2 హస్తములు పెంచుచు 10 హస్తముల వరకు సమసంఖ్యతో 5 భేదములును, 3 హస్తములు మొదలు 2-2 హస్తములు పెంచుచు 11 హస్తముల వరకు బేసిసంఖ్యతో 5 భేదములును, మొదటి అంతస్తున అధమహర్మ్యమునకును 4 హస్తములు మొదలు 2-2 హస్తములు పెంచుచు 12 హస్తముల వరకు 5 భేదములును- 5 హస్తములు మొదలుకొని 2-2 హస్తముల చొప్పున 13 హస్తములవరకు విషమ సంఖ్యతో 5 భేదములును, ఈ యైదువిధములు మొదటి అంతస్తున మధ్యమహర్మ్యమునకును, 6 హస్తములు మొదలు 2-2 హస్తములు పెంచుచు 14 హస్తములవరకు సమసంఖ్య 5 భేదములును, 7 హస్త

ములు మొదలుకొని 2-2 హస్తముల చొప్పున పెంచుచు 1? హస్తముల వరకు బేసిసంఖ్యతో 5 భేదములును మొదటి అంతస్తు ఉత్తమహర్మ్యములకును యిట్లు విస్తారములు చెప్పబడియున్నవి. అయితే యీ కొలతల ననుసరించి విస్తారమునకు రెట్టింపుగా యెత్తును చేయవలయును. సోపానము మొదలుకొని స్తూపిక వరకు పరిమాణము అని తెలియవలెను ఈ కొలత అధమహర్మ్యముల కుపయోగించును. విశాలమును 4 భాగములు చేసి అందు ? భాగములు కలిపి చేయుట మధ్యమహర్మ్యముల పద్ధతి విశాలములో సగము కలిపి యెత్తును చేయుట ఉత్తమహర్మ్యముల పద్ధతి యని తెలియవలెను.

శ్లో॥ అథ వా తత్ర మాన్యంశే త్ర్యంశాధి కోన్నతం శ్రేష్ఠం।
క్షుద్రోత్సేధస్య మానేతు తత్సమాధికోచ్ఛ్రయం స్యాత్॥ 10

పంచధోత్సేధ ముత్కృష్టం మానాత్పంచ విధం నామ।
శాంతికం పౌష్టికం శ్రేష్టం జయదం మధ్యమానేతు॥ 11

హీనం తు యత్తద్ద్వి గుణం చాద్భుత మితి కథితం।
సమాధికోదయ హర్మ్యే సార్వ కామ ముదీరితమ్॥ 12

తా॥ లేక విశాలమును 7 భాగములుచేసి అందు 3 భాగములు కలిపి యెత్తును చేయవచ్చును. క్షుద్రహర్మ్యములకు యెత్తు రెట్టింపుకంటె కూడ యెక్కువ చేయుదురు. ఇట్లు 5 విధములని తెలియవలెను. ఇందు శాంతికము, పౌష్టికము, ఈ రెండు శ్రేష్ఠము, జయదము మధ్యమము, అద్భుతము హీనము, సార్వకామికము ఆభాసము అని చెప్పుదురు.

శ్లో॥ పంచషట్కర మారభ్య ద్వి ద్వి హస్తేన వర్ధయేత్।
త్రయోదశ చతుర్దశ హస్తాంతం పంచధా విపులం॥ 13

ద్వితలం హర్మ్యం స్యాదేతత్ క్షుద్రమాన మిహోదితం।
రస ముని కర మాదౌ వర్ధనా ద్ద్విద్వి హస్తేన॥ 14

మనుపం చ దశహస్తాంతం పంచధా విపులం మధ్యమం।
సప్తాష్ట కరమారభ్య తిథి షోడశకరాంతం స్యాత్॥ 15

ద్వితల హర్మ్యే ముఖ్యే రే తత్కధితం పురాతనైః॥

తా॥ 5 హస్తములు మొదలుకొని 2-2 హస్తముల చొప్పున పెంచుచు, 13 హస్తముల వరకు 5 విధములు బేసిసంఖ్యతోను 6 హస్తములు మొదలుకొని 2-2 హస్తముల పెంచుచు 14 హస్తముల వరకు 5 విధములు సమసంఖ్యతోను రెండవ అంతస్తున క్షుద్రమానమును, 6 హస్తములు మొదలుకొని 2-2 హస్తముల చొప్పున పెంచుచు 14 హస్తముల వరకు 5 విధములు సమసంఖ్యతోను, 7 హస్తములు మొదలుకొని, 2-2 హస్తముల చొప్పున పెంచుచు 16 హస్తముల

వరకు బేసిసంఖ్యతో 5 విధములు మధ్యమ మానమును, 7 హస్తములు మొదలుకొని, 2-2 హస్తముల చొప్పున పెంచుచు 15 హస్తముల వరకు 5 విధములు బేసి సంఖ్యతోను, 8 హస్తములు మొదలుకొని 2-2 హస్తముల చొప్పున పెంచుచు, 16 హస్తములవరకు 5 విధములు సమసంఖ్యతోను ఉత్తమ మానమును చేయవలెను. ఇది రెండవ అంతస్తుయొక్క విధము.

శ్లో॥ పంచధా విపులం శాంతి కం తు పౌష్టికం జయదం॥ 16
పంచాత్మిక మద్భుతం స్యాత్ సార్వకామికం క్రమతః।
ఉత్సేధం పంచ ధా విపులాత్ ప్రాగుక్తాంశే నైవకుర్యాత్॥ 17

తా॥ శాంతికము, పౌష్టికము జయదము. అద్భుతము, సార్వకామికము ఇవి యన్నియును వరుసగా 5 విధములు యెత్తు కలవు. వానిని పూర్వము చెప్పిన ప్రకారము తెలిసికొని చేయవలెను.

శ్లో॥ వసునవకర మారభ్య ద్విద్వి హస్తేన వర్ధయేత్।
షోడశస ప్త దశాంతం విస్తారం పంచధాస్మృతం॥ 18
నవదశ కరమారభ్య సప్తాష్టాధి కదశ కరాంతం స్యాత్।
ద్వికరేణ వర్ధయేత్ ప్రోక్తం పంచధా విపులం భవేత్॥ 19
దశైకా దశమాదౌచ ద్విద్వి హస్తేన వర్ధనాత్।
ఏతత్తు పంచధా విపులం త్రితలే కథితా త్రిధా॥ 20

తా॥ మూడు అంతస్తులదాని కొలతలు చెప్పుచున్నారు. 8 హస్తములు మొదలుకొని 2- హస్తములు పెంచుచు 16 హస్తముల వరకు సమ సంఖ్యతో 5 భేదములను, 9 హస్తములు మొదలుకొని 2-2 హస్తములు పెంచుచు 17 హస్తముల వరకు బేసి సంఖ్యతో 5 భేదములును అధమమును, 9 హస్తములు మొదలు 2-2 హస్తములు పెంచుచు 17 హస్తముల వరకు బేసి సంఖ్యతో 5 విధములును, 10 హస్తములు మొదలు 2-2 హస్తములు పెంచుచు 18 హస్తముల వరకు సమసంఖ్యతో 5 విధములును మధ్యమమును, 10 హస్తములు మొదలు 18 హస్తములవరకు 5 విధములు సమసంఖ్యతోను, 11 హస్తముల మొదలు 19 హస్తముల వరకు 2-2 హస్తముల చొప్పున బేసి సంఖ్యతో 5 విధములు ఉత్తమమును అని తెలియవలెను—

శ్లో॥ క్షుద్రం మధ్యమ ముత్కృష్టం క్రమతస్తుంగం పూర్వవ త్।
నవరుద్ర త్రయోదశ తిధి స ప్తదశ పంచధా విపులం॥ 21
క్షుద్రం చతుస్తల ముక్తం ద్విగుణం త్రివిధం విపులాత్।
దశరవి మనుహస్తం షోడశ మష్టాదశ హస్తం తత్॥ 22

పంచధా విపులం హస్తయుగ్మే యుగతలం పూర్వవదుత్సేధం।
ఏకాదశ రవిహస్తం త్రయోదశ మనుతిథి హస్తం॥ 23

షోడశ సప్త దశ హస్తం చాష్టాద శైకోనవింశ వింశతిశ్చ।
యుగ్మా యుగ్మ హస్తేన పంచధా విపులం మధ్యమం చేతి॥ 24

పౌష్టిక ముత్సేధ ముదితం విపులాదేవం చతుస్తలే ప్రోక్తం।
అర్క త్ర యోదశ హస్త మనుతిథి షోడశహస్తం చ॥ 25

సప్తదశాష్టా దశతః నవపంక్తి ర్వింశ త్ర్యేకవింశశ్చ।
ద్వా వింశత్త్రయో వింశ శ్చతుర్వింశ త్పంచ షడ్వింశ హస్తంచ॥ 26

ఏవం తు పంచధా విపులం చతుస్తలే చోత్కృష్టే శాంతికోత్సేధమ్॥

తా॥ నాలుగు అంతస్తులుగల దాని కొలతలు చెప్పుచున్నారు. 9-11-13-5-17 హస్తములు ఇట్లు 5 విధముల విస్తారమును విస్తారమునకు రెట్టింపు యెత్తును, అధమము, మధ్యమము ఉత్తమము అను భేదములను, మానుపటివలెనే చేయవలయును. ఇప్పుడు చెప్పిన కొలతలు అధమ హర్మ్యమునకు చెందును. 10-12-14-16-18 హస్తములు కలది మధ్యమము. 11-13-15-17-19 హస్తములు కలదియును 12-14-16-18-20 హస్తములు కలదియు, ఉత్తమ హర్మ్యము. ఇటులే బేసిసంఖ్యతోను సమసంఖ్యతోను చేయవచ్చును. పౌష్టికముయొక్క యెత్తు చెప్పబడినది. నాలుగు అంతస్తులుగల దానియందు చెప్పబడి యున్నందున మరల చెప్ప నవసరము లేకపోయినది. 12-14-16-18-20-22-24-26 హస్తములును, 13-15-17-19-21-23-25 హస్తములును యిచ్చట 8 భేదములు కలిగియున్నవి. ఉత్తమ శాంతికముయొక్క యెత్తు చెప్పబడినది.

శ్లో॥ ఏకాదశ కరమాదా వేక హస్తేన వర్ధయే ద్వ్యక్త్యా॥ 27

పంచాధిక దశ హస్తాంతం పంచధా విపులం।
ఏవం క్షుద్రపంచ తలోత్సేధం జయదం త్రితయం॥ 28

ద్వాదశ కరమారభ్య హస్తైకేన పూర్వవద్వృద్ధ్యాత్।
అథ షట్కర సంయుక్తం దశ హస్తాంతం పంచధా విపులం॥

ఏవం మధ్యమం పంచతలే పౌష్టిక ముత్సేధ మిదముదితం।
సైకార్క కరమాదౌ (వై) సప్త దశ హస్తంచ॥ 30

ఏతద్ధర్మ్య విస్తార ముత్కృష్ట పంచ తలే కథితం।
ఇదం శాంతి కముదయ మథవా పౌష్టిక ముత్సేధ మితి॥ 31

తా॥ అయిదు అంతస్తులుగల దానిలో అధమపద్ధతి. ఇట్లు 5 విధములు. ఇది జయదము. 11-12-13-14-15 హస్తములు. మధ్యమ పద్ధతి. 12-13-14-15-16 హస్తములు. ఇట్లు 5 విధములు.

ఇది పౌష్టికము. ఉత్తమ పద్ధతి. 13-14-15-16-17 హస్తములు, ఇట్లు 5 విధములు. ఇది శాంతికమునకును పౌష్టికమునకును పనికి వచ్చును.

శ్లో॥ మనుహస్తం త్వేకవృద్ధే నాష్టాదశ హస్తాంత మేతత్।
షడ్భూమి హర్మ్యకే క్షుద్రం విపులం పంచధా కథితం॥ 32

ఉత్సేధం సర్వకామ్యోక్త మథవా ద్విగుణం మితం।
పంచదశకర మాదౌ చైకైకం హస్తమాధిక్యం॥ 33

చతుర్వింశతి హస్తాంతం విపులం దశమితి కథితం।
షడ్భూమిక ముత్సేధం మధ్యమం జయదం మితం॥ 34

షోడశ కరమారభ్య చైకైకం హస్తమాధిక్యం।
పంచ వింశతి పర్యంతం హస్తం దశధా విపులం॥ 35

షట్తల మిద ముదితం చోక్తవద్ధర్మ్యం శాంతికోత్సేధం।
అథవా పౌష్టికోత్సేధం ప్రాక్ ప్రోక్తం శిల్పవిద్వద్భిః॥ 36

తా॥ ఆఱు అంతస్తులు కలది అధమము. 14-15-16-17-18, ఇట్లు ఒక్కొక్కటి చొప్పున 5 భేదములు. ఎత్తు రెట్టింపు. (సార్వకామికము) అవియే మధ్యమము. 15 హస్తములు మొదలు 1-1 హస్తము పెంచుచు, 24 హస్తముల వరకు 10 భేదములు. 16 హస్తములు మొదలు 25 హస్తముల వరకు యిట్లే 10 భేదములు ఉత్తమము.

శ్లో॥ సప్తదశ కరమాదౌ షడ్వింశ శ్చాంతం పూర్వవ ద్వృద్ధ్యాత్।
అష్టాదశ కరమాదౌ పూర్వవద్ వృద్ధ్యాత్ త్రి నవహస్తాంతం॥ 37

ఏకోన వింశద్ధస్తాదౌ చాష్టవింశద్ధస్త పర్యతం।
ఏతత్తు పంచ విపులం క్షుద్రం మధ్యమ ముత్కృష్టం సప్తతలే॥ 38

శాంతికం పౌష్టికం జయదం చాద్భుత ముత్తుంగం సార్వకామికం।
తేషాం చోత్తమ మాదీనాం ప్రత్యేకం విపులవశా త్క్రమతః॥ 39

నవ వింశత్కరమాదౌ త్రయస్త్రింశత్ కర పర్యంతం।
త్రింశతి హస్తం చాదౌ చతుస్త్రింశతి హస్తపర్యంతం॥ 40

ఏకత్రింశతి హస్తాదౌ పంచత్రింశ ద్ధస్త పర్యంతం।
పంచ పంచ విపులం కనీయసాది త్రివిధ ముత్సేధ ముదితం॥ 41

ఏత దష్టతల ముదితం చోదయం శాంతికాది పూర్వవ త్సంయుతం॥

తా॥ ఏడు అంతస్తులు కలది. 17 హస్తములు మొదలు 1-1 హస్తము పెంచుచు, 26 హస్తముల వరకు 10 భేదములు. అల్పము. 18 హస్తములు మొదలు 1-1 హస్తము పెంచుచు 27 హస్తముల వరకు 10 భేదములు. మధ్యము. 19 హస్తములు మొదలు 1-1 హస్తము పెంచుచు 28 హస్తముల వరకు 10 భేదములు. శ్రేష్ఠము. 8 అంతస్తులు కలది 29-30-31-32-33 హస్తములు అధమము. 30-31-32-33-34 హస్తములు మధ్యమము. 31-32-33-34-35 హస్తములు ఉత్తమము.

శ్లో॥ ద్వా త్రింశత్కర మారభ్య షట్ త్రింశత్కరాంతకం చ 42
పూర్వవద్ వృద్ధ్యా త్రయస్త్రింశ త్కరమారభ్య సప్త త్రింశత్కర పర్యంతం।
చతుస్త్రింశ ద్ధస్తాదౌ చాష్ట త్రింశాంతం చైకకరైః ర్వృద్ధ్యాత్॥ 43

నవతలే త్రి పంచవిధం విపులం కన్యసాది శ్రేష్టం ప్రవక్ష్యతే।
పూర్వ వత్తుంగ ముదితం శాంతికాది శరభేద మేతత్॥ 44

త్రయ త్రింశత్కర మాదౌ చత్వారింశ ద్ద్వయాధికం।
చతుస్త్రింశతి హస్తాదౌ త్రిచత్వారింశ ద్ధస్తపర్యంతం॥ 45

పంచ త్రింశద్ధస్తాదౌ చ తుశ్చత్వారింశ ద్ధస్త పర్యంతం।
ఏవం దశతల హర్మ్యం పంచదశ విపులం ప్రోక్తం॥ 46

తా॥ తొమ్మిది అంతస్తులుగల దాని కొలతలు. 32-33-34-35-36 హస్తములు. ఇట్లు 5 విధములు అధమము. మధ్యతరగతి 33-34-35-36-37 హస్తములు. ఇట్లు 5 విధములు. ఉత్తమము 34-35-36-37-38 హస్తములు. ఇట్లు 5 విధములు. ఎత్తు పూర్వము చెప్పబడియున్నది మఱియు పది అంతస్తులుగల దాని కొలతలు. 33 హస్తములు మొ 42 హస్తముల వరకును, 34 హస్తములు మొదలు 43 హస్తముల వరకును, 35 హస్తములు మొదలు 44 హస్తముల వరకును, ఇట్లు అధమ మధ్యమ ఉత్తమ పద్ధతులు చెప్పబడి యున్నవి.

శ్లో॥ శాంతి కాద్యుక్తం క్రమతః కన్యసాద్యుత్త మాంతం కథితం।
చతుస్త్రింశ ద్ధస్తాదౌ త్రిచత్వారింశ ద్ధస్తపర్యంతం॥ 47

పంచ త్రింశత్కర మారభ్య చతుశ్చత్వారింశ త్కరపర్యంతం।
షట్త్రింశ త్కరవిపులాత్ పంచ చత్వారింశ ద్ధస్తపర్యంతం॥ 48

ఏకాదశతల హర్మ్యే క్షుద్రాది పంచ దశ విపులం స్యాత్।
పూర్వ వత్పంచ ధోత్సేధం జన్మాది స్తూపికాంతం స్యాత్॥ 49

భూత త్రింశ ద్ధస్తాదౌ వేదాధిక చత్వారింశ ద్ధస్తాంతం।
షట్ షడ్ధస్త మారభ్య పంచ చత్వారింశ ద్ధస్తపర్యంతం॥ 50

సప్తత్రింశతి హస్తాదౌ షడధి కాష్ట పంచహస్తాంతం।
పంచదశ విపులం ప్రోక్తం క్రమాత్పూర్వవ త్పంచధోత్సేధం॥ 51

క్షుద్రం మధ్యమ ముత్కృష్టం రవితల మేత త్తంత్రవి త్కుర్యాత్।
ఏత జ్జాతివశా త్ప్రోక్తం ఛందాదీనాం శాంతికోత్సేధమ్॥ 52

తా॥ పదునొక అంతస్తులుగల జాతి కొలతలు చెప్పుచున్నాడు. 34 హస్తములు మొదలు 43 హస్తముల వరకును, 35 హస్తములు మొదలు 44 హస్తముల వరకును, 36 హస్తములు మొదలు 45 హస్తముల వరకును, వరుసగా క్షుద్రము, మధ్యమము, ఉత్తమము అని తెలియవలెను. పదిరెండు అంతస్తులుగల విమానములకు కొలతలు 35 హస్తములు మొదలుకొని 44 హస్తముల వరకు 5 విధములు అధమము, 36 హస్తములు మొదలుకొని 45 హస్తముల వరకు 5 విధములు మధ్యమము. 37 హస్తములు మొదలు 46 హస్తముల వరకు 6 విధములు శ్రేష్ఠమును అని తెలియవలెను. యీ యధమ మధ్యమ శ్రేష్ఠపద్ధతులకును, ఏకాది ద్వాదశ తలములకును, ఎత్తును మునుపు చెప్పబడి యుండినట్లు చేయవలెను. ఇటుగాక శాంతికాది భేదములకు వానివాని విధి ననుసరించి చేయవలెను.

శ్లో॥ క్రమత స్త్రిపాద మర్ధం కథం పాదం చేదం సంకల్ప మాభాస మిదం।
క్షుద్ర మధ్యమ ముత్కృష్టం క్రమాత్పూర్వవత్ కర సంఖ్యయా॥ 53

ఏవం త్రివిధ మానేన హర్మ్యం సంకల్ప్య తంత్ర విధిజ్ఞైః।

ఉత్తుంగ పూర్వకాది పూర్వవిత క్రమతః కథ్యతే॥ 54

ద్విగుణం పాదమాధిక్య మధవా ర్ధాధిక్య మున్నతిః।
శాంతికాదిక ముత్తుంగం త్రిపాద మధికం తు వా॥ 55

శాంతి కోత్తుంగ మానం విభజే దష్టభాగ మేవం స్యాత్।
తస్మాత్ త్ర్యంశమాధిక్యం ద్విత్ర్యంశాదధికం వాఽథ॥ 56

ఏతేషాం సర్వ ముత్తుంగం జాత్యాది హర్మ్య మిదముదితం।
దేవతాలయా నాం నృపాణాం శాలాగోపురే ఏవముత్తుంగం॥ 57

శాంతికాది శరభేదం విస్తృతోత్సేధం గణ్యం క్రమతః।
ఏత ద్విపరీతం చే త్కర్తుశ్చ మరణం భవతి॥ 58

తా॥ హస్తములయొక్క సంఖ్యచేత వరుసగా ముప్పాతిక వంతు సగము, పాతికవంతు, యిట్లు కల్పించుటను ఆభాస మందురు. క్షుద్రము, మధ్యమము, ఉత్కృష్టము అని మూడు విధములకు యీ కొలతలు చెల్లును. రెట్టింపు ఒకటింపాతిక వంతు పెంపు. ఒకటిన్నరవంతు పెంపు చేయవలెను. శాంతికమునకు ముప్పాతికవంతు పెంపు చేయవలెను. దానిని 8 భాగములు చేయవలెను. అక్కడినుండి వరుసగా 9-10-11 భాగములు చేసినచో పౌష్టికము, జయదము, అద్భుతము అను

వానికి భాగములు చేయువలెను. (సార్వకామికమునకు 7 భాగములు చేయవలెను.) శాలలకును గోపురములకును ఇట్లే భాగములను నిర్ణయించవలెను. ఎగుడు దిగుడుగా చేసినచో యజమానుడు నశించును.

శ్లో॥ తస్మాద్ధర్మ్య తుంగాత్ (న) పరిహృత్య శిల్పి భిస్త్రం త్రైః।
నృణాంశాలానాం తు సర్వేషాం తదుత్సేధం (కథ్యతే)॥ 59

గోపురాణాం తు సర్వేషాం శిరోఽంతం వా శిఖాంతకం।
ద్వారశాఖా సముత్తుంగం ద్వితీయం చాంతం శిఖాంతం వా॥ 60

ద్వారశోభా సముత్సేధ మస్యోత్తరాంతం వా శిఖాంతం చైవ।
శాంతి కాత్పౌష్టికా దేవం విధం గోపురోత్తుంగం స్యాత్॥ 61

అథవా హర్మ్య మానేన విష్వగ్భూమానం వక్ష్యతే క్రమతః।
షట్పంచ హస్త మారభ్య వృద్ధ్యా ద్విద్వి హస్తేన (చ)॥ 62

సత్రి చతుర్నవత్యంతం కన్యసాది త్రయం త్రయం మానం।
ఏతద్ద్వాదశ భూమ్యంతం జన్మాది స్తూపికాంతం స్యాత్॥ 63

తా॥ హర్మ్యములయొక్క యెత్తును క్రమముగా చేయవలెను అన్నివిధములైన గోపురములకు స్తూపికవరకుగాని లేక శిఖరము వరకుగాని యెత్తును నిర్ణయించుకొనవలెను. ద్వారశాఖయొక్క యెత్తు రెండవ అంతస్తుపరకుగాని లేక స్తూపి వరకుగాని చేయవలెను. ద్వారశోభయొక్క యెత్తు రెండవ అంతస్తుయొక్క ఉత్తరము వరకుగాని స్తూపిక వరకుగాని చేయవలెను. శాంతికమునుండి, పౌష్టికమునుండి, యీవిధముగా గోపురముయొక్క యెత్తును చేయవలెను లేక హర్మ్యముయొక్క పరిమాణముచేత అంతటను భూపరిమాణమును చెప్పుచున్నాను. మొదటి అంతస్తు మొదలుకొని 12వ అంతస్తు వరకు యెత్తును యిట్లు చేయవలెను 5 హస్తములును, 6 హస్తములును మొదలుకొని 2-2 హస్తములు పెంచుచు ఇట్లు 93 హస్తములును, 94 హస్తములును అగునంత వరకు అధమ, మధ్యమ, ఉత్తమ భేదములతో 12 విధములుగ చేయవచ్చును. **5-13-21-29-37-45-53-61-69-77-85-93** ఇవి ఉత్తమ పరిమాణములు.

శ్లో॥ జన్మాది హస్త మేవోక్తం శాంతికాది శరభేద ముత్తుంగం।
ఏకాది ద్వి భూమ్యంతం కల్ప్యం గ్రామస్య హర్మ్యకే భవతి॥ 64

ఏకాది త్రి భూమ్యంతం ప్రాహార కస్య చాలయం ప్రోక్తం।
ఏకాది చ తు స్తలాంతం పట్ట భాజశ్చాలయ మితి కథితం॥ 65

త్రి తలాద్యష్ట తలాంతం నరేంద్రస్య చాలయం ప్రోక్తం।
త్రి తలాది నవతలాంతం మహారాజస్య భవన ముదితమ్॥ 66

తా॥ ఒక్క అంతస్తు మొదలు రెండు అంతస్తుల వరకు సామాన్యముగా గ్రామములలో హర్మ్యములను నిర్మించవలెను. ఒక్క అంతస్తు మొదలు మూడు అంతస్తుల వరకు సేనానాయకునకు శాలను చేయవలెను. ఒక్క అంతస్తు మొదలు నాల్గు అంతస్తుల వరకు మంత్రియొక్క హర్మ్యమును చేయవలెను. మూడు అంతస్తులు మొదలుకొని యెనిమిది అంతస్తుల వరకు రాజాలయమును నిర్మించవలెను. మూడవ అంతస్తు మొదలుకొని తొమ్మిదవ అంతస్తు వరకు మహారాజుయొక్క భవనమును రచించవలెను,

శ్లో॥ పంచ తలాద్యర్కాంతం చక్రవర్తి హర్మ్యం స్యాత్।
ఏకాది త్రి తలాంతం యువరాజస్య చాలయం ప్రోక్తం॥ 67

సామంత ప్రముఖానాం చైకాది త్రితల పర్యంతం స్యాత్।
క్షుద్ర భూపస్య సర్వేషా మేకాది త్రి తల పర్యంతం॥ 68

స్థపతి స్థాపకానాంతు గజాశ్వి కాదీనాంతు యోధానాంచ।
ద్విజాతి శూరాణాంతు చైక ద్వి త్రితల పర్యంతం॥ 69

ఉగ్ర జాతీనాం చైవ శాలైక ద్వి త్రితల పర్యంతం।
గజాశ్వాది శాలానాం తల మేకం కర్తవ్యం ప్రోక్తం॥ 70

దేవానా మపిసర్వేషాం హర్మ్యైకాద్యంతం భూపతీనాం చైవ।
అన్యత్సర్వ జాతీనాం నవతలం కుర్యా త్తదాలయం ప్రోక్తం॥ 71

క్షుద్రాలయ మేవోక్తం క్షుద్రాత్ క్షుద్రమానసం యుక్తం।
క్షుద్ర దేవాలయం సర్వం పూర్వ వజ్జానాదిక మిద ముదితం॥ 72

మండపం నవతలం కుర్యాద్ భవనం మధ్యరంగం వాఽధి మండపాకారం।
ఏతత్తు భూమి లంబం పురాణైః సర్వైస్తంత్ర విద్భిః ప్రోక్తం॥ 73

ఇతి మానసారేవాస్తు శాస్త్రే భూమిలంబ విధానం నామ ఏకాదశోఽధ్యాయః

తా॥ ఐదవ అంతస్తు మొదలుకొని పదురెండవ అంతస్తువరకు చక్రవర్తి హర్మ్యమును రచించవలెను. ఒక్క అంతస్తు మొదలుకొని మూడు అంతస్తుల వరకు యువరాజ హర్మ్యమును రచించవలెను సామంతరాజులకు ఒక్క అంతస్తు మొదలు మూడు అంతస్తుల వరకు రచించవలెను. క్షుద్రరాజులందరికిని ఒక్కటి మొదలు మూడు మూడంతస్తులవరకు చేయవలెను. శిల్పాచార్యునకును ఆగమాచార్యునకును సాది మొదలగు వారికిని యుద్ధవీరులకును, బ్రాహ్మణులు మొదలైన వారలకును. ఒక్కటి మొదలు మూడంతస్తుల వరకు నిర్మించవలెను. ఉగ్రజాతులకు రెండంతస్తుల వరకు చేయవలెను. గజశాలలు, అశ్వశాలలు ఒక్క అంతస్తువరకే నిర్మించవలెను దేవతలందరికిని ఒక్కటి మొదలు అన్ని అంతస్తులు చేయవలెను. రాజులకు 9 అంతస్తులు చేయవచ్చును.

అల్పాలయములు అల్పమానముతోనే చేయవలెను. మండపములకు 9 అంతస్తులు చేయవలెను. భవనమునకు మధ్యరంగమునకూడ యిట్లు చేయవచ్చును.

## 44. విమాన లక్షణము

### మానసారము 18 వ అధ్యాయము

శ్లో॥ విమాన లక్షణం చైవ సంక్షేపా ద్వక్ష్యతే ఒధునా।
తైతిలానాం ద్విజాతీనాం వర్ణానాం వాస యోగ్యకం॥ 1

ఏక భూమి విధానాది రవి భూ మ్యవసానకం।
భక్తి సంఖ్యాం తదాకారం స్తూపికాది చ లక్షణం॥ 2

ఉపా మానక్రమం సర్వం స్తూపికా స్థాపనం క్రమాత్।
ఖానయే ద్భూతలం శ్రేష్ఠం పురుషాంజలి మాత్రకం॥ 3

జలాంతం వా శిలాంతం వా పూరయే ద్వాలుకైర్జలైః।
హస్తి పాదాకృతి దారు స్తంభేన చ ప్రహారయేత్॥ 4

ఏవం దృఢీకృతం చోర్ధ్వే యథా హర్మ్యం తు కారయేత్।
ఏక భూమి విమానే తు చోక్తవ త్కార సంగ్రహమ్॥ 5

తా॥ విమాన లక్షణమును చెప్పుచున్నాడు. ఒక్కటి మొదలు పదిరెండు అంతస్తుల వరకు భాగనిర్ణయములును, వాని వాని ఆకారములను ఉపల క్రమమును. స్తూపికను స్థాపించుటయును. చెప్పుచున్నాడు. భూమిని త్రవ్వి మానవుడు యెంత పొడవున నుండునో అంత లోతునగాని లేక నీళ్ళు పడులోతువరకుగాని, రాయి పడువరకుగాని, త్రవ్వి యందు యిసుక పోసి నీళ్ళతో నిండించవలెను. ఏనుగు పాదమువలె దారువుతో స్తంభము చేసి దానితో దిమ్మెసను చేయవలెను గట్టిగా దిమ్మెస వేసిన తరువాత అన్నివిధములైన హర్మ్యములను నిర్మించవలెను.

శ్లో॥ ఏక భక్త్యా ద్వి భక్త్యా వా త్రి చతుష్పంచ భాగికం।
షడ్భాగం షడ్విధం ప్రోక్తం క్షుద్ర మేకతలం భవేత్॥ 6

పంచ షట్ సప్తభాగం స్యా న్మధ్యమ మేకతలం భవేత్।
షట్ సప్తాష్ట విభాగం స్యాత్ శ్రేష్ఠ మేకతలం భవేత్॥ 7

పంచ షట్ సప్త భక్త్యా చ క్షుద్రం చ ద్వితలం భవేత్।
షట్ సప్తాష్ట భక్త్యా చ ద్వితలం మధ్య మేవచ॥ 8

సప్తాష్ట నవభాగం స్యా దుత్తమం ద్వితలం న్యసేత్।
సప్తాష్ట భాగికం కుర్యాత్ క్షుద్రం చ త్రితలం భవేత్॥ 9

నంద పంక్త్యంశంతే నైవ మధ్యమం త్రితలం భవేత్।
ఏక పంక్త్యర్క భాగేన చోత్తమం త్రితలం విశేత్॥ 10

తా॥ ఒక్క అంతస్తు గల భవనమునకు అల్ప పరిమాణము గల దానికి 1-2-3-4-5-6 భాగములును, మధ్యమమునకు 5-6-7 భాగములును, ఉత్తమమునకు 6-7-8 భాగములును, చేయవలెను. రెండంతస్తులు గల భవనమునకు అధమము 5-6-7 భాగములును, మధ్యమమునకు 6-7-8 భాగములును, ఉత్తమమునకు 7-8-9 భాగములును చేయవలెను. మూడంతస్తులుగల భవనమున అధమమునకు 7-8 భాగములను, మధ్యమమునకు 9-10 భాగములును, ఉత్తమమునకు 11-12 భాగములను చేయవలెను.

శ్లో॥ అష్ట నంద దశాంశం స్యాత్ క్షుద్రమానే చతుస్తలే।
నంద పంక్తి రుద్రభాగం స్యాన్మధ్యమే చతుస్తలే॥ 11

పంక్తిశ్చైకాదశార్కం స్యాద్భాగం శ్రేష్ఠే చతుస్తలే।
నంద పంక్త్యేకాదశార్కం భాగం సద్మ విశాలకం॥ 12

కారయిత్వా శిల్పవిద్భిః క్షుద్ర పంచతలే న్యసేత్।
పంక్త్యేక పంక్త్యర్కాంశ త్రయోదశాంశే వికల్పకే॥ 13

ఏతత్తు మధ్యమం పంచ తలం హర్మ్యే తు కారయేత్।
ఈశ ద్వాదశకైకార్కం మనుభాగం తథైవచ॥ 14

ఏతద్భాగ విశాలేతు శ్రేష్ఠం పంచతలం భవేత్।
అర్కసైకార్క భాగం తు మనుపంచ దశాంశకం॥ 15

ఏతద్వై పూషకే కుర్యాత్ క్షుద్రషట్తల హర్మ్యకమ్॥

తా॥ నాలుగంతస్తులు గలదానికి అధమము 8-9-10 భాగములును, మధ్యమమున 9-10-11 భాగములును, శ్రేష్ఠమునకు 10-11-12 భాగములు చేయవలెను. ఐదంతస్తులు గలదానికి అధమము 9-10-11-12 భాగములును, మధ్యమమున 10-11-12-13 భాగములును, ఉత్తమమున 11-12-13-14 భాగములును చేయవలెను. ఆరు అంతస్తులు గల హర్మ్యమున 1అధమము 2-13-14-15 భాగములు చేయవలెను.

శ్లో॥ సైకార్కాంశం మనుం చాంశం తిథి షోడశ భాగికం। 16
షట్తలం మధ్యమం ప్రోక్తం కుర్యాద్ధర్మ్య విశాలకే।
త్రి చతుష్పంచ షట్ సప్తైకాధికం దశభాగికం॥ 17

శ్రేష్ఠం షట్తల మిత్యుక్తం యథా కుర్యాద్విచక్షణః।
చతుర్దశాంశకం పంచ దశాంశం షోడశాంశకం॥ 18

సప్త దశాష్ట పంక్త్యంశం క్షుద్ర సప్తతలం తు వా।
పంచ దశాంశకం చైవ షోడశాంశక మేవ వా॥ 19

సప్త దశాంశకం భాగం చాష్ట పంక్త్యంశ భాగికం।
ఏతన్మధ్యమ మానే తు కుర్యాత్తు సప్తభూమికే॥ 20

విస్తారాష్ట ద్విభాగం చ తస్సప్త దశభాగికం।
త దష్టాదశ భాగం స్యా న్నంద పంక్త్యంశ మేవ వా॥ 21

శ్రేష్ఠం సప్తతలం ప్రోక్తం కుర్యా త్తత్ర విచక్షణః॥

తా॥ ఆఱు అంతస్తులు గల భవనము మధ్యమమునకు 13-14-15-16 భాగములును, ఉత్తమమునకు 13-14-15-16-17 భాగములును, చేయవలెను. ఏడు అంతస్తులుగల భవనమునకు అధమమున 14-15-16-17-18 భాగములును. మధ్యమమునకు 15-16-17-18-19 భాగములును, ఉత్తమమునకు 16-17-18-19-20 భాగములును చేయవలెను.

శ్లో॥ సప్త దశాంశ కంచైవ విస్తార మష్టదశాంశకం॥ 22

నవ పంక్త్యంశకం చైవ విశాలే ద్విదశాంశకం।
క్షుద్రమష్టతలం హ్యేవం హర్మ్యం కుర్యాత్తు భాగతః॥ 23

నవమేవ ద్విభాగం స్యా న్నంద పంక్త్యంశకం తథా।
ఏక వింశత్యంశకం తు భాగం హర్మ్య విశాలకే॥ 24

మధ్య మాష్టతలం కుర్యా ద్భాగమాన విమానకే।
నవాధిక దశాంశం స్యా ద్వింశతి శ్చైకవింశతిః॥ 25

ద్వావింశతి శ్చభాగం చ శ్రేష్ఠ మష్టతలం తథా।
వింశత్యంశం విశాలేతు సైకం హస్తం తథైవ చ॥ 26

ద్వా వింశతిం చ భాగం చ త్రయోవింశతి భాగికం।
క్షుద్రం నవతలం హ్యేవం కుర్యాద్భాగం విమానకే॥ 27

తా॥ ఎనిమిది అంతస్తులు గల భవనము అధమమున 17-18-19-20 భాగములును, మధ్యమమున 18-19-20-21 భాగములును, ఉత్తమమున 19-20-21-22 భాగములును చేయవలెను. తొమ్మిది అంతస్తులుగల భవనమున అధమము 20-21-22-23 భాగములు చేయవలెను

శ్లో॥ ఏక వింశతి భాగం చ తత్ ద్వావింశతి భాగికం।
త్రయో వింశతి భాగం స్యా చ్చ తు ర్వింశతి భాగికం॥ 28

మధ్యం నవతలం కుర్యా న్మధ్యమే తద్విశాలకే।
ద్వావింశతి శ్చ భాగం స్యా త్త్రియోవింశతి భాగికం॥ 29

చతుర్వింశతికం చాపి పంచ వింశతి కాంశకం।
శ్రేష్టం నవతలం ప్రోక్తం కుర్యాత్తు శిల్ప విత్తమః॥ 30

త్రయో వింశతి భాగం స్యా చ్చతుర్వింశతి భాగికం।
పంచ వింశతి భాగం చ షడ్వింశతి చ భాగికం॥ 31

క్షుద్రం దశతలం కుర్యా ద్భాగం మధ్య విశాలకే।
చతుర్వింశతికం చైవ పంచ వింశతికం తథా॥ 32

షడ్వింశతి శ్చ భాగం చ సప్తవింశతి భాగికం।
మధ్యం దశతలం కుర్యా ద్విమానస్య విశాలకే॥ 33

**తా॥** తొమ్మిది అంతస్తులుగల భవనమున మధ్యమము **21-22-23-24** భాగములును ఉత్తమమున **22-23-24-25** భాగములును చేయవలెను. పది అంతస్తులగల భవనము అధమమున **23-24-25-26** భాగములును, మధ్యమమున **24-25-26-27** భాగములును చేయవలెను.

శ్లో॥ పంచ వింశతి భాగం స్యాత్ షడ్వింశతి చ భాగికం।
సప్తవింశతి భాగం స్యా దష్టావింశతి భాగికం॥ 34

శ్రేష్ఠం పంక్తితలం కుర్యా ద్భాగం హర్మ్య విశాలకే।
షడ్వింశతి శ్చ భాగం స్యా త్సప్తవింశతి భాగికం॥ 35

అష్టావింశతి భాగం స్యా న్నవ వింశతి భాగికం।
క్షుద్ర మేకాదశ తలం భాగ మానం విశాలకే॥ 36

సప్త వింశతి భాగం తు చాష్టావింశతి భాగికం।
నవ వింశతికం చైవ త్రింశద్భాగ విశాలకం॥ 37

ఏకాదశ తలం ప్రోక్తం మధ్యమం తద్విమానకే।
అష్టావింశతి భాగం స్యా న్నవ వింశతి భాగికం॥ 38

తద్వత్ త్రింశతికం చైవ చైకత్రింశాంశకం తథా।
ఏకాదశ తలం శ్రేష్ఠం హర్మ్య మూల విశాలకే॥ 39

**తా॥** పది అంతస్తులుగల భవనమున శ్రేష్ఠమునకు **25-26-27-28** భాగములు చేయవలెను. పదునొకఅంతస్తులగల భవనమునకు అధమమున **26-27-28-29** భాగములును, మధ్యమమున **27-28-29-30** భాగములును, ఉత్తమమున **28-29-30-31** భాగములును చేయవలెను.

శ్లో॥ నవ వింశతి భాగం స్యా త్త్రింశ దంశ విశాలకం।
ఏక త్రింశ ద్విభాగం స్యా ద్ద్వా త్రింశ దంశకం భవేత్॥ 40

క్షుద్ర ద్వాదశ భూమిః స్యా ద్భాగ మేవం ప్రకల్పయేత్।
విశాలే త్రింశ దంశం స్యా దేక త్రింశం చ భాగికం॥ 41

ద్వా త్రింశద్ భాగికం చైవ త్రయ స్త్రింశతి భాగికం।
మధ్యమం ద్వాదశ తల భాగ మానం విశాలకే॥ 42

ద్వా త్రింశతి భాగం స్యా త్త్రియ స్త్రింశశ్చ భాగికం।
చతుస్త్రింశతి భాగం చ పంచ త్రింశ ద్విశాలకే॥ 43

శ్రేష్ఠ ద్వాదశ భూమ్యాశ్చ భాగం కుర్యా ద్విచక్షణః।
కర్ణ పాదస్య బాహ్యేతు మధ్య పాదస్య మధ్యమే॥ 44

ఏవం భాగావసానం స్యా ద్యుక్తి యుక్తం ప్రయోజయేత్॥

తా॥ పదిరెండు అంతస్తులుగల భవనమున అధమము 29-30-31-32 భాగములును, మధ్యమమున 30-31-32-33 భాగములును, శ్రేష్ఠమున 32-33-34-35 భాగములును చేయవలెను. కర్ణముననున్న స్తంభముయొక్క వెలుపలినుండి మధ్య స్తంభముయొక్క మధ్యకు యీ చెప్పబడిన భాగములను చక్కగా సరిపుచ్చవలెను.

శ్లో॥ మూలాది స్తూపి పర్యంతం వేదాశ్రం చాయతాశ్రకం। 45

ద్వ్యశ్రం వృత్తాకృతిం వాఽథ గ్రీవాది శిఖరాకృతిః।
స్తూపికా త్రయ సంయుక్తం ద్వయం వా చైకమేవ వా॥ 46

చతురశ్రాకృతి యత్తు నాగరం తత్ప్రకీర్తితం।
మూలాగ్రం వృత్తమాకారం తద్వృత్తాయత మేవ వా॥ 47

గ్రీవాది స్తూపి పర్యంతం యుక్త్యాఽథ తద్యుగాశ్రకం।
వృత్త స్యాగ్రే ద్వశ్రకం త ద్వేసరం నామకం భవేత్॥ 48

మూలాగ్రాత్ స్తూపి పర్యంతం చాష్టాశ్రకం వా షడశ్రకం।
తదగ్రం చాయతం వాఽపి గ్రీవస్యాథో యుగాశ్రకం॥ 49

పూర్వవ చ్చోర్ధ్వ దేశం స్యా ద్ద్రావిడం పరికీర్తితం।
సమాశ్రక శిఖాయుక్తం చాయామే తచ్ఛిఖాత్రయం॥ 50

ద్వ్యశ్ర వృత్తోపరి స్తూపి వృత్తం వా చతురశ్రకం।
పద్మాది కుడ్మలాంతం స్యా దుక్తవ ద్వా కృతిం న్యసేత్॥ 51

తా॥ ఉపపీఠము మొదలుకొని స్తూపికవరకు నలుచదరము లేక దీర్ఘముగల నలుచదరము రెండు మూలలుగల వృత్తాకారము గుండ్రము కంఠము శిఖరమును స్తూపికలు మూడును, లేక రెండును, ఒక్కటియును కలిగి నలుచదరముగాను, ఉండెనేని అది నాగరము. మొదలు చివర గుండ్రములేక పొడవుగల గుండ్రము కంఠము మొదలు స్తూపిక వరకుచేసి అది చతురశ్రముగాను, చివర గుండ్రముగాను లేక ద్వ్యశ్రముగాను చేయబడినది వేసరము - మొదలునుండి చివర వరకు అనగా స్తూపిక వరకు 8 కోణములుగాని, 6 కోణములుగాని శిఖరమును కంఠము దీర్ఘముగల నలుచదరముగాని లేక సమముగా నలుచదరముగాని మునుపటివలెనే శిఖరమును కలిగి యుండినచో ద్రావిడము, సమ చతురశ్రముగల స్తూపియును పొడవు కలిగినప్పుడు మూడు స్తూపికలును, ద్వ్యశ్రముగా గుండ్రమైనను లేక గుండ్రముగా నున్నను, నలుచదరముగానున్నను, పద్మము మొదలు పై మొగ్గవరకు చెప్పినట్లు రూపమును చేయవలెను.

శ్లో॥ సపాద త్రికమారభ్య షడంగుల వివర్ధనాత్।
చతుర్హస్తావ సానం స్యాత్ ప్రత్యేకం తు చతుర్విధం॥ 52
కన్యసా దుత్తమాంతం స్యా దేకాద్యర్కతలాంతకం।
ఏతేషాం స్తూపి కోత్తుంగ మథజాతి వశాదుచ్యతే॥ 53
శూద్రాణాం చైక హస్తం స్యాద్ ద్విహస్తం వైశ్య జాతీనాం।
సార్ధ ద్విహస్త మానేన యువరాజస్య యోగ్యకం॥ 54
త్రిహస్తం భూపతీనాం వి ప్రాణాం సార్ధ త్రిహస్తకం।
తైతిలానాం చతుర్హస్తం స్తూపి తుంగం ప్రకల్పయేత్॥

తా॥ 3¼ హస్తములు మొదలుకొని 6 అంగుళముల చొప్పున పెంచుచు 4 హస్తముల వరకు 4 విధములు, కనిసము మధ్యమము ఉత్తమము అను వివరములతో 1 మొదలు 12 అంతస్థుల వరకు ఈ చెప్పబడిన యెత్తునకనుసరించి స్తూపికయొక్క యెత్తును చెప్పుచున్నాడు. శూద్రులకు 1 హస్తము వైశ్యులకు 2 హస్తములు యువరాజులకు 2½ హస్తములు, రాజులకు 3 హస్తములు బ్రాహ్మణులకు 3½ హస్తములు, దేవతలకు 4 హస్తములు చేయవలెను.

శ్లో॥ శుద్ధం మిశ్రం చ సంకీర్ణం విమానం త్రివిధం భవేత్।
ఏకద్రవ్యం తు శుద్ధం స్యాద్ ద్విద్రవ్యం మిశ్రహర్మ్యకం॥ 69
త్రిద్రవ్యం హర్మ్యం సంకీర్ణం పాషాణేష్టక దారుణాం।
ఏక ద్రవ్యేణ యుక్తం చ ప్రకుర్యా చ్ఛిల్పవిత్తమః॥ 70

## 45. నాగర ద్రావిడ వేసర భేదములు

### కాశ్యపశిల్పము 25 వ పటలము

శ్లో॥ నాగరాది విమానానాం లక్షణం వక్ష్యతే ఽధునా।
హిమాద్రి కన్య యో రంత ర్గతోదేశ ఉదాహృతః॥ 16

సోఽపిదేశస్త్రిధా భిన్న స్తత్ర ద్దేశోద్భవై ర్గుణైః।
యథై వ దేహినాం దేహం వాత పిత్త కఫాత్మకం॥ 17

తథై వేత జ్జగత్సర్వం విజ్ఞేయం త్రిగుణాత్మకం।
సాత్వికం తామసం చైవ రాజసం చ త్రిధాస్మృతం॥ 18

హిమాద్రి వింధ్యయోరంత ర్గతా సత్వా వసుంధరా।
వింధ్యాది కృష్ణవేణ్యంతా రాజసాఖ్యా మహీమతా॥ 19

కృష్ణవేణ్యాది కన్యాంతం తామసం భూతలం భవేత్।
నాగరం సాత్వికే దేశే తామసే వేసరం భవేత్॥ 20

రాజ సం ద్రావిడే దేశే క్రమా దేవం హి భావయేత్।
సాత్వికే నాగరం హర్మ్యం తామసే వేసరాలయం॥ 21

రాజ సై ర్ద్రావిడం హర్మ్యం క్రమాత్ పుంషండ యోషితః।
విష్ణు ర్మహేశ్వరో ధాతా క్రమాత్ హర్మ్యాధి దేవతాః॥ 22

తా॥ నాగరము మొదలగు విమానములయొక్క లక్షణములను చెప్పుచున్నాడు. హిమాలయము మొదలుకొని కన్యాకుమార్యగ్రము మధ్యనున్న ప్రదేశమును దేశమందురు. అందు వాతావరణము ననుసరించి 3 భేదములు కలిగినవి అవి మానవ దేహములెట్లు వాతపిత్త శ్లేష్మాదులతోనున్నవో అట్లే భూమికూడ యున్నది. ఆ భేదములే సాత్విక తామస రాజసములను కలిగించినవి. హిమాలయము మొదలు వింధ్యపర్వతము వరకు సాత్విక దేశము. వింధ్యాద్రి మొదలు కృష్ణవేణీనది వరకు రాజసదేశము, కృష్ణవేణి మొదలు కన్యాకుమార్యంతము వరకు తామస దేసము సాత్విక దేశమున నాగరము. తామస దేశమున వేసరము, రాజస దేశమున ద్రావిడము, అను హార్మ్యము లేర్పడినవి. వీనిలో నాగరము పురుష రూపమును, వేసరము నపుంసక రూపమును ద్రావిడము స్త్రీరూపమును అని తెలియవలెను. నాగరమునకు విష్ణువును, వేసరమునకు మహేశ్వరుడును ద్రావిడమునకు బ్రహ్మయును అధిపతులని తెలియవలయును.

శ్లో॥ నాగరం భూసురం విద్యాత్ వేసరం వైశ్య ముచ్యతే।
ద్రావిడం తన్నృపం జ్ఞేయం మానతః శృణు సువ్రత॥ 32

కూట కోష్ఠాది నిష్క్రాంతం మాన సూత్రే తు సుస్థితం।
ఉన్నతావన తోపేతా కూట కోష్ఠా యథా క్రమం॥ 24

ఏకాకార తల స్తంభ పత్ర తోరణ సంయుతం।
క్షుద్ర కోష్ఠ సమాయుక్తం మహానా స్యవసానకే। 25

వేదికా జాలకోపేతం కూటం వేదాశ్ర శీర్షకం।
ఏకా నేకతలం వాఽపి సాలింద్రం వాఽపి హీనకం॥ 26

వేదాశ్రం శీర్షకం కంఠం శాలాకార మథాపి వా।
నాగరం భవనంఖ్యాతం తత్తద్దేరే ప్రకల్పితమ్॥ 27

**తా॥** నాగరము విప్రజాతి, వేసరము వైశ్యజాతి, ద్రావిడము క్షత్రియజాతి యగును. కూటములు కోష్ఠములు వానియొక్క నిర్గమము మానసూత్ర ప్రకారము చేయవలెను ఎత్తు వల్లములును, కూటములు కోష్ఠములు యెట్లుండవలెనో వాని ననుసరించి చేయవలెను. ఒక్కటే రూపముగల తలము, స్తంభములును, పత్రతోరణములతోకూడిన చిన్న కోష్ఠములును, మహానాసి పైన వేదికలు జాలకములు కలిగి కూటము నలుచదరముగను, ఒక్క అంతస్తుగాని అనేకమైన అంతస్తులుగాని ద్వారమున అలింద్రములతోగాని లేకుండగాని, శిఖరమును కంఠమును నలు చదరమును, శాలయొక్క ఆకారము వలెనే యుండవలెని, అది నాగరహర్మ్యమగును.

శ్లో॥ ప్రాగ్వత్కూట వినిష్క్రాంతం కోష్ఠ కూటోద్గతం తు వా।
మానసూత్రాద్బహిష్కూటం నీవ్రకూటం తు కోష్ఠకం॥ 28

మధ్యే కోష్ఠం సభద్రం వా విభద్రం వా ద్విజోత్తమ।
పంజరం మానసూత్రేణ కూట నిష్క్రాంతం సాంతరం॥ 29

ఉన్నతావనతో వేలా సౌష్ఠికౌ చ యథాక్రమం।
ఉన్నతం సాంతరం మంచం తంతం ప్రస్తర హీరకం॥ 30

చతురష్టాశ్ర వృత్తాభం క్రమాత్కూటం తలే తలే।
నానా మసూరక స్తంభ వేది జాలక తోరణైః॥ 31

వృత్తాస్య స్ఫాటికైర్హస్తి తుండైః కుంభ లతాదిభిః
హారాంతరేషు మంచోర్ధ్వే క్షుద్ర కోష్ఠయుతం తు వా॥ 32

తత్రైవ హస్తి తుండం వా భద్రనాస్యల్ప మేవవా।
సాంధారం వా నిరంధార మేకానేక తలం తు వా॥ 33

శిరసో వర్తనం కంఠం వృత్తం వాఽష్టాశ్ర మేవ వా।
యుగాశ్రం వా శిరోదేశం విమానం ద్రావిడం భవేత్॥ 34

తా॥ మునుపు చెప్పినట్లు కూటములయొక్క నిర్గమమును, కోష్ఠముల యొక్కయు కూటముల యొక్కయు యెత్తును. మానసూత్రమునుండి వెలుపలకూటములును, నిర్గమకూటములును కోష్ఠములను, మధ్యకోష్ఠమునకు ముఖభద్రమును, లేకున్నను పంజరము మానసూత్ర ప్రకారమును కూటముయొక్క నిర్గమము లోపలనే యుండవలెను. ఎత్తును తక్కువమును, కూడినదరులును, కలిగి చక్కగా నుండవలెను. అంతరములతో గూడిన మంచములు యెత్తుగను, ఆయా ప్రస్తరములకు హీరకములును నలుచదరము 8 కోణములు గుండ్రము ఇట్లు కూటములు అన్ని అంతస్తులయందును చేయవలెను. అనేక విధములయిన అధిష్ఠానములతోను, అనేక విధములైన స్తంభముల తోను, పలువిధములైన వేదికలతోను, వివిధములైన జాలకములతోను, అనేక విధములైన తోరణములతోను, గుండ్రని ముఖము గలిగి తెలుపబడిన యేనుగుల తొండములతోను, కుంభలత మొదలైన వానితోను, హారములయొక్క అంతరములందు మంచములపైన చిన్న చిన్న కోష్ఠములును, అచ్చట యేనుగు తొండములును, ముఖభద్రముగాని, క్షుద్రనాసిగాని, అంధార సహితముగా గాని లేక నిరంధారముగాగాని, ఒక్క అంతస్తుగాని అనేక అంతస్తులుగాని, గుండ్రని శిఖరమును కంఠమును లేక 8 కోణములును, లేక నాలుగు కోణములును, కలిగినది ద్రావిడవిమానమగును.

శ్లో॥ తదేవ చరణాధార మేకాకారం తు కల్పయేత్।
హారాంతరే విశేషేణ కల్పం వృత్తం స్ఫుటోదయం॥ 35

సమం తు కూట కోష్ఠాదౌ సాంతర ప్రస్తరాన్వితౌ।
హీనో వాఽంతర మంతోర్ధ్వే నిష్క్రాంతం సమసూత్రకం॥ 36

హారాంతరే తు కర్తవ్యం భద్రం వా భద్రపంజరం।
కపోత పంజరాఢ్యం వా సాంతర ప్రస్తరాన్వితం॥ 37

సర్వేషాం కర్ణ కూటానా మాశీర్షం తు యుగాశ్రకం।
వస్వశ్రం వేదికోపేతం మండలం శీర్షకం గలం॥ 38

వస్వశ్రం వాశిరః కంఠం యుగాశ్రం వా ప్రకల్పయేత్।
ఏతచ్చ ద్రావిడం ఖ్యాతం హోమాద్యా కుడ్మలాంతరం॥ 39

వస్వశ్రం వా షడశ్రం వా తచ్చ ద్రావిడ ముచ్యతే।
ఏవం త్రివిధం నిత్యంతు ప్రోచ్యతే ద్రావిడాలయమ్॥ 40

తా॥ పైన చెప్పబడి యున్నదే స్తంభములయొక్కయు అధిష్ఠానము యొక్కయు స్వరూపము ఒక్కజాతిగనే యుండవలయును. హారములలో గుండ్రమును చేయవచ్చును. కూటకోష్ఠములు

సమానమైన యెత్తుతోను, అంతరములును ప్రస్తరములను కలిగిగాని, లేకుండగాని, అంతరముల పైన సమసూత్రముతో నిర్గమమును, హారముల మధ్య ముఖభద్రముగాని భద్రపంజరముగాని లేక కపోత పంజరముగాని ప్రస్తరములను చేయవలెను. అష్టకర్ణకూటములకు శిఖరమునకు నలుచదరమే యుండవలెను. వేదిక 8 కోణములతో నుండవలెను. కంఠము సూత్రము 8 కోణములును శిఖరము గుండ్రమును కలిగియుండ వలెను. లేక శిఖరము కంఠము నలుచదరముగాను చేయవచ్చును. ఇది ద్రావిడ హర్మ్యము. అధిష్ఠానము మొదలుకొని స్తూపివరకు 8 కోణములుగాని లేక 6 కోణములు గాని కలిగియున్నను, అదియును ద్రావిడ హర్మ్యమే యగును. ఇట్లు మూడు విధములని యెఱుగ వలెను.

శ్లో॥ వేసరం కూటకోష్ఠాది నీడకం సమ సూత్రకం।
వృత్తాకార శిరోపేతం కర్ణకూట ప్రకల్పితం॥ 41

వృత్త గర్భ గృహాకారం బాహ్య వృత్తాభ మేవవా।
వృత్త గ్రీవ శిరోపేతం యథేష్టం శిఖరేణవా॥ 42

సాలింద్రం వా స భద్రం వా ప్యేకా నేకతలం తు వా।
సమాశ్రం వా యతాశ్రం వా వృత్తం వృత్తాయతం తు వా॥ 43

ద్వ్యశ్ర వృత్తాయతం హర్మ్యం కూటకోష్ఠాదిభి ర్యుతం।
ఉన్నతావన తోపేతౌ కూటకోష్ఠౌ యథాక్రమం॥ 44

సమౌ వా కూటకోష్ఠాద్వౌ బాహూ భూమ్యేక మేవవా।
వేసరం భవనం ఖ్యాత మథవాఽన్య ప్రకారతః॥ 45

జన్మాది స్తూపి పర్యంతం యుగాశ్రం నాగరం భవేత్।
వస్వాశ్రం శీర్షం కంఠం వా ద్రావిడం భవనం భవేత్॥ 46

వృత్తగ్రీవ శిరోపేతం వేసరం హర్మ్య మీరితం।
కూటకోష్ఠ విహీనానాం హర్మ్యాణాం కథితం త్విదమ్॥ 47

తా॥ వేసరహర్మ్యము కూటము కోష్ఠము నీడ్రములతోను, సమసూత్రమునను గుండ్రని శిఖరమును కర్ణకూటములతోను గుండ్రని ఆకారముతోను గుండ్రని గలము శిఖరమును, యిట్లు యిష్టము వచ్చినట్లు శిఖరముతోను, ద్వారము ప్రక్కను అలింద్రములుగాని ముఖభద్రములుగాని యేకతలముగాని అనేక తలములుగాని నలుచదరముగాని దీర్ఘముగల నలుచదరముగాని గుండ్రము గాని లేక కోడిగ్రుడ్డు ఆకారముగాని రెండు కోణములు వచ్చునట్లు వృత్తాయతముగాని కూటము కోష్ఠము మొదలైనవానితో గూడి యెత్తును పల్లమును కలిగిన కూటకోష్ఠములయొక్క కొలతల భేదములతోను, లేక కూటకోష్ఠములు సమానమైన యెత్తుతోను, సమబాహువులతోనున్న యేకతలముగాని. యిట్టి పద్ధతులు గలది వేసరమగును. లేక ఉపానము మొదలు స్తూపిక వరకు

నలుచదరము కలది నాగర హార్మ్యమగును. కంఠము శిఖరము 8 కోణములు కలది ద్రావిడ హార్మ్యమగును. కంఠము శిఖరము గుండ్రముగా నున్నది వేసర హార్మ్యమగును. కూటములు కోష్ఠములు లేకుండినను యిట్లే యుండవలయును.

శ్లో॥ నానాధిష్ఠాన సంయుక్తం గళం పత్యంఘ్రి భేదకం।
సర్వత్ర వృత్త పాదం వా వేసరే భవనే కుతు॥ 48

బింబం చ పీఠికాం చైన ప్రాసాదం చైక జాతికం।
సర్వ సంప త్సమృద్ధిః స్యాత్ స్వపక్షేః రాష్ట్ర వర్ధనః॥ 49

విపరీతే విపరీతం వా రాజ రాష్ట్ర భయంకరం।
తస్మా త్సర్వం ప్రయత్నేన ఏక జాత్యైవ మాచరేత్॥ 50

నాగరే సకలం శాంతం వేసరే యాన వర్తనం।
భోగం వీరం చ నృత్తం చ ద్రావిడే భవనే భవేత్॥ 51

అన్యధాచే ద్విపచై్చ కర్తుః కర్తు స్తథైవచ।
నాగరాది విధిః ప్రోక్తో గర్భన్యాస విధిం శృణు॥ 52

ఇతి కాశ్యపశిల్పే నాగరాది విధిః పంచ వింశః పటలః

తా॥ అనేకమైన అధిష్ఠానములును, గళము అనేక భేదమును, స్తంభములు అనేక భేదములను, స్తంభములన్నియును గుండ్రముగాను యున్నది వేసరహార్మ్యము పీఠము ప్రాసాదము, ఒక్కటే జాతిచే యుండవలయును. సర్వసంపదలు కలుగును లేక రెండు జాతులు మూడు జాతులు కలిపిన యెడల భయంకరమైన యుపద్రవములు కలుగును. నాగర హార్మ్యమున విగ్రహములన్నియును శాంతస్వరూపముతో నుండును. వేసర హార్మ్యమున విగ్రహములన్నియును నడచుచున్నట్లుండును. ద్రావిడ హార్మ్యమునందు భోగమును అనుభవించుచున్నట్లును వీర రసముతోను నృత్యగీతాది భంగిమములతోను ఉండును. ఇట్టి లక్షణములన్నిటిని శిల్పాచార్యుడు బాగుగా తెలిసికొని చేయవలెను. లేని యెడల చేయునట్టి వారికిని చేయుచున్న వారికిని ఆపదలు కలుగును.

ఇది శ్రీమద్విశ్వకర్మ వంశమూలర్షి పంచకమధ్య మాహాభానసగోత్ర పవిత్ర, స్వర్ణాచ్చమాంబా వేంకటశివార్యపౌత్ర, లక్ష్మాంబాకోటయసుధీమణిపుత్ర, శ్రీమద్గాయత్రీ విరాడ్విశ్వకర్మ వరప్రసాద జనితకవితా సుధారసపాత్ర, పదవాక్య ప్రమాణనిధాన విమర్శకాచార్య శిల్పకళాకోవిద సర్వతంత్ర స్వతంత్ర స్థపతి తిలకాది బిరుద విరాజమాన సుబ్రహ్మణ్యాభిధాన విరచిత నానా వాస్తుశిల్పాగమ శాస్త్ర పరిశీలనాత్మ కాంధ్ర తాత్పర్యసహిత భారతీయ మహాశిల్పమునందు స్తంభ లక్షణ భేదములు ప్రస్తరలక్షణభేదములు శిఖరలక్షణము స్తూపికాలక్షణము, మూర్తిన్యాసము అను

ద్వితీయ కళ

శ్రీ ర స్తు

# భా ర తీ య మ హా శి ల్ప ము

## తృ తీ య క ళ



### 1. ఇ ష్ట దే వ తా స్తు తి

శ్లో॥ మాయయా వైభవ కల్పితా గుణమయా బ్రహ్మాండ భాండాంతరే।
జీవౌఘ స్తదధిషితాశ్చ వివిధా యస్య ప్రతిష్ఠా యన్మయాః।
ఆత్మానం పరమం త మాశ్రితవతై ర్ధ్యాతక్త్యైః సదా స్వస్తికై।
తన్విష్టం భువనైకనాథ మనిశం వందే విరించాధిపమ్॥

త్రిపుర పురత్రయ రచనా యుక్తా రచనా కస్య చాతురీ జాతా।
శిల్పివరం తం దనుజై రర్చిత చరణం మయం వందే॥ (శిల్పరత్నము)

### 2. గ ర్భ న్యా స ము

కాశ్యపశిల్పము 23 వ పటలము

శ్లో॥ అథ వక్ష్యే విశేషేణ గర్భన్యాస విధిం పరం।
ప్రాసాదం దేహ మిత్యుక్తం తస్యాంతర్వాస్తుగర్భకమ్॥ 1

గురుహీనే గృహే విప్ర సకృత్యాలం నవాసకం।
అహ మన్యశ్చ వేదాశ్చ నవసేయు రగర్భకమ్॥ 2

తస్మా త్సర్వ ప్రయత్నేన గర్భన్యాసం తు కారయేత్।
శ్రీప్రదం ప్రాణినాం గర్భ మితరే శ్రీకరం భవేత్॥ 3

అధిష్ఠాన ప్రతే రూర్ధ్వే భూసురాణాం హితాయవై।
కుముదోర్ధ్వే నృపాణాం తు జగత్యూర్ధ్వే విశాం వరమ్॥ 4

హోమోర్ధ్వే గర్భవిన్యాసం శూద్రాణా మభివృద్ధిదం।
సర్వ జాత్యంతం సంప్రోక్తం భూమౌ త్వాదేష్టకోపరి॥ 5

ప్రాసాదే మండపే చైవ ప్రాగ్ద్వారే గోపురే తథా।
పరివా రాలయే చైవ గర్భన్యాసం తు కారయేత్॥ 6

యత్రై శివా ద్యేష్టకాన్యాసం తత్ర గర్భం నిధాపయేత్।
సౌవర్ణం రాజతం తామ్రం శ్రేష్ఠం మధ్యాధమం క్రమాత్॥ 7

కాంస్యే నైవాథవా విప్ర కర్తవ్యం గర్భ భాజనం।
పంచాంగులం సమారభ్య యావద్వై వింశ దంగులమ్॥ 8

ఏకైకాంగుల వృద్ధ్యా తు కలా సంఖ్యా తు భాజనం।
ఏకాది షోడశాంతానాం భూమీనాం తు యథాక్రమమ్॥ 9

గర్భ భాజన తారాస్తే త్వంఘ్రి మూలతరం తు వా।
గర్భ భాజన విస్తారం విస్తార సదృశోన్నతమ్॥ 10

భాజనోచ్ఛ్రస్య భాగైకం వితాన స్యోచ్ఛ్రయం భవేత్।
భాజనే ద్వ్యత్రి పాదాంతం వితానాలంబనం ద్విజ॥ 11

యవైక వ్యాస మారభ్య షడ్యవార్ధైః కోష్ఠ విస్తృతం।
స్థాలోచ్ఛం త్రి చతుర్భాగం కోష్ఠ మిత్యుదయం భవేత్॥ 12

మధ్య కోష్ఠే న్యసే త్పూర్ణం మంత్ర నీల సమన్వితం।
తత్పూర్వాద్యష్టకోష్ఠేషు పరితో ద్విజ సత్తమ॥ 13

అనంతాది శిఖండ్యంతం మూల మంత్రం నిధాపయేత్।
తద్బాహ్యే షోడశే కోష్ఠే పూర్వాది క్రమ యోగతః॥ 14

అకారాది విసర్గాంత స్వరాన్ న్యస్యాత్ క్రమేణ తు।
రత్న హేమాని ధాన్యాని ఫలాన్యంతరకే న్యసేత్॥ 15

మృత్కంద ధాన్య పత్రాణి గర్భగర్తేషు విన్యసేత్।
స్థల శుద్ధిం తతః కృత్వా గవ్య మన్త్రై త్యుదాహరన్॥ 16

మాణిక్యం విన్యసే త్కూటే కూటాక్షర ముదాహరన్।
అనంతే విన్యసే ద్వజ్రం సౌమే మౌక్తికం విన్యసేత్॥ 17

శిలోచ్ఛ్రయే త్వింద్ర నీలం స్యాత్ స్ఫటికం త్వేక నేత్రకే।
ఏక రుద్రే తు శంఖం స్యాత్ సావి త్రే పుష్యరాగకమ్॥ 18

శ్రీకంఠే సూర్యకాంతం స్యా చ్ఛిఖండౌ తు విదూరకం।
స్వర్ణేన జగతీం కృత్వా ఆకారే విన్యసే ద్బుధః॥ 19

కపాలం రజతే నైవ ఇకారే తు నిధాపయేత్।
తంత్రే చైవతు తం కుంభ ముకారేద్విజ సత్తమ॥ 20

ఆరకూటేన తద్ద్వారం గకారే తు నిధాపయేత్।
కాంస్యే నైవపినాకం తు అకారే విన్యసే ద్బుధః॥ 21

సీసేన పరశుం కృత్వా ఏకారే తు నిధాపయేత్।
త్రపుణాహరిణం కృత్వా ఓంకారే తు నిధాపయేత్॥ 22

త్రిశూల మాయసేనైవ ఉంకారే తు నిధాపయేత్।
స్వర్ణేన వృషభం కృత్వా కూటాక్షరే నిధాపయేత్॥ 23

ఆకారే విన్య సేచ్ఛమ్యా మీకారే తు మనః శిలాం।
ఊకారే జాతి లింగం తు ఋకారే గైరికాం న్యసేత్॥ 24

సౌరాష్ట్రిం చైవ ౠకారే ఏకారే త్వం జనాం న్యసేత్।
గోరోచనం తథోంకారే విసర్జే తిల ధారకం॥ 25

తద్బీజం సమను స్మృత్య విన్యసేత్ తత్క్రమేణ తు।
యవా నీవారశాలీ చ ప్రియంగుతిల సర్షపమ్॥ 26

ముద్గాని సప్తబీజాని పూరయే ద్గర్భభాజనే।
విధాయ చ విధానేన సుస్నిగ్ధం సుదృఢం కురు॥ 27

తా॥ గర్భభాజన విధానమును చెప్పుచున్నాడు. ఆలయమును దేహమునియును, దాని లోపలి ప్రదేశమును గర్భమనియును చెప్పుదురు. శాస్త్రమునకు సరిశాక యెక్కువయైనది కాని, లేక తక్కువయైనదికాని, ఆలయమును రచించరాదు అందొకప్పుడును దేవతా తేజస్సుండదు. కనుక గర్భన్యాసమును చేయవలయును. సమస్తమైన వారికిని శుభముల నిచ్చుటకు అధిష్ఠానముయొక్క పైభాగమున బ్రాహ్మణులును కుముదముయొక్క పైభాగమున క్షత్రియులును, జగతియొక్క పైభాగమున వైశ్యులును, హోమముయొక్క పైభాగమున శూద్రులును, చేయుట శుభము. సమస్తమైన వారును భూమియందు మొదటి రాయినుంచునపుడు చేయవచ్చును. ప్రాసాదము మండపము, గోపురము. వీనియొక్క ముఖద్వారముల యందును, పరివార దేవతల యాలయములయందును, గర్భన్యాసమును చేయువలయును. ఎచ్చట మొదట యిటుకను పెట్ట బడునో అచ్చట గర్భము నుంచవలయును. బంగారము, వెండి, రాగి, యివి వరుసగా ఉత్తమము. మధ్యమము కనీసము అనబడును. లేక కంచుతోనైనను గర్భభాజనమును చేయవచ్చును 5 అం. మొదలుకొని, 20 అం. వఱకు ఒక్కొక్క అంగులము చొప్పున పెంచుచు 16 విధములుగా చేయ వచ్చును. ఇవి ఒక అంతస్తు మొదలు పదునాఱు అంతస్తుల వఱకు క్రమముగా నుండవలెననుట, గర్భభాజన విస్తారము స్తంభము మొదలుతో సమానముగను చేయవచ్చును. ఎత్తు విస్తారముతో సమానము, భాజనము యెత్తులో పాతికవంతు ఉల్లెడ యెత్తుండ వలయును. భాజనములో సగము గాని ముప్పాతిక యెత్తుగాని ఉల్లెడ నడుము యెత్తుండవలెను. పళ్ళెము ప్రక్క యెత్తులో శివ వంతు గాని 4వ వంతుగాని గది యెత్తుండవలెను. నడిమి గదియందు శిఖరమునుంచి దానిపై యింద్ర

నీలము నుంచవలెను. దాని చుట్టును తూర్పు మొదలగు ఎనిమిది గదుల యందును అనంతుడు మొదలు బ్రహ్మవఱకు మూల మంత్రములనుంచి దాని వెలుపల పదునారు గదులనుంచి అ ఆ ఇ ఈ ఉ ఊ ఋ ౠ ఌ ౡ ఎ ఏ ఐ ఒ ఓ ఔ అం అః, అను అక్షరములు పూర్వాదిక్రమముగా నుంచి రత్నములు, బంగారము, ధాన్యములు, ఫలములు లోపల నుంచవలయును. ఇవియన్నియును గర్భముయొక్క గుంటయందు శ్రేష్ఠమైన మృత్తికలను, దుంపలును, ధాన్యములను, పత్రములును ఉంచవలయును ఆ పళ్ళెమును పంచగవ్యములతో మంత్రయుక్తముగా శుద్ధిచేసి నడుమ మాణిక్యమును, అనంతుని స్థానమున వజ్రమును, ఈశాన స్థానమున ముత్యమును, భూధర స్థానమున యింద్రనీలమును, విశ్వేశ పదమున స్ఫటికమును, వీరభద్రపదమున శంఖమును, సావిత్ర పదమున పుష్యరాగమును, శ్రీకంఠ పదమున సూర్యకాంతమును, బ్రహ్మస్థానమున వైడూర్యమును స్థాపించి బంగారముతో వేదికను కల్పించి అకారము నందుంచవలెను. వెండితో కపాలమునుచేసి ఇకారమునందుంచవలెను. కుంభమును తంతువులతో చుట్టి దానిని ఉకారమునందుంచవలెను, ఇత్తడితో ద్వారమునుచేసి గకారమునందుంచవలెను. కంచుతో బిల్లునుచేసి అకారమునందుంచవలెను. సీసముతో పరశువునుచేసి ఏకారమున నుంచవలెను సత్తుతో లేడినిచేసి ఓంకారమున నుంచవలెను. ఇనుముతో త్రిశూలమునుచేసి అంకారమున నుంచవలెను, బంగారముతో వృషభమును చేసి మధ్యాక్షమున నుంచవలెను. ఆకారమున శ్యామమును, ఈకారమున మణిశిలను, ఊకారమున జాతిలింగమును, ౠకారమున గైరికమును, ౡకారమున సౌరాష్ట్రమును, ఏకారమున అంజనమును, ఓకారమున గోరోజనమును, నిలిపి సూత్రములతో ధారాగతమును చేయవలెను. ఆ బీజముల వరుస ననుసరించి వరుసగా యవ, వ్రీహి, శాలి, ప్రియంగు, తిల, సర్షప, ముద్గ నామములుగల సప్తధాన్యములను గర్భభాజనములనుంచి చక్కగా స్థిరముగా నుంచవలెను

శ్లో॥ ప్రాసాదస్యోత్తరే చాగ్రే పంచ షట్సప్త హస్తకాం।
షోడశ స్తంభ సంయుక్తాం ప్రపాంకృత్వా ఒతి సుందరామ్॥ 28

విధానే నోర్ధ్వ మాచ్ఛాద్య తదంగైః స్తంభవేష్టనైః
ద్వార తోరణ సంయుక్తం దర్భమాలాది భూషితమ్॥ 29

మండపస్య త్రిభాగైకం మధ్యే వేదిం ప్రకల్పయేత్।
హస్త మాత్ర సముత్సేధం తాలమాత్ర మథాపి వా॥ 30

పరిత స్త్వగ్ని కుండాని మహాశాలం ద్విజోత్తమ।
చతురశ్రం ధను ర్వృత్తం పద్మం ప్రాగాదిషు క్రమాత్॥ 31

త్రిమేఖల సమాయుక్తం నాభియోని సమన్వితం।
దర్పణోదర సంకాశం కుండ వేదిస్థలం కురు॥ 32

తచ్ఛిల్పిప్రవర ముద్వాస్య గోమయా లేపనం కురు।
పిష్ట చూర్ణై రలంకృత్య పుణ్యాహం ప్రోక్షణం కురు॥ 33

వేదీద్వే స్థండిలే కుర్యా చ్చతుర్ద్రోణైస్తు శాలిభిః।
తిల తండుల లాజైశ్చ దర్భైః పుష్పైః పరిస్తరేత్॥ 34

గంధ పుష్పాదిభిః పూజ్యా దిగ్దేవా నామ మంత్రకైః।
గవ్యాభిషేచ్య ఫలం తు స్నాపయేద్గంధతోయకైః॥ 35

తంతునా కౌతుకం బద్ధ్వా నవ వస్త్రేణ వేష్టయేత్।
స్థండిలేతు నిధాతవ్యం కూటాక్షర సమాహ్వయమ్॥ 36
పరితో ఉష్టౌఘటాన్ న్యస్య ససూత్రాన్ సవిధానకాన్।
సకూర్చాన్ వస్త్ర సంఛాద్యాన్ సగంధాన్ పరితః క్రమాత్॥ 37

విశ్వేశ మాది కుంభస్థం స్తోత్రాభ్యర్చ్య సమంత్రతః।
కుండానాం పంచ సంస్కారం కృత్వా హోమం సమాచరేత్॥ 38

అగ్న్యాధా నాదికం సర్వ మగ్నికార్యోక్త మాచరేత్।
సమిదాజ్య చరుంల్లాజ తిల తండు సర్షపాన్॥ 39

హృదయాది షడంగైశ్చ ఈశానేన క్రమేణ తు।
హోమం కృత్వా విశేషేణ ప్రత్యేకాష్ట శతాహుతిః॥ 40

ద్రవ్యాంతే వ్యా హృతీర్హుత్వా మూలే నైవ శతాహుతీః।
జయాది రభ్యాదా నైశ్చ రాష్ట్రి భృచ్చైవ హోమయేత్। 41

ఏవం జాగరణం రాత్రౌ ప్రభాతే సుముహూర్తకే।
సునక్షత్రే శుభలగ్నే తు సు తిథౌచ సువారకే॥ 42

శివ ద్విజ కులే జాతః స్వాచార్యః శివదీక్షితః।
స్నానద్వయ సమాయుక్తః సకళత్రః సవిగ్రహః॥ 43

సిత వస్త్రోత్తరీయశ్చ సిత మాల్యానులేపితః
ఆచార్యాన్ పూజయే త్తత్ర వస్త్ర హేమాంగులీయకైః 44
శిల్పినః పూజయే త్తత్ర వస్త్రైరాభరణాదిభిః॥
గర్భస్థానం ప్రవిశ్యాథ కర్తా చాచార్య శిల్పి చ॥ 45

అష్టధా విభజే ద్భిత్తిం బాహ్యా తశ్చ తు ర స్త్ర్య జేత్।
త్రీణి చాభ్యంతరే వర్జ్య శేషాంశే భాజనం న్యసేత్॥ 46

నదీ సంగ్రాహ్య వల్మీకం హలాగ్రే కులీరపదేః
నాగ వృషభ శృంగే చ ష్టమ్య ద్గ్రాహ్య దేశతః 47

గర్భ గర్తే నమోచ్చార్య కందాన్ న్యస్యే త్తతోబుధః
మధ్యమే త్వంబుజం న్యస్యా త్పూర్వే కుముద కందకమ్॥ 48

దక్షిణే చోత్పలం కందం సౌగంధిం పశ్చిమే న్యసేత్।
సౌమ్యే ఉశీరకందః స్యా ద్బీజం తదుపరి న్యసేత్॥ 49

పూర్వేతు విన్యసే చ్ఛాలిం వ్రీహిం వై దక్షిణే న్యసేత్।
పశ్చిమే కోద్రవం విద్యా న్మాష ముత్తరతో న్యసేత్॥ 50

పావకే విన్యసే న్ముద్గాన్ నైర్ఋత్యాం కంగు పూజకైః।
ప్రియంగు వాయుదిగ్భాగే ఐశాన్యేతు కుళత్థికమ్॥ 51

ఏవం న్యస్యహృదం మంత్రాం స్తథా వై గర్భభాజనమ్।
సర్వ వాద్య సమాయుక్తం నృత్తగేయ సమన్వితమ్॥ 25

జయ శబ్ద సమాయుక్తం బ్రహ్మ ఘోష సమన్వితం।
ప్రాసాద బీజ ముచ్చార్య స్థాపయే ద్గర్భభాజనమ్॥ 53

శైలై ర్వా ఇష్ట కాభి ర్వా సుధయా సుదృఢం కురు।
గంధ పుష్పాదిభిః పూజ్య ప్రాసాదం కల్పయేత్సుధీః॥

గర్భన్యాస విధిః ఖ్యాత స్తత స్త్వేకతలం శ్రుణు॥ 54

ఇతి కాశ్యపశిల్పే గర్భన్యాస విధిః షడ్వింశః పటలః

తా॥ దేవాలయముయొక్క ఉత్తరమునగాని ముందుగాని 5-6-7 హస్తముల విస్తారముతో పదునాఱు స్తంభములు సమానగదులతో నుండునట్లు స్థాపించి, ఆపైన కప్పువేసి స్తంభములకు వస్త్రములనుచుట్టి ద్వారములు తోరణములు దర్భమాలలు మొదలగు వానితో నలంకరించి మండపముయొక్క మధ్యప్రదేశమున ఒక హస్తముయెత్తున వేదిక చదరముగాను, దానిచుట్టును నాలుగు కుండములును అనగా తూర్పున నలుచదరమును, దక్షిణమున ధనురాకారమును, పడమర గుండ్రమును, ఉత్తరమున ఎనిమిది దళములపద్మము వలెను కుండములు మూడు మేఖలములతోను, నడుమ విశాలముతో సమానమైన లోతును చదరమును కలిగి యుండునట్లును, చేసి శిల్పివ్రతమున కుద్వాసముచెప్పి ఆవు పేడతో అలికించి వరిపిండితోగాని లేక రాతిపిండితోగాని ముగ్గులు వేసి పుణ్యాహవాచనముచేసి వేదియందు రెండుచోట్ల సంస్కారములు జరిపి వస్త్రములను పఱచి వానిపై బియ్యమునుపోసి నువ్వులు, పేలాలు, దర్భలు, పుష్పములు, చుట్టునుంచి దిక్పాలకులను-గంధపుష్పాదులతో పూజించి గంధమునుచల్లి గందపు నీటితో స్నానము చేయించి

కౌతుకములను దారముతోచుట్టి నూతన వస్త్రమునుచుట్టి సంస్కరింపబడిన ప్రదేశమునసుంచి మూల బీజమునందుంచి దాని చుట్టును ఎనిమిది కుంభములను సూత్రకూర్చ పత్ర గంధ పుష్పాది సహితముగ వరుసగా నలుదిశల యందును, నాలుగు మూలలయందును ఉంచి ఆయా మంత్రములతో ఆయా దేవతలను షోడశోపచారములతో పూజించి కుండములను పంచసంస్కారములు జరిపి హోమములను చేయవలయును. అగ్నిప్రతిష్ఠాది కార్యములు శాస్త్రోక్తముగా జరుపవలెను. సమిధలు, అజ్యము, చరువు లాజలు తిలలు తండులములు సర్షపములు, కరన్యాస, అంగన్యాస సహితముగ ఈశానమంత్రముచేత నూటయెనిమిది హోమములుచేసి తరువాత ఓంకార యుక్తముగా మూలమంత్రముచేత నూఱు హోమములను చేయవలయును. యజమానుడు జయాది హోమములను చేయవలయును. ఇట్లు రాత్రియంతయు జరిపి తెల్లవారిన తరువాత పంచాంగశుద్ధిగల శుభ ముహూర్తమున కర్త ధర్మపత్నీ సహితముగ మలస్నానమును, శుద్ధిస్నానమునుచేసి, విగ్రహమును గూడ అదే తీరున స్నానములు రెండును చేయించి తెల్లని వస్త్రమును, ఉత్తరీయమును, గంధపు పూతయును, తెల్లని పూలదండలును, కలవాడై శివబ్రాహ్మణ కులోత్పన్నుడును, శివదీక్షాపరుడును అగు ఆచార్యులను వస్త్రములు సువర్ణాంగులీయకము మొదలగు వానితో పూజించి శిల్పులను వస్త్రా భరణాదులతో పూజించి గర్భస్థానమున ప్రవేశించిన తరువాత యజమానుడును శిల్పియును ఆచనముచేసి గోడను ఎనిమిది భాగములుగాచేసి, వెలుపల నాలుగు భాగములను వదలి లోపల మూడు భాగములను వదలి మిగిలినచోట పళ్ళెము నుంచవలెను, వీటిమన్ను రెండునదులు కలిసిన చోటమన్ను, సముద్రము దరిమన్ను, నాగలిని అంటుకొన్నమన్ను, ఎండ్రకాయ బొక్కలోని మన్ను, పుట్టమన్ను, ఏనుగుకొమ్ము తగిలిన మన్ను, ఎద్దుకొమ్ము తగిలిన మన్ను, ఇవి సమకూర్చి ఆచార్యుడు వేదమంత్ర యుక్తముగ గర్భగర్తమును పూడ్చవలయును. ఆపైన నడుమ పద్మములను తూర్పున కలువదుంప. దక్షిణమున నల్లకలువదుంప. పడమర సౌగంధికము, ఉత్తరము వట్టివేరు ఉంచి ఆపైన తూర్పునశాలి. దక్షిణమున వ్రీహి. పడమరకోద్రవ, ఉత్తరమున మాష, ఆగ్నేయమున ముద్గ, నైరృతిన కంగు, వాయవ్యమున ప్రియంగు, ఈశాన్యమున కుళుత్థ, ధాన్యముల నుంచవలయును. తదుపరి మంత్రయుక్తముగ పళ్ళెము గర్భమున నుంచునపుడు సమస్త శుభ వాద్యములును, వేదమంత్రములును, నృత్తగీతములును, జయశబ్దములును, సమృద్ధిగా నుండ వలయును. ప్రాసాద బీజము నుచ్చరించుచు భాజనము నుంచవలయును తామ్రితోగాని, ఇటికతో గాని, సున్నముతోగాని, గట్టిగా బిగించి గంధ పుష్పాదులతో పూజించి దేవాలయమును రచించ వలయును. మానసారమున జెప్పబడిన విశేషాంశములు.

మానసారము 12 వ అధ్యాయము

శ్లో॥ హేవాస్తో త్వహగర్భస్య వృద్ధిం కురు నమామ్యహమ్॥ 22
బ్రహ్మాది దేవతానాం చ ఓంకారాది నమో ఒంతకమ్।
తత్తత్ స్వనామ మంత్రేణ అర్చయే ద్వాస్తు దేవతాః 23
క్షాళయే త్పంచ గవ్యైస్తు గర్భ మంజూషికాం బుధః।
సూత్రై రావేష్టనం కుర్యా త్తస్యచోపరి విన్యసేత్॥ 24
తదేవ గంధజలైః పూర్ణ కుంభం వినిక్షిపేత్।
పరితస్తు చతుర్వింశ త్కలశాన్ జలపూరితాన్॥ 25

నిక్షిప్య సూత్రై రావేష్ట్య వస్త్రం పల్లవ కూర్చకైః।
అలంకృత్య స్థపతిశ్చ వర వేషోత్తరీయవాన్॥ 26
గంధ పుష్పైః సమభ్యర్చ్య భువనాధిపతిం జపేత్।

(శివాలయమున)

కపాలం చ త్రిశూలం చ ఖట్వాంగం పరశుం తథా।
వృషభం చైవ పినాకం చ హరిణం శార్ఙ్గ మేవచ॥ 50
ఏవం చాష్ట విధం రూపం సావర్ణేన ప్రకల్పయేత్।
ఇంద్రాది కోష్ఠేషు కపా లాది కాన్ విన్యసేత్ క్రమాత్॥ 51

(కలశ పూజయందు)

శ్లో॥ స్రష్టారం విశ్వకర్మాణం ధ్యానం కృత్వా తు వా ఒర్చయేత్॥ 56
సృష్టి స్థితి లయాధారం భువనాదిపతిం మనాక్।
గంధ పుష్పాది ధూపైశ్చ నైవేద్యాదిభి రర్చయేత్॥ 57

(విష్ణ్వాలయమున)

శ్లో॥ విష్ణు దిష్ణ్యస్య గర్భాంతం రుద్ర చిహ్నాం విసర్జయేత్।
ప్రాగుక్తం ద్రవ్య సంయుక్తం విష్ణు చిహ్నాని యోజయేత్॥ 68
మధ్యే చక్రం చ హైమేన భాజనాంతం వినిక్షిపేత్।
రౌప్యేణ శంఖం తామ్రేణ చాపం చైవతు వామకే॥ 69
త్ర పు సీసేన ఖడ్గం చ వాయవ్యేన తు దక్షిణే।
ప్రాఙ్ముఖే తార్క్ష్యరూపం చ హేమజేన ప్రకారయేత్॥ 70

(బ్రహ్మాలయమున)

శ్లో॥ యత్ర వస్తూని వాస్తూని బ్రహ్మస్థానే విశేషతః॥ 71
బ్రహ్మ గర్భం క్షిపేత్కాలే తస్య చిహ్నాం చ యోజయేత్।
ఓంకారం నిర్మితం హేమ్నా మధ్యకోష్ఠే తు విన్యసేత్॥ 72
హేమజం యజ్ఞసూత్రం స్యా దోంకారస్యోపరి న్యసేత్।
స్వస్తికాదీని స్వర్ణేన చతుర్దిక్షు వినిక్షిపేత్॥ 73
కమండలుం వా తత్రైవ తామ్రేణైవ చ నిర్మితం।
అక్షమాలాం చ తామ్రేణ కృష్ణ చర్మ చ వామకే॥ 74

గర్భన్యాసం చ రాత్రౌ చ దివాకాలేష్టకా భవేత్॥ 108

తా॥ గర్భన్యాసము మంత్రయుక్తముగా రాత్రి చేసినను యిటికలనుగాని రాళ్ళనుగాని రాత్రియందు స్థాపించరాదు కనుక ప్రాతఃకాలమున రాళ్ళను భిగించ వలయును.

## 3. ఏకతల విధానము

### కాశ్యపశిల్పము 27 వ పటలము

శ్లో॥ అథవక్ష్యే విశేషేణ హర్మ్య మేకతలం శృణు।
తస్య విస్తార తుంగం చ ప్రోక్తం ప్రాసాదమానకే॥ 1
యుగాశ్రం వృత్త మాయామం వస్వశ్రం చ షడశ్రకం।
అష్టాశ్ర మాకృతి స్త్వేషాం శిఖరే ఒపి తథైవ చ॥ 2
హర్మ్య తారార్ధమానం తు కన్యసం ముఖమంటపం।
హర్మ్య తారసమం శ్రేష్ఠం తయోర్మధ్యే ఒష్ట భాజితే॥ 3
ముఖ మండప దైర్ఘ్యం తు నవధా కథితం మయా।
ప్రాసాద సదృశం వ్యాస ముత్తమం మండపత్రయం॥ 4
ప్రాసాద వేశనం శ్రేష్ఠం దండం వా సార్ధ దండకం।
ద్విదండం వా ప్రవేశం తు మానసూత్రం ద్విజోత్తమ॥ 5
అంతరాల సమాయుక్తం యుక్తి సర్వాంగ శోభితం।
సావకాశాంతరాలం చ దీర్ఘం ద్వి త్రి చతుష్టయమ్॥ 6




తా॥ ఒక్క అంతస్తుగల దేవాలయమును చెప్పుచున్నాడు. నలుచదరమును, గుండ్రమును, ఆయతవృత్తమును, 8 కోణములును, 6 కోణములును, శిఖరము 8 కోణములును చేయవచ్చును ఆలయముయొక్క విస్తారములో సగము కనీస ముఖమండపమును, విస్తారముతో సమానమైనది శ్రేష్ఠ ముఖ మండపము అనగా 2-2¼-2½-అధమములు. 2¾-3-3¼ మధ్యమములు, వానియొక్క మధ్య 8 భాగములుచేసి, 3½-3¾-4 ఉత్తమములు. ఇట్లు తొమ్మిది విధములు, ప్రాసాద వేశనము 1 దండము, 1½ దండము, 2 దండములు మానసూత్రమును చేయవలెను. అంతరాలము సర్వాంగ సుందరమును విశ్రాంతి స్థలమును కలిగి 3-4 దండములు దీర్ఘము కలిగియుండవలెను.

శ్లో॥ సోపానం పార్శ్వయోః కుర్యా ద్గజ హస్త విభూషితం।
ప్రాసాద భిత్తి విస్తార తుల్యం వాఽర్ధ త్రిపాదకం॥ 7

అంతరాలస్య భిత్తేశ్చ వ్యాసాఽన్య ర్మండపే తథా।
కూటకోష్ఠాది యుక్తం వా హీనం వా ముఖమండపం॥ 8

త్రివర్గ సహితం వాఽపి తోరణాద్యై ర్వి చిత్రితం।
ఏకా నేకతలం వాఽథ కర్తవ్యం ముఖమండపం॥ 9

హర్మ్య తారాగ్ని భాగైకం గర్భగే హస్య విస్తరం।
పంచభాగే ఽగ్నిభాగం చ వేదాంశం సప్తభాగికే॥ 10

నవాంశే భూతభాగం తు షష్ఠాంశం రుద్రభాగికే।
త్రయోదశాంశే సప్తాంశం వస్వంశం పక్ష భాగికే॥ 11

సప్తదశే నవాంశం చ వ్యాసోచ్చం హి ద్విజోత్తమ।
గర్భగే హస్య విస్తారో నవధా పరికీర్తితః॥ 12

తా॥ ప్రక్కలమెట్లుండవలెను, అవి ఏనుగు తొండములతో అలంకరింపబడి యుండవలెను ఆలయముయొక్క గోడ యెంత విస్తారమో అంత విస్తారముగాని, లేక అందు ముప్పాతికవంతుగాని అంతరాలముయొక్క గోడ యుండవలెను. మండపమునకు గూడ అటులే యుండవలెను. ముఖమండపమునకు కర్ణ మండపములును కోష్ఠములును చేగాని లేకుండగాని త్రివర్గసహితముగాగాని, తోరణములు మొదలైన వానితో అలంకారముగాని, ఏకతలముగాని, అనేకతలములుగాని ముఖమండపమును చేయవచ్చును. ఆలయముయొక్క పరిమాణములో ఒక భాగము గర్భ గృహముండవలెను. (4 భా, చేసి 2 భాగములు, 5 భా. చేసి 3 భాగములు, 7 భా, చేసి 4 భాగములు, 9 భాగములుచేసి 5 భాగములు, 11 భా, చేసి 6 భాగములు, 13 భా. చేసి 7 భాగములు, 15 భా. చేసి 8 భాగములు, 17 భాగములుచేసి 9 భాగములు ఇట్లు తొమ్మిది విధములుగా చేయవచ్చును

## 4. శాంతికము

శ్లో॥ శేషం భిత్తి విశాలం స్యా త్పరితః కల్పయే ద్బుధః।
ఏక ద్వి త్రి చతుష్పంచ పంక్తి స్యా దేకభాగికే॥ 13

హర్మ్యోచ్చం వసుధా భజ్య ఏకాంశం హి తలోన్నతం।
ద్విభాగం చరణాయామం ప్రస్తర స్త్వైకభాగతా॥ 14

గలోచ్చం త్వేకభాగేన ద్విభాగం శిఖరోదయం।
ఏకాంశం స్తూపి తుంగం తు కల్పై్యవం శాంతికం భవేత్॥ 15

ఏకాంశ రహితం శేషం మంచం వా పార్శ్వ దేవతా।
ఏవం శాంతిక మాఖ్యాతం పౌష్టికం చాధునోచ్యతే॥ 16



శాంతికము 8 భా.

తా॥ పైన చెప్పినరీతిగా గర్భమును నిర్ణయించి మిగిలినది గోడ మందమును చేయవలయును, 1-2-3-4-5-10 భాగములుచేసి అందు 1 భాగమును ఆలయముయొక్క యెత్తును 8 భాగములు చేసి అందు అధిష్ఠానము 1 భా, స్తంభముయొక్క యెత్తు 2 భా, ప్రస్తరము 1 భా, గలము 1 భా, శిఖరము 2 భా, స్తూపి 1 భా, ఇట్లు చేసినేని దానిని శాంతికము అని చెప్పుదురు. ఇందు ప్రస్తరము 1 భా, తగ్గించి ప్రక్కల యందు దేవతలను రచించవచ్చును.

## 5. పౌష్టికము

శ్లో॥ సదనోచ్ఛే నవాంశే తు శివాంశం తు తలోదయం।
అర్ధేనాంశ సమాయుక్తం ద్వయాంశం చరణాయతం॥ 17
మంచమానం తథైకాంశం సార్ధ మేకాంశకం గలం।
తదూర్ధ్వే తు ద్విభాగేన శిఖరోదయ మీరితం॥ 18
స్తూప్యుత్సేధం తథైకాంశం పౌష్టికం సదనం త్విదమ్॥



పౌష్టికము 9 భా.

తా॥ ఆలయముయొక్క యెత్తును 9 భాగములుచేసి అందు తలము 1 భా. స్తంభముయొక్క యెత్తు 2½ భా, మంచము 1 భా, గలము 1½ భా, శిఖరము 2 భా, స్తూపిక 1 భా, చేసినచో పౌష్టికమగును.

## 6. జయదము

శ్లో॥ సదనోచ్ఛం దశాంశైక మధిష్ఠానోదయం భవేత్॥ 19

సార్ధ ద్వ్యంశం తు పాదోచ్చం ప్రస్తరోచ్చం శివాంశకం।
సార్ధాంశం గలమానం తు గుణాంశం శిఖరోదయం॥ 20

ఏకాంశం స్తూపిమానం తు జయదం త ముదాహృతమ్।



తా॥ ఆలయముయొక్క యెత్తును 10 భాగములుచేసి అందు అధిష్ఠానము 1 భా, స్తంభముయెత్తు $2\frac{1}{2}$ భా. ప్రస్తరము యెత్తు 1 భా, గలము యెత్తు $1\frac{1}{2}$ భా, శిఖరము 3 భా, స్తూపిక 1 భా, ఇట్లు చేసినేని జయదము అగును.

జయదము 10 భా.

## 7. అద్భుతము

శ్లో॥ రుద్రాంశం హర్మ్యతుంగం తు సపాదాంశం ధరాతలం॥ 21

సార్ధ ద్వ్యంశం తు పాదోచ్చం ప్రస్తరోచ్చం శివాంశకం।
అధ్యర్ధాంశం తు కంఠోచ్చం సార్ధత్ర్యంశం తు శీర్షకం॥ 22

శేషం స్తూప్యుదయం ఖ్యాత మద్భుతం సదనం భవేత్॥

తా॥ ఆలయముయొక్క యెత్తును 11 భాగములుచేసి అందు అధిష్ఠానము $1\frac{1}{4}$ భా, స్తంభముయెత్తు $2\frac{1}{2}$ భా. ప్రస్తరము 1 భాగము, కంఠము $1\frac{1}{2}$ భా. శిఖరము $3\frac{1}{2}$ భా, స్తూపి $1\frac{1}{4}$ భా, చేసినచో అద్భుత మనిపించుకొనును, మరియు,



అద్భుతము 11 భా.

## 8. అద్భుతము రెండవపద్ధతి

శ్లో॥ రుద్రాంశం సదనోత్సేధం తల మేకాంశ మానతః॥ 26

ద్వ్యంశం చ చరణాయామం ప్రస్తరం చ శివాంకం।
ఊర్ధ్వే గ్రీవం తు సార్ధాంశం త్రిపాదం ప్రస్తరోదయమ్॥ 27

సపాదాంశం గలోత్సేధం సార్ధద్వ్యంశం తు శీర్షకం॥
ఏకాంశం స్తూపిమానం తు ఏవం చైవాద్భుతం స్మృతం॥ 28

తా॥ ఆలయము యెత్తును 11 భాగములుచేసి అందు అధిష్ఠానము 1 భా, స్తంభము 2 భా, ప్రస్తరము 1 భా, ఉపరిగ్రీవము 1½ భా, ప్రస్తరము 0¾ భా, గలము 1¼ భా, శిఖరము 2½ భా. స్తూపిక 1 భా,ఇదియును అద్భుతము రెండవ పద్ధతి.

## 9. సార్వకామికము

శ్లో॥ ఉత్తుంగే సప్తభాగే తు వ్యోమాంశం తు ధరాతలం॥ 23

పక్షాంశం పాద తుంగం తు శిఖరోచ్చం గుణాంశకం।
స్తూప్యుత్సేధం తథైకాంశ మేతత్ స్యాత్ సార్వకామికం॥ 24

శాంతి కాద్యు దయోపేతం హర్మ్య గుణ్యం క్రమోదయం।
విపరీతే ద్విపాదానాం వైపరీత్యం సమావహేత్॥ 25

తస్మా ద్భిత్త్యాది గుణ్యం చ ఉదయం చైవ మాచరేత్॥



సార్వకామికము 7 భా.

తా॥ ఆలయము యెత్తును 7 భాగములుచేసి అందు అధిష్ఠానము 1 భా, స్తంభము 2 భా, శిఖరము 3 భా, స్తూపిక 1 భా. ఇట్లు చేసినయెడల సార్వకామిక మగును. శాంతికాది భవనములకు చెప్పబడిన కొలతలను అనుసరించక చేసినయెడల మనుష్యులు మొదలగువారికి ఆపదలు కలుగును కనుక కొలతలను యేమాత్రము అతిక్రమించక చేయవలెను.

## 10. జయదము

శ్లో॥ అథవాష్టౌ ద్విరిష్టౌ చ ధాత్వష్టాభూ త్రధాకృతం।
పక్షై రాధారమానం చ మంచప్రగ్రీవ పంచకం॥ 29

గలమూర్ధ్ని శిఖామానం చాద్యే చాష్టన వాంశకే।
సప్రగ్రీవ సమం చైత దేక భూరేవం విన్యసేత్॥ 30

ఊర్ధ్వం మంచోపరిష్ఠం తు చతుష్కోణైః సమన్వితః।
అథ వాఽష్టన వాంశేతు సప్తాంశం సవిస్తరం॥ 31

వివిధం స్యాత్సమాయుక్తం కర్ణకూట ముదాహృతం।
కర్ణకూట సమాయుక్తం హీనం వా తద్విశేషతః॥ 32

ప్రవిష్ఠానాది సర్వాంగం ప్రగ్రీవం చ ప్రకల్పయేత్।
వృత్తగ్రీవ సమాయుక్తం తథైవ శిఖరం ఘనమ్॥

తా॥ అలయము యెత్తును 8 భా. గాని, (16 భాగములుగాని) చేసి ఆధారము 2 భా. మంచము 1, ప్రగ్రీవము 1, మంచము 1, గలము 1, శిఖరము 1, స్తూపిక 1, ఇవి 8 భాగములుగాగాని లేక 9 భాగములుగాగాని చేయవచ్చును. మరియు ప్రగ్రీవముతో సమానముగా ఏకతలమున మంచమును. పైన మంచమునకు పై భాగమున 4 కోణములతోను లేక 8-9 భాగములుచేసి అందు 7 భాగములు విస్తారమును, ఇట్లు అనేకవిధములుగాను కర్ణకూటములును, ఒకప్పుడు కర్ణకూటములు తగ్గించియును చేయవచ్చును. ప్రవేశము మొదలైన అన్నిరూపములును ప్రగ్రీవమును చేయవలెను. గుండ్రముగా గ్రీవమున్నయెడల అటులే పెద్దదిగా శిఖర ముండవలెను.

శ్లో॥ శిఖరే తు మహానాసీ చతురస్రా మహాదిశి।
దిశిభద్ర యుతం వా ఽఽస్తే మంచే ఽల్పానాసికా కలా॥ 34

ప్రస్తరే ఽష్టాల్పనాసీ వా జయదంత ముదాహృతమ్॥

తా॥ శిఖరమునందు మహానాసి నాలుగువైపుల నుండవలెను. లేక దిశిభద్రములనైన చేయవలెను. మంచమున క్షుద్రనాసికలను 16 చేయవలెను. ప్రస్తరమున 8 క్షుద్రనాసికలను చేయవలెను. దీనిని జయదమని చెప్పుదురు.

## 11. శ్రీ భోగము

శ్లో॥ తదేవ కర్ణకూటాభ్యాం షట్పంచాంశే శివే తథా॥ 35

నాగశ్రేష్ఠ్యన్వితం కర్ణ కూటాకారం ప్రకల్పయేత్।
కర్ణకూట సమం మధ్య భద్రం తద్భద్ర నాసికా॥ 36

అంతరాలం చ తత్తుల్యం క్షుద్ర పంజరం సంయుతం।
అభద్రం వా ఽథ భద్రం వా కూటం వా భద్రనాసికా॥ 37

భద్రనాసీ విశాలాం వా మధ్యే భద్రం విశాలకం।
త్రి చతుష్పంచ షట్ సప్త భాగం వా సదనాంశకం॥ 38

కృత్వైకాంశం ద్విభాగం వా మధ్యే భద్ర విశాలకం।
త్రిభాగం చ విశాలం తు మధ్యే భద్రేవిశాలయాః॥ 39

దండం వాధ్యర్ధ దండం వా ద్విదండం వాఽథ నిర్గతిః।
యథేష్టం శిఖరం కంఠం శ్రీభోగం త ముదాహృతమ్॥ 40

తా॥ పైజెప్పినదానినే కర్ణకూటములు 5 భాగములుగాని, 6 భాగములుగాని చేసి అందు 1 భాగము నాగరపద్ధతిలో చేసి దానితో సమానముగా మధ్యను భద్రమును భద్రనాసికను చేయవలెను, అంతరాలమును దానితో సమానముగా నుంచి క్షుద్రపంజరములను చేయవలెను, భద్రమునుచేసిగాని లేకుండగాని కూటముగాని భద్రనాసికగాని చేయవలెను. భద్రనాసి విస్తారము ప్రకారము మధ్య భద్రముయొక్క విస్తారముండవలెను. ఆలయములో 3_4_5_6_7 భాగములుచేసి అందు 1 భాగముగాని 2 భాగములుగాని మధ్య భద్రముయొక్క విస్తారమును చేయవలెను. 3 భాగములు మధ్య భద్రమునుగాని శాలనుగాని చేయవలెను. 1 దండముగాని 1½ దండములుగాని 2 దండములుగాని నిర్గమమును చేయవచ్చును. ఇష్టానుసారముగా శిఖరమును చేయవచ్చును. దీనిని శ్రీభోగమందురు.

## 12. శ్రీ భద్రము

శ్లో॥ స్వవర్ణం పట్ట సంయుక్తం స్వతారే కుడ్య పాదయోః।
స్వతారే కుడ్య పాదాఢ్యా న్నిష్క్రాంత రహితం తు వా॥ 41

శ్రీభద్రమితి విఖ్యాతం సర్వ దేవాత్మకం పరమ్॥

తా॥ స్వజాతిలోనే పట్టములును, స్వవిస్తారములోనే గోడయును స్తంభమును, స్వవిస్తారమునసే గోడయందలి స్తంభములును చేయవలెను. ముందుకు నిర్గమమును చేయరాదు. ఇది శ్రీభద్రము.

## 13. స్వస్తికము

శ్లో॥ తదేవ సదనే బాహ్యే మధ్యే భద్రయుతం తు వా॥ 42

తోరణైర్జాల కాఢ్యం త చ్ఛ్రీవిశాలద్రు మాన్వితం।
తదేవ వేదికా కంఠం శిఖరం చ ఘనం తథా॥ 43

వస్వంగం పాద సంయుక్తం చతుర్దిగ్భాగ నాసికం।
చతస్రో నాసికాశ్చాల్పాః శిఖరే తు విదిక్ స్థితాః॥ 44
పాదం ప్రత్యల్పనా సాధ్యం స్వస్తికం తు తదుచ్యతే।

తా॥ పైజెప్పినదానినే ఆలయము వెలుపల మధ్య భద్రమునుగాని, తోరణములు జాలక ములుగాని, చేసిరేని అది శ్రీవిశాలద్రుమము అగును, అదియే వేదికయును గలమును గొప్ప శిఖరమును అష్టాంగయుతస్తంభములును, నాలుగువైపుల క్షుద్రనాసికలును, శిఖరమున మూలల యందును, స్తంభములయందును అల్పనాసికలను చేసినచో స్వస్తికమగును.

## 14. సుశోభనము

శ్లో॥ తదేవ మధ్య భద్రం చ కర్ణకూట విహీనకం॥ 45
సుశోభ నావహంఖ్యాతం సర్వదేవ ప్రియావహమ్।

తా॥ పైజెప్పినదానినే మధ్య భద్రముచు చేసి కర్ణకూటములు లేకుండ అలంకారముగా చేసి రేని సుశోభనమగును.

## 15. శ్రీకరము

శ్లో॥ శిఖరే తు కృతానాసీ ప్రస్తారాష్టౌ ద్వీరష్టధా॥ 46
యుగాగ్రం శిఖరం కంఠం వేదికం చైవ శ్రీకరమ్।

తా॥ శిఖరమున నాసికలు 8, ప్రస్తరములు 16, మరియు గలమును శిఖరమును 4 కోణము లుచు, వేదికయును, నాలుగుకోణములతోను చేసిరేని శ్రీకరమగును.

## 16. వృత్తకేసరము రాజకేసరము

శ్లో॥ తదేవ శిఖరే చాష్టా వల్పనాసి సమన్వితం॥ 47
మహానాస్య పరేకోష్ట సంయుతం శీర్షకం భవేత్,
నాసికా విస్తృతం దండద్వయం వాఽపి త్రిదండకం॥ 48
కోష్ఠదీప సమాఖ్యాత ముత్సేధం నాసికా సమం।
విదిక్షు భద్రనా సాధ్యం శిఖరం పరికల్పయేత్॥ 49
వృత్త మస్తక కంఠాఢ్యం వస్వశ్రం వా గలం శిరః।
వృత్తకేసర మాఖ్యాతం వస్వశ్రం రాజకేసరమ్॥ 50

తా॥ పై జెప్పినదానినే శిఖరమున 8 క్షుద్రనాసికలును, మహానాసికయును, కోష్ఠములును కలుగునట్లు శిఖరమును చేయవలెను. మహానాసికయొక్క విస్తారము 2 దండములుగాని 3 దండములుగాని చేయవలెను. దీనిని కోష్ఠదీప మందురు. నాసికతో సమానముగా మూలలయందు భద్రనాసికలును, శిఖరమును చేయవలెను. గళము శిఖరము గుండ్రముగా చేయవలెను. ఇది వృత్తకేసరము లేక గలముగాని శిఖరముగాని 8 కోణములున్నను వృత్తకేసరమే, గలము శిఖరము 8 కోణములుగా నున్నచో రాజకేసర మగును.

## 17. కల్యాణసుందరము

శ్లో॥ ప్రాసాదస్య తు విస్తారః పంచ సప్తాష్టవా భవేత్।
త్రిభాగం వా ద్విభాగం వా ప్రాగ్వద్వా మధ్య భద్రకం॥ 51

దండం వాఽధ్యర్ధ దండం వా ద్విదండం వా త్రిదండకం।
మధ్య భద్రస్య నిష్క్రాంతం భద్రాపేక్షిత హర్మ్యకే॥ 52

తా॥ ఆలయముయొక్క విస్తారమును 5-7-8 భాగములుచేసి, అందు 3 భాగములుగాని 2 భాగములు గాని మునుపటివలె మధ్య భద్రమును చేసి 1 దండముగాని 1½ దండముగాని 2 దండములుగాని 3 దండములుగాని మధ్య భద్రమునకు నిర్గమమును చేయవలెను. అట్లు భద్రమునుచేసిన హార్మ్యమునందు,

శ్లో॥ యన్మహా నాసికోపేతం శిరః స్యాయత వృత్తకం।
పాదం ప్రత్యల్పనాసాఢ్యం కంఠం వై శీర్షకాకృతి॥ 53

కల్యాణ సుందరం ఖ్యాతం సర్వ దేవార్హకం పరమ్।

తా॥ మహానాసికతో గూడిన శిఖరము ఆయతివృత్తముగా నుండవలెను. స్తంభములయందు క్షుద్రనాసికలును, గలమును, శిఖరమును ఒక్కటే ఆకారములో నుండెనేని కల్యాణసుందరమగును,

## 18. కోసలము

శ్లో॥ తదేవ భద్రనా సాఢ్యం పూర్వాపరం ద్విజోత్తమ॥ 54

లలాట నాసికోపేతం పార్శ్వయో ర్ద్విజసత్తమ।
సమం వా సాయతం వాఽథ కల్పితం కోసలం భవేత్॥ 55

తా॥ పై జెప్పిన దానినే భద్రనాసికలతోను లలాటనాసికలతోను చేయవలెను. అవి సమచతురశ్రముగాగాని దీర్ఘచతురశ్రముగాగాని చేయవచ్చును, దీనిని కోసలమందురు,

శ్లో॥ తలం ప్రతి విమానాది ఉన్నతం త్వథ వక్ష్యతే।
స్కందం వై పూర్వ దిగ్భాగే దక్షిణామూర్తి దక్షిణే॥ 56
పశ్చిమే విష్ణుమూర్తిం వా లింగోద్భవ మథాపి వా।
ధాతార ముత్తరే విప్ర భార స్థానే తు వర్జయేత్॥ 57
మండపే దక్షిణే భద్రే స్థాపయే ద్ధి వినాయకం।
పూర్వే వా పశ్చిమే తస్య నృత్త మూర్తిం ప్రకల్పయేత్॥ 58
దుర్గా ముత్తర దిగ్భాగే క్షేత్రపాలం తు వా ద్విజ।
స్థానం వా సదనం వాథ దిశిమూర్తిం ప్రకల్పయేత్॥ 59
ఏవం ధరాతలోర్ధ్వే తు విన్యసే త్సర్వ దేవతాః।

తా॥ అంతస్తులకు గూర్చి విమానము మొదలైన వానియందు చేయదగినవనులు చెప్పుచున్నాను, తూర్పున షణ్ముఖుడు, దక్షిణమున దక్షిణామూర్తి, పడమర విష్ణువు లేక లింగాకారము, ఉత్తరమున బ్రహ్మ, వీరిని పై స్థానమున నిర్మించవలెనుగాని బరువును మోయుచున్నట్టి దిగువ ప్రదేశమున కల్పించరాదు, మండపముయొక్క తూర్పు భద్రమునగాని పడమర భద్రమునగాని నటరాజ విగ్రహమును రచించవలెను, దక్షిణ భద్రమున వినాయకుని రచించవలెను ఉత్తర భద్రమున దుర్గనుగాని క్షేత్రపాలునిగాని రచించవలెను. స్థానమునగాని ఆలయమునగాని యే దిశ యందుండదగినవారిని ఆ దిశయందు కల్పించవలెను, ఇట్లు పై భాగమున దేవతల నుంచవలెను,

శ్లో॥ స్కందం వైపూర్వ దిగ్భాగే శక్రం వాసితంరోహితం॥ 60
హస్తిం వాఽప్యంబుజాసీన ఏక ఏవ సమన్వితం।
దక్షిణే దక్షిణా మూర్తిం వీరభద్ర మథాపి వా॥ 61
పశ్చిమే నారసింహం తు సౌమ్య మూర్తి మథాపివా।
ఉత్తరే తు విధా తారం సోమం వా ద్విజ సత్తమ॥ 62
ప్రస్తరోపరి కర్తవ్య మేక ద్విత్రి తలే తథా।
చతుర్భూమ్యాది భూమాసు మహేశస్తు యథేష్టగః॥ 63
ఉమా స్కందాది సహితో మహేశః పరికీర్తితః।
అన్య దేవాశ్చ గంధర్వాః సిద్ధా దైత్యా మరుద్గణాః 64
కలాంతయుగ భూమ్యాది గ్రీవే చ మస్తకాంతకే।
ఇష్టమూర్తి మరిష్టాంశే కల్పయే చ్ఛిల్ప విత్తమః॥ 65

తా॥ తూర్పున షణ్ముఖునిగాని, యింద్రునిగాని చేయవలెను. షణ్ముఖుకు తెలుపు, ఇంద్రు డెఱుపు, ఏనుగపైనగాని, పద్మముపైనగాని యుండవలెను. ఒక్కరినే చేయవలెను. భార్య యుండ కూడదు. దక్షిణమున దక్షిణామూర్తిగాని, వీరభద్రుడుగాని యుండవలెను. పడమర నృసింహుడు గాని, శాంతరూప విష్ణువుగాని యుండవలెను. ఉత్తరమున బ్రహ్మగాని, కుబేరుడుగాని యుండ వలెను. ప్రస్తరముపైన -౨-౩-౬ అంతస్తులలో యిష్టమువచ్చినచోట కల్పించవలెను. ఈశ్వరుడు పార్వతి కుమారస్వామి మొదలైనవారితో కూడి యుండవలెను. ఇతర దేవతలును గంధర్వులును సిద్ధులును ఆదిత్యులును మరుద్గణమును వీరందఱు నాలుగవ అంతస్తునుండి పదునాఱవ యంతస్తు వరకు నుండవచ్చును. గలమున శిఖరమువరకు కూడ కల్పించవచ్చును. ఇష్టదేవతలను శుభమైన స్థానమున నుంచుచుండవలెను. శిల్పాచార్యుడు పరిశీలించి స్థానములను కల్పించవలెను.

శ్లో॥ గలస్యాదిష్ఠ మంచోర్ధ్వే కోణేషు వృషభం కురు।
ప్రతికోణే ద్వయం వైకం వృషభం శయనం కురు॥ 66

భూతం వాఽథ చతుష్కోణే హృదయాంజలి సంయుతం।
కల్పయే త్పద్మపీఠేద్వే ఆసీనం తు బృహత్తనుం॥ 67

ఆమోదం చాగ్నికోణేతు ప్రమోదం నైరృతే భవేత్।
ప్రముఖం వాయుకోణేతు దుర్ముఖం త్వీశ కోణకే॥ 68

శ్వేతం రక్తం తథాపీతం కృష్ణ మగ్న్యాదిషు క్రమాత్।
యమో వైదేవతా హ్యేతా తా సా మావాహనం కురు॥ 69

కరాలముద్గ కుల్మాష సిత ప్రేంకణ లేపనం।
నానాలంకార సంయుక్తం నానాలీలా సమన్వితం॥ 70

నానాక్రీడ సమాయుక్తం సుధయా ధాతు భిస్తథా।
యథోచితం కల్పయేత్తు శిలా దా ర్విష్టకా భవేత్॥ 71

ఏకం తల మిదం ఖ్యాతం ద్వితలం తు తతో విదుః॥ 72

**ఇతి కాశ్యపశిల్పే ఏకతల విమాన లక్షణం సప్తవింశః పటలః**

తా॥ గలము యొక్క మూలమున నాలుగు మూలలయందు వృషభములను చేయవలెను. ప్రతి కోణమునందు రెండు వృషభములు శయనించునట్లును శిరస్సు ఒక్కటియు నుండవలెను. నాలుగుమూలలయందు అంజలిబద్ధులైయున్నట్లు భూతములనుకూడ చేయవచ్చును పద్మపీఠమున నుండినట్లును గొప్ప శరీరముతోను నుండవలెను. ఆగ్నేయమున ఆమోదుడు, నైరృతిన ప్రమోదుడు, వాయవ్యమున ప్రముఖుడు, ఈశాన్యమున దుర్ముఖుడు, ఆమోదుడు తెలుపు, ప్రమోదుడు ఎఱుపు, ప్రముఖుడు పసుపువన్నె, దుర్ముఖుడు నలుపు.

## 19. ఏకతల విధానము మరియొక పద్ధతి

### మానసార 19 వ అధ్యాయము

శ్లో॥ ఏక భూమి విధానం చ లక్షణం వక్ష్యతే ఒధునా।
జాతిచ్ఛందం వికల్పం తు చాభాసం తు చతుర్విధం॥ 1

పూర్వం హస్తేన సంయుక్తం హర్మ్యం జాతి రితిస్మృతం।
ఛందం త్రిపాద హస్తేన వికల్పం స్యా త్తదర్ధకం॥ 2

అభాసం చార్ధ హస్తేన హర్మ్యాదీనాం తు మానయేత్।
ఏత దాయాది శుద్ధ్యర్థం స్థానకాది త్రిధాభవేత్॥ 3

ఉత్సేధే మానం గ్రాహ్యం చేత్ స్థానకం తత్ప్రకథ్యతే।
విస్తారే మానం సంకల్ప్య చాసనం త దుదీరితం॥ 4

పరిణాహే పదే వాఒపి మానం శయన మీరితం।
ఆసనం సంచితం ప్రోక్తం స్థానం స్యాత్వ సంచితం॥ 5

అపసంచితం శయనం స్యా త్తత్త్రివిధ హర్మ్యకే।
స్థానకాది యస్యమూలం బింబహర్మ్యం యథాక్రమమ్॥ 6

తా॥ ఒక్క అంతస్తుగల విమానమును నిర్మించు విధానమును చెప్పుచున్నాడు. జాతి, ఛందము, వికల్పము, ఆభాసము అని నాలుగు విధములు. హస్తముయొక్క పరిమాణముతో నిర్మించునది జాతిహర్మ్యము ముప్పాతికవంతుగల హస్తముతో కొలిచి నిర్మించునది ఛందహర్మ్యము. ముప్పాతికవంతు గల హస్తమును చెరిసగముచేసి దానితో కొలిచి రచించునది వికల్పహర్మ్యము, హస్తము అనుదానిని సగముచేసి దానితో కొలిచి రచించునది ఆభాసహార్మ్యము. ఇంతేకాక ఆయము మొదలైనవి క్రమముగా నుండుటకు స్థానకము, అసనము, శయనము అను మూడు పద్ధతులు కలవు. ఎత్తునుబట్టి గణితమును శుద్ధిచేయబడినది స్థానకము. విస్తారమునుబట్టి గణితమును నిర్ణయించి చేయుబడినది ఆసనము. చుట్టుకొలతనుబట్టి గణితముచేసి నిర్మించినది శయనము. ఈ చెప్పబడిన మూడు విధములలో ఆసనమును సంచితమనియు, స్థానకమును అసంచితమనియు, శయనమును అపసంచిత మనియు వచింతురు. ఇట్లు క్రమముగా కొలతలను తెలిసికొని చేయవలెను.

శ్లో॥ కుర్యా త్తత్ద్విమానం స్యా ద్విపరీతం వినాశనం।
సమాశ్రం సమవృత్తం య త్పురుషం చేతి కథ్యతే॥ 7

ఆయ తాకారధిష్ణ్యం వా వనితేతి ప్రకీర్తితం।
పుంవిమానే పురుషం చ వనితే వనితాంక్షిపేత్॥ 8

శక్తీనాం వనితాం వాఽపి పురుషం వాఽపి కల్పయేత్।
విస్తారోత్సేధ భక్తిశ్చ పూర్వ వచ్చోక్తవత్ క్రమాత్॥ 9

కుర్యాత్త దేకభౌమస్య కన్యసాదీని కుంగకం (కాని)
ఆహత్య చాష్టధా హర్మ్యం గణ్యమాన మహోచ్యతే॥ 10

ఉత్సేధే చాష్టభాగే తు చైకాంశే నమ సూరకం।
ద్విభాగం చాంఘ్రికోత్తుంగం మంచ మేకేన కారయేత్॥ 11

కంధరం తత్సమం కుర్యాత్తద్ ద్వయం శిఖరోదయం (ః)
తదర్ధం స్తూపికోత్తుంగం వక్త్రం షడ్విధ మీరితం॥ 12

తా॥ విమానములను శాస్త్రమునకు విరుద్ధముగా నిర్మించిరేని నాశము కలుగును సమ చతురశ్రమును, సమవృత్తమును, కల విమానములు పురుషరూపములు. ఆయత చతురశ్రమును, ఆయత వృత్తమును కల విమానములు స్త్రీరూపములు. పురుషసంబంధమైనవానికి పురుష విమానములను. స్త్రీ సంబంధమైనవానికి స్త్రీ విమానములను నిర్మించవలెను, శక్తి ఆలయములకు స్త్రీ విమానములును పురుష విమానములును నిర్మించవచ్చును. విస్తారమును యెత్తును మనువు చెప్పి యున్నప్రకారము చేయవలెను. ఏకతలమునందు అధమము, మధ్యమము, ఉత్తమము అను మూడు విధములుగ కొలతలు చెప్పబడియున్నవి గనుక వాని ననుసరించి చేయవలెను. ఆలయము యొక్క యెత్తును 8 భాగములుచేసి అందు అధిష్ఠానము 1 భా., స్తంభము యెత్తు 2 భా, మంచము 1 భా, శిఖరము 2 భా, స్తూపిక 1 భా. చేయవలెను. ముఖము 6 విధములుగా చేయవచ్చును

శ్లో॥ హర్మ్యతా రాష్ట భాగైకం హీనం వేది విశాలకం।
తచ్చతుర్భాగ మేకాంశం హీనం గ్రీవ విశాలకం॥ 13

శిఖరా లంబనాంతం చ వేదితార సమన్వితం।
లంబనం త్ర్యంశ మేకం చ మధ్యనాసి విశాలకం॥ 14

తత్సమం చ త్రిపాదం వా చార్ధం వా నిర్గమం భవేత్।
మధ్యనాసి విశాలే తు చతుర్భాగ విభాజితే॥ 15

తత్త్రిభాగం తు తుంగం స్యాత్పంచాంశం త్ర్యంశ మేవ వా।
స్థితస్య లుపమూలం తు తదూర్ధ్వే నాసికంధరం॥ 16

తదర్ధం చ త్రిభాగం చ కంధరం మూర్ధ్ని తత్సమం।
తత్తుల్యం మౌలితుంగం స్యా ద్యుక్త్యా తత్పాలికాంతకం॥ 17

మధ్య నాస్యర్ధ మానేన సాంతరం నాసిమానకం।
నాసికాగ్రాననం సర్వం కింబరీ సమలంకృతం॥ 18

తా॥ ఆలయము యొక్క విస్తారమును 8 భాగములుచేసి అందు వేది విస్తారము 7 భాగములు చేయవలెను. మరల దానిని 4 భాగములుచేసి అందు 3 భాగములు గలమును చేయవలెను. శిఖరముయొక్క మొదలు వేది విస్తారముతో సమానముగా నుండవలెను. మరల శిఖరముయొక్క మొదలును 8 భాగములుచేసి అందు 1 భాగము మధ్యనాసివి చేయవలెను. ఆ నాసితో సమానము గాని లేక అందు ముప్పాతిక వంతుగాని లేక సగముగాని నాసియొక్క నిర్గమమును చేయవలెను. మధ్యనాసియొక్క విశాలమును 4 భాగములుచేసి అందు 3 భాగములు యెత్తు చేయవలెను. లేక 5 భాగములుగా అందు 3 భాగములు వచ్చును. లుపయొక్క మొదలును — దానిపైన నాసి అందులో సగమును. గలము 3 భాగములును చేయవలెను గలము శిఖరము సమానముగా నుండ వలెను. శిఖరముయొక్క విస్తారముతో సమానముగా యెత్తును చేయవలెను. పాలికయొక్క పై భాగమువరకు యుక్తితో చేయవలెను. మధ్యనాసియొక్క కొలతలో సగము లోపల నాసి యుండవలెను. నాసికలయొక్క ముందరి ముఖమున అంతటను కింపురుష విగ్రహము లుండవలెను.

శ్లో॥ నాసితార త్రిభాగైకం కుక్షితార మితిస్మృతం।
భూతాది చిత్ర సంయుక్తం సర్వాలంకార సంయుతం॥ 19

లంబ నోర్ధ్వే దలం బధ్వా సర్వాలంకార సంయుతం।
అగ్రాంగం పత్ర సంయుక్తం భూషైః వ్ట్టైరలంకృతం॥ 20

కరోతీవ దలంకృత్య లంబనే పత్ర సంయుతం।
పాలికే లంబనం తత్ర శ్రేణ్యాదర్పణ వృత్తవత్॥ 21

యుక్త్యాలంకార సంయుక్తం శేషం ప్రాగుక్త వ న్నయేత్।
గ్రీవోచ్చం త్రిభాగ మేకం వేదికోదయ మీరితం॥ 22

తత్సమం తు గలాగ్రే తు చోత్తరాదీని వర్గకం।
తదేవాలంబనం తత్ర గోపానాద్రిశ్ర యాన్వితం॥ 23

వేదితుంగ సమం కుర్యాత్ క్షుద్రనాశి విభూషితమ్।

తా॥ నాసి విస్తారమును 3 భాగములుచేసి అందు 1 భాగము గర్భమును చేయవలెను. భూతములు మొదలయిన చిత్రములును సమస్తమైన అలంకారములును చేయవలెను. లంబనము పైన దలమును సమస్తమైన అలంకారములతో బంధించి ముందు రూపమును పత్రములతోను వివిధ భూషణములతోను, పట్టములతోను అలంకారముగ చేయవలెను. తలపుత్త్రమూదిరిగా అలంకరించి లంఖనమును పత్రములతో నలంకరించి పాలికయందు లంఖనముచేసి అద్దముయొక్క వృత్తాకారము వలె శ్రేణితో చక్కగా నలంకారమును చేయవలెను, మిగిలిన పనులు మునుపటివలెనే చేయ వలయును. కంఠముయొక్క యెత్తును 3 భాగములుచేసి అందు 1 భాగము వేదికను చేయవలెను. దానితో సమానముగా గలము యొక్క చివర ఉత్తరము మొదలైనవి చేయవలెను. అదియె

ఆలంబనము, దానియందు గోపానము మొదలయినవియును లక్ష్మితోగూడ వేదియొక్క యెత్తుతో సమానముగా చేయువలెను. క్షుద్రనాసినికూడ అలంకారముగా చేయవలెను.

శ్లో॥ అథవా తుంగమానే తు దశభాగం విభాజితే॥ 24

సపాదాంశ మధిష్ఠానం తద్ద్వయం పాద తుంగకం।
తదర్ధం ప్రస్తరోచ్చం తు ద్విభాగేన గలోదయం॥ 25

తత్సమం శిఖరోత్తుంగం తదర్ధం తచ్ఛిఖోదయం।
ప్రస్తరోపరి చాంశేన కర్ణహర్మ్యం ప్రకల్పయేత్॥ 26

తదూర్ధ్వే పూర్వదిగ్గ్రీవం యుక్త్యాచాంశేన యోజయేత్।
కర్ణ హర్మ్యస్య విస్తారం షడ్భాగే తు విభాజితే॥ 27

ఏకాంశం కర్ణకూటం స్యా న్మధ్యే శాలాద్వయాంశకం।
ఏకం వా ద్విత్రిదండేన నిర్గమం భద్ర మేవవా॥ 28

శాలా కూట ద్వయోర్మధ్యే చైవహారం సపంజరం।
తత్తుంగం సప్తభాగం స్యా దేకాంశం వేదికోదయం॥ 29

తదూర్ధ్వే ఉధ్యర్ధభాగేన గలం త్ర్యంశకం మస్తకం।
తదర్ధం స్తూపికోత్తుంగం కర్ణహర్మ్య మితి స్మృతం॥ 30

తదేవాధిష్ఠాన సంయుక్తం కర్ణహర్మ్యం వినా తథా।
తదూర్ధ్వే వేదికాంశేన కర్ణ కంపాబ్జకంప యుక్॥ 31

తా॥ ఆలయము యెత్తును 10 భాగములుచేసి అందు అధిష్ఠానము 1$\frac{1}{4}$ భా. స్తంభము యెత్తు 2$\frac{1}{2}$ భా. ప్రస్తరము 1$\frac{1}{4}$ భా, గలము 2 భా. శిఖరము 2 భా, స్తూపిక 1 భా, చేయవలెను. ప్రస్తరముపైన కర్ణమున హార్మ్యమును కల్పించవలెను. అది 1 భాగముండవలెను, దానిపైన తూర్పుదిశయందు గలమును 1 భాగము యుక్తితో చేయవలెను. కర్ణ హార్మ్యముయొక్క విస్తారమును 6 భాగములు చేసి అందు 1 భాగము కర్ణకూటమును చేయవలెను. మధ్యను శాల 2 భాగములు చేయవలెను. 1 దండముగాని 2 దండములుగాని 3 దండములుగాని నిర్గమమును చేయవలెను. లేక భద్రమునైన చేయవలెను. శాలాకూటముల రెంటిమధ్య నొక హారమును పంజరయుక్తముగ చేయవలెను. దానియెత్తును 7 భాగములుచేసి అందు 1 భాగము వేదిక యెత్తును చేయవలెను. దానిపైన 1$\frac{1}{2}$ భాగము గలమును దానిపైన శిఖరమును 3 భాగములును మస్తకముపైన స్తూపిక 1$\frac{1}{2}$ భాగమును చేయవలెను. ఇది కర్ణమునందలి హార్మ్యము అదియే అధిష్ఠానముతోకూడి కర్ణములయందు హార్మ్యములు లేకుండను ఆపైన 1 భాగము వేదికయును కర్ణము, కంపము, పద్మము, కంపము ఇట్లు చేయవచ్చును.


(తుంగమానం) 10 భా.

శ్లో॥ అథవా వేదికోత్తుంగం శేషం భాగ మిహోచ్యతే।
తదేవ వేదికాంశేన నవభాగే విభాజితే॥ 32

ద్విభాగం వాజనం మూలే చోర్ధ్వే కర్ణం గుణాంశకం।
తదూర్ధ్వే కంప మేకాంశం గలం ద్వ్యంశేన వాజనం॥ 33

వేదితారం చతుర్భాగం మధ్యకోష్ఠం శివాంశకం।
నాసికాయుక్త కోష్ఠం వా నాసికా పంజరాన్వితం॥ 34

శేషం ప్రాగుక్తవ త్కుర్యాత్ సర్వాలంకార సంయుతమ్॥

**తా॥** లేక వేదికయొక్క యెత్తును 9 భాగములుచేసి దాని మొదట వాజనము 2 భాగములును, ఆపైన కర్ణము 3 భాగములును, దానిపైన కంపము 1 భాగమును, గలము 2 భాగములును, వాజనము 1 భాగమును చేయవలెను. వేదియొక్క విస్తారమును 4 భాగములుచేసి మధ్యను 1 భాగము కోష్ఠమును చేయవలెను నాసికతోగూడిన కోష్ఠమును చేయవచ్చును. నాసిక పంజరముతోకూడి యుండవలెను, మిగిలినవి మునుపు చెప్పినట్లు సమస్తమైన అలంకారములతో చేయవలెను,

శ్లో॥ అథవా హర్మ్య తుంగే తు ద్వాదశాంశం విభాజితే॥ 35

సార్ధ తుంగ మధిష్ఠానం పాద దీర్ఘం గుణాంశకం।
తదర్ధం ప్రస్తరోత్సేధం గ్రీవోచ్చం తు గుణాంశకం॥ 36

శిఖరోచ్చం ద్విభాగం స్యాత్ స్తూపికోచ్చం శివాంశకం।
ప్రస్తరోచ్చం ద్విభాగేన చాంతరం ప్రస్తరాన్వితమ్॥ 37



(ప్రాసాదసాల) (12 భా.)

**తా॥** మరియు హార్మ్యముయెత్తును 12 భాగముచేసి అందు అధిష్ఠానము 1½ భా, స్తంభముయెత్తు 3 భా, ప్రస్తరము 1½ భా, గలము 3 భా, శిఖరము 2 భా, స్తూపిక 1 భా, ప్రస్తరముయొక్క యెత్తును 2 భాగములుగా చేసి 1 భాగము ప్రస్తరమును 1 భాగము అంతరమును చేయవలెను.

శ్లో॥ ఉత్సేధం దశ భాగే తు వేదితుంగం శివాంశకం।
పాదతుంగం గుణాంశం స్యాత్ త్రిపాదాంశం తు మంచకం॥ 38

వేదికోచ్చం తు పాదాంశం కంధరోచ్చం శివాంశకం।
శిరస్తుంగ మద్వయానీ భాగే చోర్ధ్వం కుంభం శివాంశకం॥ 39

తదూర్ధ్వే గ్రీవ మంశేన పూర్వవ త్సమలంకృతమ్।

తా॥ ఎత్తును 10 భాగములుచేసి అందు వేదిక 1 భా, స్తంభము 3 భా, మంచకము $0\frac{3}{4}$ భా. వేదిక $0\frac{1}{4}$ భా. కంఠము 1 భా, శిఖరము 2 భాగములు అందులో పైన 1 భాగము కుంభమును చేయవలెను. ఆ పైన 1 భాగములో గ్రీవమును స్తూపికను చేయవలెను

శ్లో॥ అథవా మనుభాగం తు హర్మ్యతుంగే విభాజితే॥ 40

సత్రిపాద మధిష్ఠానం తద్ద్వయం చాంఘ్రి భాజితం।
తదర్ధం ప్రస్తరోత్సేధం యుగాంశం గ్రీవ తుంగకం॥ 41

తదర్ధం శిఖరోత్తుంగం తూర్ధ్వే స్తూపిక మంశకం।
గ్రీవ మంచోర్ధ్వ మంశేన యథేష్టాధిష్ఠాన సంయుతం॥ 42

తదూర్ధ్వే చ ద్విభాగేన కర్ణ హర్మ్యాది మండితం।
శేషం చ కంధరం ప్రోక్తం పూర్వవ త్సమలంకృతమ్॥ 43

తా॥ ఆలయము యెత్తును 14 భాగములుచేసి అందు అధిష్ఠానము $1\frac{3}{4}$ భా, భా, స్తంభము యెత్తు $3\frac{1}{2}$ భా. ప్రస్తరము $1\frac{3}{4}$ భా, గలము 4 భా, శిఖరము 2 భా, స్తూపిక 1 భా, గ్రీవమునకును మంచమునకును పైన 1 భాగము అధిష్ఠానమును చేయవలెను. దానిపైన 2 భాగములు కర్ణములయందలి హర్మ్యములను చేయవలెను. మిగిలినదిగలము చేయవలెను, అన్ని పనులు మునుపటివలెనే చేయవలయును.



(భూమి నిర్ణయం) 14 భా.

శ్లో॥ అథవా హర్మ్య తుంగే తు షోడశాంశం విభాజితే।
అధిష్ఠానం ద్విభాగం స్యా త్పాద తుంగం గుణాంశకం॥ 44

ప్రస్తరం చాశ్వినీభాగం చోర్ధ్వే భాగం విశేషతః।
మంచభాగో యుగాంశం స్యా త్ప్రస్తరం చ ద్విభాగికం॥ 45
తత్సమం గ్రీవ తుంగం స్యా ద్యుగాంశం శిఖరోదయం।
తదర్ధం స్థూపికోత్తుంగం చాష్టవర్గ మితి స్మృతమ్॥ 46



(కూటశాల) 16 భా.

తా॥ ఆలయము యెత్తును 16 భాగములుచేసి అందు అధిష్ఠానము 2 భా, స్తంభముల యెత్తు 3 భా, ప్రస్తరము 2 భా, మంచము 2 భా, ప్రస్తరము 2 భా, గలము 2 భా, శిఖరము 2 భా, స్థూపిక 1 భా, చేయవలెను.

శ్లో॥ మూల హర్మ్య విశాలే తు చాష్టభాగం విభాజితే।
షడ్భాగ మూర్ధ్వ శాలే కుర్యా త్త ద్విస్తార మితి స్మృతం॥ 47
ఊర్ధ్వాంగం పూర్వ వత్కుర్యాత్ సర్వాలంకార సంయుతం।
తదే వాష్టాంశకం చోర్ధ్వే పాదతుంగం ద్వయాంశకం॥ 48
తదర్ధం మంచ తుంగం స్యా త్తత్సమం కంధరోదయః।
ద్వ్యర్ధాంశం శిఖరోత్తుంగం చా ధ్యర్ధాంశం శిఖోన్నతమ్॥ 49

తా॥ ప్రధానాలయము యొక్క విస్తారమును 8 భాగములు చేసి అందు 6 భాగములు పై ప్రదేశమున విస్తారమును చేయవలెను. పై రూపమును ఆలయము వలెనే చేయవలెను అన్ని అలంకారములతో నుండవలెను, అదియే 8 భాగములుచేసి స్తంభము యొక్క యెత్తును 2 భాగములును, మంచము యెత్తు 1 భాగమును, గలము 1 భాగమును, శిఖరము 2½ భాగములును, స్థూపిక 1½ భాగమును, చేయవలెను. మరియు,

శ్లో॥ ఊర్ధ్వే పాదోదయే బంధు భాగ మేకాంశ (ం) వేదికం।
శేషం తు పూర్వవ త్కుర్యా దష్ట వర్గ విదో విదుః॥ 50

తా. పైన స్తంభము యొక్క పొడవును 4 భాగములు చేసి, అందు వేదిక 1 భాగము చేసి మిగిలినది మునుపటివలెనే చేయువలెను.

శ్లో॥ వేద వృద్ధ్యాఽష్టభాగం స్యా జ్జన్మాది స్తూపికాంతకం।
అధిష్ఠానం యుగాంశం స్యా త్పాదం వా పాలికా తథా॥ 51

ప్రస్తరోచ్చం యుగాంశం స్యా దూర్ధ్వే పాదం శరాంశకం।
తదూర్ధ్వే ద్వ్యంశం మంచం స్యా ద్వేదికోచ్చం శివాంశకం॥ 52

గ్రీవ తుంగం ద్విభాగం స్యా చ్ఛిఖరోచ్చం వేద భాగికం।
స్తూపికోచ్చం ద్విభాగం స్యా త్పూర్ణ హర్మ్యాది మండితం॥ 53

ఏత దష్ట విధం ప్రోక్త మేక భూమి విధానకే।

తా॥ అధిష్ఠానము మొదలు స్తూపిక వరకు 34 భాగములు చేసి అందు అధిష్ఠానము 4 భా, స్తంభము పాలిక కలసి 8 భా, ప్రస్తరము 4 భా, పైన స్తంభము 5 భా, పైన మంచము 2 భా, వేదిక 1 భా, గలము 2 భా, శిఖరము 4 భా, స్తూపిక 2 భా, చేసి శిరముగల హర్మ్యమును చేయవలెను. ఇట్లు 8 విధములుగా చెప్పబడి యున్నది.

## 20. ఆలయమునకు పేళ్లు

### మానసారము 19వ అధ్యాయము

శ్లో॥ విమానం సద్మ హర్మ్యం తు చాలయం వా చాధిష్ఠ్యకం॥ 54

ప్రాసాదం భవనం క్షేత్రం మందిర మాయతనం తథా।
వేశ్మ చ వస్త్య మావాసం క్షయం ధామ సనాతనం॥ 55

వాసం గేహ మాగారం వా సదనం వసతిర్గృహం।
నిలయం చ తలం కోష్ఠం స్థానం పర్యాయ వాచకం॥ 56

విమానస్య తు విస్తారే త్రిభాగం చాంశకం గృహం।
హర్మ్య తారే తు భూతాంశం త్రయాంశం గర్భ గేహకం॥ 57

గేహ తారే తు సప్తాంశం నాలీ తారం యుగాంశకం।
నాలీతారం యుగాంశం స్యా చ్ఛరాంశం గృహ విస్తృతం॥ 58

క్షయ వ్యాసం చ రుద్రాంశం షడ్భాగం కోష్ఠ విస్తృతం।
సైకార్క భాగ విస్తారే సప్తాంశం నాలికం గృహం॥ 59

పంచ దశాంశకం తారే సాష్టాంశం గర్భ గేహకం।
విస్తారే చ ద్విభాగే తు చైకాంశం తుంగ విస్తృతం॥ 60

శేషం కుడ్య విశాలం స్యా ద్గర్భ గేహావృతం తథా।

తా॥ విమానము, సద్మము, హర్మ్యము, ఆలయము, ధిష్ణ్యము, ప్రాసాదము, భవనము, క్షేత్రము, మందిరము, ఆయతనము, వేశ్మము, వస్త్యము, ఆవసథము, క్షయము, ధామము, సనాతనము, వాసము, గేహము, ఆగారము, సదనము, వసతి, గృహము, నిలయము, తలము, కోష్ఠము, స్థానము ఇవి యన్నియును ఆలయమునకు పేర్లు. ఆలయముయొక్క విస్తారమును 3 భాగములు చేసి అందు 1 భాగము గర్భగృహము, 5 భాగములుచేసి అందు 3 భాగ గర్భగృహము, గృహమును 7 భాగములుచేసి అందు 4 భాగములు నాళిక చేయవలెను. గృహవిస్తారమును 5 భాగములుచేసి అందు 4 భాగములు నాళిక చేయవలెను. గృహమును 11 భాగములుచేసి 6 భాగములు కోష్ఠమును చేయవలెను. 13 భాగములుచేసి 7 భాగములు నాళిక గృహమును చేయవలెను. విస్తారమును 15 భాగములుచేసి అందు 8 భాగములు గర్భగృహమును చేయవలెను. విస్తారమును 2 భాగములు చేసి అందు భాగము యెత్తు చేయవలెను. మిగిలినది గోడ విశాలము చేయవలెను. గర్భగృహమును ఆవరించి యుండవలెను.

శ్లో॥ ఆ ద్వాదశ భూమిపికోష్ఠం ద్వికలాంతం మూలగృహం॥ 61

ఆంతః గృహే విమాన విధి మశేషం గృహం నాళికాదిమ్।
విమాన మిద ముక్తం స్యాత్ యథాగతం గృహాంతరం॥ 62

యత్ర త్వాద్య విశాలం తు ద్వాదశాంశే విభాజితే।
పంచాంశం తు బహిః కుర్యాత్ చాంతః సప్తాంశకం త్యజేత్॥ 63

తద్ ద్వయోర్మధ్య దేశేచ ద్వారపాదస్య మధ్యమే।
ఏతద్బహిః స్థిత స్తంభం తదభ్యంతర ముచ్యతే॥ 64

తత్పాద మధ్యమోచ్చాంతం క్షుద్రా దంఘ్రి మధ్యమం।
ఏవం తు మధ్యమం శ్రేష్ఠం హర్మ్యే ద్వారస్య యోగ్యకం॥ 65

క్షుద్రహర్మ్యేతు యుక్త్యైవ కుర్యాత్తు శిల్ప విత్తమః।
అంతః స్తంభం వినా వాఽపి కుర్యా ద్బాహ్యస్తు పాదకమ్॥ 66

తా॥ పది రెండంతస్తులవరకు కోష్ఠములు రెండంతస్తుల వరకు గర్భగృహమును చేయవలెను. గర్భమును విమానమును విధానము చొప్పున చేయవలెను. నాళిక మొదలైనవి కూడ చేయవలెను. గృహముయొక్క విస్తారము ననుసరించి నాళికను చేయవలెను. గోడయొక్క విస్తారమును 12 భాగములుచేసి వెలుపల 5 భాగములును, లోపల 7 భాగములును చేయవలెను. ఆ రెంటియొక్క మధ్య ప్రదేశమునను, ద్వారపాదముయొక్క నడుమునను, దీనియొక్క వెలుపలనున్న స్తంభము ఆ స్తంభము యెత్తుకు తక్కువలో నుండవలెను. స్తంభముయొక్క నడుము యెత్తు వరకు చివరనుండి స్తంభమధ్యమము, నడుమునుండి మొదలు హర్మ్యమునందు ద్వారమునకు యోగ్యము. క్షుద్రహర్మ్యమున యుక్తితో శిల్పాచార్యుడు చేయవలెను. లోపలి స్తంభము లేకుండను వెలుపల స్తంభమును చేయవచ్చును.

## 21. ద్వార ప్రమాణము

మానసారము 19వ అధ్యాయము

శ్లో॥ విభజేత్పంచ షట్సాష్ట హర్మ్య పాదోదయం తథా।
తత్తదేకాంశ హీనం స్యాచ్ఛుద్ధ ద్వారోదయం భవేత్॥ 67

తదర్ధం ద్వార విస్తారం దేవానాం హర్మ్య మధ్యమే।
నాగ నందాంగుల మారభ్య ద్వి ద్వ్యంగుల వివర్ధనాత్॥ 68

ఏకహస్తావసానాంతం కన్యసాది త్రయం క్రమాత్
ద్వార పాదస్య విస్తారం క్షుద్రహర్మ్యేషు యోగ్యకం॥ 69

చతుర్వింశాంగులం పంచ వింశత్యంగుల మారభేత్।
ద్వి ద్వ్యంగులేన వృద్ధిః స్యాత్కన్యసాదీని పూర్వవత్॥ 70

చత్వారింశాంగులం చైక చత్వారింశాంగులాంతకం
మధ్యమం మానంహర్మ్యేతు ద్వారపాదస్య విస్తృతమ్॥ 71

తా॥ హర్మ్యముయొక్క స్తంభములను 5-6-8 భాగములుచేసి, వానిలో ఒక్కొక్క భాగమును తగ్గించి శుద్ధద్వారముయొక్క యెత్తును చేయవలెను. ఆద్వారముయొక్క విస్తారము అందులో సగము చేయవలెను. దేవాలయములయొక్క మధ్యను 8-9 అంగులములు మొదలుకొని 2-2 అంగులములను పెంచుచు 1-హస్తము వరకు కనిష్ఠము మధ్యమము-ఉత్తమము. ఇట్లు ద్వార స్తంభముయొక్క విస్తారమును చేయవలెను. ఇవి క్షుద్రహర్మ్యములకు పనికి వచ్చును. 24-25 అంగులములు మొదలుకొని 2-2 అంగులములను పెంచుచు అధమము, మధ్యమము, ఉత్తమము అనువానికి వరుసగా 40-41 అంగులముల వరకు మధ్యమము అను దేవాలయములకు ద్వార పాదముయొక్క విస్తారమును చేయవలెను. ఇట్లు 9 భేదములు అని తెలియవలెను.

శ్లో॥ ద్విహస్తంతు సమారభ్య త్రిత్ర్యంగుల వివర్ధనాత్।
తత్త్రిహస్తావధి ర్యావ దధమాదిత్రయం త్రయం॥ 72

ఏవంతు ద్వారపాదం స్యాద్విస్తారం చోత్తమాలయే।
కేచిత్తు ద్వారపాదోచ్చ వశాద్ ద్వారాంఘ్రి విస్తృతమ్॥ 73

తా॥ రెండు హస్తములు మొదలుకొని 3-3 అం. చొప్పున పెంచుచు 3 హస్తముల వరకు 9 భేదములు అధమము మధ్యమము, ఉత్తమము అను పద్ధతులలో వరుసగా ద్వార స్తంభముయొక్క విస్తారమును చేయుదురు. ఇది ఉత్తమాలయములకు చెప్పబడిన పద్ధతి. కొందరు ద్వార స్తంభము యొక్క యెత్తు ననుసరించి ద్వార స్తంభముయొక్క విస్తారమును చేయుదురు. దానిని చెప్పబోవు చున్నాను.

శ్లో॥ ద్విహస్తంతు విశాలం స్యాత్సమం వా బహూంశం భవేత్।
తదర్థం వా త్రయాంశైకం ద్వారపాదస్య తత్తథా॥ 74

ద్వారా యామ సమపాదౌ చోర్ధ్వయోః పట్టికా ఘనా।
స్తైవ విస్తృతం దీర్ఘం పాదయుక్త్యా ప్రయోజయేత్॥ 75

దేవ భూసుర భూపానాం సామంత ప్రముఖాదీనాం।
యోగ్యం కవాట యుగ్మం చ శ్రేష్ఠం మధ్యం చ హర్మ్యకే॥ 76

అంతర్వాఽపి బహిర్వాఽపి ఘటనం కీల సంయుతం।
ద్వారపాదం చ బాహ్యేతు సర్వాలంకార సంయుతం॥ 77

ద్వారోర్ధ్వే ద్వారపార్శ్వే తు కుర్యాత్తు ద్వారదేవతాం।
కవాట ద్వారదేవానాం స్పృష్ట దోషం సమావహేత్॥ 78

తా॥ రెండు హస్తముల విశాలమును మందము దానితో సమానముగాని, లేక ముప్పాతిక వంతుగాని చేయవలెను. ద్వారముయొక్క యెత్తుతో సమానముగా స్తంభములను చేయవలెను. ద్వారశాఖలపైన అదేకొలతగల పట్టికల నుంచవలెను. దేవతలకును, బ్రాహ్మణులకును, రాజులకును, సామంతరాజులు మొదలైన వారలకు తగినట్లు ఉత్తమము, మధ్యమము, కనిసములను భేదములు కల్పింపబడినవి. తలుపు లోపలకును వెలుపలకును కదలుటకు దానికి తగిన మేకును కల్పించవలెను. ద్వార స్తంభము వెలుపల సమస్తమైన అలంకారములను రచించవలెను ద్వారము పైనను, రెండు వైపులను, ద్వారదేవతలను రచించవలెను. అయినను కవాటద్వార దేవతలను పశులు తాకినయెడల దోషము కలుగును.

## 22. నాల లక్షణము

### మానసారము 19వ అధ్యాయము

శ్లో॥ తస్మాత్పరిహారేచ్ఛిల్పీ బాంత స్తంభం ప్రయోజయేత్।
జన్మాది పట్టికాంతం చ పంచాంశంతు యథావిధి॥ 79

దేవతాస్థాపనం కుర్యాద్బాహ్యే నాళం ప్రయోజయేత్।
మసూరాణాం స్థానం కుర్యాదస్యార్థం విప్రనాలికా॥ 80

విస్తారాయామ ముత్సేధం లంబనం వక్ష్యతేఽధునా।
అష్టం పంక్తి స్తథా భానుర్మనుః షోడశకాంగులం॥ 81

పంచధా రచితం నాలం విస్తారం పంక్తి రీతం।
వితస్త్యాః సార్ధ ద్విహస్తాంతం పంచధా యామ మీరితం॥ 82

ఏతత్ క్షుద్ర విమానేతు మధ్యదేశస్య వామకే।
పూర్వ దిక్పోత్తరే వాఽపి యుక్త్యా నాలం ప్రయోజయేత్॥ 83

యథాపూర్వోక్త మానేతు తదూర్ధ్వే చ గుణాంశకం।
మధ్యమే చోత్తమే హర్మ్యే దంత నాలం ప్రమాణకం॥ 84

యథాధిష్ఠాన తుంగం తత్సమం నాలోదయం భవేత్।
ఉత్సేధే చ త్రిభాగైకం తస్యాధో చాగ్రలంబనమ్॥ 85

తా॥ కావున శిల్పాచార్యుడు వెలుపల స్తంభమును చేయవలయును. జన్మస్థానము మొదలు పట్టిక వరకు 5 భాగములు చేసి దేవతాస్థానమును చేయవలెను, వెలుపల నాలమును కల్పించవలెను. మసూరములకు స్థానము ననుసరించి నాలిక నుండవలయును. దానియొక్క కొలతలను చెప్పుచున్నాను, 8-10-12-14-16 అంగులములు ఇట్లు 5 విధములుగా నాలముయొక్క విస్తారము చెప్పబడినది. 1 వితస్తి మొదలు 2½ హస్తముల వరకు పొడవు 5 విధములుగా చెప్పబడి యున్నది. ఇది క్షుద్రవిమానమునకు పనికి వచ్చును. మధ్యప్రదేశమున పశ్చిమవైపునగాని యెడమవైపునగాని లేక ఉత్తరమునగాని, తూర్పునగాని యుక్తితో నాలమును అమర్చవలెను. పూర్వము చెప్పబడినట్లు దానిపైన 3 భాగములు మధ్యమమునను, ఉత్తమమునను హర్మ్యమునుండి వెలుపలకు నాలముయొక్క పొడవును చేయవలెను. అధిష్ఠానము యెత్తుతో సమానముగా నాలముయొక్క యెత్తును చేయవలెను. ఎత్తును 3 భాగములుచేసి అందు 1 భాగము క్రింద లంబమును చేయవలెను.

శ్లో॥ నాల మూల విశాలేతు భూతభాగం విభాజితే।
త్రయాంశం చాగ్ర విస్తారం లంబనం పంచభాగికమ్॥ 86

కుడ్మలోచ్చం త్రిభాగం స్యాత్పద్మమేకేన కారయేత్।
తదూర్ధ్వే వాజనం చాంశం యుక్త్యా చ సమలం కృతమ్॥ 87

ద్వారాభం వాఽథ వృత్తం వా భద్రద్వారం స్వలంకృతం।
ఏకద్విత్ర్యంగులం వాఽపి చతుష్పంచాంగులేన వా॥ 88

మూల విస్తార ముత్సేధం యుక్త్యా ఛిద్రం ప్రకల్పయేత్।
మూల పాద త్రయాంశేన చాగ్రే ఛిద్ర విశాలకమ్॥ 89

మూలే తుంగం సింహ వక్త్రం స్యాత్తదా స్యాన్నిర్గమోదయం।
రంభా నాలం ప్రసూనాభం కుర్యాత్తచ్ఛిల్ప విత్తమః॥ 90

తా॥ నాలముయొక్క మొదలు విస్తారము 5 భాగములుచేసి చివర 3 భాగములు చేయవలెను. ఎత్తును 5 భాగములు చేయవలెను. మొగ్గయొక్క యెత్తు 3 భాగములును, పద్మము 1 భాగమును చేయవలెను. దానిపై వాజనము 1 భాగము అలంకారముగా చేయవలెను. ద్వార

చదరముగాగాని గుండ్రముగాగాని భద్రద్వారమును అలంకారముగా చేయవలెను. 1-2-3-4-5 అంగుళములు మొదలు విస్తారమును యెత్తును చేసి అందులో 3వ వంతు విస్తారమును యెత్తును కలుగునట్లు రంధ్రమును చేయవలెను. మరియు పల్లములుగాని ప్రక్కలకు ఒంపులుగాని లేకుండ చక్కగా చేయవలెను. మొదలు యెత్తైన సింహముయొక్క ముఖమును చేయవలెను. ఆ సింహ ముఖమంతయు కలువల కుండునట్లు నిర్గమమును చేయవలెను. నాలమును అరటి యాకువలెను పుష్పమువలెను చేయవలెను. శిల్పాచార్యుడు చక్కగా ఆలోచించి చేయవలెను.

శ్లో॥ శీర్షకం చ శిఖాగ్రీవం వృత్తం స్యా ద్వైజయంతికం।
తదేవ కర్ణ కూటం చే దాభోగమితి కీర్తితమ్॥ 91

తన్మధ్యే భద్ర సంయుక్తం శ్రీ విశాల మితిస్మృతం।
తదష్టాశ్రం శీర్షకం స్యాత్ స్వస్తి బంధమితి స్మృతమ్॥ 92

తదేవం చతురశ్రం చే చ్ఛిఖరం శ్రీకరం భవేత్।
తద్ ద్వ్యశ్ర వృత్త సంయుక్తం హస్తిపృష్ఠ మదాహృతమ్॥ 93

శిరోగ్రీవం షడశ్రం స్యాత్ స్కంధతార మిహోచ్యతే।
మధ్యే భద్రం విశాలం స్యాత్ కర్ణ కూటోప సంయుతమ్॥ 94

తచ్ఛాలా భద్రనాస్యంగం శిరోగ్రీవం తు వృత్తకం।
అథ వా చతురశ్రం స్యాత్ కేసరం తత్ప్ర కథ్యతే॥ 95

తదేవాకార మాయామం తత్తన్నామ్నా ప్రకీర్తితమ్॥ 96

ఏవం ప్రోక్తం హర్మ్యకే మధ్య భద్రం। శాలా కోష్ఠం దిగ్వి దిక్కూటయుక్తం।
హారాక్రాంతా నాసికా పంజరం ధ్యం। కుర్యా త్సర్వం వేదికా భద్రయుక్తమ్॥ 97

తా॥ శిఖరము, స్తూపిక, గలము, ఈమూడును గుండ్రముగా నుండెనేని వైజయంతికము. అదియే కర్ణకూటములు కలిగి యుండెనేని ఆభోగము. దానియొక్క నడుమ భద్రమును కల్పించిరేని శ్రీ విశాలము. అదియే 8 కోణములుగల శిఖరముతో నుండెనేని స్వస్తిబంధము. అదియే నలు చదరముగా నున్న శిఖరము కలది యయ్యెనేని శ్రీకరము. అదియే ద్వ్యశ్ర వృత్తముతో కూడిన శిఖరము కలిగి యుండెనేని హస్తిపృష్ఠము. శిఖరమును గలమును 6 కోణములు గలిగి యుండెనేని స్కంధతారము. మధ్యను భద్రము విశాలము కలిగి కర్ణకూటములతో నుండి మరియు శాల, భద్రనాసి, ఇవియును కలిగి శిఖరము, గలము, గుండ్రముగా నుండెనేని కేసరము, లేక నలు చదరముగా నున్నను కేసరమే యగును. అదియే రూపము పొడవున నుండెనేని ఆయారూపముల ననుసరించి పేరులు కలుగుచున్నవి. హర్మ్యమున మధ్యభద్రము శాలాకోష్ఠము. దిక్కులయందును విదిక్కులయందును కూటములును, హారములు, క్రాంతములు, నాసికలు, పంజరములు, మొదలగునవి వానిలోను వేదికా భద్రములోను సమస్తమును చేయవలెను.

## 23. ముఖమండపలక్షణము

### మానసారము 19 వ అధ్యాయము

శ్లో॥ హర్మ్య్యతారసమం చ ... శతం। తత్త్రిపాద మర్ధ మథాపిచ।
కుడ్య తారసమాది ముఖ్యాక్రమం కన్యసం త్రిపథం ముఖమండపం।
తన్ముఖ మండపం ముఖ్యవిమానే॥ 98

మధ్య విమానస్య మండపం పూర్వే అంబరం దండ మథ ద్వయ దండం।
హర్మ్య వశా దుపవేశనయుక్తం యుక్తత్ క్షుద్రవిమానే తన్ముఖే మండపంస్యాత్॥
తద్ ద్వయోర్మధ్య దేశే చైకాధ్యక్షం హస్త విస్తారం।
అథ వా త్రిపాద హస్తం స్యాత్ ప్రాసాదార్థమథకథితమ్॥ 100

ఏక ద్వి త్రిదండం వా చాంతరాలస్య వేశనం స్యాత్।
కుంభ స్తంభ సహిత నాసికా పంజర యుక్తమేసవా॥ 101

శాలా పంజరయుక్తం తోరణైః సమలంకృత్య యుక్త్యా।
ఏక ద్వి త్రి చతుర్హస్తా స్తంభ యుక్త మితికథితమ్॥ 102

తా॥ ఆలయముయొక్క విస్తారముతో సమానముగా గాని, లేక అందు ముప్పాతికవంతుగాని సగముగాని గోడవిస్తారమునుబట్టి క్రమముగా ఉత్తమ మధ్యమ అధమ ముఖమండపములను చేయవలెను. ప్రధానమయిన హర్మ్యములకు ముఖమండపము ముండవలెను. మధ్య మహర్మ్యములకు ముఖమండపముయొక్క శిఖరము 1 దండముగాని లేక 2 దండములుగాని హర్మ్యము ననుసరించి చేయవలెను. క్షుద్రవిమానములకును ముఖమండపమును చేయవలెను ఆ రెంటయొక్క మధ్య ప్రదేశమున 1 హస్తముగాని లేక ¾ హస్తములుగాని, లేక ముప్పాతిక హస్తముగాని చేయవలెను. 1 దండముగాని 2 దండములుగాని 3 దండములుగాని అంతరాలముయొక్క వేశనముండవలెను. కుంభముంతో గూడిన స్తంభములను, నాసికయును, పంజరము, పీటితోకూడ గాని, లేక శాలలు, పంజరములు తోరణములు మొదలగున వానితో గూడిగాని యుండవలెను 1-2-3-4 హస్తములు కల స్తంభములతోగూడి యుండవలెను.

## 24. దేవతాన్యాసము

### మానసారము 19 వ అధ్యాయము

శ్లో॥ అథ వా ద్వార యుతం పూర్వవద్ ద్వార మానేన కుర్యాత్।
తద్ ద్వార ముఖసోపానం హస్తిహస్తేన భూషితం సమ్యక్॥ 103

యుగ్మమండప దేశే తత్సమమూల ఏవ మలంకృత్య।
అన్యమండపదేశే య న్మనోరమ్య మలంకృతమ్॥ 104

మండపే ప్రస్తరస్యోర్ధ్వే కర్ణహార్మ్యాది మండితం।
యత్తన్మాంతరాలస్యోర్ధ్వే నాసికాజాల పంజరం వాఽపి॥ 105

తత్తన్మండపమధ్యే ప్రాసాదాద్ ద్వారం సంకల్పయేత్।
పూర్వవత్కవాట యుక్తం మండపస్యాంతః సకీలయుక్తమ్॥ 106

తత్తద్బహిర్ద్వార దేవాన్ న్యసేదే తద్ ద్వార పార్శ్వయోశ్చైవ।
నంది మహాకాలాదౌ చోక్తవద్ ద్వారదేవాన్న్యసేత్॥ 107

మండపస్య దక్షిణే కోష్ఠే నృత్త యుక్తమేవ వినాయక ముక్తం।
మండప సౌమ్యే కోష్ఠే స్థాన దుర్గయుక్ స్థాపయేత్తత్స్థమ్॥ 108

తా॥ మరియు ద్వారముతోగూడి కునుపటివలె ద్వారముతో నుండవచ్చును. ఆద్వారము యొక్క ముఖమునందు మొల్ల ఏనుగు తొండములతో నలంకరింపబడి చక్కగా నుండవలెను. మండపములు జతగానున్నచోట దానిని సమానమైన అధిష్ఠానములతో నలంకరించి యితర మండప ప్రదేశములందు అందమునుబట్టి యేపరిమాణమున చేయవలయునో అటుల చేయవలయును. మండపమున ప్రస్తరముయొక్క పైభాగమున కర్ణహర్మ్యములతోను అంతరాలముపైన నాసిక, జాలకములు, పంజరము, అయినను కలిగియుండవలెను ఆ మండపమునకు నడుమ ప్రాసారము ననుసరించి ద్వారము నుంచవలెను. దానికి తలుపులుచేయు పద్ధతి పూర్వము చెప్పబడి యున్నది. మండపము లోపల మేకుతోకూడ కవాటము నంచుంచవలెను. (అనగా తలుపుల కొరకు) ఆయా ద్వారముల వెలుపల ద్వారదేవతల నుంచవలెను. నంది, మహాకాలుడు అను యిరువురిని తూర్పు ద్వారమున నుంచవలెను మండపముయొక్క దక్షిణ కోష్ఠమున నృత్తమూర్తిని, వినాయకుని, స్థాపించవలెను. మండపముయొక్క ఉత్తర కోష్ఠమున స్థానదుర్గతోగూడిన దేవతల నుంచవలెను.

శ్లో॥ ప్రాసాద దక్షిణే మధ్య కోష్ఠే జ్ఞాన దక్షిణామూర్తిం।
తదూర్ధ్వే గ్రీవ కోష్ఠే గేయమూర్తిం వీరభద్రం వాఽపి॥ 109

పశ్చిమమూలతలే మధ్యే కోష్ఠే లింగముద్భూతం।
అథవాఽర్ధనారీశ్వరం స్థానకం విష్ణుం స్థాపయేద్వాఽపి॥ 110

తదూర్ధ్వే గ్రీవ కోష్ఠేతు కేశవ నృసింహోచ్యుతా నాసీనాన్।
సౌమ్యకే మూలతలే కోష్ఠే స్థానకం చతుర్ముఖం స్యాత్॥ 111

తదూర్ధ్వే గ్రీవకోష్ఠేఽథ నారదం కమలజం వాఽపి।
పూర్వే గల దేశే మధ్య కోష్ఠే గుహంగజారూఢమ్॥ 112

దిశాపతిం వాఽథ సర్వత్ర తత్తద్దేవ్యా సహాసనస్థ ముక్తం।
ఇంద్రస్య దక్షిణా వృత్తా త్పురతః షోడశ విగ్రహం కుర్యాత్॥ 113

ప్రస్తరోపరి తద్దేశే కోణే స్థాయే ద్వృషభం।
కర్ణైక మేక మూర్ధ్వం చ ద్వయం వాథ వృషభ సంయుతమ్॥ 114

ఏకానేకతలం సర్వ మేతద్దైవాకా పురాణ సంయుక్తం।
ఏవం శివ హర్మ్యాణాం యోగ్యం వినోద మన్యదేవానామ్॥ 115

తత్తద్వారముక్తం చైకా నేకతలోపేతం సర్వమ్॥

తా॥ ఆలయముయొక్క దక్షిణమున మధ్యగదిలో జ్ఞానదక్షిణామూర్తిని దానిపైన గలమునందలి కోష్ఠమున నటరాజ విగ్రహమునుగాని వీరభద్రునిగాని చేయవలెను. పడమర ప్రధాన స్థానమున మధ్య లింగరూపమును లేక అర్ధనారీశ్వరుడు నిలుచున్నట్లుగాని లేక విష్ణువునుగాని, దానిపై నగ్రీవమునందలి కోష్ఠమున కేశవుడు నృసింహుడు అచ్యుతుడు వీరిలో నెవరైన కూర్చున్నట్లు చేయవలెను. ఉత్తరమున మొదటి కోష్ఠమున మధ్యను చతుర్ముఖుడు నిలుచున్నట్లును దానిపైన గలమున నారదునిగాని బ్రహ్మనుగాని యుండవచ్చును. తూర్పున గలమున మధ్యకోష్ఠమున ఏనుగుపై నెక్కిన కుమారస్వామినిగాని లేక ఇంద్రునిగాని చేయవచ్చును. ఇంద్రుని దగ్గరనుండి వరుసగా అన్ని దిక్పాలయందు వారవారి భార్యలతో సహ వాహనముపైన కూర్చుండినటు 16 విగ్రహములను చేయవలెను. ప్రస్తరముపై ప్రదేశమున నాలుగు మూలలయందును వృషభమును చేయవలెను అయినను మూలను ఒక్కటే తలతోను రెండు ప్రక్కల శరీరములను కలిగి అందముగా నుండవలెను. ఒక్క అంతస్తునగాని లేక యెన్ని అంతస్తులు కలిగినప్పటికిని అంటటను ఈ దేవతలను పురాణ కథలకు సంబంధించినట్లు శివాలయములయందు శాస్త్రప్రకారము చిత్రించవలెను, ఇంకను వినోదమైన ఇతర దేవతల రూపములుకూడ చేయవచ్చును. ఏ ద్వారమునం దేవతలను రచించవలెనో దాని ననుసరించి అన్ని అంతస్తులయందును చేయవలెను.

శ్లో॥ అథ విష్ణు విమానేతు దేవ స్థాపనం వక్ష్యామః॥ 116

ద్వారే చండ ప్రచండౌ చ మండప యామ్యే వనితాం।
ప్రాగుక్త వత్సౌమ్య దేశే విమానే పూర్వ వద్దేవతాం వాపి॥ 117

హరిం వా గరుడం వా కుర్యా త్పరిత శ్చతుష్కోణేషు।
శయనం వాసన మాసనం సింహం తార్క్ష్యం కృతాంజల్యాసనయుక్తమ్॥ 118

పౌత్రీ నృసింహ మథ కేశవమశ్వాస్యం కర్ణాత్పూర్వాదిదిక్షు।
చతుర్షు పూర్వోక్త హర్మ్యైక భూమి గలదేశమితి ప్రతిష్ఠాం కుర్యాత్॥ 119

దుర్గా ముత్తర మథాసన మచ్యుతం వా ప్రాచ్యాం ద్వితలే హర్మ్యే గల ప్రదేశే।
శ్రీమాధవం నరహరిం కృతం దక్షిణేచ నారాయణం చాథ పశ్చిమ దిక్ప్రదేశే॥ 120

తా॥ విష్ణు హర్మ్యమున దేవతల నుంచుటకు క్రమము చెప్పుచున్నాడు. ద్వారమున చండ ప్రచండులను నిలుపవలెను. మండపముయొక్క దక్షిణమున మోహినీ రూపమును, ఉత్తర

పూర్వము చెప్పిన దేవతారూపములుగాని లేక విష్ణురూపములనుగాని చేయవలెను. నాలుగు మూలల యందు గరుత్మంతుని రూపములనుగాని, లేక సింహరూపములను గాని చేయవచ్చును. సింహములను చేయునప్పుడు పరుండినట్లుగాని లేక కూర్చుండినట్లుగాని చేయవలెను. గరుత్మంతుని చేయునప్పుడు అంజలిబద్ధుడై కూర్చున్నట్లు చేయవలెను. వరాహము, నృసింహము, కేశవరూపము, హయగ్రీవ రూపము. ఈ నాల్గురూపములు గలప్రదేశమున తూర్పు మొదలుగా నాలుగు దిశలయందు చేయవలయును. ఇది యేకతలమున నిర్మించు పద్ధతి. రెండంతస్తుల హర్మ్యమైయ్యేని రెండవ గలమున ఉత్తరమున దుర్గనుగాని లేక కూర్చుండినట్లు విష్ణువునుగాని చేయవలెను. తూర్పున మాధవుని నిర్మించవలెను. దక్షిణమున నృసింహరూపమును చేయవలెను. పడమర నారాయణుని చేయవలెను.

శ్లో॥ క్రోడం స్యాదుత్తరే గ్రీవే జనార్దన హర్మ్యకే తత్।
త్రితలే పూర్వదిగ్దేశే గ్రీవే తచ్ఛ్రీధరం న్యసేత్॥ 121

ఉత్తరే వాసుదేవం వా థవా సంకర్షణం స్మృతం।
అనిరుద్ధం పశ్చిమే దేశే చోర్ధ్వే వా త దధోతలే॥ 122

ఏవం తు చోక్త వత్కృత్వా బౌద్ధాది జినకాలయం।
తత్ర ద్విమాన స్యోర్ధ్వే తు తత్తద్దేవాన్ న్యసేత్క్రమాత్॥ 123

అన్యేషాం దేవ దేవీనాం విమానే తద్విధానతః।
సర్వేషాం హర్మ్యకే కుర్యాత్ తత్ర ద్వాహన మీరితమ్॥ 124

శయనం ఽఽవాసనం వాఽపి ప్రస్తర స్యోపరి న్యసేత్।
ఏవం తత్ప్రోక్త వత్కుర్యా ద్ధర్మ్యం తత్సంపదా స్పదం॥ 125

ఏకభూమి మధికం త్వథ కుర్యాత్ చోపపీఠ మతి సుందరాన్వితం।
సోపపీఠ భవనైర్యుతం తు వా కారయేత్తు కథితం పురాతనైః॥ 126

ఏవం సర్వహర్మ్యాలంకార యుక్త్యా నానాపాదైర్వేదికాధారమంచం।
హీనాధిక్యం చే ద్వినాశనం తస్మాత్ కుర్యాత్సర్వం చోక్తవత్సంపదర్థమ్॥ 127

ఇతి మానసారే వాస్తుశాస్త్రే ఏకభూమి విధానం నామ ఏకోనవింశోఽధ్యాయః॥

తా॥ మూడు అంతస్తులుగల విష్ణ్వాలయమున వరాహావతారమును ఉత్తరగలమున చేయవలెను. తూర్పు గలమున శ్రీధరుని స్థాపించవలెను. మరియు నుత్తరమున వాసుదేవునికూడ నుంచవచ్చును. దక్షిణమున సంకర్షణుని నిలుపవలెను. పడమర అనిరుద్ధుని స్థాపించవలెను. గలమునగాని అంతకు తక్కువ గలమునగాని యుంచవచ్చును. ఇటులే బౌద్ధాలయములకును జైనాలయములకును సంప్రదాయము ననుసరించి యాయా దేవతలను క్రమముగా నుంచవలెను.

ఇతర దేవీహార్మ్యముల యందును ఇట్టే విధముగా వస్తుదేవతలను వారివారి వాహనములతో గూడ స్థాపించవలెను. ప్రస్తరమునకు పైభాగమున పతంగికలుగాని కూర్చుండునట్లుగాని చేయవలెను ఇట్లు చేసిన యెడల సంపదలు వృద్ధియై సుఖముతో నుందురు ఒక్క అంతస్తుగల దానినిట్లు చేసి అంతకు మిక్కిలి అంతస్తులు పెంచుట వలసినచో శిఖరమును యుపపీఠములతోను లేక ఉపపీఠభవనములతోను చేయవలెను. ఇట్లు సమస్తమైన హార్మ్యములు అలంకారయుక్తమైన వివిధ స్తంభములతోను, వేదికలతోను, ఆధారములతోను, మంచములతోను చక్కగా చేయవలెను ఈ చెప్పబడిన పద్ధతికి తక్కువగా గాని యెక్కువగా గాని కొలతలు వచ్చునట్లు చేసిన యెడల నశింతురు. కనుక సంపదలు జయము ఆయుర్వృద్ధి కావలయుననేవారు శాస్త్రము నతిక్రమించక చేయవలెను.

## 25. ఏకతల విమానము ద్రావిడపద్ధతి

### అపరాజిత 103 వ సూత్రము

శ్లో॥ పీఠోర్ధ్వే కర్ణ రేఖాశ్చ భూమికాః క్రమ సంస్థితాః।
విభక్తిదలనా పూర్ణా లతా శృంగక్రమోద్భవాః॥ 26

మేష మకర కూటస్థైః కంటకై రావృతా శుభాః।
వేదీ ఘంటా నాసికాద్యాః ద్రావిడాః శుభలక్షణాః॥ 27

### సమరాంగణ సూత్రధార

### 62 వ అధ్యాయము

శ్లో॥ ఊర్ధ్వమానమథ బ్రూమో ఘంటాంతం పీఠమాదితః।
ప్రమాణం కర్ణమానేన సర్వేషా మేవధారయేత్॥

తత్రైకభూమికః కార్యో హస్త పంచకవిస్తృతః
అంగుల ద్వాదశోపేతః సప్తహస్త సముచ్ఛ్రితః॥ 2

పాదోద్విహస్త ఉత్సేధాత్ సర్వాలంకారభూషితః।
సార్ధహస్త సముత్సేధ స్తావన్మానః స్తరావధి॥ 3

మాలా తు ద్విస్తరాప్రోక్తా స్తరో లశునకం భవేత్।
భరణం స్తరమేకంస్యాద్. భరణార్థం స్తరద్వయం 4

కలశం ద్విస్తరం జ్ఞేయో వారిధారా సమన్వితః।
ద్విస్తరం శుకకం కుర్యాత్ పద్మపత్ర సమన్వితమ్॥ 5

వీరకంఠంపునః కుర్యాత్ స్తరమేకం తమూర్ధ్వతః।
ద్విస్తరం హీరకం ప్రోక్తం పట్టశ్చైవతథాఽధః॥ 6

తా॥ అధిష్ఠానము పైభాగమునుండి ఘంటయొక్క తుదివరకుగల యెత్తును చెప్పుచున్నాను



ద్రావిడపద్ధతి.

కర్ణమానముతో అన్నిటికిని కొలతలు నిర్ణయించవలెను అందు ఏకతలమును 5 హస్తముల విస్తారముతోను 7½ హస్తముల యెత్తుతోను చేయవలెను. స్తంభముయెత్తు 2 హస్తములు, అన్నివిధములైన అలంకారములతో చేయవలెను. అదేవిధముగా 1½ హస్తము యెత్తున స్తరముల వరకు ప్రస్తరము మొదలైనవి చేయవచ్చును. మాల 2 స్తరములు, ఉశుకము 1 స్తరము, భరణము 1 స్తరము, భరణార్ధము 1 స్తరములు, కలశము 2 స్తరములు జలధారతో కూడ చేయవలెను. కులకము [illegible] స్తరములు, పద్మపత్రముతో కూడ చేయవలెను. మరల వీరకంఠమును 1 స్తరము చేయవలెను. హీరకము 2 స్తరములు, పట్టము 2 స్తరములు చేయవలెను. మరియు ఆపైన చేయవలసినవానిని చెప్పుచున్నాను.

శ్లో॥ పట్టికా స్తరమేకం స్యాద్ వసంతం ద్విస్తరం విదుః।
వసంతపట్టికా చోర్ధ్వం స్తరమేకం విధీయతే॥ 7

కపోతం నాసికాయుక్తం విదధీత స్తరత్రయం।
తదంతరం ప్రకుర్వీత మేడమేక స్తతః పరం॥ 8

స్తరప్రమాణం మకరం తద్వన్మకరపట్టికాం।
పునశ్ఛేదం స్తరంకుర్యాద్ వేదీబంధ స్తతః స్తరం॥ 9

ఛేదః స్తర ప్రమాణశ్చ కంఠః స్యాద్ ద్విస్తరంతతః।
పట్టికా స్తరమేకంతు తద్వచ్చాంబుజపట్టికా॥ 10

మాలాది పద్మపత్రాంతం ద్విహస్తోత్సేధ మీరితం।
సార్ధహస్తః సముత్సేధః కూటస్యపరికీర్తితః॥ 11

నాసికా పద్మసంయుక్తం తదూర్ధ్వం కలశో భవేత్।
ఏకభూమే రిదంమానం ప్రాసాదస్య ప్రకీర్తితమ్॥ 12

తా॥ పట్టిక 1 స్తరము, వసంతము 2 స్తరములు, వసంతపట్టిక 1 స్తరము, కపోతము నాసికతో కూడ 3 స్తరములు చేయవలెను. ఆలోపల మేడము 1 స్తరము, మకరము 1 స్తరము, ఛేదము 1 స్తరము వేదీబంధము 1 స్తరము, ఛేదము 1 స్తరము, కంఠము 2 స్తరములు, పట్టిక [illegible] స్తరము, పద్మపట్టిక 1 స్తరము చేయవలెను. ఇందు మాల మొదలు పద్మపత్రము వరకు

22 స్తరములు. స్తరమనగా 1 వీసము. ఇది హస్తమునకు 16 వ వంతు కనుక 32 ను కలసి 2 హస్తములైనవి. స్తంభములకును యీ స్తరములకును మధ్య ప్రస్తరము మొదలైనవి 1½ హస్తము. తరువాత కర్ణకూటములు 1½ హస్తములు, ఆపైన నాసికపద్మము వీనితోగూడ కలశము ⅓ హస్తము చేయవలెను. మొత్తము 7⅓ హస్తములు సరిపోవును. ఇది ఒక్క అంతస్తుగల ప్రాసాదము.

## 26. ద్వితల లక్షణము

### కాశ్యపశిల్పము 28 వ పటలము

శ్లో॥ అథవక్ష్యే విశేషేణ ద్వితలస్యతు లక్షణం।
ప్రాసాదమానవ త్కుర్యా ద్విస్తారోచ్ఛ్రం చ నిర్గమః॥ 1

విన్యాసమాత్ర యోరంత ర్వ్యాసం సప్తర్తు వా భవేత్।
ఏకాంశం కూట విస్తారం కోష్ఠం తు ద్విగుణాయతం॥ 2

కూట వ్యాస సమం కోష్ఠ విస్తారం ద్విజసత్తమ।
శేషం హారాంతరం కోష్ఠం పార్శ్వయోస్తు స పంజరం॥ 3

హారాంతర మశేషం వా త్రిపాదం వార్ధ ఏవ వా।
పంజర వ్యాస మాఖ్యాతం కూట బాహ్య సమోగతిం॥ 4

అంతః ప్రవేశం వా మాన సూత్రాణి ప్రయుతం తు వా।
పంజరం కర్ణ కూటాభం నాసికాకార మేవ వా॥ 5

తా॥ రెండంతస్తులుగల దేవాలయముయొక్క లక్షణమును చెప్పుచున్నాడు విన్యాస సూత్రముల రెండింటియొక్క నడుమ విస్తారమును 7 భాగములుగాని, 6 భాగములుగాని చేసి 1 భాగము కూటముయొక్క విస్తారమును 2 భాగములు కోష్ఠముయొక్క పొడవును, కూటము యొక్క విస్తారముతో సమానముగా కోష్ఠముయొక్క విస్తారమును చేయవలెను. మిగిలిన హారము నందలి కోష్ఠము రెండువైపుల పంజరములతోను చేయవలెను. లేక హారాంతరములు మిగులకుండ గాని చేయవలెను, ముప్పాతికవంతుగాని, లేక సగమువంతుగాని పంజరమునకు వ్యాసమును చేయవలెను. కూటముయొక్క వెలుపల అంచుతో సమానముగా నుండవలెను. లోపల వేశనముగాని, మానసూత్రములతో కూడిగాని పంజరము కర్ణకూటముతో సమానముగా నాసికవలెగాని చేయవలెను.

## 27. శాంతికము

శ్లో॥ ప్రాసాదోచ్ఛ్రం తు విభజే దష్టావింశతి భాగయా।
త్ర్యంశం ధరాతలోత్సేధం రసాంశం చరణోదయం॥ 6

ప్రస్తరోచ్ఛ్రం గుణాంశంస్యా ద్భూతాంశం చరణోదయం।
ద్విభాగం ప్రస్తరోత్సేధ మేకాంశం వేదికోదయం॥

భాగద్వయం గలోత్సేధం సార్ధ వేదం శిరోదయం।
అధ్యర్ధాంశం శిఖామానం కల్పితం శాంతికం భవేత్॥ 8



శాంతికము 28 భా.

తా॥ ప్రాసాదము యెత్తును 28 భాగములుచేసి అందు అధిష్ఠానము 3 భా, స్తంభము 6 భాగములు, ప్రస్తరము 3 భా, స్తంభము 5 భా, ప్రస్తరము 2 భా, వేదిక 1 భా, గలము 2 భా, శిఖరము 4½ భా, స్థూపిక 1½ భా, ఈ ప్రకారము చేసినయెడల శాంతిక మగును.

## 28. పౌష్టికము

శ్లో॥ చతుస్త్రింశతి భాగం తు కృత్వా చ సదనోదయం।
సార్ధాగ్న్యంశ మధిష్ఠానం తద్ ద్వయం చరణోదయం॥ 9
ప్రస్తరోచ్చం గుణాంశం స్యా త్తలిపం సార్ధ షడ్భవేత్।
గుణాంశం మంచమాత్రం తు వ్యోమాంశం వేదికోదయం॥ 10
సార్ధాగ్న్యంశం గలోత్సేధం భూతాంశం శిఖరోదయం।
సార్ధాంశం తు శిఖామానం పౌష్ఠికం సదనం భవేత్॥ 11



తా॥ ఆలయము యెత్తును 34 భాగములుచేసి అందు అధిష్ఠానము 3½ భా, స్తంభము 7 భా. ప్రస్తరము 3 భా, స్తంభము 6½ భా. ప్రస్తరము 3 భా, వేదిక 1 భా, గలము 3½ భా, శిఖరము, 5 భా, స్థూపిక 1½ భా, ఈ ప్రకారము చేసినచో పౌష్టికమగును.

## 29. జయదము

శ్లో॥ తదేవ గలమానం తు సార్ధ ద్వ్యంశేన కల్పయేత్।
శేషం పూర్వవ దేవం తు త్రయస్త్రింశోదయేకృతే॥ 12
జయదం సదనం హ్యేతత్ సర్వదేవ ప్రియావహమ్।



జయదము 33 భా.

తా॥ పైజెప్పినదానినే 1 భాగము తగ్గించి, 33 భాగములు చేసి అందు అన్నియు మునుపటిలెనే చేసి గలము 2½ భాగములు చేసినయెడల జయదమగును.

## 30. అద్భుతము

శ్లో॥ షట్త్రింశద్భాజితే తుంగే చతుర్భాగం ధరాతలం॥ 13
వస్వంశం పాదమానం తు సార్ధాగ్న్యంశం తు ప్రస్తరం।
సప్తాంశం చరణోచ్చం తు గుణాంశం ప్రస్తరం తతః॥ 14
శివాంశం వేదికోత్తుంగం గుణాంశం చ గలోదయం।
భూతాంశం శిఖరోచ్చం తు స్తూప్యుచ్చం సార్ధభాగయా॥ 15
అద్భుతం సదనం హ్యేతత్కల్పయే చ్ఛిల్ప విత్తమః।



అద్భుతము 36 భా.

తా॥ ఆలయము యెత్తును 36 భాగములుచేసి అందు అధిష్ఠానము 4 భా. స్తంభము 8 భా. ప్రస్తరము 3½ భా. స్తంభము 7 భా. ప్రస్తరము 3 భా. వేదిక 1 భా. గలము 3 భా. శిఖరము 5 భా. స్తూపిక 1½ భా. ఈప్రకారము చేసినేని అద్భుత మనిపించుకొనును.

## 31. సార్వకామికము

శ్లో॥ చత్వారింశతి భాగం తు కర్తవ్యం సదనోదయం।
అధిష్ఠానం తు వేదాంశం స్తంభం తద్ద్విగుణాయతం॥ 16
యుగాంశం మంచమానం చ స్తంభోచ్చం సార్ధ సప్తకం।
త్రిభాగం ప్రస్తరోత్సేధం ద్విభాగం వేదికోదయం। 17
త్రిభాగం గ్రీవమానం తు శిఖరం సప్తభాగయా।
సార్ధభాగం శిఖామానం విమానం సార్వకామికమ్॥ 18



సార్వకామికము ౪౦ భా.

తా॥ ఆలయము యెత్తును 40 భాగములుచేసి అందు అధిష్ఠానము 4 భా, స్తంభము 8 భా, ప్రస్తరము 4 భా, స్తంభము 7½ భా, ప్రస్తరము 3 భా, వేదిక 2 భా, గలము 3 భా, శిఖరము 7 భా, స్తూపిక 1½ భా, ఈప్రకారము చేసినయెడల సార్వకామికమగును.

## 32. స్వస్తికము

శ్లో॥ హోమాది స్థూపి పర్యంతం యుగాశ్రం పరికల్పయేత్।
చతుష్కూటం చతుశ్శాలం పంజరాష్టక సంయుతం॥ 19
షడష్టైవాఽల్పనాసీం చ పాదం ప్రతి ప్రకల్పయేత్।
కల్పితం వేదికాద్యైస్తు నానాచిత్రై ర్విచిత్రితం॥ 20
ఏతత్ స్వస్తిక మాఖ్యాతం సర్వదేవ ప్రియావహమ్।

తా॥ అధిష్ఠానము మొదలుకొని స్తూపికవరకు నలుచదరముగాచేసి నలువైపుల శాలలును నాలుగు మూలలయందు కర్ణకూటములును 8 పంజరములును, 6 గాని లేక 8 గాని క్షుద్రనాసికలను స్తంభములందును చేసి వేదికలు మొదలగువానియందు నానావిధములైన చిత్రములును చేసిన యెడల స్వస్తికమనిపించుకొనును.

## 33. స్వస్తిభద్రము

శ్లో॥ తదేవ శీర్షకాగ్రేషు పార్శ్వయోః స్వల్పనాసికా॥ 21

స్వస్తిభద్ర మితి ఖ్యాతం మమ ప్రీతికరం భవేత్।

తా॥ పై జెప్పినదానినే శిఖరములపైన ప్రక్కలయందు క్షుద్ర నాసికలను చేసినయెడల స్వస్తి భద్రమగును. ఇది మిక్కిలి అందముగా నుండును.

## 34. శ్రీకరము

శ్లో॥ తదేవ నతకూటం చ కోష్ఠం నాసిక మంచకమ్॥ 22

నతపంజర సంయుక్త యథేష్టం క్రమశీర్షతః।

స్తూపిర్ఘటం గలం తం చ శ్రీకరం సముదాహృతమ్॥ 23

తా॥ పై జెప్పినదానినే కర్ణకూటములు యెత్తు తక్కువగాచేసి కోష్ఠములు, నాసికలు, పంజరములు యెత్తును తగ్గించి శిఖరమును యిష్టప్రకారము స్తూపి, కుంభము, గలము, కల్పించినయెడల శ్రీకర మగును.

## 35. కైలాసము

శ్లో॥ తదేవ కూటకోష్ఠాః స్యుః కూటశాలోన్నతాః సమాః।

నిమ్న పంజర వంతోఽసౌ యత్ర కైలాస ముచ్యతే॥ 24

తా॥ పై జెప్పినదానికే కూటములు, కోష్ఠములు, కూటశాలలు యెత్తు కలిగి సమానముగాను, పంజరములు తక్కువగాను చేసినయెడల కైలాసమగును.

## 36. రుద్రకాంతము

శ్లో॥ తదేవ కూటకోష్ఠాద్వౌ నిమ్నోన్నత వివర్జితే।

అంతర ప్రస్తరోపేతౌ సమసూత్ర తతౌ నతౌ॥ 25

హారాంతరే విశేషేణ యుగ్మం వాఽయుగ్మ పంజరం।

చతుష్కూటం చతుశ్శాలం షడష్టైవాఽల్ప నాసికా॥ 26

వస్వశ్రం వేదికోపేతం వర్తులం శీర్షకం గలం।

శిఖరం వసునాసాఢ్యం భద్రం భద్రం చతుశ్చతుః॥ 27

వేదికాతోరణాఢ్యం తు రుద్రకాంత మిదం పరమ్।

తా॥ పైజెప్పినదానికే కూటములు రెండును, కోష్ఠములు రెండును సమానమైన యెత్తుతో చేసి లోపల ప్రస్తరములను కల్పించి సమాన సూత్రముతో తగ్గువలగల ప్రస్తరములును హారములలో జతగాగాని లేక జేసిసంఖ్యగాగాని పంజరములనుచేసి నాలుగు కర్ణకూటములును నాలుగు శాలలును 6 గాని లేక 8 గాని క్షుద్రనాసికలను వేదిక 8 కోణములును, శిఖరము గుండ్రముగాను, శిఖరమునకు 8 నాసికలును, నాలుగు నాలుగు భద్రములును, వేదికకు తోరణమునుచేసినేని రుద్రకాంత మగును.

## 32. హీరకము

శ్లో॥ కూటాత్కోష్ఠక నిష్క్రాంతం దండం వాఽధ్యర్ధ దండకం। 28

ద్విదండం వా త్రిదండం వా కూటకోష్ఠస్య నిర్గతిః

నానాధిష్ఠాన సంయుక్తం నానా స్తంభ విమానితమ్॥ 29

ప్రాగుక్తానాం తు సర్వేషాం కల్పితం వాఽపి హీరకమ్।

తా॥ కర్ణకూటమునుండి కోష్ఠముయొక్క నిర్గమను 1 దండముగాని, 1½ దండముగాని, 2 దండములుగాని, 3 దండములుగాని చేయవచ్చును. అనేకమయిన అధిష్ఠానములను స్తంభములను మునువుజెప్పబడిన రీతిగా కల్పించిరేని హీరక మను పేరుగలది యగును.

## 33. స్వస్తిబంధము

శ్లో॥ తదేవ శిఖరే చార్ధ కోష్ఠకం తు చతుష్టయం॥ 30

చతురశ్రం శిరోపేతం చతుష్కూట సమన్వితం।

షడష్ట నాసికోపేతం స్వస్తిబంధ మితి స్మృతమ్॥ 31



స్వస్తికము.

తా॥ పైజెప్పినదానికే శిఖరమున అర్ధకోష్ఠములు నాలుగును, శిఖరము నలుచదరముగను, కర్ణకూటములు నాల్గును, నాసికలు 6 గాని లేక 8 గాని చేసినయెడల స్వస్తిబంధ మగును.

## 39. కల్యాణ సుందరము

శ్లో॥ తదేవ కూటకోష్ఠాద్వా సాంతర ప్రస్తరాన్వితా।
హార పంజర సంయుక్తం షడష్టా వాఽల్పనాసికమ్॥ 32

సర్వాలంకార సంయుక్త మేతత్కల్యాణ సుందరమ్।

తా॥ పూర్వోక్తమైన దానినే కూటములు రెండును కర్ణములు రెండును లోపల ప్రస్తరములతో చేసి హారములు పంజరములు మరియు 6 గాని లేక 8 గాని క్షుద్రనాసికలు యిట్లు సమస్తమైన అలంకారములతో చేసినేని కల్యాణసుందర మగును.

## 40. పాంచాలము

శ్లో॥ తదేవ శిఖరే చార్ధకోష్ఠకం తు వివర్జయేత్॥ 33
చత్వారి నాసికోపేతం శిఖరం పరికల్పయేత్।
నానాలంకార సంయుక్త మేత త్పాంచాల ముచ్యతే॥ 34

తా॥ పూర్వము చెప్పినదే శిఖరమున అర్ధకోష్ఠమును లేకుండచేసి 4 నాసికలను శిఖరమును అలంకారముగా చేసినయెడల పాంచాలమగును.

## 41. విష్ణుకాంతము

శ్లో॥ తదేవాష్టా శకం వేదీ కంధరం శిఖరం ఘనం।
శిరోష్ఠాచ మహానాసి యుక్తం తద్విష్ణుకాంతకమ్॥ 35

తా॥ మునుపు చెప్పినగాని లేక వేదిక 8 కోణములుగను, శిఖరము అదేవిధముగాను మహానాసికలను చేసినయెడల విష్ణుకాంతమగును.

## 42. ఈశ్వరకాంతము

శ్లో॥ సాంతరం ప్రస్తరోపేతం కూటకోష్ఠా చతుశ్చతుః।
లంబ పంజర సంయుక్తం వృత్తశీర్షక కంధరం॥ 36

దండం వాఽధ్యర్ధ దండం వా ద్విదండం వా త్రిదండకం।
కర్ణకూటం తు కోష్ఠాని నిష్క్రాంతం పరికల్పయేత్॥ 37

షడష్టనాసికోపేతం చత్వారి శిఖరే వర।
ఏతదీశ్వర కాంతం స్యా దీశ్వర స్య ప్రియావహమ్॥ 38

తా॥ అంతరములతోను ప్రస్తరములతోను కూడి కూటకోష్ఠములు 4-4 ను విస్తారమైన పంజరములును, గుండ్రని శిఖరమును గలమును, 1 దండము, 1½ దండము, 2 దండములు, 3 దండ

ములు, కర్ణకూటమును కోష్ఠములును నిర్గమములును కల్పించవలెను. నాసికలు 6 గాని లేక 8 గాని చేయవలెను. శిఖరమును 4 చేయవలెను. ఇది యీశ్వర కాంత నుసరించుకొనును.

## 43. మంగళము

శ్లో॥ తదేవ త్రి చతుర్భాగే భాగాధిక్యం యథాఽఽశ్రకం।
తథా శీర్ష మకంఠం చావేదికం త త్ర్పకల్పయేత్॥ 39
స్థూపిత్రయ సమాయుక్త మేతన్మంగల ముచ్యతే।

తా॥ పై జెప్పినదానినే 3-4 భాగములుచేసి అందు 1 భాగమును అధికముచేసి గలము లేకుండ శిఖరమును, వేదికను మాత్రమే చేయవలయును, స్థూపి మూడు శిఖలుగా నుండవలెను, దీనిని మంగళమందురు.

## 44. గాంధారము

శ్లో॥ తదే వాయత వృత్తాభం గాంధార మితి విద్యతే॥ 40

తా॥ పై జెప్పిన మంగళమను దానినే దీర్ఘవృత్తాకారముగా జేసినయెడల గాంధారమగును.

## 45. రమ్యము

శ్లో॥ తారా ధర్ధాధికా దర్ధ మాయతాశ్రం సమాశ్రకం
ద్వ్యశ్ర వృత్త ముపానాది కలితం వా తదేవహి॥ 41
సమాశ్ర మాయతాశ్రం వా బాహ్యతః పరికల్పయేత్।
వృత్త గర్భ గృహోపేతం కూటకోష్ఠక సంయుతం॥ 42
వృత్తాభం కర్ణకూటానాం శీర్షం స్యా త్పరికల్పయేత్।
కూట కోష్ఠాల్ప నీడాశ్చ సమసూత్రై శ్చ కల్పయేత్॥ 43
నామ్నా మనోహరం రమ్యం సర్వదేవార్హకం పరమ్।

తా॥ విస్తారమునుండి సగము యెక్కువచేసి అందు సగము దీర్ఘవృ వలయమునుచేసి గాని లేక ద్వ్యశ్రవృత్తమును చేసిగాని ఉపానము మొదలుగా సమ చతురశ్రము, దీర్ఘచతురశ్రము యిట్లు వెలుపల కల్పించి గర్భగృహము లోపల గుండ్రముగా జేసి కర్ణకూటములను, కోష్ఠములును అటులే గుండ్రముగా నుండునట్లుచేసి శిఖరమును చేయవలెను, కూటములు, కోష్ఠములు, పంజరములు సమసూత్రముతోనే చేయవలయును, దీనికి రమ్యమని పేరు.

## 46. శివకాంతము

శ్లో॥ జన్మాది స్తూపి పర్యంతం వృత్తం చేత్తు బహిర్బహిః॥ 44
శేషం ప్రాగివకర్తవ్యం శివకాంత మిదం పరమ్।

తా॥ ఉపానము మొదలుకొని స్తూపిక వరకు వృత్తముగా నుండునట్లు పై జెప్పిన రూపము లన్నియును చక్కగా చేసినయెడల శివకాంత మనిపించుకొనును.

## 47. కుబేరకాంతము

శ్లో॥ చతురశ్ర మధిష్ఠానం గర్భగేహం తథైవ చ।
అధిష్ఠా నోపరిష్ఠాత్తు స్తూప్యంతం వర్తులాకృతి॥

కూట కోష్ఠాది సర్వాంగ యుక్తం గర్భగృహం భవేత్।
చతురశ్ర మధిష్ఠాన మాయతాశ్ర మథాపి వా॥ 45

రసాశ్రం శిఖరం కంఠం కూటకోష్ఠాది సంయుతం।
యథోచితం తు సంకల్ప్య నామ్నా కుబేర కాంతకమ్॥ 46

తా॥ అధిష్ఠానము నలుచదరమును గర్భగృహముకూడ నలుచదరమును, అధిష్ఠానమునకు పైన స్తూపికవరకు గుండ్రని యాకారమును కూటములు, కోష్ఠములు మొదలైనవి సమస్తమును కలిగియుండవలెను. అధిష్ఠానము చతురశ్రముగాగాని లేక దీర్ఘచతురశ్రముగాగాని యుండి శిఖరమును కంఠమును 6 కోణములు కలిగి కూటకోష్ఠాది సంయుతముగా నుండెనేని యది కుబేర కాంతమగును.

శ్లో॥ ఏవం తు ద్వితలం యోగ్యం భేద మష్టాదశ స్మృతం।
ఇష్టకాభిః శిలాభిర్వా హోమాది స్తూపికాంతకం॥ 47

కల్పితం సంచితం హర్మ్యం పుమానేవ ఘనీకృతం।
దృషద్భి రిష్టకాభిః స మ్మిశ్ర హర్మ్యం తదేవహి॥ 48

తేష్వాదౌ దృషతాకార్యం తదూర్ధ్వే త్విష్టకాక్రియా।
ఇష్టకాదారు సం మిశ్రం షండమేత దుదాహృతం॥ 49

తదే వోపచితం ఖ్యాతం ఘనా ఘన ముదాహృతం।
అశేష తరుభిః కార్యాం సంచితం స్త్రీతి విద్యతే॥ 50

తా॥ ఇట్లు రెండంతస్తుల దేవాలయములు 18 విధములు కలవు, ఇటుకలతోగాని, రాళ్ళతోగాని పాదుక మొదలు స్తూపిక వరకు ఒక్కటే జాతితో చేయబడినది సంచితము. పురుషవిమానము. రాలతోను, ఇటుకలతోను చేయబడినది మిశ్రము. అందులో రాతితో ముందుగా చేయ

వలెను. ఇటిక రాతితో పైభాగమును చేయవలెను. ఇటికలతోను. దారువుతోను మిశ్రమముగా చేయబడిన దినపుంసకము. దానిని ఉపచితమందురు. కేవలము దారువుతో చేయబడినది ఘనాఘనము. స్త్రీవిమానమని తెలియవలెను.

శ్లో॥ అఘనం చేతి తత్కార్యం ఏవం పుం షండ యోషితాం।
వక్త్రి మంటప మానం చ గర్భ గేహ విశాలకం॥ 51

భిత్తి వ్యాసం చతుశ్శాలం ప్రాగ్వదేవ తలోక్తవత్।
ద్వార స్యోభయ పార్శ్వే తు పాదయో రంతరే ద్విజ॥ 52

ద్వారపాల గృహం కుర్యా త్తలా దుత్తర సీమకం।
బింబోదయం ద్విశాలం చ దండమాత్రం తు వేశనం॥ 53

సర్వధామని కర్తవ్యం ప్రవేశరహితం తు వా।
ఏవం ద్వితల మాఖ్యాతం త్రితలం తు తతోవిదుః॥ 54

ఇతి కాశ్యపశిల్పే ద్వితలవిధానోనా మాష్ట వింశః పటలః

తా॥ ఘనమును కల్పించకుండినను ఇట్లు పురుష నపుంసక స్త్రీ విమానములు చెప్పబడినవి. ముఖమండపముయొక్క విస్తారముతో సమానముగా గర్భగృహముండవలెను. గోడయొక్క విసారమును చతుశ్శాలలు మునుపుచెప్పినట్లు చేయవలెను. ద్వారముయొక్క రెండువైపుల స్తంభములలో అనగా ద్వారశాఖలలో ద్వారపాలకులకు గూళ్ళను చేయవలెను. ఆ ద్వారపాలక విగ్రహములు 1 దండముపొడవు కలిగియుండవలెను. ద్వారపాలకవిగ్రహములకు గూళ్ళు లేకుండినను పార్శ్వములయందు దుంచవచ్చును. రెండంతస్తుల దేవాలయమును నిర్మించవలసిన విధానము చెప్పబడినది.

## 48. ద్వితల లక్షణము మరియొక పద్ధతి (శ్రీకరము)

### మానసారము 20 వ అధ్యాయము

శ్లో॥ ద్వితలానా మలంకారం వక్ష్యే సంక్షిప్యతే ఽధునా।
విస్తారోత్సేధే హర్మ్యే వా పూర్వ వ త్పరికల్పయేత్॥ 1

జన్మాది స్థూపి పర్యంతం చాష్టావింశ ద్విభాజితే।
ఆధారోచ్చం గుణాంశం స్యా త్పాద తుంగం షడంశకం॥ 2

బంధ్వంశం ప్రస్తరోత్సేధం చోర్ధ్వే పాదం శరాంశకం।
తదూర్ధ్వే ఽంశం తు మంచోర్ధ్వే శివాంశం వేదికోదయం॥ 3

తద్ ద్వయం కంధరోత్సేధం వేదాంశం శిఖరోదయం।
తదూర్ధ్వే స్థూపి యుగ్మాంశం తుంగం తు పరికల్పయేత్॥ 4


శ్రీకరము 28 భా (ద్వి)

తా॥ రెండంతస్తుల దేవాలయమును నిర్మించు విధానమును చెప్పు చున్నాడు. విస్తారమును యెత్తును పూర్వము చెప్పబడినట్లు చేసి ఆ యెత్తును 28 భాగములు చేసి అందు అధిష్ఠానము 3 భా, స్తంభము 6 భా, ప్రస్తరము 4 భా, పైన స్తంభము 5 భా, మంచము 1 భా, వేదిక 1 భా, గలము 2 భా, శిఖరము 4 భా, స్తూపిక 2 భా, ఇట్లు చేసినని శ్రీకరమగును.

## 49. విజయము

శ్లో॥ ఏకత్రింశాంశకం తుంగం సార్ధబంధు మ సూరకం।
సప్తాంశం పాద తుంగం స్యా త్తదర్ధం ప్రస్తరోదయం॥ 5

తదూర్ధ్వే ఒంశ మధిష్ఠాన మంశం వేదాంఘ్రి తుంగకం।
తదర్ధం ప్రస్తరోత్సేధం తదర్ధం వేదికోదయం॥ 6

తద్ ద్వయం గలతుంగం స్యా చ్ఛిఖరోచ్చం యుగాంశకం।
స్తూపి తుంగం ద్వయాంశం స్యాద్ ద్వితలే తద్ ద్వితీయకమ్॥


విజయము 31 భా (ద్వి)

తా॥ మరియొక పద్ధతి. యెత్తును 31 భాగములు చేసి అధిష్ఠానము 4½ భా, స్తంభము 7 భా, ప్రస్తరము 3½ భా, దానిపైన అధిష్ఠానము 1 భా, స్తంభము 4 భా, ప్రస్తరము 2 భా, వేదిక 1 భా, గలము 2 భా, శిఖరము 4 భా, స్తూపిక 2 భా, ఈ విధముగా చేసినచో విజయమగును.

## 50. సిద్ధము

శ్లో॥ తదే వోర్ధ్వ మధిష్ఠానం విమానాం శైక హస్తకం।
తదూర్ధ్వే ఒంఘ్రి శరాంశం స్యా త్కర్ణహర్మ్యాది మండితం॥ 8

శేషం తు పూర్వవ త్కుర్యాత్ త్ర్యంశ ద్వితలే భవేత్।




తా॥ పైజెప్పినదానినే రెండవ యంతస్తున 1 భాగమును పెంచి, ఆ భాగమును స్తంభమునందు కలిపినచో స్తంభము 5 భాగములు కలది యగును. కర్ణములయందు హార్మ్యములను రచించవలెను. మిగిలినవి మును పటివలెనే చేయవలెను. ఇది మూడవవిధము. సిద్ధమనిపించుకొనును.

## 51. పౌష్టికము

శ్లో॥ తుంగే ద్విరష్టభాగం స్యా దధ్యర్ధాంశం మసూరకం॥ 9

గుణాంశం చాంఘ్రి తుంగం స్యా త్ప్రస్తరం సార్ధభాగికం।
తదూర్ధ్వ మంశ కంమంచం చోర్ధ్వే ద్వ్యంశక మంఘ్రికం॥ 10

శివాంశం ప్రస్తరోత్తుంగం త్రిపాదం చోర్ధ్వ మంచకం।
పాదాంశం వేదికోత్తుంగం సపాదాంశం గలోదయం॥ 11

ద్వ్యర్ధాంశం శిరస్తుంగం స్యాత్ సపాదాంశం శిఖోదయం।
చతుర్ధం ద్వితలం ప్రోక్తం తదేవ శిఖరం విదుః॥ 12

తా॥ ఆలయము యెత్తును 16 భాగములుచేసి, అందు అధిష్ఠానము 1½ భా, స్తంభము 3 భా, ప్రస్తరము 1½ భా, మరల అధిష్ఠానము 1 భా, స్తంభము 2 భా, ప్రస్తరము 1 భా, మరల అధిష్ఠానము, ¾ భా, వేదిక ¼ భా, గలము 1¼ భా, శిఖరము 2½ భా, స్తూపిక 1¼ భా, ఇట్లు చేయుట నాల్గవపద్ధతి, పౌష్ఠికమగును.



## 52. శాంతికము

శ్లో॥ లంబనం సార్ధభాగేన గోపానాది క్రియాన్వితం।
శేషం ప్రాగుక్తవ త్కుర్యాత్ పంచధా ద్వితలం విదుః॥ 13

తా॥ పైజెప్పినదానికే 1½ భాగముతో అధిష్ఠానము గోపానముగాని కపోతముగాని చేసి మిగిలిన పనులన్నియును పూర్వమువలెనే చేసినయెడల ఐదవపద్ధతి యగును. శాంతికము.

## 53. అద్భుతము

శ్లో॥ ఏకాదశాంశకం తుంగ మేకాంశేన మసూరకం।
అక్షికం చాంఘ్రి తుంగం స్యా చ్ఛివాంశం ప్రస్తరోదయం॥ 14
తదూర్ధ్వే చోపపీఠం స్యా త్తత్సమం చ మసూరకం।
తద్ ద్వయం పాద తుంగం స్యా త్తదర్ధం ప్రస్తరోదయం॥ 15
తత్సమం వేది తుంగం స్యా చ్ఛివాంశం గల తుంగకం।
శిఖరోచ్చం ద్విభాగం స్యా దేకాంశం స్తూపికోదయం॥ 16
షష్ఠమం ద్వితలం ప్రోక్తం సప్తమం వక్ష్యతే ఽధునా।

తా॥ రెండంతస్తులుగల విమానము యెత్తును 11 భాగములుచేసి అందు అధిష్ఠానము 1 భా, స్తంభము 2 భా, ప్రస్తరము 1 భా, దానిపైన ఉపపీఠము ½ భా. అధిష్ఠానము ½ భా, మరల స్తంభము 1 భా, పైన ప్రస్తరము ½ భా, వేది ½ భా, గలము 1 భా, శిఖరము 2 భా, స్తూపిక 1 భా, ఇది ఆఱవపద్ధతి, అద్భుతము.



అద్భుతము 11 భా (మూల)

## 54. స్వస్తికము

శ్లో॥ ఏకాదశాంశకం తుంగే చైకాంశేన మసూరకం॥ 17
ద్విభాగం పాద తుంగం స్యాత్ ప్రస్తరం చాంబరాంశకం।
కుర్యా త్తత్ర ఘనం చోర్ధ్వే త్రిపాదాంశం మసూరకం॥ 18

తదూ ద్వయం పాద తుంగం స్యా త్తదర్థం ప్రస్తరోదయం।
తదూర్ధ్వే ఒంఘ్రి సపాదాంశం చార్ధాంశం ప్రస్తరోదయం॥ 19

పాదాంశం వేదికోత్తుంగం తదూ ద్వయం గలతుంగకం।
శిఖరోచ్ఛం శివాంశం స్యా త్తదర్ధం తచ్ఛిఖోదయం॥ 20

ద్వితలే సప్తమం ప్రోక్తం త్రయాంఘ్రి కర్ణహర్మ్యకమ్।


స్వస్తికము ॥ భా (పూత)

తా॥ ఆలయము యెత్తును 11 భాగములు చేసి అందు అధిష్ఠానము 1 భా, స్తంభము 2 భా, ప్రస్తరము 1 భా. మరల అధిష్ఠానము $\frac{3}{4}$ భా, స్తంభము $1\frac{1}{2}$ భా. ప్రస్తరము $\frac{3}{4}$ భా, స్తంభము $1\frac{1}{4}$ భా, ప్రస్తరము $\frac{1}{2}$ భా వేదిక $\frac{1}{4}$ భా, గలము $\frac{1}{2}$ భా, శిఖరము 1 భా. స్తూపిక $\frac{1}{2}$ భా, ఇట్లు చేసిన రేని యేడవపద్ధతి స్వస్తిక మగును. ఇది మూడు స్తంభముల వరుసలును అట్లే 3 వరుసలు కర్ణహర్మ్యములును కలిగియుండవలెను.

## 55. పుష్కరము

శ్లో॥ తదే వాంశాధికం తుంగే తస్మాలే ప్రస్తరోర్ధ్వకే॥ 21

అంశేన చోపపీఠం స్యా దధిక ద్వితలం స్మృతం।
ఏవం దండ వశాత్కుర్యా న్నిర్గమం తది హోచ్యతే॥ 22

ప్రాగుక్త విస్తృతం బాహ్యే నిర్గమం పరితస్తథా।
ఏకదండం ద్విదండం వా త్రిదండం నిర్గమం స్మృతం॥ 23

ఏక హస్తం ద్విహస్తం వా త్రిహస్తం వా ఒథ నిర్గమం।
త్రి చతుర్హస్త మారభ్య ద్వి ద్విహస్త వివర్ధనాత్॥ 24

ఏకాదశార్క హస్తాంతం పంచధా నిర్గమం భవేత్।
పంచ షట్కాగ మారభ్య ద్వి ద్విహస్త వివర్ధనాత్॥ 25

సైకార్క మనుహస్తాంతం నిర్గమం పంచధా భవేత్।
క్షుద్రాల్ప మధ్య ముఖ్యానాం యుక్త్యా తత్రైవ యోజయేత్॥ 26



తా॥ పైఁ జెప్పిన దానినే యెత్తును 12 భాగములుచేసి దానియొక్క మొదటి ప్రస్తరముపైన అనగా మొదటి అంతస్తుపైన 1 భాగము ఉపపీఠమును చేసి మిగిలినవి అన్నియును పూర్వోక్త ప్రకారముగా చేయవలెను ఇది యెనిమిదవ పద్ధతి పుష్కరము. ఇట్లే దండముయొక్క కొలతలతోను చేయవచ్చును పూర్వము చెప్పబడినట్లు విస్తారమును వెలుపల చుట్టును నిర్గమమును 1 దండముగాని, 2 దండములుగాని 3 దండములుగాని చేయవచ్చును. లేక 1 హస్తముగాని 2 హస్తములుగాని, 3 హస్తములుగాని చేయవచ్చును. 3-4 హస్తములు మొదలుకొని అక్కడినుండి 2-2 హస్తములు పెంచుచు 11-12 హస్తములవరకు 5 విధములుగాను చేయవచ్చును. అయితే వరుసగా క్షుద్రమందిరములు, అధమమందిరములు, మధ్యమమందిరములు, ఉత్తమ మందిరములు, అనువానికి వరుసగా యీ నిర్గమము ఉపయోగపడును.

శ్లో॥ అథ హర్మ్య విశాలార్ధం తత్సమం నిర్గమం తు వా।
యత్తద్భక్తి విశాలే రు కూట మేకైక భాగికం॥ 27

ఏకం వా ఒథ ద్విపాదం వా తస్యహారా విశాలకం।
ద్విభాగం వా త్రిభాగం వా మధ్యశాలా విశాలతా॥ 28

హర్మ్యే చోర్ధ్వతలే పాదం బాహ్యే కూటాది విన్యసేత్।
కర్ణ హర్మ్యాకృతిం వాఒథ చాంతరం ప్రస్తరం తు వా॥ 29

త్రి చతుష్పంచాంగులం వా ద్వితలే ఒంఘ్రి విశాలకం।
త చ్చతుష్పంచ షట్ సప్త సాష్టాంశాంఘ్రి విశాలకం॥ 30

తత్ర దేకాంశ హీనం స్యా దూర్ధ్వే పాద విశాలకం।
శాలా కూటశ్చ పాదౌ చ బాహ్యే మధ్యాంతరాలకం॥ 31

నాసికా పంజరైః శాలా కుంభ పాదాది భూషితం।
తోరణై ర్నీడ భద్రాభి ర్మాలే చోర్ధ్వ చ భూషితమ్॥ 32

తా॥ హర్మ్యముయొక్క విశాలములో సగముగాని లేక హర్మ్య విస్తారముతో సమానముగాని నిర్గమమును చేయునచ్చును ఆ విశాలమున యెట్లు భాగములు చేయబడియున్నవో ఆప్రకారమే కూటములు ఒక్కొక్క భాగము చొప్పున చేయవలెను. 1 పాదిక వంతుగాని లేక 2 పాదికలు గాని దానికి హార విస్తారమును చేయవలెను. మధ్యశాల 2 భాగములుగాని, 3 భాగములుగాని విస్తారము చేయవలెను, మందిరము పై అంతస్తున స్తంభము వెలుపల కూటములతోసహా చేయవలెను. లేక కర్ణ హర్మ్యములతోనైన చేయవలెను. లేక అంతరము, ప్రస్తము మొదలైనవానితోనైన చేయవలెను, 3-4-5 అంగులములు రెండవ అంతస్తున స్తంభముయొక్క విస్తారమును చేయు.

వలెను 4-5-6-7-8 అం. వరకు చేయవచ్చును. అందు ఒక్కొక్క భాగమును తగ్గించి దాని పైఅంతస్తున స్తంభమును చేయుచుండవలెను. శాలాకూటము స్తంభములు వెలుపల మధ్య అంత రాలము నాసిక పంజరము శాల కుంభముగల స్తంభము, తోరణము, నీడము, భద్రము ఈవిధమైన యలంకారములతో మొదటను పైనను చేయవలెను,

శ్లో॥ నానాధిష్ఠాన సంయుక్తం నానాపాదై రలంకృతం।
నానాగోపాన సంయుక్తం క్షుద్ర నాస్యై ర్విభూషితం॥ 33

అర్ధశాలా విశేషో ఽస్తి చోర్ధ్వశాలా సమన్వితం।
తదూర్ధ్వే ప్రస్తరాంతః స్యా న్నాసికాభి రలంకృతం॥ 34

కూటానాం చతురశ్రం స్యా న్మధ్యే మధ్యే తు నాసికా।
ఏకద్వి త్రి చతుర్దండం మధ్య భద్రస్య నిర్గమం॥ 35

చతుశ్శాలా చతుష్కూటం చాష్టహారం సపంజరం।
ఏకదండం తదర్ధం వా చోర్ధ్వకూటాది వేశనం॥ 36

మధ్యకోష్ఠే ద్విపార్శ్వే తు చార్ధశాలా సమన్వితం।
తదూర్ధ్వే మధ్యమే నాసి తత్పార్శ్వం వక్త్రనాసికం॥ 37

తత్పార్శ్వం శాలయోః పార్శ్వే క్షుద్రనాస్యై ర్విభూషితం।
కూటకోష్ఠాది సర్వాంగం యుక్త్యా తు సమలంకృతం॥ 38

శేషం తు పూర్వవ త్కుర్యాత్ కర్ణహర్మ్యాది చోక్తవత్।
సప్తాష్టకం ద్వితూమ్యేతు విశేషే ణాధునోచ్యతే॥ 39

తా॥ అనేకమైన అధిష్ఠానములతోను. అనేక విధములైన స్తంభములతోను. అనేకవిధము లైన గోపానములతోను, క్షుద్రనాసికలతోను, కూడియుండవలెను, అయితే అర్ధశాలయందు విశేషము కలదు. పైశాలతో కూడియుండవలెను, దానిపైన ప్రస్తరములోపలనే యంతను. నాసిక లతో నుండవలెను, కర్ణకూటములు నలుచదరముగా నుండవలెను మధ్యను మధ్యను నాసికలుండ వలెను, 1-2-3-4 దండములు మధ్య భద్రముయొక్క నిర్గమమును చేయవలెను, నాలుగు శాల లును, నాలుగు కూటములును, 8 హారములును, పంజరములును, చేయవలెను. 1 దండముగాని, ½ దండముగాని, పైకూటముయొక్క వేశనమును కల్పించవలెను. మధ్యకోష్ఠమున కిరుపైపులను అర్ధశాలలును, ఆపైన నడుమ నాసికయును, దానిప్రక్కల ముఖనాసికలును, దానిప్రక్క శాలలకు రెండు ప్రక్కల క్షుద్రనాసికలును, కూటములు కోష్ఠములు మొదలైన అన్నిరూపములు ఆలోచ నతో అలంకారముగా చేయవలెను. మిగిలిన పనులు మునుపటివలెనే చేయవలెను. కర్ణహర్మ్య ములు కూడ పూర్వము చెప్పబడినట్లు చేయవలెను. ద్వితలమునందు 7-8 పద్ధతులను విశేషించి చెప్పబోవుచున్నాను.

శ్లో॥ విస్తారార్ధం ద్విగుణం వా త్రిగుణం వా తదుచ్ఛ్రయం।
తన్ముఖే మండపాగ్రే తు కుర్యా దధిక మండపం॥ 40

తత్పురే మధ్యమే ద్వారం గవాక్షం వా ఽథ కల్పయేత్।
దక్షిణే మధ్యమే ద్వారం స్యా దగ్రే మధ్య మండపం॥ 41

చతుర్ద్వార సమాయుక్తం పూర్వే సోపాన సంయుతం।
తద్ఘనం తల సర్వాంగం కూటకోష్ఠాది భూషితం॥ 42

సోపపీఠ మధిష్ఠానం సోపపీఠం మసూరకం।
పాదం మంచం తదూర్ధ్వే చ సంయుక్తం త త్త్రివర్గకం॥ 43

పూర్వవ న్మాన యుక్త్యా చ విమానం తస్య నిర్గమం।
కుర్యా త్తత్పాద తుంగే షు షడ్భాగాంశ విహీనకం॥ 44

ప్రస్తర స్యోపరిన్యస్య చాంతర్మండల కుడ్యకం।
కర్ణ హర్మ్యాది సంయుక్తం సర్వాలంకార సంయుతమ్॥ 45

తా॥ విస్తారములో సగము విస్తారమును దానికి రెండు రెట్లుగాని, మూడురెట్లుగాని ఎత్తును గలుగునట్లు దాని ముఖమండపమునకు ముందు అధిక మండపమును రచించవలెను. దానిముందు మధ్యద్వారమునుగాని గవాక్షమునుగాని కల్పించవలెను. దక్షిణమున నడుమ ద్వారమును పెట్టవలెను, ముందు మధ్య మండప ముండవలెను, ఆ మండపము నాల్గుద్వారములు కలిగి అందు తూర్పు ద్వారమునకు రెండువైపుల మెట్లుండవలెను, అమట్టమునకు సమానముగా ఆ అంతస్తు అంతయు నుండవలెను. కూటములు, కోష్ఠములు నిర్మించవలెను. ఉపపీఠముతో సహితముగా అధిష్ఠానమును ఉపపీఠముతో సమానముగా ప్రస్తరమును చేసి దానిపైన స్తంభమును ప్రస్తరమును చేసినయెడల అది త్రివర్గమగును. మనువు చెప్పిన కొలతల ప్రకారమే విమానమును దాని యొక్క నిర్గమము నుండవలెను. దానియొక్క స్తంభము యెత్తులో ౬వ భాగమును తగ్గించి ప్రస్తరము పైన నుంచి లోపలి ప్రదేశమున గోడయును, కర్ణములయందు హర్మ్యములును అనేక అలంకారములతో చేయవలెను.

శ్లో॥ ప్రదక్షిణం తదారోప్యం సౌమ్య మేవం ప్రకల్పయేత్।
శేషం తు పూర్వ వత్కుర్యాత్ సర్వ దేవాంశ్చ సద్మకే॥ 46

శ్రీకరం విజయం సిద్ధం పౌష్టికం కాంతిక మద్భుతం।
స్వస్తికం పుష్కరం నామ ప్రథమాద్యష్ట సద్మకే॥ 47

పూర్వవ చ్చోక్త దేవానాం సర్వ హర్మ్యేషు యోజయేత్।
అథవా విష్ణు హర్మ్యే తు గలే పూర్వే జనార్దనం॥ 48

దక్షిణే దక్షిణామూర్తిం నారసింహ మథాపి వా।
పశ్చిమే కేశవం ప్రోక్తం చోత్తరే శ్రీధరం న్యసేత్॥ 49

అథవా పితామహం స్యాన్నాగరాదౌ చ హర్మ్యకే।
ద్వార దేవాదికాన్ సర్వాన్ పూర్వవత్ కల్పయేత్ సుధీః॥ 50

తా॥ దానికి మెట్లు దక్షిణమునను ఉత్తరమునను చేయవలెను. శేషించిన పనులన్నియును పూర్వోక్త ప్రకారముగా చేయవలెను. సమస్త దేవాలయములకును ముఖ్యము, శ్రీకరము, విజయము, సిద్ధము, పౌష్టికము, శాంతికము, అద్భుతము, స్వస్తికము, పుష్కరము అను 8 పేరులు గలిగియున్నవి. మనువు చెప్పినట్లు దేవతలను హర్మ్యముల యందుంచవలెను. విష్ణ్వాలయ మయ్యెనని గలమున తూర్పు జనార్దనుని, దక్షిణమున దక్షిణామూర్తినిగాని నృసింహునిగాని, పడమర కేశవుని, ఉత్తరమున శ్రీధరుని లేక బ్రహ్మను చేయవలెను. నాగరము మొదలగు హర్మ్యముల యందు ద్వార దేవతలు మొదలగువారిని మునుపటివలెనే చేయవలెను.

శ్లో॥ తదేవ శివ హర్మ్యం తు మండపే తు విశేషతః।
సౌమ్యే తు కాలరూపం వా ప్రోక్తవాం స్తత్రదైవతం॥ 51

స్థాపయేత్ క్షేత్రపాలం తు షణ్ముఖం చాపి కల్పయేత్।
ఆరోప్యం హర్మ్య మూలే తు కర్ణ హర్మ్య ప్రవేశయేత్॥ 52

సర్వేషాం దేవతా హర్మ్యే పూర్వ వద్దేవతా న్యసేత్।
ఉక్తవ చ్ఛాస్త్ర మార్గేణ దోషాదోషేన యోజయేత్॥ 53

వేదాక్రాంతం వర్తులాభం గజాశ్రం। వృత్తాశ్రాభం ద్వ్యశ్ర వృత్తం తథైవ।
తద్దీర్ఘ తచ్ఛిరో గ్రీవ యుక్తం చ। ఉక్తం ప్రాగ్వద్ భూషణాది ద్విభూమౌ॥ 54

హారా ప్రాంతే ద్వ్యంశ కైకాంశ మలిందం।మంచ స్యోర్ధ్వే చావృతం ప్రస్తరం చ।
ఆరుహ్య సార్ధ హర్మ్య మూలం యత్।యుక్త్యా శక్త్యా యన్మనో రమ్యం కుర్యాత్॥

ఇతి మానసారే వాస్తుశాస్త్రే ద్వితల విధానం నామ వింశోధ్యాయః

తా॥ శివాలయమైనయెడల మండపమునందు ఉత్తరమున కాలాంతక రూపమునుగాని, క్షేత్ర పాలునిగాని, షణ్ముఖునిగాని చేయవలెను. మందిరముయొక్క మొదట కర్ణ హర్మ్యములవలన ప్రవేశమును, మెట్లును చేయవలెను. అన్ని దేవాలయములయందును మునుపు చెప్పబడినట్లు దేవతల నుంచవలెను. శాస్త్రమునందు చెప్పబడినట్లు చక్కగా ఆలోచించి చేయవలెను. నలుచదరము గుండ్రము, 8 కోణముల, వృత్తమును చదరమును కలిసినదియును, ద్వ్యశ్రము వచ్చునట్లు గుండ్రమును, అదియే దీర్ఘరూపమును, అటులే శిఖరము గలవి చేసి పూర్వము చెప్పబడినట్లు అలంకారము చేయవలెను. రెండవ యంతస్తున హారము రెండుభాగములును అళిందము 1 భాగ

ముగు. మంచము యొక్క పైభాగమున గుండ్రముగా ప్రస్తరము. పైభాగమున ½ హస్త్ర మూలములు కలుగునట్లు యేకొలత అందముగా నుండునో ఆ కొలత ననుసరించి చేయవలెను.

## ౬౪. ద్వితలము. ద్రావిడ పద్ధతి

### సమరాంగణ సూత్రధార 62 వ అధ్యాయము

శ్లో॥ ద్విభూమికస్య లక్ష్మాథ ప్రాసాదస్యాభిధీయతే।
సప్త హస్త సువిస్తారో నవహస్త సముచ్ఛ్రితః 13

కర్ణ మానాద్భవేదస్య విభాగోఽథ నిగద్యతే।
ద్విహస్తం కల్పయేత్పీఠం జంఘా సార్ధ ద్విహస్తకం॥ 14

కూటస్య సన్నివేశోఽయం విజ్ఞాతవ్యః సభాగికః।
జంఘా ద్వితీయా తు పునః కర్తవ్యా తస్య భాగికా॥ 15

సన్నివేశో ద్వితీయస్య స్యాత్ కూటస్యార్ధభాగికః।
వేదీక్రమాత్కర్తవ్యా సహ కంఠేన భాగికః॥ 16

తస్యోపరిష్టాద్ఘంటా చ సార్ధభాగ సముచ్ఛ్రితా।
నాసికాపద్మ సంయుక్తా విధాతవ్యా విపశ్చితా॥ 17

పీఠానాం పూర్వ ముక్తానాం పాదబంధాది నామభిః।
పంచానాం కల్పయేదేవ మేకభూమ్యాదితః క్రమాత్॥ 18




తా॥ రెండంతస్తుల ప్రాసాదమును చెప్పుచున్నాడు. ఎత్తు విస్తారము 7 హస్తములును, ఎత్తు 9 హస్తములును, కలిగి కర్ణమానముచేత విభాగములు చేయుచుండవలెను. ఎదుకనగా ½ భాగము పెరుగును కనుక కర్ణమానముతోనే కొలవవలెను. పీఠము 2 భా, జంఘ 2½ హస్తములు, కూటముయొక్క సన్నివేశము 1 భా, మరల జంఘ 1 భా, మరల కూటముయొక్క సన్నివేశము ½ భా, వేది కంఠముతోసహా 1 భా, దానిపైన ఘంట 1½ భా, నాసిక పద్మపత్రముకూడ చేయవలెను. పాదబంధము మొదలయిన పంచపీఠములు చేయవలెను.

శ్లో॥ తేషాం శోభావహం యత్ స్యాత్తత్కార్యం విపశ్చితా।
తస్యోపరి భవేజ్జంఘా మాలాలంకార సంయుతమ్॥ 19

భరణం కలశం తద్వద్ వీరకంఠ సమన్వితం।
ఉచ్ఛాలం పూర్వమానేన పద్మ పత్ర యుతం తతః॥ 20

వీరకంఠః పునః కార్యో హీరకం పూర్వ క్రమేణ చ।
తస్యోపరిష్టాత్ పట్టశ్చ భవేత్పట్టిక యా సహ॥ 21

వసంత వేద్యూర్ధ్వం తత స్తస్యోపరి పట్టికా।
తతః కపోతశ్ఛేదశ్చ మేడం మకర మేవచ॥ 22

పట్టికా మకరాఢ్యా చ వేదీ కంఠో ఽథ పట్టికా।
వేదీ ఛేదశ్చ కంఠశ్చ పట్టికా పద్మ పట్టికా॥ 23

తా॥ పంచపీఠములలో యేది బాగుగా నుండునో దానిని చేయవలెను. దానిపైన జంఘ మాలాలంకారముగా చేయవలెను భరణమును కలశమును వీరకంఠముతో చేయవలెను ఉచ్ఛాలము ముందటివలెనే పద్మపత్రములతో కూడ చేయవలెను. మరల వీరకంఠమును హీరమును పట్టమును పట్టికయును వసంత వేదికయును దానిపై పట్టికయును తరువాత కపోతమును, ఛేదమును, మేడమును, మకరమును చేయవలెను మకర పట్టికను చేయవలెను వేదికకును గలమునకును పట్టికలను చేయవలెను. వేది, ఛేదము, గలము, పట్టిక, పద్మపట్టిక చేయవలెను.

శ్లో॥ కూటం తదూర్ధ్వం కుర్వీత విచిత్రం నాసి కాన్వితమ్।
ఛేదాంతం పూర్వ మానేన సర్వ మేత ద్విధీయతే॥ 24

తస్యోపరి పునర్జంఘా సర్వాభరణ భూషితా।
తతో మాలాలశునం తోరణం కలశ స్తతః॥ 25

వీరకంఠ స్తథోచ్ఛాలం పత్రకం వీరకంఠకమ్।
హీరకం పట్టికా తద్వత్ వసంత పట్టికా పునః॥ 26

కపోతశ్ఛేదమేదశ్చ మకరోతస్య పట్టికా।
ఛేదోపై నక్రపట్టీ చ వేదీచ్ఛేదో ఽథ కంఠకః। 27

తా॥ దానిపైన కూటమును చేయవలెను. విచిత్రనాసికలతో కూటము అలంకారముగా నుండవలెను. ఛేదమును, తదుపరి జంఘయును సమస్తాలంకారములతో చేయవలెను. తరువాత మాలను చేయవలెను. లశునమును, తోరణమును, కలశమును, వీరకంఠమును, ఉచ్ఛాలమును, పత్రమును మరల వీరకంఠమును, హీరమును, పటికను మరల వసంతపట్టికను, కపోతమును, ఛేదమును, మేడమును, మకరమును, పట్టికను, మకరపట్టికను, వేదిని, ఛేదమును, కంఠమును వరుసగా చేయవలెను.

శ్లో॥ పట్టికా పద్మ పూర్వా చ కర్తవ్యా పట్టికాత్మకమ్।
తత శ్ఛేదో విధాతవ్యః సర్వైరాభరణైర్యుతః॥ 28

తత శ్ఛిత్వా తథా కార్యం యథా శోభా ప్రజాయతే।
పునః కంఠః ప్రదాతవ్యః పట్టికా పద్మ పట్టికా॥ 29

తతః కంఠం విధాతవ్యం చంద్రమాలా విభూషితమ్।
ప్రకుర్వీత త తశ్ఛేద ముపరిష్టా ద్విచక్షణః॥ 30

కంఠం పట్టికయా యుక్తం తదూర్ధ్వం కంఠ పట్టికామ్।
సప్తాంగులాని కర్తవ్యా స్తతో ఘంటా వినిర్గమః॥ 31

భాగార్ధం విస్తృతి స్తస్యా విస్తారార్ధం సముచ్ఛ్రితిః।
ఏవం ద్విభూమికం ప్రాజ్ఞః ప్రాసాదం పరికల్పయేత్॥ 32

తా॥ పట్టిక పద్మముతోగూడ చేయవలెను. పట్టిక, పద్మము, ఛేదము, అలంకారముగా చేయువలెను. మరల ఛేదము, గలము, పట్టిక, పద్మపట్టిక, గలము, చంద్రమాలతో నలంకారముగా చేయవలెను ఛేదము, గలము, పట్టికతోగూడ చేయవలెను. పట్టికపైన నుండవలెను. 7 అంగుళముల పరిమితి పట్టిక యుండవలెను. తరువాత ఘంట మందారపుష్పము వలె 1½ భాగము విస్తారమును అందులో సగము యెత్తును కలిగియుండవలెను, ఇట్లు ద్వితల ప్రాసాదమును చేయవలయును.

## 57. త్రితల లక్షణము

### కాశ్యపశిల్పము 29వ అధ్యాయము

శ్లో॥ అథ వక్ష్యే విశేషేణ త్రితలం శృణు సువ్రత।
తస్య విస్తార మానం చ పురోక్తం హర్మ్య మానకమ్॥ 1

విన్యాస సూత్ర యోరంత రష్టా వింశే తు భాజితే।
ఏకాంశం కూట విస్తారం శాలాయా మంచ తద్ద్వయమ్॥ 2

అంశం త్రిపాద మర్ధం వా పంజర వ్యాసముచ్యతే।
శేషం హారాంతరం ఖ్యాతం నిష్క్రాంతాదీని పూర్వకమ్॥ 3

ఊర్ధ్వ భూమి రసంశేషం కూట వ్యాస ముదాహృతమ్।
శాలాయామం ద్విభాగం తు శేషం హారాంతరం భవేత్॥ 4

హారాంతరం సపాదం తు త్రిపాదం వాఽథ పంజరమ్।
ఊర్ధ్వ భూమి త్రిభాగైకం మధ్యభద్రం విధీయతే॥ 5

దండం సార్ధం ద్విదండకం వా మధ్యభద్రస్య నీవ్రకమ్।

తా॥ మూడంతస్తులుగల దేవాలయమును చెప్పుచున్నాడు. విస్తారము పూర్వము చెప్ప బడియున్నది విన్యాసమాత్రముయొక్క మధ్య 23 భాగములుచేసి, అందు 1 భాగము కూటము యొక్క విస్తారమును, శాలయొక్క దీర్ఘము, 2 భాగములును, 1 భాగముగాని లేక ముప్పాతిక వంతుగాని లేక సగముగాని పంజరము యొక్క విస్తారము, మిగిలినది హారము చేయవలెను. నిర్గమము మొదలైనవి మునుపుచెప్పినట్లు చేయవలెను. పై అంతస్తును 6 భాగములుచేసి మిగిలినది కూటముయొక్క విస్తారమును చేయవలెను. శాలయొక్క పొడవు 2 భాగములు, మిగిలినది హారాంతము చేయవలెను. హారాంతము 1¼ భాగమును, పంజరము ¾ భాగమును చేయవలెను. దానిపై అంతస్తును 3 భాగములుచేసి అందు 1 భాగము మధ్య భద్రమును చేయవలెను. ఆభద్రము యొక్క నిర్గమము, 1 దండముగాని, 1½ దండముగాని, 2 దండములుగాని చేయవలెను.

## 68. శాంతికము

శ్లో॥ ప్రాసాద స్యోచ్ఛ్రయం భాను ద్విగుణాంశం విభాజితే॥ 6

ద్విభాగం భూతలోత్సేధం వేదాంశం చరణోదయమ్।
మంచమానం ద్విభాగేన పాదోన చతురంశకైః॥ 7

పాదాయామం తు సార్ధాంశం ప్రస్తరోచ్చ ముదాహృతమ్।
పాదోచ్చం సార్ధ వహ్న్యంశం సపాదాంశం తు మంచకమ్॥ 8

అర్ధాంశం వేదికామానం గలమానం శివాంశకమ్।
సార్ధ త్ర్యంశం తు శిఖరం స్తూప్యుచ్ఛ్రం త్వేకభాగయా॥ 9

ఏవం హికల్పితం గేహం శాంతికం త్వితి విద్యతే।



తా॥ ఆలయముయొక్క యెత్తును 24 భాగములుచేసి అందు అధిష్ఠానము 2 భా. స్తంభము 4 భా. ప్రస్తరము 2 భా, మరల స్తంభము 3½ భా. మరల ప్రస్తరము 1¼ భా, మరల స్తంభము 3½ భా. మరల ప్రస్తరము ¼ భా. వేదిక ½ భా. గలము 1 భా. శిఖరము 3½ భా, స్తూపిక 1 భా, ఇట్లుచేసినచో మూడంతస్తులు గల శాంతిక మగును.

## ౫౯. పౌష్టికము

శ్లో॥ చతుర్వింశతి భాయామే తలోచ్చ్రం తు ద్విభాగయా॥ 10
వేదాంశం చరణాయామం షడంశం మంచమానకమ్।
పాదోన చతురంశం తు పాదాయామ మతీష్యతే॥ 11
సార్ధాంశం ప్రస్తరోత్సేధం పాదం సార్ధద్వయం భవేత్।
అధ్యర్ధాంశం తు మంచోచ్చ మధ్యర్ధం వేదికోదయమ్॥ 12
శివాంశం గ్రీవమానం తు గుణాంశం శిఖరోదయమ్।
సపాదాంశం శిఖామానం పౌష్టికం త మదాహృతమ్॥ 13


పౌష్టికము 24 భా.

తా॥ ఆలయము యొత్తును 24 భాగములు చేసి, అధిష్ఠానము 2 భా, స్తంభము 4 భా, ప్రస్తరము 2 భా, మరల స్తంభము 3½ భా, మరల ప్రస్తరము 1½ భా, మరల స్తంభము 2¾ భా, ప్రస్తరము 1½ భా, వేదిక 1½ భా. గలము 1 భా, శిఖరము 3 భా, స్తూపిక 1¼ భా, ఇట్లు చేసిన మూడంతస్థులు గల పౌష్టిక మగును.

## 60. జయదము

శ్లో॥ సప్త వింశతి భాగం తు కృత్వాచ సదనోదయమ్।
ద్వ్యంశం ధరాతలోత్సేధం యుగాంశం చరణోదయమ్॥ 14
మంచమానం ద్విభాగేన వేదాంశం చరణాయతమ్।
పాదోన ద్వ్యంశమం చోర్ధ్వం తలిపోచ్చం తు తద్ ద్వయమ్॥ 15
సార్ధాంశం ప్రస్తరోత్సేధ మేకాంశం వేదికోదయమ్।
ద్విభాగం గ్రీవమానం తు వేదభాగం తు శీర్షకమ్॥ 16
శేషం స్తూప్యుదయం ఖ్యాతం జయదం త దుదాహృతమ్॥



తా॥ ఆలయముయొక్క మొత్తము 27 భాగములుచేసి అధిష్ఠానము [illegible] భా, స్తంభము 4 భా, ప్రస్తరము 2 భా, మరల స్తంభము 4 భా, మరల ప్రస్తర 1¾ భా, మరల స్తంభము 3½ భా, మరల ప్రస్తరము 1½ భా, వేదిక 1 భా, గలము [illegible] భా, శిఖరము 4 భా, స్తూపిక 1¼ భా, ఇట్లు చేసినచో మూడంతస్తుల జయద మగును.

[illegible] 27 భా.

## 41. అద్భుతము

శ్లో॥ చత్వారింశ ద్ద్వయాధిక్యం భాగం కృత్వా గృహోన్నతమ్॥ 17

అధిష్ఠానం త్రిభాగార్ధం సప్తాంశం చరణోదయమ్।

తలోచ్చ సదృశం మంచం తలిపం సార్ధ షట్కకమ్॥ 18

గుణాంశం ప్రస్తరోత్సేధం భూపాదం చ షడంశకమ్।

సార్ధద్వ్యంశం తు మంచోచ్చ మేకాంశం వేదికోదయమ్॥ 19

గలమానం ద్విభాగం స్యా ద్భూతాంశం శిఖరోదయమ్।

ద్విభాగం స్తూపి తుంగం తు ప్రోక్త మద్భుత హార్మ్యకమ్॥ 20

తా॥ ఆలయము యెత్తును 42 భాగములుచేసి అధిష్ఠానము 3½ భా, స్తంభము 7 భా, ప్రస్తరము 3½ భా, మరల స్తంభము 6½ భా, మరల ప్రస్తరము 3 భా, మరల స్తంభము 6 భా, మరల ప్రస్తరము 2½ భా, వేదిక 1 భా, గలము 2 భా, శిఖరము 5 భా, స్తూపిక 2 భా, ఇట్లు చేసిన యెడల మూడంతస్తులు గల అద్భుత మగును.



## 32. సార్వకామికము

శ్లో॥ ప్రాసాదస్య తు తుంగేన షడష్టాంశ విభాజితే।
అధిష్ఠానం యుగాంశం తు వస్వంశం చరణాయతమ్॥ 21
మంచమానం తు వేదాంశం తలిపం సార్ధ సప్తకమ్।
సార్ధ త్రిభాగం మంచోచ్ఛ్రం సప్తాంశం చరణాయతమ్॥ 22
ప్రస్తరోచ్ఛ్రం గుణాంశం తు శివాంశం వేదికోదయమ్।
ద్విభాగం గలమానం తు రసాంశం శిఖరోదయమ్॥ 23
ద్విభాగం తు శిఖామాన మేవం స్యాత్సార్వకామికమ్।

తా॥ ఆలయము యెత్తును 48 భాగములు చేసి, అధిష్ఠానము 4 భా, స్తంభము 8 భా, ప్రస్తరము 4 భా, మరల స్తంభము 7½ భా, మరల ప్రస్తరము 3½ భా, మరల స్తంభము 7 భా, మరల ప్రస్తరము 3 భా, వేదిక 1 భా, గళము 2 భా, శిఖరము 6 భా, స్తూపిక 2 భా, ఇట్లు చేసినయెడల మూడంతస్తులు గల సార్వకామిక మగును.



సార్వకామికము 3 భూ.

## 33. స్వస్తికము

శ్లో॥ అష్ట కూటాష్ట శాలాభిః కలాపంజర సంయుతం॥ 24
సతోరణాల్పనా సాఢ్యం జన్మాదగ్రం యుగాంశకం।
నానాధిష్ఠాన యుక్తానాం నానాపాదైరలంకృతం॥ 25
శిఖరే భానునాసాఢ్యం మంచకం చతురష్టకం।
కూట కోష్ఠోన్నతా దీని కారయే దుచితం భవేత్॥ 26
స్వస్తికం భవనం ఖ్యాతమ్।

తా॥ కర్ణకూటములు 8, శాలలు 8, పంజరములు 16, తోరణములును, అల్పనాసికలు 16
ఉపపీఠము మొదలుకొని శిఖరము [illegible] అనేక అధిష్ఠానములును, అనేక స్తంభము

లును, శిఖరమున 12 నాసికలును, మంచములు 32 ను, కూటకోష్ఠములు యెత్తుగాను చేయవలెను. దీనిని స్వస్తిక మందురు.

### 64. స్వస్తిభద్రము

శ్లో॥ తదేవ శిఖరే ద్విజ॥ చతుర్మహా నాసికాఢ్య మల్పాష్టక వివర్జితం॥ 27

స్వస్తిభద్ర మిదం ఖ్యాతం సర్వదేవ ప్రియావహమ్।

తా॥ నాలుగువైపుల మహానాసికలతో గూడి యుండెనేని పూర్వోక్త దేవాలయమునే స్వస్తిభద్ర మందురు.

### 65. రుద్రకాంతము

శ్లో॥ తదేవ వృత్త శిఖరం గలంవై వేదికా తథా॥ 28

రుద్రకాంత మిదం నామ్నా మమప్రీతికరమ్ పరమ్॥

తా॥ మునుపు చెప్పినదే గుండ్రని శిఖరమును గలమును వేదికను చేసినట్లయిన రుద్రకాంత మగును.

### 66. శివకాంతము

శ్లో॥ తదేవ శీర్షకోణేషు అల్పనాసి ద్వయాహ్వయం॥ 29

కల్పితం శివకాంతం స్యాచ్ఛివప్రీతికరం గృహమ్।

తా॥ పైన జెప్పబడినదియే శిఖరమున మూలలయందు క్షుద్రనాసికలు రెండు చేసిరేని శివకాంత మగును.

### 67. విష్ణుకాంతము

శ్లో॥ తదేవ వేదికా కంఠం శీర్షకం చ ఘటం తథా॥ 30

వస్వశ్రం కల్పితం యత్ర ద్విష్ణుకాంత మిదం పరమ్॥

తా॥ పైన జెప్పినదియే వేదిక గలము శిఖరము 8 కోణములతో నుండెనేని విష్ణుకాంత మగును.

### 68. ధర్మకాంతము

శ్లో॥ విన్యాస సూత్రయో రంతం నవభాగ విభాజితే॥ 31

ఏకాంశం కూట విస్తారం ద్విభాగం కోష్ఠదీర్ఘకం।

కోష్ఠం ప్రతి ద్వికోష్ఠం స్యా దర్ధాంశం పంజరం తతః॥ 32

శేషం హారాంతరం ఖ్యాతం కల్పయే చ్ఛిల్ప వి త్తమః।
చతుష్కూటాష్ట శాలాంశం భాను పంజర సంయుతం॥ 33

తచ్ఛాల్ప నాసికోపేతం వస్వశ్రం శీర్షకం గలం।
మహానాస్యష్ట కోపేతం శిఖరం తద్ ద్విజోత్తమ॥ 34

నామ్నా ధర్మ విమానం తు ధర్మ ప్రీతికరం భవేత్॥

విన్యాసనూత్రముయొక్క చివరకు 9 భాగములుచేసి కూట విస్తారము 1 భా, కోష్ఠము నిడివి 2 భా, కోష్ఠమునుగూర్చి రెండు కోష్ఠములు చేయవలెను. పంజర విస్తారము ½ భా. మిగిలినది హారముయొక్క మధ్యస్థానము. నాలుగు కర్ణకూటములు 8 శాలలు. 12 పంజరములు, అల్ప నాసికలును, శిఖరము గలము 8 కోణములు, మహానాసికలు 8, శిఖరమును కలిగియుండినేని ధర్మకాంత మగును.



ధర్మకాంతము.

## 69. విమానము

శ్లో॥ తదేవాష్టాశ్ర వేదీ తు వృత్తాభం శిఖరం గలం॥ 35
విమానాకృతి నామ్నాతం సర్వ దేవార్హకం భవేత్।

తా॥ పైజెప్పినదియే వేదిక 8 కోణములును శిఖరము గుండ్రముగాను చేసినేని విమానమగును.

## 70. బ్రహ్మకాంతము

శ్లో॥ తదేవ శిఖరం కంఠం యుగాశ్రం బ్రహ్మకాంతకమ్॥ 36

తా॥ పైజెప్పినదానినే గలమును శిఖరమును నలుచదరముగా చేసినేని బ్రహ్మకాంతమగును.

శ్లో॥ తదేవ సాయతాశ్రం తు సపాదం సత్రిభాగికం।
వసుభాగం తు విస్తార మాయామం దశధా భవేత్॥ 37

ఏకాంశం కూట విస్తారం శాలాయా ద్వి గుణాయతం।
శేషం హారాంతరం ఖ్యాతం ప్రాగివైవ ప్రకల్పయేత్॥ 38

తా॥ అదియే దీర్ఘ చతురశ్రముగాచేసి 1¼ భాగముగాని 1¾ భాగముగాని ఆ విస్తారమును 8 భాగములుగా చేసి నిడివి 10 భాగములు చేయవలయును. కూటము 1 భా, శాల 2 భా, మిగిలినది హారము. ఇట్లు పూర్వమువలెనే చేయవలెను. ఇది మొదటి అంతస్తు పద్ధతి.

## 71. హస్తిపృష్ఠము

శ్లో॥ షడష్ట భాగ విస్తార మాయామం చోర్ధ్వ భూమికే।
ఏకాంశం కూట విస్తారం కోష్ఠ దీర్ఘం త్రయాంశకం॥ 39

అర్ధాంశం పంజరవ్యాసం శేషం హారాంతరం భవేత్।
ఊర్ధ్వ భూ విస్తృతం చాగ్ని భాగైకం కంఠభద్రకమ్॥ 40

ద్వ్యశ్ర వృత్తం చ వేదీ చ కంఠం వై శీర్షకం తథా।
చతుష్కూటాష్టశాలం చ భానుపంజర సంయుతమ్॥ 41

హారాంతరం చతుర్వింశ త్కల్పయే దాది భూతలే।
చతుష్కూటం చతుశ్శాలం పంజరాష్టక సంయుతమ్॥ 42

షోడశాంతర సంయుక్తం శత సంఖ్యాల్ప నాసికం।
లలాటం నాసికా యుక్తం పార్శ్వయోర్భద్ర నాసికా॥ 43

తథైవ నాసికా పృష్ఠే పృష్ఠే శీర్షక మాచరేత్।
నానాధిష్ఠాన సంయుక్తం నానాచాంఘ్రి సమాయుతమ్॥ 44

సర్వాలంకార సంయుక్తం హస్తి పృష్ఠ మిదం భవేత్।

తా॥ పై అంతస్తున 6 భాగములు విస్తారమును, 8 భాగములుపొడవును చేసి కర్ణకూటము విస్తారము 1 భా, కోష్ఠముల నిడివి 3 భాగములు. పంజరము యొక్క విస్తారము ½ భా, మిగిలినది మధ్యహారము అగును. ఆపైన భూమియొక్క విస్తారమును 3 భాగములుచేసి అందు 1 భాగము కంఠభద్రమునకు చేయవలెను, వేదిక 2 భాగములు గుండ్రముగాను చేసి కంఠమును శిఖరమును ఆవిధముగా చేయవలెను. 4 కర్ణకూటములు, 4 శాలలు, 12 పంజరములు 16 అంతరములు, 100 క్షుద్రనాసికలు, ముఖనాసికయును, ప్రక్కల భద్రనాసికలును, వెనుక నాసికయును, ఆ నాసిక యొక్క వీపున శిఖరమును చేయవలెను. అనేక అధిష్ఠానములును, అనేకమైన స్తంభములును సమస్తమైన అలంకారములును చేయవలెను. దీనిని హస్తిపృష్ఠమని చెప్పుదురు.

శ్లో॥ మాన సూత్రాంతరం వ్యాసం నవభాగ విభాజితే॥ 45

గుణాంశం గర్భగేహంతు శివాంశం కుడ్యవిస్తృతం।
పరితోఽలింద్ర మేకాంశం హారవ్యాసం శివాంశకం॥ 46

ఏవం హి కల్పయే త్తేషు కర్ణకూటం శివాంశకం।
మధ్యకోష్ఠం గుణాంశం స్యా దే కాంశః పంజర స్తతః॥ 47

హారాంతరం తదర్ధాంశం కల్ప్యేవం ప్రథమేభువి।
అథవా పంజరాణాంతు అర్ధాంశం వా విధీయతే॥ 48

శేషం హారాంతరం ఖ్యాతం పరితస్త్వే వ మాచరేత్।
కోష్ఠమధ్యే త్రిదండేన మహానాసి వినిర్గతమ్॥ 49

ఊర్ధ్వ భూమౌ షడం శేషు కూటకోష్ఠాయుత ద్వయం।
అర్ధాంశం పంజర వ్యాసం శేషం హారాంతరం భవేత్॥ 50

తా॥ మానసూత్రమునుండి వ్యాసమును 9 భాగములుచేసి గర్భగృహము 3 భాగములు, గోడ విస్తారము 1 భా, చుట్టూ అలింద్రము 1 భా. హారముయొక్క విస్తారము 1 భా, ఇట్లు భాగములు చేయవలెను. కర్ణకూటము 1 భా, మధ్యకోష్ఠము 3 భా, పంజరము 1 భా, అందులో సగము హారాంతరము, ఇట్లు మొదటి అంతస్తున చేయవలెను. లేక పంజరములకు ½ భాగమును చేయవచ్చును. మిగిలినది హారాంతరము. చుట్టును యిట్లు చేయవలెను, కోష్ఠము మధ్య 3 దండములు మహానాసియొక్క నిర్గమమును చేయవలెను. పై అంతస్తున 6 భాగములుచేసి కూటము 2 భా, కోష్ఠము 2 భా, పంజరము ½ భా మిగిలినది హారాంతరము చేయవలెను.

## 72. భద్రకోష్ఠము

శ్లో॥ ఊర్ధ్వ భూమీ వి స్తృతార్ధం త్వర్ధ దండేన నిర్గతం।
చతురశ్ర మధిష్ఠానం వస్వశ్రం శీర్షకం గలం॥ 51

ఆదౌ తలే చతుష్కర్ణే కూటో వేదాశ్ర శీర్షకః।
అష్టాశ్రం శీర్షకం కూట శ్చోర్ధ్వ భూమౌ ప్రకల్పయేత్॥ 52

అష్ట కూటాష్ట కోష్ఠం చ కలా పంజర సంయుతం।
శతాల్ప నాసికోపేతం శిఖరేంద్రం మహాంతరం॥ 53

భద్రకోష్ఠ మిదం నామ్నా సర్వ దేవార్హకం పరమ్।

తా॥ పై అంతస్తు విస్తారములో సగము ½ దండము నిర్గమమును అధిష్ఠానము నలుచదరమును, దాని శిఖరము 8 కోణములును, మొదటి అంతస్తున 4 కర్ణకూటములు నలుచదరముగా శిఖరమును చేయవలెను. రెండవ యంతస్తున 4 కర్ణకూటములును శిఖరమును 8 కోణములుగా చేయవలెను. 8 కూటములు, 8 కోష్ఠములు, 16 పంజరములును, 100 అల్పనాసికలు వీనితో శిఖరము చేసి మహాంతరములు కల్పించినచో భద్రకోష్ఠ మగును,

## 73. వృత్తకూటము

శ్లో॥ తదేవ కర్ణకూటానాం శీర్షకం వర్తులాకృతి॥ 54

ప్రాసాద శీర్షకం కంఠం వృత్తాకారం ప్రకల్పయేత్।
శిఖరే తు చతుర్దిక్షు భద్రనాసి సమన్వితం॥ 55

తథాదిక్ష్వల్పనాసాఢ్యం వృత్త కూట మిదం పరమ్।

తా॥ పైజెప్పినదానినే కర్ణకూటముల యొక్క శిఖరమును గుండ్రముగాచేసి ప్రాసాదము యొక్క గలమును శిఖరమును గుండ్రముగానే చేసి ఆశిఖరముయొక్క నలుదిశల భద్రనాసిని కల్పించి అటులే అన్నిదిక్కులయందును క్షుద్రనాసికలను రచించినచో వృత్తకూట మగును.

## 74. శ్రీకాంతము

శ్లో॥ తదేవ శిఖరే కోణే క్షుద్రనా సాష్టకాన్వితం॥ 56

యుగాశ్రం కర్ణకూటానాం శీర్షకం పరికల్పయేత్।
శేషం ప్రాగివ కర్తవ్యం శ్రీకాంతం త దుదాహృతమ్॥ 57

తా॥ పైజెప్పినదానినే శిఖరమున కోణములయందు క్షుద్రనాసికలు 8. కర్ణకూటములు నలుచదరముగను, శీర్షమును చేసినయెడల శ్రీకాంత మగును. మిగిలినవి అన్నియును మునుపటి వలెనే చేయవలెను,

## 75. సుమంగలము

శ్లో॥ తదే వాష్టాంశ మాధిక్య మాయామం చతురశ్రకం।
శాలామధ్యే మహానాసి భద్రం హీనం ప్రకల్పయేత్॥ 58

శాలాభం మస్తకం కంఠం వృత్తాయత మథాపి వా।
స్తూపి త్రయ సమాయుక్త మేతన్నామ్నా సుమంగలమ్॥ 59

తా॥ పైజెప్పినదానినే 8 భాగములు అధికముచేసి పొడవును చతురశ్రమును చేసి, శాల యొక్క మధ్యను మహానాసికను, క్షుద్రభద్రమును కల్పించి శాలతో సమానముగా శిఖరమును గలమును చేసిగాని లేక కోడిగ్రుడ్డు ఆకారముగాచేసి స్తూపికలను మూడుచేసినచో సుమంగల మగును.

## 76. గాంధారము

శ్లో॥ మాన సూత్రాంతరం ధర్మ భాగం కృత్వా ద్విజోత్తమ।
గర్భగేహం తు వేదాంశం గృహం పింఢ్యంశ మావృతం॥ 60

పరితో ఒలింద్ర మేకాంశం హారం భాగేన కల్పయేత్।
తదేకం కూట విస్తారం మధ్యే కోష్ఠాయతద్వయం॥ 61

తయోర్మధ్యైక భాగేన పంజర వ్యాస ముచ్యతే।
హారాంతరం తథాంశేన పంజరస్య తు పార్శ్వయోః॥ 62

అష్టాంశాం చోర్ధ్వ భూమిం తు కృత్వాంశం కూట విస్తృతం।
శాలాయా ద్విగుణాయామం తయోర్మధ్యే తు పంజరం॥ 63

ఏకాంశే నైవ కర్తవ్యం శేషం హారాంతరం భవేత్।
ఊర్ధ్వ భూమి చతుర్భాగం ద్విభాగం మధ్య భద్రకం॥ 64

దండం వాఽథ ద్విదండం వా త్రిదండం వాఽథ నిర్గతిః।
వేదాశ్రం త దధిష్ఠానం తద్వత్ కంఠం చ శీర్షకం॥ 65

అష్ట శాలాష్ట కూటం చ పంజరం షోడశాన్వితం।
నానాధిష్ఠాన సంయుక్తం నానాపాదై రలంకృతం॥ 66

ఉన్నతౌ కూట కోష్ఠౌ ద్వౌ చాంతర ప్రస్తరాన్వితౌ । గాంధార మితి విఖ్యాతమ్॥

తా॥ మానసూత్రమును 10 భాగములుచేసి, గర్భాలయము 4 భా. గోడ 1 భా. చుట్టును, దాని వెలుపల అలింద్రము చుట్టును 1 భా. హారము 1 భా. కూట విస్తారము 1 భా. మధ్యకోష్ఠములు దీర్ఘముగా రెండును. ఆరెంటిమధ్య 1 భాగము పంజరముయొక్క విస్తారమును 1 భాగము హారాంతరమును, పంజరమునకు రెండువైపుల నుండవలెను. రెండవఅంతస్తున సూత్రమును 8 భాగములు చేసి కూటవిస్తారము 1 భా. శాలకు 2 భా. ఆరెంటిమధ్య పంజరము 1 భా. మిగిలినది హారాంతరము దానిపై భూమిని నాలుగు భాగములు చేసి దానిమధ్య 2 భాగములు భద్రమును చేయవలెను ఆ భద్రముయొక్క నిర్గమము 1 దండముగాని 2 దండములుగాని 3 దండములుగాని చేయవచ్చును. దానియొక్క అధిష్ఠానము నలుచదరముగా నుండవలెను. గలము శిఖరముకూడ నలుచదరముగనే యుండవలెను. 8 శాలలు, 8 కూటములు, 16 పంజరములు అనేకమైన అధిష్ఠానములు, వివిధ స్తంభములతో నలంకరింపబడి యెత్తయిన కూటకోష్ఠములు గలిగి అంతరములతోను ప్రస్తరములతోను కూడియుండినయెడల గాంధార మగును.

## 77. శ్రీవిశాలము శ్రీభోగాఢ్యము

శ్లో॥ అష్టాశ్రం వా గలం శిరః॥ 67

శ్రీవిశాల మితి ఖ్యాతం వర్తులా వేదికా గలం।
శీర్షం చైవ చ కర్తవ్యం శేషం పూర్వ వ దాచరేత్॥ 68

శ్రీభోగాఢ్య మితి ఖ్యాతం సర్వ దేవార్హకం పరమ్॥

తా॥ గలము శిఖరము 8 కోణములతో జేసినేని పై జెప్పిన విమానమే శ్రీవిశాల మని పించుకొనును. వేదిక గలము శిఖరము గుండ్రముగా నుండి మిగిలిన పనులు పూర్వోక్త ప్రకార ముగా నుండెనేని శ్రీభోగాఖ్య మగును.

శ్లో॥ వృత్తే వృత్తాయతే ద్వ్యశ్రే వృత్తే చైవ షడశ్రకే॥ 69
కూట కోష్ఠాది సర్వాంగం ప్రాగివైవ ప్రకల్పయేత్।
వక్షః స్థలం మండలం చ త్యజేత్కర్ణం చ శీర్షకమ్॥ 70

వక్షః స్థల విహీనానా మకర్ణం శీర్ష సంయుతం।
కూట కోష్ఠాది సర్వాంగ ముచితం నాగరాదికం॥ 71

నానాలంకార సంయుక్తం నానాచిత్రై ర్విచిత్రితం।
గర్భగేహ విశాలం చ గృహం పిండ్యగ్రమండపం॥ 72

ఏక భూమి విధానోక్త మనుక్తానాం విశేషతః।
త్రితలం హ్యేవ మాఖ్యాతం చతుర్భూమి మథోచ్యతే॥ 73

తా॥ గుండ్రము, గుండ్రములో దీర్ఘము, ద్వ్యశ్రవృత్తము, 6 కోణములు. ఇట్టి భేదములతో కూటములు కోష్ఠములు మొదలైన అన్నిరూపములు మునుపటివలెనే చేయవలెను. వక్షఃస్థలమును మండలమును చేసి కర్ణమును శిఖరమును తీసివేయవలెను. లేదా వక్షఃస్థలమును కర్ణమునులేకుండ చేసి శిఖరముచు కూట కోష్ఠాది సమస్త రూపములతో సహితముగా చేయవలెను. నాగరము మొదలైన పద్ధతులతో నానావిధములైన అలంకారములతోను అనేక చిత్రములతోను చేయవలెను. గర్భాలయము యొక్క విస్తారముతో సమానముగా గృహముయొక్క గోడయును, ముందు మండపమును నిర్మించవలెను. ఏకభూమి విధానమున చెప్పబడినట్లు చేయవలెను. ఇందు కొన్ని చెప్పబడకుండెనను పూర్వము చెప్పబడినవానిని తెలిసికొని చేయవలెను. ఇట్లు త్రితలమునుగూర్చి చెప్పబడినది.

## 78. త్రితలము మరియొక పద్ధతి (శ్రీకాంతము)

### మానసారము 21 వ అధ్యాయము

శ్లో॥ త్రితలస్య విధానం చ లక్షణం వక్ష్యతే ఽధునా।
విమానోచ్చ షడంశే తు సార్ధాంశేన మసూరకం॥ 1

తద్ద్వయం పాద తుంగం స్యా త్తదర్ధం ప్రస్తరోదయం।
మూల పాదోదయే ఽష్టాంశ హీనం చోర్ధ్వాంఘ్రి తుంగకం॥ 2

తదర్ధం ప్రస్తరోచ్చం తు మూలపాద త్రిగుణాంఘ్రికం।
తదర్ధం చోర్ధ్వకే మంచం తస్యార్ధం వేదికోన్నతం॥ 3

తద్ ద్వయం చోర్ధ్వకంపం స్యాద్ గ్రీవ తుంగం ద్వయాంశకం।
శేషం చోర్ధ్వే శిఖోత్తుంగం సర్వాలంకార సంయుతం॥ 4

ప్రచ్ఛాదనోపరి స్తంభం కర్ణహర్మ్యాది మండితం।
విస్తారోత్సేధ మేతేషాం యత్తత్ప్రాగుక్తవ న్నయేత్॥ 5

శ్రీకాంతం హర్మ్యకం ప్రోక్తం క్షుద్రం హి త్రితలే విదుః।

తా॥ ఆలయముయొక్క యెత్తును 6 భాగములుగాచేసి అందు 1½ భాగము అధిష్ఠానము స్తంభము 3 భాగములు, ప్రస్తరము 1½ భాగము, మొదటి అంతస్తు స్తంభమును 8 భాగములు చేసి అందు 1 భాగము తక్కువగా పై అంతస్తు స్తంభమును చేయవలెను. అందులో సగము యెత్తు ప్రస్తరమును చేయవలెను. మొదటి అంతస్తు స్తంభముయొక్క కొలతలో ముప్పాతికవంతు మూడవ అంతస్తు స్తంభము చేయవలెను. అందులో సగము ప్రస్తరమును చేయవలెను. ఆ ప్రస్తరములో సగము వేదికను చేయవలెను. వేదికకు రెట్టింపు కంపమును చేయవలెను, గళము 2 భాగములు చేయవలెను. మిగిలినది శిఖరమును, స్తూపికను చేయవలెను. ప్రస్తరముపైన స్తంభము కర్ణహర్మ్యముతో కూడియుండవలెను. విస్తారమును యెత్తును పూర్వము చెప్పినట్లు చేయవలెను. త్రితలమున క్షుద్రమనియు. శ్రీకాంతమనియు దీనిని చెప్పుదురు. అధిష్ఠానము 4 భా, స్తంభము 8 భా, ప్రస్తరము 4 భా, రెండవ స్తంభము 7 భా, ప్రస్తరము కక్షే భా, మూడవ స్తంభము 6 భా, ప్రస్తరము 3 భా, కంపము 1½ భా, వేదిక 3 భా, గళము 6 భా, కుంభము 12 భా, కలశము 2 భా, మొత్తము 60 భాగములు అని తెలియవలెను.



శ్రీకాంతము ౬౦. భా (మూడు)

## 79. ఆసనము

శ్లో॥ అథవా సప్త సప్తాంశం విభజే త్త్రితలోదయే॥ 6

చతుర్భాగ మధిష్ఠానం తద్ద్వయం పాదతుంగకం।
అధిష్ఠాన సమం మంచం మంచోర్ధ్వే ఒర్ధేన వప్రయుక్॥ 7

సత్రిపాద షడంశేన చోర్ధ్వం పాదోదయం భవేత్।
తదూర్ధ్వం ప్రస్తరోత్తుంగం సైకపాద త్రిభాగికం॥ 8

తదూర్ధ్వే ఒర్ధేన వప్రం స్యా త్తదూర్ధ్వే ఒంఘ్రి షడంశకం।
సార్ధ ద్విభాగం మంచం స్యా దర్ధాంశం తూర్ధ్వ పట్టికం॥ 9

ఏకాంశం వేదికోత్తుంగం గ్రీవ తుంగం గుణాంశకం।
తద్ ద్వయం శిఖరోత్తుంగం గుణాంశం తచ్ఛిఖోదయం॥ 10

శేషం ప్రాగుక్తవ త్కుర్యా దాసనం పరికీర్తితమ్।



ఆసనము 49 భా (ప్రాక్)

తా॥ ఆలయము యెత్తును 49 భాగములుచేసి, అధిష్ఠానము 4 భా, స్తంభము 8 భా, ప్రస్తరము 4 భా. వప్రము ½ భా, మరల స్తంభము $6\frac{1}{3}$ భా, మరల ప్రస్తరము $3\frac{1}{4}$ భా, వప్రము ½ భా, మరల స్తంభము 6 భా, దానిపై ప్రస్తరము $2\frac{1}{2}$ భా, పట్టిక ½ భా. వేదిక 1 భా, గలము 3 భా, శిఖరము 6 భా, స్తూపిక 3 భాగములు ఇట్లు చేసినేని ఆసనమని చెప్పుదురు.

## ౮0. సుఖాలయము

శ్లో॥ అథవా త్రితలోత్తుంగే ద్వాదశాంశం విభాజితే॥ 11

తదేకాంశ మధిష్ఠానం ద్విభాగం పాద దైర్ఘ్యకం।
తదర్ధం ప్రస్తరోత్సేధం త్రిపాదం చోర్ధ్వపీఠకం॥ 12

అధిష్ఠా నోర్ధ్వదేశే తు తద్ద్వయం పాద దైర్ఘ్యకం।
తదర్ధం ప్రస్తరం చోర్ధ్వే సార్ధాంశేన మసూరకం॥ 13

ఏకాంశం పాద దైర్ఘ్యం స్యా దర్ధాంశం మంచ తుంగకం।
తదర్ధం వేదికోత్తుంగం తద్ద్వయం గ్రీవ తుంగకం॥ 14

గ్రీవతుంగ ద్వయం చోర్ధ్వే శీర్షమర్ధం శిఖోదయం।
ఏవం సుఖాలయం ప్రోక్తం శేషం పూర్వవ దాచరేత్॥ 15

తా॥ మూడంతస్తులు గల దేవాలయమును 12 భాగములు చేసి అందు అధిష్ఠానము 1 భా, స్తంభము 2 భా, ప్రస్తరము 1 భా. దానిపైన మరల అధిష్ఠానము $\frac{3}{4}$ భా, మరల స్తంభము $1\frac{1}{2}$ భా' మరల ప్రస్తరము $\frac{3}{4}$ భా, దానిపైన మరల అధిష్ఠానము $\frac{1}{2}$ భా' దానిపై స్తంభము 1 భా, ప్రస్తరము $\frac{1}{2}$ భా, వేదిక $\frac{1}{4}$ భా, గలము $\frac{1}{2}$ భా, శిఖరము 1 భా, స్తూపిక $\frac{1}{2}$ భా, ఇట్లు చేసినేని సుఖాలయ మగును. ఇది $12\frac{1}{4}$ కనుపడుచున్నది.



## 81. కేసరము

శ్లో॥ తస్యోప పీఠ దేశే తు చోర్ధృతా హారితాన్వితం।
ఏతత్తు కేసరం ప్రోక్తం కమలాంగ మిహోచ్యతే॥ 16

తా॥ పైజెప్పినదానినే ఉపపీఠ స్థలమున ఆచ్ఛాదనము చేసినేని దీనిని కేసరమందురు.

## 82. కమలాంగము

శ్లో॥ చతుర్విం శాంశకం తుంగే శ్రీకాంత స్యాకృతి స్తథా।
సర్వాంగకం గవాక్షం స్యా త్కర్ణహర్మ్యం వినాతథా॥ 17

నానా వేదికయా యుక్తం నానా స్తంభై రలంకృతం।
చతుర్దిగ్వారణం కుర్యాత్ సంకీర్ణం ద్రవ్య సంయుతం॥ 18

ఆదిభూతం తు కుడ్యం స్యా త్తదూర్ధ్వే త్వంఘ్రిసంయుతం।
సర్వాలంకార సంయుక్తం కమలాంగ ముదీరితమ్॥ 19

తా॥ ఆలయము యెత్తును 24 భాగములుచేసి శ్రీకాంతము యొక్క ఆకారములోనే అన్నియును చేసి, గవాక్షులతోను కర్ణహర్మ్యములేకుండ అనేక వేదికలతోను, అనేక స్తంభముల తోను చేసి నాలుగు దిశలను యేనుగులనుచేసి సంకీర్ణముగా చేసినేని మరియు మొదటగోడయును, దానిపై స్తంభములును అలంకారముగా చేసినచో కమలాంగ మగును.

శ్లో॥ తదేవకర్ణ హర్మ్యాది యుక్తం వేద్యాది భూషితమ్।
సర్వాలంకార సంయుక్తం బ్రహ్మకాంత మితి స్మృతమ్॥ 20

తా॥ పైజెప్పినదానికే కర్ణకూటములయందు హార్మ్యములను చేసి అన్ని అలంకారములతో రచించిరేని బ్రహ్మకాంతమగును.

## 83. మేరుకాంతము

శ్లో॥ అథవా తుంగ మానేతు త్రింశ దంశం విభాజితే।
అధిష్ఠానం ద్విభాగం స్యాత్ తద్ద్వయం పాద తుంగకమ్॥ 21
తదర్ధం ప్రస్తరోత్తుంగం చోర్ధ్వం మంచం తు తత్సమమ్।
సార్ధ వహ్న్యంశకం చోర్ధ్వే పాదం సార్ధాంశం ప్రస్తరం॥ 22
తత్సమం చోర్ధ్వ మంచం స్యా దూర్ధ్వే పాదం గుణాంశకమ్।
సపాదాంశం ప్రస్తరం స్యా త్తత్సమం చోర్ధ్వం మంచకమ్॥ 23
ఏకాంశం వేదికోత్తుంగం తద్ద్వయం కంధరోదయమ్।
గ్రీవద్వయం శిరస్తుంగం శేషం తు స్థూపి తుంగకమ్॥ 24
కర్ణ హర్మ్యాది సంయుక్తం మేరుకాంత మితి స్మృతమ్।


మేరుకాంతము బింబా (ప్రతి)

తా॥ ఎత్తును 30 భాగములుచేసి అధిష్ఠానము 2 భా, స్తంభము 4 భా. ప్రస్తరము 2 భా, మరల అధిష్ఠానము 2 భా, దానిపైన స్తంభము 3½ భా, దానిపై ప్రస్తరము 1½ భా, మరల అధిష్ఠానము 1½ భా, దానిపైన స్తంభము 3 భా, ప్రస్తరము 1¼ భా, మంచకము 1¼ భా, వేదిక 1 భా, గలము 2 భా, శిఖరము 4 భా, మిగిలిన 1 భాగము స్థూపిక, మొత్తము 30 భాగములు కర్ణములయందు గృహములను రచించిరేని మేరుకాంత మగును.

## 84. కైలాసము

శ్లో॥ తదే వైకాంశ మాధిక్యం మూలే వహ్న్యంశ మాసనమ్॥ 25
తద్ద్వయం పాద దైర్ఘ్యం స్యా త్తదర్ధం ప్రస్తరోదయమ్।
ఊర్ధ్వాంగం పూర్వవ త్కుర్యా దేతత్కైలాస మీరితమ్॥ 26


కైలాసము 3(భూ ప్రసాదం)

తా॥ పైనజెప్పినదానికి 1 భాగము వృద్ధిచేసి అధిష్ఠానమును మొదట 3 భాగములు చేయవలెను. స్తంభమును 6 భాగములును, ప్రస్తరమును 3 భాగములును, ఇట్లు 12 భాగములు మొదటిఅంతస్తు చేసి మిగిలినవి మునుపటివలెనే చేయవలయును. దీనిని కైలాసమని చెప్పుదురు.

శ్లో॥ ఆరుహ్య ప్రదక్షిణం కుర్యా ద్ధర్మ్య మేవం తు పూర్వవత్।
ఏత దష్టవిధం ప్రోక్తం త్రితలే చోత్తమం మతమ్॥ 27

విశాలే తు యథాభాగం కూటానాం చైకభాగికం।
మధ్యే ద్విత్రి చతుర్భాగం శాలాకోష్ఠం ప్రకల్పయేత్॥ 28

ఏక ద్విత్ర్యంశకే నైవ హారాం స పంజరాన్వితాం।
పరితశ్చైక భాగేన కూటశాలాది భూషితమ్॥ 29

తస్యాం త శ్చావృతాంశేన చోర్ధ్వదేశే జలస్థలం।
ఏకం వా ద్విత్రి దండేన భద్ర నిర్గమ మీరితమ్॥ 30

హారా చ తత్త్రిభాగైకం మధ్య శాలా విభూషితమ్।
అష్ట కూట సమాయుక్తం కోష్ఠకం చాష్ట సంయుతమ్॥ 31

తా॥ ప్రదక్షిణముగా పైకి బోవునట్లుచేసి యాలయమును మాత్రము పూర్వము చెప్పినట్లు చేయుట మరియొకవిధము. ఇట్లు 8 విధములు కలవు ఈ యెనిమిదియును ఉత్తమ త్రితలమున చేయవలసినవి? మరియు విశాలమున భాగములు చేయుట యెట్లనిన కూటములకు 1 భాగమును, నడుమ 2-3-4 భాగములు శాలాకోష్ఠములను చేయవలయును. 1-2-3 భాగములచేత పంజరములతో గూడిన హారమును కల్పించవలెను. చుట్టును ఒక్కభాగము కూటశాలలతో నలంకరించవలెను. దానిలోపల చుట్టును 1 భాగముపై ప్రదేశమున జలాంతరమును చేయవలెను. 1-2-3 దండములు భద్రముయొక్క నిర్గమమును కల్పించవలెను. హారమునందు మూడు భాగములలో

ఒక్కభాగము మధ్య శాలను రచించవలెను. కర్ణకూటములు 8 చేయవలెను. కోష్ఠములుకూడ 8 చేయవలెను. మరియు-

శ్లో॥ హారా షోడశ సంయుక్తం సర్వాలంకార సంయుతమ్।
నానాధిష్ఠాన సంయుక్తం నానాపాద్రై రలంకృతమ్॥ 32

నానాతోరణైర్నీడైశ్చ నానావేది విభూషితమ్।
త్రితలే కూట కోష్ఠాది హారాదీన్ గల దేశకే॥ 33

మూల పాద ప్రదేశే తు కుర్యాత్తు సర్వదేవతాః।
దేవాదీనాం పురాణైశ్చ దేవతానాం చ విగ్రహమ్॥ 34

యుక్త్యా సర్వప్రయత్నేన విన్యసే ల్లక్షణోక్తవత్।
గ్రీవాది సశిఖాంతశ్చ పూర్వోక్తానాం చ సమ్మతమ్॥ 35

గ్రీవ మస్తక శిఖా ప్రదేశకే । నాగరాది సమలంకృతోక్తవత్।
దేవతాశ్చ దిశి చాష్టకేన్యసేత్ । విష్ణుశంకరజినాది హర్మ్యకే॥ 36

ఇతి మానసారే వాస్తుశాస్త్రే త్రితల విధానం నామ ఏకవింశోఽధ్యాయః

తా॥ 16 హారములను, అనేకపీఠములను, అనేక స్తంభములను, వివిధ తోరణములను, వివిధ పంజరములను, వివిధ వేదికలను రచించవలెను. మూడంతస్తులుగల దేవాలయమున కూటములు కోష్ఠములు హారములు గల ప్రదేశమున రచించవలెను, ముఖ్య స్తంభప్రదేశమున సర్వదేవతలను చేయవచ్చును. ఆ విగ్రహములను శాస్త్రోక్తముగా నిర్మించవలెను. గలము మొదలుకొని స్తూపిక వరకు ఇట్లు చేయవచ్చును, గలము శిఖరము స్తూపిక మొదలగు ప్రదేశములయందు నాగరముననను, ద్రావిడముననను, వేసరముననను చెప్పబడియుండినట్లు 8 దిక్కులయందును క్రమప్రకారము దేవతల నుంచవలెను. విష్ణు హర్మ్యమునకును శివమందిరమునకును, జినాలయమునకును వేఱువేఱుగా దిగ్దేవతలు చెప్పబడియున్నారు కనుక ఆ పద్ధతుల ననుసరించి చేయవలయును.

## 85. త్రితలము ద్రావిడపద్ధతి

### సమరాంగణ సూత్రధార 62 వ అధ్యాయము

శ్లో॥ త్రిభూమిక స్తృతీయోఽథ ప్రాసాదో ఽస్మాభి రుచ్యతే।
తస్యైకాదశ విస్తారో హస్తాః పంచదశోచ్ఛ్రయః॥ 33

చతుర్దశాంగులాన్యేషాం భవేదస్యాధికాని చ।
ఏవం త్రిభూమికస్యైతత్ కర్ణమాన మసంశయమ్॥ 34

పీఠం ద్విహస్తం కుర్వీత తత్రాదౌ పూర్వ సూచితమ్।
జంఘా త్రిభాగికోత్సేధాం కూటోచ్ఛ్రాయం తు భాగికమ్॥ 35

భవేజ్జంఘా ద్వితీయా చ సార్ధభాగద్వయం తతః।
భాగం చ కూట ప్రస్తార శ్చంద్రశాలా విభూషితః॥ 36

పునస్తృతీయా జంఘా స్యా ద్భాగద్వయ సముచ్ఛ్రితా।
తతశ్చ కూట ప్రస్తారో భాగికో భూషణాన్వితః॥ 37

భాగం స్యా ద్వేదిబంధస్తు సతోరణద్వార కంఠకః।
చతుర్దిశ మహాకార్యో భూషాయుక్తో యథోచితమ్॥ 38

తా॥ మూడంతస్తులుగల ప్రాసాద విధానమును చెప్పు చున్నాడు. విస్తారము 11 హస్తములును, ఎత్తు 15 హస్తములును పైన 14 అంగులములును, ఈ కొలతను కర్ణమానముచేత గ్రహించవలెను. పీఠము 2 హస్తములు, జంఘ 3 భాగములయెత్తు, కూటము 1 భాగము, మరల జంఘ 2½ భాగము, కూటము 1 భాగము, చంద్రశాలతో సహితముగా నుండవలెను. మరల జంఘ 2 భాగములు, కూటము 1 భాగము అలంకారసహితముగాను, వేదిక 1 భాగము, చేసి నాల్గుదిశల ద్వారములును తోరణములును చేయవలెను, ఇష్టానుసారముగా అలంకారమును చేయువచ్చును.



ప్రావిడపక్షం 11 ఎత్తు 15½ హ.

శ్లో॥ ఘంటాఛేదస్తు భాగౌద్వౌ ద్వ్యంగుల ద్వయ సంయుతౌ।
ఏకాదశ స్తరాః కుర్యాత్ తస్యోపరి విధీయతే॥ 39

ఇదానీం ప్రవిభాగో ఽస్య పీఠా దూర్ధ్వం విధీయతే।
హస్త మేకం భవేజ్జంఘా ద్వయో ఽపి చ తథా సమా॥ 40

మాలా తు ద్విస్తరా ప్రోక్తా లశునం భాగికం తతః।
భరణం స్తరమేకం స్యాత్ కలశో ఽపి చ తత్సమః॥ 41

వీరకంఠ సమాయుక్త ముచ్చాలం ద్విస్తరం తతః
తతస్తరం వీరకంఠో......................॥ 42

హీరకం ద్విస్తరం విద్యాత్ స్తరం వా సంతపట్టికా।
కపోతం నాసికాయుక్తం త్రిస్తరం కారయే త్తతః॥ 43

ఛేదం స్తర ప్రమాణం చ మేడం చ తస్య సమ్మితం।
స్తరం కుర్వీత మకరం తదర్థేనా స్య పట్టికా॥ 44

తా॥ ఘంట 2 భాగములును, 2 అంగులములును చేయవలెను. తరువాత ఛేదము 11 స్తరములును, ఇట్లు పీఠముపైన భాగములను చేయవలెను. జంఘ 1 హస్తమును, ఈప్రకారము రెండును కల్పించవలెను. మాల 2 స్తరములును, లశునము 1 భాగమును, భరణము 1 స్తరమును, కలశముకూడ భరణముతో సమానముగాను, వీరకంఠముతోను చేయవలెను. ఉచ్ఛాలము 2 స్తరములును, దానిపైన వీరకంఠము 1 స్తరమును, హీరము 2 స్తరములును, వసంతపట్టిక 1 స్తరమును, కపోతము నాసికతోసహా 3 స్తరములును, ఛేదము 1 స్తరమును, మేడము 1 స్తరమును, మకరము 1 స్తరమును, మకరపట్టిక ½ స్తరమును చేయవలెను.

శ్లో॥ ఛేదం తథైవ కుర్వీత కంఠ మేక స్తరం తతః।
పట్టికా వేదికా చైవ స్తర మేకం విధీయతే॥ 45

ఛేద మర్ధ స్తరం విద్యాత్ కంఠం సార్ధ స్తరం తతః।
పట్టికా స్యాత్ స్తరా పద్మం స్తర మేకం తతో భవేత్॥ 46

శేషే చ సుందరం కంఠం విధాతవ్యం విచక్షణైః।
అనంతరం ద్వితీయా చ జంఘా కార్యా నవ స్తరాః॥ 47

మధ్యే చ సా ప్రక ర్తవ్యా తదూర్ధ్వం తాం విభాజయేత్।
తత స్తరా భవే న్మాలా స్తరార్ధం లశునం తతః॥ 48

తథైవ భరణం జ్ఞేయం పూర్వే నిర్దిష్ట లక్షణం।
వీర కంఠేన సహితః కలశో ఽపి తథా భవేత్॥ 49

పద్మ పత్రికయా యుక్తం స్తర ముచ్ఛాలకం విదుః।
వీరకంఠం స్తరం విద్యా దర్ధభాగం చ హీరకమ్॥ 50.

తా॥ ఛేదము 1 స్తరము, కంఠము 1 స్తరము, పట్టిక 1 స్తరము, ఛేదము ½ స్తరము కంఠము 1½ స్తరము, పట్టిక 1 స్తరము, పద్మము 1 స్తరము మిగిలిన ప్రదేశమునః గలమును చక్కగా చేయవలెను. తరువాత రెండవ జంఘ 9 స్తరములు, నడుమ చేయవలెను. దానిపైన దానిని విభాగములను చేయవలెను. మాల 1 స్తరము, లశునము ½ స్తరము, భరణము ½ స్తరము మునుపు నిర్ణయించిన లక్షణములతో చేయవలెను. వీరకంఠముతో కూడ కలశమును అదేప్రకారముగ చేయవలెను. పద్మపత్రికతోకూడ ఉచ్ఛాలమును 1 స్తరము చేయవలెను. వీరకంఠము 1 స్తరమును ½ భాగము హీరమును చేయవలెను.

శ్లో॥ పట్టం తథైవ కుర్వీత స్తర స్యార్ధేన పట్టికా।
వసంతః స్తర మేకం స్యాత్ స్తరం వాసంత పట్టికా॥ 51

కపోతం త్రి స్తరం కుర్యా న్నాసికా సహితం బుధః।
ఛేద మర్ధ స్తరం విద్యాన్మేడం తత్తుల్య మేవచ॥ 52

మకరం స్తర మేకం చ భాగార్ధం పట్టికాతతః।
భాగ మేకం భవే చ్ఛేదః స్తరం కంఠ స్తదూర్ధ్వతః॥ 53

పట్టికా వేదికా చైవ స్తర మేకం విధీయతే।
ఛేదం భాగాధికం కుర్యాత్ కంఠకం సార్ధభాగికం॥ 54

భాగేన పట్టికాం కుర్యాత్ తథా కమల పత్రికాం।
కూటం తతః పరం కుర్యా న్నాసికాసు విభూషితమ్॥ 55

తా॥ పట్టము ½ భాగము, పట్టిక ½ భాగము, వసంతము 1 స్తరము, వసంతపట్టిక 1 స్తరము, కపోతము 3 స్తరములు, నాసికతో కూడ చేయవలెను. ఛేదము ½ స్తరము, మేడము ½ స్తరము. మకరము 1 స్తరము, పట్టిక ½ భాగము, ఛేదము 1 భాగము, గలము 1 భాగము, పట్టిక 1 భాగము, వేదిక 1 భాగము, ఛేదము ½ భాగము, గలము 1½ భాగము, పట్టిక 1 భాగము పద్మపత్రము 1 భాగము, తరువాత కూటము నాసికతో సహా చేయవలెను.

శ్లో॥ తృతీయ జంఘా తద్వత్ స్యాత్ చతుర్భిః కల్పితా స్తరైః।
స్తర మేకం భవే న్మాలా స్తరం చ లశునం విదుః॥ 56

భరణం స్తర మేకం చ కుంభ మేక స్తరం తథా।
వీరకంఠ సమోపేతా ముచ్చాలం స్యా త్తదూర్ధ్వతః॥ 57

స్తర మేకం ప్రకుర్వీత వీరకంఠ సముచ్ఛ్రితం।
తతశ్చ హీరకం కుర్యాద్ భాగే నైకేన బుద్ధిమాన్॥ 58

సార్ధభాగేన పట్టః స్యాత్ పట్టికార్ధం స్తరం తథా।
స్తర మేకం వసంతం స్యాత్ స్తరం వాసం త పట్టికా॥ 59

కపోతో ద్వి స్తరశ్ఛేదో ఒర్ధ స్తరో మేడక స్తరః।
భాగికో మకరః కార్యః పట్టికా చార్ధభాగికా॥ 60

తా॥ మూడవ జంఘ 4 భాగములు, మాల 1 భాగము, లశునము 1 భాగము, భరణము 1 భాగము, కుంభము 1 భాగము, వీరకంఠముతో గూడ చేయవలెను. ఉచ్చాలము 1 భాగము, వీరకంఠముతో సమానముగా యెత్తు చేయవలెను. హీరము 1 భాగము, పట్టకము 1½ భాగము,

పట్టిక ½ భాగము, వసంతము 1 భాగము, వసంతపట్టిక ½ భాగము, కపోతము 2 భాగములు, ఛేదము ½ భాగము, మేడము 1 భాగము, వేదిక 1 భాగము, మకరపట్టిక ½ భాగము చేయవలెను.

శ్లో॥ ఛేదో ఒర్ధ భాగికో భాగ మేకం కంఠః ప్రకీర్తితః।
పట్టికా వేదికా ఛేదా స్త్రయో ఒప్యర్ధ స్తరం పృథక్॥ 61

కంఠశ్చార్ధ స్తరః కార్యః పీఠికా చార్ధభాగికా।
అర్ధభాగేన కర్తవ్యా తదూర్ధ్వం పద్మ పత్రికా॥ 62

విచిత్ర లక్షణోపేతం తతః కూటం ప్రకల్ప్యతే।
స్తర మేకం భవేచ్ఛేదః స్యా త్కంఠో ఒప్యేవ మేవహి॥ 63

పట్టికా స్తర మేకం స్యాత్ తతో వేదీ స్తర ద్వయం।
ఛేదః స్తరం భవేద్భూయః కంఠః స్యాద్ ద్విస్తరం తతః॥ 64

కర్తవ్యః స్తర మేకైకం పట్టికా పద్మ పత్రికా।
ఘంటా తతః పరం కార్యా మానతో వింశతి స్తరాః॥ 65

ఏకాదశ స్తరః కుంభః సర్వేషాం సర్వతో భవేత్।
త్రిభూమికో ఒయమాఖ్యాత శ్చతుర్భూమి రథోచ్యతే॥ 66

తా॥ ఛేదము ½ భాగము, కంఠము ½ భాగము, పట్టిక ½ భాగము, వేదిక ½ భాగము, ఛేదము ½ భాగము, గళము ½ భాగము, పీఠము ½ భాగము, పద్మపత్రిక ½ భాగము, విచిత్ర లక్షణములతో కూటమును రచించవలెను. ఛేదము 1 భాగము, గళము 1 భాగము, పట్టిక 1 భాగము, వేదిక 2 భాగములు, ఛేదము 1 భాగము, మరల గళము 2 భాగములు, పట్టిక 1 భాగము, పద్మపత్రిక 1 భాగము, ఘంట 20 భాగములు, కుంభము 11 భాగములు, ఇట్లు మూడంతస్తుల దేవాలయమును చేయవలెను.

## 86. చతుర్భూమి లక్షణము — శాంతికము

### కాశ్యపశిల్పము 30 వ పటలము

శ్లో॥ అథవక్ష్యే విశేషేణ చతుర్భూమ్యాది లక్షణం।
విస్తారోత్సేధ మానం తు ప్రోక్తం ప్రాసాదమానకే॥ 1

రవ్యంశ మాన సూత్రం వా కృతే గర్భగృహాంశకం।
గృహ పిండ్యలింద్రాహారం ప్రత్యేకం చైకభాగతః॥ 2

విన్యాస సూత్రయో రంత ర్దశధా విభజేద్గృహం।
కర్ణకూటం శివాంశం తు కోష్ఠం తద్ద్విగుణాయతం॥ 3

పంజర వ్యాస మంశేన శేషం హారాంతరం భవేత్।
పునర పూర్వ్యర్ధ్వ భూమిం చ వసుభాగ విభాజితే॥ 4

కర్ణకూటం చ కోష్ఠం చ పంజరం పూర్వవ ద్భవేత్।
తదూర్ధ్వ భూమౌ షడ్భాగే శివాంశం కూట విస్తృతం॥ 5

కోష్ఠాయామం ధరాభాగ మర్ధాంశం పంజరస్య తు।
శేషం హారాంతరం ప్రోక్తం హీనాధిక్యంతు నాశ్రయేత్॥ 6

**తా॥** నాలుగు అంతస్తులు గల దేవాలయమును చెప్పుచున్నాడు. విస్తారమును యెత్తును మొదలగు సమస్తమును చెప్పబోవు రీతిగా తెలుసుకొనవలెను. స్థానసూత్రమును 12 భాగములు చేసి అందు గర్భగృహమును, అలిందమును, హారమును ఒక్కొక్క భాగముగా చేయవలెను. విన్యాసనూత్రముల మధ్యగృహమును 10 భాగములుచేసి కర్ణకూటము 1 భాగము, కోష్ఠము పంజరము మునుపటివలెనే చేయవలెను, మూడవ అంతస్తును 6 భాగములుచేసి కూటము 1 భాగము, కోష్ఠము 1 భాగము. పంజరము ½ భాగము, మిగిలినది హారను చేయవలెను. ఇంతకంటె యెక్కువ గాని తక్కువగా ని చేయగూడదు.

శ్లో॥ ఊర్ధ్వ భూమి విభాగేన వ్యోమ్నా భద్ర మభద్రకం।
దండం వాఽధ్యర్ధదండం వా ద్విదండం వాఽథ నిర్గమం॥ 7

ప్రాసాదోచ్చం తు విభజేత్ సగ్రహ త్రింశదంశకం।
సార్ధద్వ్యంశ మధిష్ఠానం భూతాంశం చరణోదయం॥ 8

అధిష్ఠాన సమం మంచం పాదం పాదోన పంచకం।
సాంఘ్రి పక్షాంశకం మంచం కల్పయేద్ ద్విజ సత్తమ॥ 9

సార్ధ వేదాంశకం పాదం పక్షాంశం ప్రస్తరోదయం।
సపాద వేదభాగం చ చరణోదయ మిష్యతే॥ 10

పాదోనాక్ష్యంశ మంచోచ్చం శివాంశం వేదికోదయం।
కంఠోచ్చం తు ద్విభాగం స్యాత్ సార్ధ వేదాంశ శీర్షకం॥ 11

స్థూప్యుచ్చం తు ద్విభాగంస్యా చ్ఛాంతికం భవనం భవేత్।


శాంతికము 39 భా. 4 అంత.

తా॥ పై ప్రదేశమును భాగములుచేసి 1 భాగము భద్రమును చేసిగాని, లేక కదలి వేసిగాని నిర్గమము 1 దండముగాని 1½ దండములుగాని, 2 దండములుగాని, చేయవలెను. ఆలయము యెత్తును 39 భాగములుచేసి. అధిష్ఠానము 2¾ భా, స్తంభము 5 భా. ప్రస్తరము 2½ భా, మరల స్తంభము 4½ భా. మరల ప్రస్తరము 2¼ భా, మరల స్తంభము 4½ భా, మరల ప్రస్తరము 2 భా, మరల స్తంభము 4¼ భా, మరల ప్రస్తరము 1¾ భా, వేదిక 1 భా, గలము 2 భా, శిఖరము 4½ భా, స్తూపిక 2 భా, ఇది శాంతికము,

## 87. పౌష్టికము

శ్లో॥ చత్వారింశ ద్ద్వయాధిక్యం భాగం కృత్వా గృహోన్నతం॥ 12
గుణాంశం తలమానం తు రసాంశం చరణోదయం।
ప్రస్తరం త్వగ్నిభాగేన భూతాంశం తలిపోదయం॥ 13
గుణాంశం ప్రస్తరోత్సేధం పాదం పాదోన పంచకం।
సాంఘ్రి ద్విభాగం మంచోచ్చం సార్ధ వేదాంఘ్రిణోదయం॥ 14
ద్విభాగం మంచమానం తు శివాంశం వేదికోదయం।
అధ్యర్ధాంశం గలోత్సేధం యుగాంశం శిఖరోదయం॥ 15
ద్విభాగం తు శిఖామానం పౌష్టికం తదుదాహృతమ్।

తా॥ ఆలయము యెత్తును 42 భాగములుచేసి అధిష్ఠానము 3 భా, స్తంభము 6 భా. ప్రస్తరము 3 భా, మరల స్తంభము 5 భా, మరల ప్రస్తరము 3 భా, మరల స్తంభము 4¾ భా, మరల ప్రస్తరము 2¼ భా, మరల స్తంభము 4½ భా, మరల ప్రస్తరము 2 భా, వేదిక 1 భా, గలము 1½ భా, శిఖరము 4 భా, స్తూపిక 2 భా, ఇట్లు చేసినేని పౌష్టికమగును.


పౌష్టికము 42 భా. 4 అంత.

## 88. జయదము

శ్లో॥ పంచాశద్ విభజేద్ధర్మ్యం తుంగం స్తూప్యవసానకం॥ 16

సార్ధాగ్న్యంశ మధిష్ఠానం సప్తాంశం చరణోదయం।
సార్ధత్ర్యంశం ప్రస్తరోచ్చం రసాంశం పాదదైర్ఘ్యకం॥ 17

గుణాంశం మంచమానం తు ఊర్ధ్వపాదం తు త్రిద్వయం।
త్రిభాగం ప్రస్తరోత్సేధం పాదోచ్చం సార్ధపంచకం॥ 18

ప్రస్తరోచ్చం త్రిభాగం తు శివాంశం వేదికోదయం।
ద్విభాగం గలమానం తు భూతాంశం శిఖరోదయం॥ 19

సార్ధాంశం స్తూపిమానం తు జయదం త దుదాహృతమ్।

**తా॥** ఆలయము యెత్తును 50 భాగములుచేసి అధిష్ఠానము 3½ భా, స్తంభము 7 భా, ప్రస్తరము 3½ భా, మరల స్తంభము 6 భా. మరల ప్రస్తరము 3 భా, మరల స్తంభము 6 భా. మరల ప్రస్తరము 3 భా, మరల స్తంభము 5½ భా, మరల ప్రస్తరము 3 భా, వేదిక 1 భా, గలము 2 భా, శిఖరము 5 భా, స్తూపిక 1½ భా. ఇట్లు చేసినయెడల జయదమగును.



జయదములంకణా 4 అంత.

## 89. అద్భుతము

శ్లో॥ ఉపానాత్ స్తూపి పర్యంతం పంచాశ ద్విభజే ద్బుధః॥ 20

జన్మోచ్చం సార్ధ మగ్న్యంశం సప్తాంశం చరణోదయం।
తలోచ్చ సదృశం మంచం తలిపం సార్ధ షట్కకం॥ 21

పాదాధిక త్రిభాగేన మంచమాన ముదాహృతం।
పాదోచ్చం రసభాగేన గుణాంశం ప్రస్తరోదయం॥ 22

సార్ధపంచాంశ మంఘ్ర్యుచ్చం మంచం సార్ధ ద్విభాగయా।
ఏకాంశం వేదికామానం ద్విభాగం స్యా ద్గలోదయమ్॥ 23

పంచాంశం శిఖరోత్తుంగం సపాదాంశం శిఖోదయం।
అద్భుతం సదనం హ్యేవం కల్పయే చ్ఛిల్పి సత్తమః॥ 24

తా॥ ఆలయము యెత్తును 60 భాగములుచేసి అధిష్ఠానము 8¾ భా, స్తంభము 7 భా, ప్రస్తరము 3¾ భా, మరల స్తంభము 6¾ భా, మరల ప్రస్తరము 3¼ భా, మరల స్తంభము 6 భా, మరల ప్రస్తరము 3 భా, మరల స్తంభము 5¾ భా, మరల ప్రస్తరము 2¾ భా, వేదిక 1 భా, గలము 2 భా, శిఖరము 5 భా, స్థూపిక 1¼ భా, ఇట్లుచేసినది అద్భుత మగును.

## 90. సార్వకామికము

శ్లో॥ ఆధారోచ్చం తు పంచాశ ద్భాగం కృత్వా విశేషతః।
సార్ధాగ్న్యంశ మధిష్ఠానం ధాత్వంశం పాదోదయం॥ 25
సపాదాగ్న్యంశ మంచం స్యా త్తలిపం సార్ధ షట్కకం।
ప్రస్తరోచ్చం త్రిభాగం తు చరణం సార్ధ షడ్భవేత్॥ 26
త్రిభాగం ప్రస్తరోత్సేధం పాదోచ్చం సార్ధ పంచకం।
పాదో నాగ్న్యంశ మంచోచ్చం శివాంశం వేదికోదయం॥ 27
ద్విభాగం గలమానం తు పంచాంశం శిఖరోదయం।
వ్యోమాంశం తు శిఖామానం విమానం సార్వకామికమ్॥ 28

తా॥ ఆలయము యెత్తును 50 భాగములుచేసి, అధిష్ఠానము 3½ భా, స్తంభము 7 భా ప్రస్తరము 3¼ భా, మరల స్తంభము 6½ భా, మరల ప్రస్తరము 3 భా, మరల స్తంభము 6½ భా, మరల ప్రస్తరము 3 భా, మరల స్తంభము 5½ భా, మరల ప్రస్తరము 2¾ భా, వేదిక 1 భా, గలము 2 భా, శిఖరము 5 భా, స్థూపిక 1 భా, ఇట్లుచేసినదేని సార్వకామిక మగును,

## 91. సుభద్రము

శ్లో॥ హోమాది స్థూపి పర్యంతం వేదాశ్రం పరికల్పయేత్।
భానుకూటం తథా కోష్ఠం భాను ద్విగుణ పంజరం॥ 29
శిఖరే తు చతుర్దిక్షు భద్రనాసి చతుష్టయం।
పాదం ప్రత్యల్పనాసాఢ్యం శిఖరే ఒష్టాల్పనాసికం॥ 30
కూటకోష్ఠాది సర్వాంగం నాగరాద్యుచితం కురు।
ఏకాకార తల స్తంభం సుభద్ర మితి విద్యతే॥ 31

తా॥ అలఘుముయొక్క పొడుగును సంచదశముగా చేసి 12 కూటములును, 12 కోష్ఠములును, 24 పంజరములును, శిఖరమున నలువైపుల 4 భద్రనాసికలును, స్తంభములయందు క్షుద్రనాసికలును, శిఖరమున 8 క్షుద్రనాసికలును; కూటములు కోష్ఠములు మొదలైనవి సమస్తమును నాగర పద్ధతిలోనే చేయవలయును అధిష్ఠానములును స్తంభములును ఒక్కటే రూపముతో నన్నియు నుండవలెను ఇది సుభద్ర మగును

౬౬. శ్రీకాంతము మొదలైనవి

శ్లో॥ తదేవ శిఖరే ఒష్టాల్ప నాసికా రహితం భవేత్।
తద్వాహ్య మితి విఖ్యాతం సర్వదేవ ప్రియావహం॥ 32

తదేవ శిఖరం కంఠం వృత్తం శ్రీకాంత ముచ్యతే।
వస్వశ్రం శీర్ష కంఠం వై శ్రీమండన మువాహృతం॥ 33

తదేవ శిఖరే చాష్ట మహానాసి సమన్వితం।
శ్రీభవంతం చ వ్యాఖ్యాతం శాలా భద్రయుతం తు వా॥ 34

విభద్రం వా ఒథ భక్త్యాం సర్వేషాం సద్మనామపి।
శ్రీకాంతం శిఖరేఒష్టాల్ప నాసాఢ్యం శ్రీవిశాలకం॥ 35

నానాంఘ్రి సిం యుక్తాస్తే తత్తన్నామ్నా ప్రకీర్తితాః।
విస్తారాఢ్య మసం .... ఛాస్కారం తు విశీర్షకం॥ 36

సర్వదాలయ మిత్యుక్తం సర్వ దేవార్హకం పరమ్।

తా॥ పై జెప్పినదానినే శిఖరమున 8 క్షుద్రనాసికలు లేకుండ చేసిరేని, అది వాహ్య మగును. అదియే శిఖరమును కంఠమును గుండ్రముగా చేసినచో శ్రీకాంత మగును. అదియే శిఖరమును గలమును 8 కోణములుగా చేసిరేని శ్రీమండన మగును. అదియే శిఖరమున 8 మహానాసికలతో చేసిన యెడల శ్రీభవ మగును. అదియే శాలాభద్రములతోగాని అవి లేకుండగాని చేయవచ్చును. అదికూడ శ్రీకాంత మనిపించుకొనును. శిఖరమున 8 క్షుద్రనాసికలుండెనేని శ్రీవిశాల మగును. ఇటులే స్తంభములు అధిష్ఠానములు వీని రూపములనుబట్టి నామములు నిర్ణయింపబడుచున్నవి.

శ్లో॥ మానసూత్రాంత మానంద భాగం కృత్వా విశేషతః॥ 37

గర్భగేహం గుణాంశం స్యా ద్భాగేన గృహ పిండికా।
ఆలింద్రాంశే తు కర్తవ్యం హారం భాగేన కల్పయేత్॥ 38

తతో విన్యాస సూత్రాంతం వ్యాసం నంద విభాజితే।
ఏకాంశం కూట విస్తారం గుణాంశం కోష్ఠదీర్ఘకం॥ 39

ఏకాంశం పంజర వ్యాస మర్ధాంశం హారయాంతరం।
శాలా మధ్యే మహానాసి నిష్కృత్తం త్వర్ధభాగయా॥ 40

ఊర్ధ్వ భూనంద భాగే తు కూటం మంశేన కల్పయేత్।
శాలా తద్ద్వి గుణాయామా శివాంశం పంజరం భవేత్॥ 41

శేషం హారాంతరం చోర్ధ్వే భూతాంశం చ భాజితే।
కూట మేకేన కర్తవ్యం కోష్ఠం తద్ ద్విగుణాయతమ్॥ 42

తా॥ మానసూత్రాంతము 9 భాగములుచేసి అందు గర్భాలయము 3 భాగములును, గృహపిండిక 1 భాగమును అలింద్రము 1 భాగమును, హారము 1 భాగమును చేయవలెను. తరువాత విస్తారసూత్రముయొక్క అంతమువరకు వ్యాసమును 9 భాగములుచేసి కూటము 1 భాగము, కోష్ఠముయొక్క దీర్ఘము 3 భాగములు, పంజరముయొక్క వ్యాసము 1 భాగము, హారయొక్క అంతరము ½ భాగము, శాలయొక్క నడుమ మహానాసి చుట్టుకొనివచ్చుట ½ భాగము పై అంతస్తున 9 భాగములలో కూటము 1 భాగము చేయవలెను. శాల 2 భాగములును, పంజరము 1 భాగమును చేయవలెను. మిగిలినది హారము చేయవలెను, దానిపైన అంతస్తును 6 భాగములుచేసి కూటము 1 భాగము, కోష్ఠముయొక్క నిడివి 2 భాగములు చేయవలెను.

శ్లో॥ అర్ధాంశం పంజర వ్యాసం శేషం హారాంతరం భవేత్।
ఊర్ధ్వ భూమిం తథాఽర్ధం తు మధ్యదండేన నిర్గతిం॥ 43

చతురష్టాశ్ర వృత్తాభం కూటానాం శీర్షకం క్రమాత్।
కర్కరీ దండవ త్కోష్ఠం స్వాశ్రం హార్మ్యాది శీర్షకం॥ 44

మహానాస్యష్ట కోపేతం శీర్షకం పరికల్పయేత్।
రవికోష్ఠం చ కూటం చ రవి ద్విగుణ పంజరం॥ 45

ప్రాగివోచ్చాంశ మానం తు తతః కోష్ఠ మిదం పరం।
గేహ వ్యాసం తు వర్గాంశం కృత్వా నీచ గృహోచ్చకం॥ 46

గృహ పిండాంశ మానేన అలింద్రం త్వేకభాగయా।
హార వ్యాసం శివాంశేన పరితః పరికల్పయేత్॥ 47

తా॥ పంజరముయొక్క విస్తారము ½ భాగమునుచేసి మిగిలినది హారాంతము చేయవలెను. పై అంతస్తునుకూడ అటులే అర్ధభాగముచేసి మధ్య 1 దండము నిర్గమము చేయవలెను. వరుసగా 4 కోణములు, 8 కోణములు, గుండ్రము. కూటములయొక్క శిఖరములను చేయవలెను. కర్కరీ దండమువలె కోష్ఠమును చక్కని కోణములతోను శిఖరమును అటులే కోణములతోను 8 మహా

నాసికలతోను శిఖరమును చేయవలెను. 12 కోష్ఠములు. 12 కూటములు, 24 పంజరములు, చేయవలెను. ముందుపటివలెనే యెత్తుయొక్క భాగములు చేయవలెను. కోష్ఠము లిట్లు చేయవలెను. గృహముయొక్క విస్తారమునకు 3 రెట్లుచేసి నీచగృహమునకు యెత్తుచేయవలెను. గృహపిండము యొక్క భాగమానముచేత అలింద్రము 1 భాగము, హారవ్యాసము 1 భాగము, చుట్టును చేయవలెను.

శ్లో॥ విన్యాస సూత్ర యో రంత ర్వ్యాసం ధర్మ విభాజితే।
కర్ణకూటం తదేకాంశం కోష్ఠాయామం తు తద్ద్వయం॥ 48

అర్ధాంశం పంజరవ్యాసం శేషం హారాంతరం భవేత్।
చతుష్కూటాష్ట కోష్ఠం చ పంజరాష్టం తు సంఖ్యయా॥ 49

హారాంతరం చతుర్వింశ త్కల్పయే త్ప్రథమం తలం।
అలింద్రం జలపాదం స్యాత్ ప్రస్తారం తు ఘనీకృతం॥ 50

ఊర్ధ్వభూ నవ భాగం స్యా చ్ఛివాంశం కూట విస్తరం।
కోష్ఠం తద్ద్వి గుణాయామం పంజరం చాంశమానతః॥ 51

శేషం హారాంతరం ఖ్యాతం క్షుద్రపంజర సంయుతం।
ఊర్ధ్వ భూమి త్రిభాగైకం మధ్యే దండేన నిర్గమం॥ 52

చతురశ్ర మధిష్ఠాన మష్టాశ్రం మస్తకం గలం।
శిఖరే ఒష్టౌ మహానాస్యః పాదే ప్రత్యల్పనాసికా॥ 53

కర్ణకూటం తు భాగం స్యా త్కోష్ఠషోడశభి ర్యుతం।
నత కూటోన్నతం కోష్ఠ మంతర ప్రస్తరాన్వితమ్॥ 54

తా॥ విన్యాససూత్రములయొక్క మధ్య విస్తారమును 10 భాగములుచేసి కర్ణకూటము 1 భాగము, కోష్ఠముయొక్క పొడవు 2 భాగములు, పంజరముయొక్క విస్తారము ½ భాగము, మిగిలినది హారాంతరము చేయవలెను కూటములు 4. కోష్ఠములు 8, పంజరములు 8. హారాంతములు 24 ప్రథమ తలమున చేయవలెను. అలింద్రమును జలపాదమును ప్రస్తరమును గట్టిగా చేయవలెను, ఆపై అంతస్తును 9 భాగములచేసి కూటము విస్తారము 1 భాగమును, కోష్ఠము పొడవు 2 భాగములును, పంజరము 1 భాగమును, మిగిలినది హారమును చేయవలెను. క్షుద్ర పంజరములనుకూడ చేయవలెను. ఊర్ధ్వభూమిని 3 భాగములుచేసి అందులో 1 భాగము మధ్య 1 దండము నిర్గమమునుచేసి అధిష్ఠానము నలుచదరమును, గలమును శిఖరమును 8 కోణములుగను, శిఖరమున 8 మహానాసికలును, స్తంభములకు క్షుద్రనాసికలునుచేసి కర్ణకూటము 1 భాగమును, కోష్ఠములు 16 ను, కూటములు పల్లముగాను కోష్ఠములు యెత్తుగాను, అంతరమున ప్రస్తరములతోను చేయవలెను.

శ్లో॥ క్షుద్ర నీడాష్ట వింశం స్యాత్ న్యానాసం సూకరాకృతి।
నానా చిత్రై ర్విచిత్రం తు తుంగం భాగం తు పూర్వకం॥ 55

జయావహ మిదం ఖ్యాతం సర్వ దేవార్హకం వరం।
తదేవ వర్తులం కంఠం శీర్షాంతం సార్వకామికం॥ 56

తదేవ సాంతరం మంచం కూటం కోష్ఠం చ పంజరం।
కూటానాం శీర్షకం స్థూపి కుంభం కంఠం చ వర్తులం॥ 57

ఏవం స్యాన్మూల భూమౌ తు చతురశ్రం మధ్యమే తలే।
యుగాశ్రం మధ్య భూమౌ తు కర్ణకూటం ప్రకల్పయేత్॥ 58

సుఖావహ మిదం ఖ్యాతం సర్వ దేవార్హకం పరం।
తదేవ కూట కోష్ఠం చ అంతరం ప్రస్తరం వినా॥ 59

వ్యాసోచ్చ సమసూత్రం తు సదా జయావహం భవేత్।
తదేవ శిఖరం కంఠం యుగాశ్రం భూమి కాంతకమ్॥ 60

ఇది కాశ్యపశిల్పే చతుర్భూమి విధానో నామ త్రింశః పటలః.

తా॥ క్షుద్రపంజరములు 28 వివిధములైన కోణములతోను గుండ్రముగాను చిత్రవిచిత్రముల తోను యెత్తు 1 భాగమును చేసినచో జయావహమగును. అదియే గుండ్రముగా గలమును శిఖరమును చేసినచో సార్వకామికమగును. అదియే అంతరముతో సహితముగాను మంచము కూటము కోష్ఠము పంజరము మొదలగువానితో గూడ కూటములయొక్క శిఖరములును, గలమును కుంభమును స్థూపికయును గుండ్రముగా చేయవలయును. ఇట్లు మొదటి అంతస్తును రచించవలెను, మధ్యభూమియందు నలుచదరమును కర్ణకూటములు మొదలైనవి 8 కోణములుగాను చేయవలెను దీనిని సుఖాలయమందురు, అదియే కూటకోష్ఠములతో చేసి అంతరములు ప్రస్తరములు లేకుండ కూడ చేయుదురు. వ్యాసముయొక్క యెత్తుతో సమానముగా సూత్రమును చేసినచో సదాజయ మగును, అదియే గలము శిఖరము నలుచదరముగా నుండెనేని భూకాంతమగును.

## 93. కూట కోష్ఠ పంజర లక్షణములు

### కాశ్యపశిల్పము 31వ అధ్యాయము

శ్లో॥ వక్ష్యేఽహం కూట కోష్ఠానాం పంజరాణాం తు లక్షణం।
ద్వితలాది తలాంతానాం సమ మేవ ప్రకీర్తితం॥ 1

తలం ప్రత్యుదితం వ్యాసం సమాశ్రం కర్ణ కూటకం।
సార్ధతాశ్రం తు కోష్ఠం స్యా చ్చతుష్పాద్వై కపాదుకా॥ 2

అథస్తాత్ స్తంభ వర్గం చ ప్రస్తరః కంఠ శీర్షకం।
స్థూపి వర్గ సమాయుక్తౌ కూట కోష్ఠౌ విశేషతః॥ 3

ఏవం చాది తలే కుర్యా ద్ధరాతలం వినోర్ధ్వతః।
కూట శాలౌచ కర్తవ్యౌ పంజరాశ్చ తథైవచ॥ 4

ఊర్ధ్వ పాదోదయం సప్త భాగం కుర్యా ద్విశేషతః।
ఏకాంశం వేదికోత్సేధం సార్ధాంశం గల మున్నతం॥ 5

శీర్షం తు త్రిగుణాంశేన శేషం స్థూప్యుదయం భవేత్।
ఏవం తు కూటకోష్ఠాద్వా కల్పయేత్తు తలం ప్రతి॥ 6

తా॥ కూటముల యొక్కయు, కోష్ఠముల యొక్కయు, పంజరముల యొక్కయు, లక్షణములను చెప్పుచున్నాను. రెండవ అంతస్తు మొదలు అన్ని అంతస్తులకు సమముగానే చేయవలెను ఏ అంతస్తునకు యెంత విస్తారము చెప్పబడియున్నదో దాని ప్రకారము భాగములు చేయుచుండవలెను. కర్ణకూటములు సమాంశముగా నలుచదరముగాను కోష్ఠములు 1 భాగము వెడల్పును, 1½ భాగము నిడివిగానులేక 1½ భాగము నిడివిగాను చేయవలెను. అడుగున స్తంభములను, తరువాత ప్రస్తరమును, దానిపైన గలమును శిఖరము స్థూపికయిట్లు చేయవలెను. కూటములేకాక కోష్ఠములుకూడ చేయవచ్చును ఇట్లు మొదటి అంతస్తున చేయవలెను. అనగా అధిష్ఠానము స్తంభములకు దిగువ నుండును కనుక అచ్చటినుండి యీకొలతలు నిర్ణయించు కొనవలెను, అధిష్ఠానమునకుపైన కూటశాలలు రెండును అటులే పంజరములును చేయవలెను. పై అంతస్తు స్తంభమును 7 భాగములు చేసి అందు వేదిక 1 భాగము, గలము 1½ భాగము, శిఖరము 3 భాగములు. మిగిలిన 1½ భాగము స్థూపిక చేయవలెను. ఇట్లే కూటములు కోష్ఠములు యేఅంతస్తుకు ఆ యంతస్తున చేయవలెను.

శ్లో॥ అథవా కూట కోష్ఠానా ముదయం తు వదామ్యహం।
ఉత్తర స్యోర్ధ్వ సీమాంతం హంస మాలోర్ధ్వ సీమకం॥ 7

కపోతం వాఽవసానం వా భాగం పూర్వవ దేవ తు।
సాంతర ప్రస్తరం చేత్తు ప్రస్తర స్యోర్ధ్వ సీమకం॥ 8

వేదికోర్ధ్వ సమం వాఽథ సాంతర ప్రస్తరాన్వితం।
తదుచ్చం రుద్రధా భజ్య చైకాంశం వేదికోదయం॥ 9

గుణాంశం చరణోచ్చం తు పాదోనద్వ్యంశ మంచకం।
సపాదాంశం గలోత్సేధం పాదో నాగ్న్యంశకం శిరః।
స్థూప్యుత్సేధం సపాదాంశం క్రమశః పరికల్పయేత్॥ 10

ఏవంహి కూట కోష్ఠాద్వా కల్పయే చ్ఛిల్ప విత్తమః।
కూటస్యా స్య త్రిభాగైకం స్వనాసి విస్తృతం భవేత్॥ 11

తా॥ మరియు కూటకోష్ఠములయొక్క యెత్తును చెప్పుచున్నాను. ఉత్తరముయొక్క పై భాగము వరకును లేక హంసమాలయొక్క పైభాగమువరకుగని లేక కపోతముయొక్క చివర వరకుగాని చేయవలెను. మునుపు చెప్పిన భాగముల చొప్పుననే చేయవలెను. అంతర ప్రస్తరములతో కూడియుండినట్లయిన ప్రస్తరములయొక్క పైభాగము వరకు చేయవలెను. మరియు వేదికయొక్క పైభాగముతో సమానముగను చేయవచ్చును. అంతర ప్రస్తరములతో ఈ ప్రకారము చేయవలెను. దాని యెత్తును 11 భాగములుచేసి అందు వేదిక 1 భాగము. స్తంభము 3 భాగములు, ప్రస్తరము $1\frac{3}{4}$ భాగము గళము $1\frac{1}{4}$ భాగము శిఖరము $2\frac{3}{4}$ భాగము స్తూపిక $1\frac{1}{4}$ భాగములు చేయవలెను. శిల్పాచార్యుడు ఇట్లు కూటములును కోష్ఠములును చేయవలెను కూటముయొక్క విస్తారమును 3 భాగములు చేసి అందు 1 భాగముమధ్య నాసికను చేయవలెను.

శ్లో॥ తద్వ్యాస త్రి చతుః పంచ సప్తభాగేన నీవ్రకం।
కర్ణకూటే కపోతం తు నాసికా నిర్గమం భవేత్॥ 12

చతుర్దిక్షు చ తుర్నాసిః కూటానాం పరికల్పయేత్।
ఏక స్తూపి సమాయుక్తం నీవ్ర వేశం విమానవత్॥ 13

వేదాశ్రం వసుకోణం వా వృత్తాభం వా గలం శిరః।
నాగరాద్యుచితం కల్ప్యం కర్ణకూటం విశేషతః॥ 14

శాలానాం పార్శ్వయోర్న్వ్రప లలాటాఖ్యా తు నాసికా।
శాలా వ్యాస విశాలా తు ఉన్నతా ముఖ పట్టికా॥ 15

స్వస్తూప్యగ్ర సమం ప్రోక్తం శాలానాస్యశ్ర సీమరం।
శాలా దైర్ఘ్యం త్రిభాగైకం ముఖనాసి విశాలకం॥ 16

కూటానాం నాసికానీవ్రం మహానాసివ దాచరేత్।
స్తూపి త్రయ సమాయుక్తం నాగరే భవనే ద్విజ॥ 17

తా॥ ఆవ్యాసమునందు 3వ వంతు, లేక 4వ వంతు, 5వ వంతు, 7వ వంతు, ఇట్లు నిర్గమము చేయవచ్చును. దీనిని కర్ణకూట కపోతనాసికా నిర్గమమని చెప్పుదురు. కర్ణకూటములకు నలువైపుల నాసికలను కల్పించవలెను ఒక్కటే స్తూపిక విమానమువలె చేయవచ్చును. 4 కోణములు 8 కోణములు, గుండ్రము ఇట్టి భేదములతో గలమును శిఖరమును కర్ణకూటములును నాగరము ద్రావిడము వేసరము అను పద్ధతుల ప్రకారము చేయవలయును. శాలలయొక్క పార్శ్వములందు ముఖనాసికలను చేయవలెను. శాలయొక్క విస్తారముతో సమానముగాను యెత్తుగాను ముఖ పట్టికను కల్పించవలెను. దానియొక్క స్తూపికముందు శిలానాసియొక్క పైభాగము వరకు సరిపుచ్చ వలెను. శాలయొక్క నిడివిలో మూడవవంతు ముఖనాసియొక్క విస్తారమును చేయవలెను. కూటములకు నాసికయొక్క నిర్గమము మహానాసివలెనే చేయవలెను. ముఖనాసికకు 3 స్తూపికలు చేయవలెను. నాగరపద్ధతి యందిట్లుచెప్పబడినది.

శ్లో॥ శాలానాం ద్రావిడానాం తు స్తూపి స్స్యా ద్ద్విత్రి సంఖ్యయా।
శాలానాం వేసరాణాం తు స్తూప్యేకం వా చతుష్టయం॥ 18

గలాంశే కూట కోష్ఠానాం దేవతాద్యాస్తు కల్పయేత్।
ఏవం హి కూట కోష్ఠస్తు పంజర స్త్వధు నోచ్యతే॥ 19

ఉపానా ద్యుత్తరాంతం తు నవభాగ విభాజితే।
ఉపపీఠ మథాంశేన పక్షాంశేన ధరాతలం॥ 20

వేదాంశం చరణాయామం మంచ మధ్యర్ధ భాగయా।
అర్ధాంశం వేదికామానం కపోతాంతం గలోదయం॥ 21

ప్రతివాజన సీమాంతం పంజరోచ్ఛ ముదాహృతం।
ప్రాసాదస్య కపోతం తు యథాశోభాంశ నిర్గతిః॥ 22

పంజరో నాసికాకారః కూట కోష్ఠాకృతిస్తు వా।
హస్తి పృష్ఠ విమానం స్స్యా చ్ఛిఖరాంత మథాపి వా॥ 23

ఏవం త్వనేక భేదేన పంజరాకృతి రుచ్యతే।

తా॥ ద్రావిడశాలలకు స్తూపికలు 2 గాని, 3 గాని చేయుదురు. వేసరశాలలకు స్తూపిక 1 గాని, 4 గాని చేయుదురు. కూటకోష్ఠములయొక్క గలమునందు దేవతాదులను చేయవలెను. ఉపానము మొదలుకొని ప్రస్తరమువరకు 9 భాగములుచేసి ఉపపీఠము 1 భా, అధిష్ఠానము 2 భా, స్తంభము 4 భా, ప్రస్తరము 1½ భా, వేదిక ½ భా, ఇట్లు గలముయొక్క పై ప్రదేశమువరకుగాని లేక కపోతమువరకుగాని ప్రతివాజనము వరకుగాని, పంజరముయొక్క యెత్తును చేయవలెను. ప్రాసాదముయొక్క కపోతము అందముగా నుండునట్లు నిర్గమమును చేయవలెను. పంజరము, నాసిక, కూటము, కోష్ఠము. ఇవి యన్నియు హస్తిపృష్ఠరూపవిమానమువరకు చేయవలెను. లేక శిఖరము పైభాగమువరకును చేయవలెను. ఇట్లు అనేకవిధములుగా పంజరములయొక్క ఆకారములు చెప్పబడినవి.

శ్లో॥ యథేష్టంతేషు కర్తవ్యం హర్మ్య కోష్ఠేషు హర్మ్యకం॥ 24

ఏకేన భూమి హర్మ్యేషు .....................।
ఏవమాది తలం కుర్యా దంతర ప్రస్తరాన్వితం॥ 25

మానసూత్రం తు నిష్క్రాంతం యుక్త మేవ యదాచరేత్।
పంజరం నీవ్ర రహితం ప్రస్తరోర్ధ్వే విశేషతః॥ 26

కర్ణకూట సమం వాఽథ త్రిపాదం వా ఽవధి స్తరం।
తద్వ్యాస భద్రకం తుంగం యుక్త్యా పంజర మాచరేత్॥ 27

తలం ప్రత్యూర్ధ్వ పాదోచ్చం ప్రాగివైవ నవాంశకం।
గుణాంశం వా ఘనాభిత్తి చ్ఛత్రం శీర్ష సమం యుతం॥ 28

పాదాయామం చతుర్భాగ మధ్యర్ధాంశం తు ప్రస్తరం।
అర్ధాంశం వేదికామానం కపోతాంతం గలోదయం॥ 29

ప్రతివాజన సీమాంతం పంజరోదయ మీరితం।
శేషం ప్రాగివ కర్తవ్య మేవం నిష్క్రాంత పంజరమ్॥ 30

తా॥ ఈచెప్పబడిన వానిలో యేపద్ధతిప్రకారముగానైన కూటములు కోష్ఠములు పంజరములు చేయవచ్చును. మొదటి అంతస్తునందిట్లు చేయవలెను అంతర ప్రస్తరములతోకూడ చేయవలెను. మానసూత్రమునుగాని నిర్గమమునుగాని యుక్తమనిఆలోచిన కొలతప్రకారము చేయవలెను. ప్రస్తరముపైన పంజరమునకు నీనము అవసరములేదు. కర్ణకూటముతో సమానముగాగాని అందు ముప్పాలికవంతుగాని లేక సగముగాని పంజరమును చేయవచ్చును. దానియొక్క విస్తారమును బట్టి భద్రముయొక్క యెత్తును కల్పించవలెను. పంజరము ఆలోచనతో చేయవలెను. ప్రతి అంతస్తునపై స్తంభములు ముసపటివలెనే 9 భాగములు చేయవలెను. గోడ 3 భాగములు చేయవలెను పైగోడుగు శిఖరముతో సమానముగా నుండునట్లు చేయవలెను. స్తంభముయొక్క యెత్తును 4 భాగములుచేసి 1½ భాగము ప్రస్తరమును, వేదిక ½ భాగమును; కపోతము వరకు గలమును చేయవలెను. ప్రతివాజన ప్రదేశమువరకు పంజరముయొక్క యెత్తును చేయవచ్చును. మిగిలినవి మునుపటివలెనే చేయవలెను. ఇట్లు నిర్గమముగల పంజరమును చేయవలెను.

శ్లో॥ నిష్క్రాంత రహితం చేత్తు ప్రస్తరోర్ధ్వం తు వాజనం।
పంజరే కూట కోష్ఠేచ పాదే పాదాంతరే ఽపివా॥ 31

గోపానాధస్థలే కుర్యాత్ మహాబల పరాక్రమాన్।
హస్తౌ పాదౌద్వయోపేతాన్ దంష్ట్రా కర్ణాన్ సటాన్వితాన్॥ 32

రౌద్ర దృష్టి సమాయుక్తాన్ నతా నంజన సన్నిభాన్।
గోపానం యత్నతో ధృత్వా పాదౌ హస్తౌ తదన్వితౌ॥ 33

ఏవం వా గజ సింహాభం సింహవ్యా లాభ మేవ వా।
గోపానం శిరసా వాహ్యాం హస్తౌ పాదే యథేష్టగౌ॥ 34

కూటాది లక్షణం ప్రోక్తం పంచ భూమి విధిం తతః।

**ఇతి కాశ్యపశిల్పే కూటాది లక్షణ మేకత్రింశః పటలః**

తా॥ నిర్గమము లేకుండినచో ప్రస్తరము పైన వాజనము పంజరము కూటము కోష్ఠము పాద పాదము నందును... : గోపాలనము యొక్క దిగువ నాలుగు మూలల ప్రతిమలను చేయవలెను గొప్ప బలముతోను. భయంకరమైన కోఱలు జూలు కోపదృష్టికలిగి కొంచెము వంగి నట్లును కాటుకవంటి నలుపుతోను గోపానమును మోయుచున్నట్లును పాదములు హస్తములు తగినరీతిగా విన్యాసము చేసిగాని లేక యేనుగులనుగాని సింహములనుగాని సింహవ్యాలములనుగాని గోపానమును మోయుచున్నట్లు చేయవలెను. ఇది కూటాది లక్షణము

96. కూటకోష్ఠపంజర రూపములు.



శిల్పరత్నము 25 వ అధ్యాయము

శ్లో॥ ప్రాసాదాది విశాలేదు దశభాగ కృతేపునః।
నందాష్ట సప్తభాగే వా రుద్రభాస్కర భాజితే॥ 2

త్రయోదశ హృతేవా ఽథ కూట మేకాంశ మానతః।
శాలామానం ద్విభాగం వా త్రిచతుర్భాగ మేవవా॥ 3

కోణేషు కూటం తుర్యాశ్రం దిక్షుశాలాయతాశ్రకా।
అధిష్ఠానం స్తంభవర్గం ప్రస్తరం కంఠ శీర్షకా॥ 4

స్తూపికాంచ విశేషేణ బిభ్రతా కూటకోష్ఠకా।

తా॥ అలయముయొక్క విస్తారమును 10-9-8-7-11-12-13. ఇట్లు భాగములుచేసి అందు 1 భాగము కర్ణకూటమును మూలను చేయవలెను దిశయందు ?-?-4. ఇట్లు భాగములుచేసి శాలను కల్పించవలెను. కూటము నలుచదరముగాను, శాల దీర్ఘచతురస్రముగాను ఉండును. అధిష్ఠానము, స్తంభములు, ప్రస్తరము, గలము, శిఖరము, స్తూపిక ఈయంశములతో ఈరెండును చేయవలెను. మరియు మధ్య ముఖనాసికను స్తూపి త్రయముతోను శక్తి ధ్వజయుక్తముగాను చేయవలెను.

శ్లో॥ ఏవం చాదితలే కుర్యా దూర్ధ్వ భూమిషు తౌపునః॥ 6

అధిష్ఠానం వినాసర్వై రంగైః స్యాతాం సమన్వితౌ।
ఊర్ధ్వ పాదోదయం సప్త భాగం కృత్వా విశేషతః॥ 7

ఏకాంశం వేదికోత్సేధం సార్ధాంశం గలమానకం।
శీర్షకం తు గుణాంశేన శేషం స్తూప్యుదయం భవేత్।

తా॥ మొదటి అంతస్తున పైన జెప్పబడినట్లు చేసి రెండవ యంతస్తున అధిష్ఠానము లేకుండ భాగములు చేయవలెను. పై అంతస్తు స్తంభమును 7 భాగములుచేసి వేదిక 1 భా. గలము 1½ భా, శిఖరము 3 భా, స్తూపిక 1½ భా, ఇట్లు చేయవలెను.

శిల్పరత్నము 26 వ అధ్యాయము

శ్లో॥ శాలా కూటాంతరాలంత ద్ధారాంతర మితి స్మృతం।
పంజరం తత్ర కుర్వీత తదనేక విధం భవేత్॥ 1

తా॥ శాలయొక్కయు కర్ణకూటముయొక్కయు మధ్యస్థానమును హారాంతమని చెప్పుదురు. అచ్చట పంజరములను నిర్మించవలెను. ఆ పంజరము లనేకవిధములు కలవు.

శ్లో॥ వ్యాస తుల్యం త్రిపాదం వాఽప్యర్ధం వా భిత్తి బాహ్యతః॥ 8

నిష్క్రమం పంజరాదీనాం త్రిభాగద్వయ మేవవా।
యత్ స్తంభ బహలార్ధం త త్సర్వ భూషణ నిష్క్రమమ్॥ 9

తా॥ విస్తారముతో సమానముగాని, ముప్పాతికవంతుగాని, సగముగాని నిర్గమము చేయవలెను. లేక మూడుభాగములలో రెండుభాగమునుగాని నిర్గమము చేయవలెను. అన్నిటికిని నిర్గమము యిదేవిధముగా చేయవలెను.

శ్లో॥ పంజరోచ్చే శరాంశే వా సపాదాంశేన చాంఘ్రికం। 27
తదర్ధం ప్రస్తరోత్సేధం తత్సమం కంఠమానకం॥

శేషార్ధే మంచ కంఠాఖ్యౌ శేషం శీర్షోదయం స్మృతమ్॥ 28

తత్ స్తంభార్ధా దధిష్ఠానం శేషేణాప్యుప పీఠకం।
ఏవముక్తంహి సర్వేషాం పంజరావయవం బుధైః॥ 39

తా॥ పంజరము యెత్తును 5 భాగములుచేసి అందు స్తంభము 1¼ భా, అందులో సగము ప్రస్తరము, దానితో సమానము గలము, మిగిలిన సగముతో ప్రస్తరము గలము శిఖరము చేయవలెను. స్తంభములో సగము అధిష్ఠానమును మిగిలినది ఉపపీఠమును చేయవలెను. అన్నివిధములైన పంజరములకు యిట్లు చేయవలెను.

శ్లో॥ అథవా ప్రస్తరోత్సేధా దార్ధ్యర్థం పాద ముచ్యతే॥ 39

తచ్ఛేషం పంజరోత్సేధే ఉప్యష్టాదశ విభాజితే।
కుర్యా దేకాంశ మానేన తూత్తరోచ్చం విచక్షణః॥ 40

వలభిం త్వేకభాగేన ద్విభాగం తు కపోతకం।
ప్రస్తరోత్సేధ మశ్వ్యంశం తత్సమం వేదికోదయం॥ 41

సార్ధ ద్విభాగం పాదోచ్చం తత్పాదం తూత్తరోదయం।
తత్సమం వలభే రుచ్చం పంచాంశం శిఖరోదయం॥ 42

వేదాంశం వా త్రిభాగం వా కుర్యా దౌచిత్య భేదతః।
శేషం శక్తి ధ్వజోత్సేధం భవేత్ ద్వితల పంజరే॥ 43

తా॥ పంజరముయొక్క యెత్తులో సగము స్తంభమును చేసి మిగిలిన సగమును 18 భాగములు చేసి ఉత్తరము 1 భా, వలభి 1 భా, కపోతము 2 భా, ప్రస్తరము 2 భా, వేదిక 2 భా, మరల స్తంభము 2½ భాగము, ఉత్తరము 1 భా, వలభి 1 భా, శిఖరము 5 భా, మిగిలిన ½ భాగము శక్తిధ్వజమును చేయవలెను, లేక శిఖరమును 1 భాగము తగ్గించి శక్తిధ్వజములో కలుపవచ్చును. ఇది రెండవ యంతస్తు పంజరము

శ్లో॥ అథవా త్ర ద్వి భాగార్ధం సవలభ్యుత్తరోదయం।
తత్సమం తు కపోతోచ్చం ద్విభాగం ప్రస్తరోదయమ్॥ 44

త్రిభాగంస్యాత్పాద తుంగం సవల భ్యుత్తరం దృశం।
పంచాంశం శిఖరో త్సేధం శేషం శక్తిధ్వజం స్మృతమ్॥ 45

తా॥ పైజెప్పిన భాగములే ఉత్తరము 1 భా, వలభి 1½ భా, కపోతము 1½ భా, ప్రస్తరము 2 భా, స్తంభము 3 భా, ఉత్తరము 1 భా, వలభి 1 భా, శిఖరము 5 భా, శక్తిధ్వజము 1 భా, ఇట్లుకూడ చేయవచ్చును.

